# భక్తిసుధ

## సుధాతరంగిణ్యాఖ్య

### ఆంధ్రవివరణము

### ద్వితీయ భాగము

మూలము :

అనంతశ్రీవిభూషిత యతిచక్రచూడామణి

శ్రీ కరపాత్రీస్వామి శ్రీచరణులు

సుధాతరంగిణి :

జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి


ప్రకాశకులు

ఆర్షభారతి - తెనాలి

BHAKTI SUDHA TARANGINI PART-II

ప్రథమ ముద్రణము : 1996

కాపీలు : 1000



మూల్యము : 70/-

ప్రాప్తిస్థానము

1. జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి
21-9-25
రామలింగేశ్వరపేట,
తెనాలి - 522 201

2. హరి వెంకటేశ్వరశర్మ,
శోధన్ పెయింట్స్,
కొత్తపేట,
తెనాలి - 522 201

ముద్రణ :

శ్రీ గాయత్రీ ప్రింటర్స్ & బైండర్స్
కరెంటు రెవిన్యూ ఆఫీసు వద్ద,
గాంధీచౌక్ - తెనాలి.

THIS BOOK IS PUBLISHED
WITH THE FINANCIAL ASSISTANCE OF
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
UNDER THEIR SCHEME
"AID TO PUBLISH RELIGIOUS BOOKS"

## ACKNOWLEDGEMENT

I acknowledge the permission accorded to me to translate into Telugu and publish the following books-

1. BHAKTHI SUDHA
2. BHAGAVATA SUDHA
3. RADHA SUDHA

and offer my thanks to Sri H. P. Dhanuka, Radha Krishna Dhanuka Prakasan Samsathan, Bombay, Original Publishers of the above books-

– J. SUBRAHMANYA SASTRY

సమర్పణము

ధర్మసమ్రాట్

అనంతశ్రీవిభూషిత యతిచక్రచూడామణి

శ్రీ కరపాత్రీస్వామి

నామ విశ్రుతులు

బ్రహ్మీభూత

శ్రీశ్రీశ్రీ హరిహరానంద సరస్వతీస్వామి

శ్రీచరణారవిందములకు

ఈ గ్రంథము

భక్తిశ్రద్ధాపరిప్లుత హృదయముతో

సమర్పితము.

—రచయిత



ధర్మ సమ్రాట్

అనంత శ్రీ విభూషిత యతిచక్రచూడామణి

శ్రీ కరపాత్రీస్వామి శ్రీచరణులు

# విషయానుక్రమణిక

శ్రీః

# ప్రవేశిక

"మన్దారపుష్పవాసిత మన్దానిలసేవితం పరానన్దమ్ ।
మన్దాకినీయుతపదం నమత మహానన్దదం మహాపురుషమ్ ॥"

"కటాక్షకిరణాచాన్త నమన్మోహాబ్ధయే నమః ।
అనన్తానన్దకృష్ణాయ జగన్మంగళమూర్తయే ॥"

ఈ 'భక్తిసుధ' శ్రీకరపాత్రీస్వామిహృదయ వినిఃసృతమైన సుధామంజూష. ఈ భక్తిసుధాతరంగిణిలో మునుకలిడిన కర్మిష్ఠులు, భక్తులు, జిజ్ఞాసువులైన ముముక్షువులు, వారి వారి అధికారము నను సరించి అభిలషణీయములైన ఫలములను పొందగలరు. ఇంతియే కాక, శ్రవణ, మననాదినిష్ఠులై పరమప్రాప్యమైన నిఃశ్రేయసమును గూడా పొందగలరు. ఇదొక పవిత్ర త్రివేణీసంగమము. కర్మ, భక్తి,జ్ఞానరూపములైన గంగా, యమునా, సరస్వతీ స్రోతస్వినులు సరససమన్వయసమన్వితములై జాలువారుచు,పండిత హృదయము లను, జిజ్ఞాసు పాఠకుల హృదయకేదారములను సుధాప్లావితము చేసి, అచింత్యానంద సంధాయకములై విలసిల్లుచుండును. ఏత త్సుధాపానముచేసిన భావుకహృదయులు అధికారిభేదమును అను సరించి, వైదిక కర్మానుష్ఠాననిరతు లగుదురు, భక్తిపరాయణులై ఈశ్వరారాధనాసక్తు లగుదురు, జ్ఞాననిష్ఠులై బ్రహ్మాత్మైక్యాను భూతిని పొందుదురు.

మన భారతభూమి అనాది, అపౌరుషేయ,స్వతః ప్రమాణ వేద రాశికి ఆవాసభూమి. వేదార్థోపబృంహకములైన పురాణేతిహాసము లకు, శ్రుత్యర్థానుప్రాణితములైన స్మృతులకు ఆలయము. ఈ పవిత్ర భారతావనియందు పరమేశ్వరుడు అచింత్య స్వీయమాయా శక్తిచేత మాయామానుష విగ్రహధారియై, లీలామానుష విగ్రహ ధారియై రామ, కృష్ణాదిరూపములతో అవతరించెను. వసిష్ఠ, వ్యాస

శుకాది మునీంద్రులు ఈ భారతభూమియందు అవతరించి, వైదిక ధర్మ రక్షణము చేసిన మహాత్ములు.

అనంత కాల ప్రవాహములో ప్రకృతిప్రభావముచేత ధర్మము నకు గ్లాని, అధర్మమునకు అభ్యుత్థానము కలుగుట సహజము. అట్టితరి,భగవత్సంకల్పముచేత వైదికధర్మోద్ధరణమునకై శ్రీశంకర భగవత్పాద, శ్రీవిద్యారణ్యాది బ్రహ్మజ్ఞాననిష్ఠులు భగవద్విభూతి సంపన్నులై అవతరించి భాష్యరచనలు గావించిరి, శ్రుతిప్రతిపాది తములైన కర్మ, బ్రహ్మలకు సరస సమన్వయము చేసి, వైదిక మార్గమును తీర్చిదిద్దిరి. శ్రీ శంకర భగవత్పాదులు సర్వశ్రుతి సమన్వయ పూర్వకముగా అద్వైత సిద్ధాంతమందే వేదములకు పరమ తాత్పర్యమని సిద్ధాంతీకరించిరి. వారు వైదిక కర్మానుష్ఠాన మును త్రోసి రాజనలేదు. సగుణభక్తిని నిరాకరించలేదు. ఇవి దురితక్షయమునకై, చిత్తశుద్ధికై, చిత్తైకాగ్ర్యమునకై అవశ్యము ఆదరణీయములే అని ప్రతిపాదించిరి. ఇవి, అన్య ఉత్తమలోక ప్రాపకములే గాని, కైవల్యప్రదములు కావు అని ముక్తకంఠముతో చాటిరి. "జ్ఞానాదేవ తు కైవల్యమ్" అనునది పరమ సిద్ధాంతమని శాస్త్ర, యుక్తి, అనుభవ పురఃసరముగా శ్రీశంకరులు ప్రస్థాన త్రయ భాష్యములందును, ప్రకరణ గ్రంథములందును ప్రతిపాదించిరి.

కాశీక్షేత్రమందు అద్వైత వేదాంత సంప్రదాయమునకు చెందిన అద్వయ బ్రహ్మాత్మైక్యనిష్ఠులైన యతీశ్వరులయ్యు భక్తశిరోమణులైన నలుగురు మహాత్ములు జన్మించిరి.వీరిలో ఒకరు, శ్రీధరస్వామి 14వ శతాబ్ది పూర్వార్ధమందు (1300-1350) ఉండెడి వారు. ఈయన నృసింహోపాసకులు. శ్రీధరస్వామి 'భావార్థ దీపిక' అను నామముతో శ్రీమద్భాగవతమునకు ప్రసన్నగంభీరమైన వ్యాఖ్యను రచించిన మహామనీషి. ఏతద్వ్యాఖ్య, శ్రీమద్భాగవత రహస్యార్థాభివ్యంజకమైనది. భాగవతాంతర్గతమైన గంభీరార్థమును

సరళము, సుబోధము చేయునట్టి వ్యాఖ్యారాజము ఇది. ఇంతియే కాక, శ్రీమద్భగవద్గీతకు ఈయన, 'సుబోధిని' అను టీకను గూడా రచించియున్నారు.

17వ శతాబ్దిలో గల శ్రీమధుసూదన సర్వస్వతీస్వామి, కేవల జ్ఞానమార్గానుయాయి అయిన ఆచార్యుడు మాత్రమే కారు. విశేషించి భక్తిరసవ్యాఖ్యాత, భక్తిస్నిగ్ధ హృదయులును అయిన మహనీయ సాధకులు. వీరు బృందావనమందు అయిదు పర్యాయములు 'శ్రీగోపాలసహస్రనామస్తోత్ర' పురశ్చరణముచేసి, శ్రీకృష్ణపరమాత్మ దర్శనమును పొందిన భక్తశిఖరాయమాణులు. ఈ మధుసూదన సరస్వతీస్వామిచరణులు శ్రీమద్భగవద్గీతకు 'గూఢార్థదీపిక' అను నామముతో విశ్రుతమైన టీకను రచించిరి. 'అద్వైతసిద్ధి' వంటి అద్వైత సిద్ధాంత ప్రతిపాదకములైన శాస్త్రీయ గ్రంథరాజముల ప్రణయన మొనర్చిన మహా ప్రతిభా వైదుష్యసంపన్నులు. ఇంతియే కాక, 'భక్తిరసాయనము' వంటి రచనలు చేసి భక్తిరసమునకు శాస్త్రీయ ప్రామాణ్యమును సమకూర్చిపెట్టిన విద్వన్మూర్ధన్యులు. వీరు వారణాసిలో 'చౌసట్టీఘాటు'లో గల తమ మఠమునందు నివసించెడివారు.

శ్రీనారాయణతీర్థస్వామివారు 18వ శతాబ్దిలో శ్రీవిశ్వనాథ క్షేత్రమందు నివసించిన అద్వైత సిద్ధాంతానుయాయి అయిన యతీశ్వరులు. ఈయన, వేదాంతశాస్త్రమందు మూర్ధన్య గ్రంథ ప్రణయనముకావించిన యతిశేఖరులు. వీరు శాండిల్యభక్తిసూత్రములకు 'భక్తిచంద్రికా' వ్యాఖ్యను రచించి, భక్తితత్త్వమును, భక్తి ప్రకారములను, భక్తిసాధనాభ్యాసరీతిని శ్రుతిప్రతిపాదిత మంత్రములను ప్రమాణముగా చూపుచు సుప్రతిష్ఠిత మొనర్చిన భక్తిరస సిద్ధాంత నిష్ణాతులు.

ఈ శతాబ్దిలో శ్రీకరపాత్రీస్వామి శ్రీచరణులు కాశీక్షేత్రమును ప్రధాన కేంద్రముగా చేసికొని, భక్తిరసాప్లుతమైన అద్వైతబ్రహ్మ

నిష్ఠయందు నిరంతరము నిమజ్జితులైన భక్తిమార్గానుయాయులు. అద్వైత యతిశ్రేష్ఠుల పరంపరలో శిరోరత్నముగా భాసిల్లిన యతి చక్రచూడామణులు. ఈ మహనీయుడు శ్రీమధుసూదనసరస్వతీ సంప్రదాయానుయాయులై 'భక్తిరసార్ణవము' అను భక్తిశాస్త్ర గ్రంథమును గీర్వాణ భాషలో రచించిన మహాత్ములు.

ఈవిధముగా, ఈ మహాత్ములు నలువురును అసమాన ప్రతిభా వైదుష్యసంపన్నులై గ్రంథ ప్రణయనము చేయుటయే కాక, శ్రీవిశ్వనాథుని సన్నిధిలో 'మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' అను సిద్ధాంతమును అనుసరించి భక్తి, జ్ఞాననిష్ఠులై జీవితములను సార్థక మొనర్చుకొనిన పవిత్రాత్ములు. తాదృశ మహాత్ముల స్మరణమే భవతారకము.

శ్రీ కరపాత్రీస్వామిచరణులు సార్థక నామధేయులు. వీరు జన్మనా, సహజ విరాగులు. శ్రీచరణులు 'నరవర' నివాసులైన 'షడ్దర్శనాచార్య' శ్రీ విశ్వేశ్వరాశ్రముల సన్నిధిలో యథావిధిగా గురూపసదనము చేసి, సర్వదర్శనములను అధ్యయనము చేసిరి. అనంతరము, వీతరాగులై గంగాతటమున, వృక్షచ్ఛాయలలో తపోనిష్ఠానిమగ్నులైరి. ఆ కాలమున, శ్రీచరణులు కేవల కౌపీన మాత్రధారులై ఉండెడివారు. కేవలము గంగాజలమును మాత్రమే గైకొనుచు బాహ్యవిషయసంస్పర్శ లేక, ఆత్మారాములై ఉండెడివారు. ఎపుడైనను, అయాచితముగా లభ్యమైన భిక్షను పవిత్ర గృహములందు కరతలభిక్షగా స్వీకరించుచుండెడివారు. కావున, వారు 'కరపాత్రీ' యని అన్వర్థనామముతో విశ్రుతులైరి. వారు నిరీహులు, నిస్పృహులును అయి, నిరంతరము మనన, నిదిధ్యాసన నిష్ఠులై ఉండెడివారు. తరువాత, కొంతకాలమునకు శ్రీ బ్రహ్మానంద సరస్వతీ స్వామిచరణుల నుండి శాస్త్రోక్తవిధిగా తురీయాశ్రమమును స్వీకరించి, 'శ్రీహరిహరానంద సరస్వతీ' అను నామముతో విరాజిల్లిరి. అయినను, శ్రీకరపాత్రీస్వామి నామముతోనే ప్రసిద్ధి నొందిరి.

(II)

శ్రీ కరపాత్రీస్వామివారు వర్తమాన శతాబ్దియందు అసమాన ప్రతిభా వైదుష్య సంపన్నులై విద్వల్లోకమున ప్రచండభాస్కరునివలె వెలుగొందిన మహామనీషి. వివిధ దర్శనములను ఆపోశనము పట్టిన అపూర్వ మేధా ప్రజ్ఞావిలసిత మతులు. శ్రీస్వామిచరణులు ఎంత అద్వైత బ్రహ్మనిష్ఠులో, అంత మహాసాధకవరిష్ఠులు, అంత భక్తి నిష్ఠాగరిష్ఠులు, ఉపాసక శ్రేష్ఠులు.

శ్రీ కరపాత్రీస్వామివారు పూర్వోత్తర మీమాంసలయందు అసమాన శేముషీధురంధరులు. న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగాది దర్శనములందు నాన్యతోదర్శనీయములైన పాండితీ ప్రతిభలు కలవారు. ఆయనగారిచే అచుంబితమైన తంత్రశాస్త్రము గాని, భక్తి శాస్త్రము గాని, రససిద్ధాంతముగాని లేదనుట అతిశయోక్తి కాదు. వారి హృదయము వైదికధర్మనిష్ఠము. వారి చిత్తము సామాజిక, రాజనైతిక చైతన్యవిలసితము.

ఏవంవిధమైన శ్రీ కరపాత్రీ శ్రీచరణుల వ్యక్తిత్వము సర్వతో విలక్షణముగా పరిఢవిల్లినది. ఇది ఈశ్వరసంకల్పము. ఇది, ఆస్తిక వర్యులైన భారతీయుల సౌభాగ్యము. నా పురాకృత సుకృత విశేషాతిశయము వలన 40 సంవత్సరములకు పూర్వము అమరావతిలో జరిగిన మహాసభలలో ఈ మహాత్ముని దర్శించు భాగ్యము నాకు కలిగినది. వీరి ప్రవచనసుధను ఆస్వాదించునట్టి అదృష్టము కలిగినది. ఆ సభలు, శ్రీకరపాత్రీ శ్రీచరణులతోపాటు, ఆంధ్రదేశ మందలి విద్వన్మూర్ధన్యులతో హృదయరంజకముగా జరిగినవి. ఆంధ్రదేశమందలి పండితవర్యులతో శ్రీస్వామిచరణులు చేసిన శాస్త్ర గోష్ఠులు నేటికిని, నా హృదయ కుహరమునందు ముఖరితము లగుచుండును. ఆ సన్నివేశమును తలంచుకొనినపుడు నా హృదయమందు ఆనందవీచికలు వీచును. ఆనందోద్రేకముతో నా నేత్రములు అశ్రుసిక్తము లగును. అవిస్మరణీయమైన ఈ సదవకాశము,

గురుదేవతానుగ్రహము వలనను, మా పితృపాదుల అనుకంపా విశేషముచేతను నా జీవితములో సంభవించినది. ఇది ఈశ్వరానుగ్రహమే అని భావింతును.

శ్రీకరపాత్రీస్వామివారు గీర్వాణ,హిందీ భాషలలోసహ ప్రాధిక ప్రవచనములు గావించిన మహాత్ములు, అనేక గ్రంథములను రచించిన ప్రతిభావైదుష్యసంపన్నులు. శ్రీచరణుల శైలి ఎంత ప్రఖరమో, ఎంత సునిశితమో, భావప్రవణశైలి అంత సరసము, అంత హృదయావర్జకము. ఆ మహానుభావుని వ్యక్తిత్వము నిశితమైన బౌద్ధికతతోపాటు, భక్తివిగలితమైన సరసభావముతో,భక్తినిర్భరమైన తన్మయతతో విలసిల్లుచుండును. శ్రీచరణుల ప్రవచనములందును, రచనలందును వారి నాన్యతోలభ్యమగు అలౌకిక వ్యక్తిత్వము ప్రస్ఫుటితమగుచుండును. గాఢమైన వైదిక కర్మపరత, తపోబల సముపార్జితమైన జ్ఞానము, సాత్త్విక హృదయమందు ఉద్వేలితమగు పరమానందము చేత పరిప్లావితమగు భక్తి, వీని మధుమయ సామంజస్యము వారి వ్యక్తిత్వమందు భాసమానమగుచుండును. శాస్త్రీయ సత్యములను విశ్లేషించు సమయమున, శ్రీచరణుల వాణి, ఎంత తర్కనిష్ఠముగా, ఎంత యుక్తిప్రవణముగా ఉండునో, భక్తిరస వివరణమందు ఆ వాణి, అంత మధురము, సరసము, సరళము, సుబోధమునయి ఉండును.

శ్రీకరపాత్రీస్వామి చరణులచే ప్రణీతములైన గ్రంథములు కొన్ని ఇవి—

భక్తిరసార్ణవః —

ఈ గ్రంథము శ్రీమధుసూదన సరస్వతీ ప్రణీత 'భక్తి రసాయన' శైలిలో రచించబడినది. ఇందు, భక్తిరస స్వరూప వివేచనము గంభీరశాస్త్రీయశైలిలోచేయబడినది.భక్తిరసముయొక్క విస్తృత, గంభీర వివేచనము చేయుట ఈ గ్రంథము యొక్క

ముఖ్య ఉద్దేశ్యము. శ్రీస్వామిచరణులచేత ఈ గ్రంథమందు భగవత్స్వరూప వివేచనము, భగవన్నామ, రూప, లీలా, ధామాది వివేచనము అత్యంత గంభీరముగా భక్తిశాస్త్రనిర్ణీత సిద్ధాంత శైలిలో చేయబడిన భక్తిరస సిద్ధాంత గ్రంథము. శ్రీకరపాత్రీ స్వామివారు 'భక్తిర్ముక్తిశతాధికా' అను సిద్ధాంతమును వేద, శాస్త్ర, యుక్తి పురఃసరముగా, ప్రతిభా వైదుష్యస్ఫోరకముగా ఈ 'భక్తిరసార్ణవ' మందు ప్రతిపాదించిరి. ఇంతియే కాక, శ్రీరాధాకృష్ణుల తత్త్వము, వేద, శాస్త్ర ప్రతిపాదితమైన భజనీయ తత్త్వముగా శ్రీస్వామి చరణులు ఈ గ్రంథమందు ప్రతిపాదించిరి. ఇందు శ్రుతి ప్రతి పాదిత తత్త్వమును ఎడనెడ మహా వైదుష్యముతో ప్రతిపాదించిరి. శ్రీస్వామిచరణులు ఇందు పురుషసూక్త, దేవీ సూక్తాదుల పరమ తాత్పర్యమును ప్రతిపాదించుటలో అద్భుతమైన ప్రతిభను ప్రదర్శించిరి. ఈ భక్తిరసార్ణవము 'భక్తిరసాయన' శైలిలో రచించ బడినను, అనేక నవీన విషయ సంవలితమై, ఇది తద్విలక్షణముగా భాసిల్లుచుండును.

వేదార్థ పారిజాతః :-

ఈ గ్రంథము శ్రీకరపాత్రీస్వామిచరణుల వేదవిజ్ఞానమునకు దర్పణము పట్టుచుండును. ఇది వైదిక వాఙ్మయమందలి అసాధా రణమైన విశ్వకోశమని చెప్పవచ్చును. ఈ గ్రంథమున, ప్రమా, ప్రమాణ, ఖ్యాతి, దేవతాస్వరూపములు సశాస్త్రీయముగా నిర్ధారణము చేయబడినవి. ఇందు వేదముల అపౌరుషేయత్వము, బ్రాహ్మణ ముల వేదత్వము సంప్రదాయానుగుణముగా ప్రతిపాదించబడినది. ఇందు వేదముల విషయమై పాశ్చాత్యులు, తదనుయాయులు చేసిన పూర్వపక్షములు సశాస్త్రీయముగా నిరాకరించబడినవి. ఈ గ్రంథము సాయణాది పూర్వాచార్యుల సిద్ధాంతానుసారముగా రచించబడినది. ఇది శ్రీకరపాత్రీస్వామి ప్రణీతమైన వెద భాష్యము

నకు భూమికా భాగము. ఈ గ్రంథమునకు ఉత్తర ప్రదేశ్ సంస్కృత అకాడమీవారు లక్ష రూప్యముల మహుమతి నొసగిరి. ఇది, రెండు భాగములుగా (2314 పేజీలలో) ప్రకాశితమైన బృహద్గ్రంథము.

**శుక్ల యజుర్వేద వాజసనేయ సంహితాభాష్యమ్ :—**

శ్రీకరపాత్రీస్వామిచరణులు ఉవ్వట,మహీధరాది ఆచార్యుల శైలిలో రచించిన శుక్లయజుర్వేద మాధ్యందినశాఖాభాష్యము. దీని యందు ఆధునిక విద్వాంసులచేత చేయబడిన దోషారోపములను దక్షతాపూర్వకముగా ఖండించిరి. ఇందు, ప్రతి మంత్రమునకు భగవత్పరకము, ఆధ్యాత్మికము, ఆధిదైవికములైన అర్థములను హృదయాహ్లాదకరముగా ప్రతిపాదించిరి. ఈ భాష్యమందు ఇంత వరకు రెండు అధ్యాయములు మాత్రమే ప్రకాశితములైనవి.

**శ్రీవిద్యారత్నాకరః :—**

ఈ గ్రంథము శ్రీకరపాత్రీస్వామిచరణులకు మంత్రశాస్త్ర మందు గల అపార విజ్ఞానమునకు పరిచాయకమైన గ్రంథరాజము. ఈ గ్రంథము శ్రీసపర్యా, మంత్రభాష్య,వాంఛాకల్పలతా,లక్షార్చన, పూర్ణాభిషేక, మహాయాగక్రమాది వివిధ విధివిధాన విలసితమైన మంత్రశాస్త్రగ్రంథము. కులార్ణవ, తంత్రరాజ, కల్పసూత్ర, శ్రీవిద్యార్ణవ, త్రిపురారహస్య,నిత్యోత్సవాది వివిధ తంత్రగ్రంథము లను నిశితముగా పరిశీలించి ఉపాసకుల శ్రేయస్సునకై రచించ బడిన మంత్రశాస్త్ర గ్రంథరాజము.

**శ్రీరామాయణమీమాంస :—**

ఈ గ్రంథము హింధీ భాషలో రచించబడినది. ఇది ఒక బృహద్గ్రంథము. శ్రీమద్రామాయణము అవైదికుల వలన దేశ, విదేశభాషలలో ఎంత వికృతరూపము దాల్చినదో ఇందు శ్రీస్వామి చరణులు వివేచనాత్మకముగా ప్రదర్శించిరి. 'బుల్కే' మహాశయుల వంటివారు చేసిన కువిమర్శలను వేద, శాస్త్ర, యుక్తిపురఃసరముగా

ఖండించి శ్రీచరణులు రామాయణ యథార్థ స్వరూపమును మహా ప్రతిభాస్ఫోరకముగా ప్రదర్శించిరి.

భాగవత సుధ :—

ఈ 'భాగవత సుధా' గ్రంథమును శ్రీకరపాత్రీస్వామివారు భక్తి ప్లావితమైన హృదయముతో హిందీ భాషలో రచించిరి. నిగమ కల్పతరుగలిత ఫల మైన శ్రీమద్భాగవతము భగవంతుని వాఙ్మయ విగ్రహము. ఈ గ్రంథము 8 అధ్యాయములుగా వెలువడినది. శ్రీమద్భాగవతమందలి అంతరంగ రస రహస్యములను అసాధారణమైన ప్రతిభతో శ్రీస్వామివారు సరళముగా సుబోధముగా వివరించిరి. ఈ గ్రంథము శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీకరపాత్రీస్వామి ముఖారవిందమునుండి వినిఃసృతమైన వచనామృతము. ఇందలి విషయవిశ్లేషణము నాన్యతోలభ్యము.

శ్రీరాధాసుధ :—

ఈ గ్రంథము హిందీభాషలో 12 అధ్యాయములుగా ప్రకాశిత మైనది. శ్రీరాధాకృష్ణులయందు శ్రీస్వామిచరణులకు గల అపార భక్తిశ్రద్ధలకే కాక, తద్రసానుభూతిపరవశతకు ఈ గ్రంథము సూచకము. ఇందు శ్రీ రాధాకృష్ణ యుగళతత్త్వము పరమ ప్రామాణికముగా లలితమైన భాషలో అభివ్యక్తము చేయబడినది. ప్రేమాత్మకము, ప్రకాశాత్మకము నయిన యుగళ తత్త్వము యొక్క విలాసమే ఈ సమస్త విశ్వము అని ఇందు అపూర్వ ప్రతిభాసమున్మేషముతో ప్రదర్శించబడినది.

మార్క్సువాదము–రామరాజ్యము :

ఈ గ్రంథమందు శ్రీకరపాత్రీచరణులు ప్రాచ్య, ప్రాశ్చాత్య దర్శనములనన్నిటిని సమగ్రముగా, తులనాత్మకముగా అనుశీలనము చేసి రామరాజ్యము యొక్క సార్థకతను, మార్క్సువాదము యొక్క వైయర్థ్యమును ప్రతిభాసముల్లసితముగా ప్రతిపాదించిరి.

భక్తిసుధ :-

'భక్తిసుధ' శ్రీకరపాత్రీస్వామివారిచే రచించబడిన అపూర్వ గ్రంథరాజము.ఇది ఒక బృహదారణ్యకము, ఒక బృందారణ్యకము. ఈ గ్రంథము 'భక్తిరసార్ణవము'నకు పరిపూరకము. ఈ రెండు గ్రంథములకును మధ్య, సంబంధము కలదు,పార్థక్యమును కలదు. 'భక్తిరసార్ణవము' భక్తిసిద్ధాంతమును ప్రతిపాదించు గ్రంథము. ఈ 'భక్తిసుధ'భక్తియొక్క వ్యావహారిక దర్శనమును నిర్దేశించును. ఈ రెండు గ్రంథముల మధ్య ఉపకార్య, ఉపకారక భావము కలదు. ఇందు వర్ణితములైన సర్వవిషయములు మనోహరులు, విచారోత్తేజకములు. వేణుగీత, చీరహరణ, వేదాంతరససార, శ్రీరాసలీలారహస్యాది విషయములందు వర్ణించబడిన తత్త్వము అత్యంత హృదయావర్జకము, భక్తిరసాన్వితము, పరమానంద సంధాయకము. ఈ గ్రంథము నిగమాగమసార సర్వస్వము. ఈ భక్తిసుధయందు శ్రీకరపాత్రీ శ్రీచరణులు ఆధ్యాత్మిక తత్త్వమును లౌకిక ఉదాహరణముల ద్వారా హృదయరంజకముగా ప్రదర్శించియున్నారు. ఈ గ్రంథములే కాక, శ్రీకరపాత్రీ స్వామివారిచే ప్రణీతములైన గ్రంథములు అనేకములు అముద్రితములుగానే ఉండిపోయినవని చెప్పెదరు. వారు గీర్వాణ, హిందీ భాషలలో చేసిన ప్రవచనములు లిపిబద్ధములు కాక, అటులనే ఉండిపోయినవని చెప్పెదరు. కాలమహిమ ఇది. ఏమి చేయగలము! ఏమి చెప్పగలము!

శ్రీకరపాత్రీస్వామిచరణుల సమన్వయసరణి అపూర్వము, అసదృశము. వారికి సనాతన ధర్మమందు గల ఆస్థా, శ్రద్ధలు నాన్యతోదర్శనీయములు. శ్రీచరణుల వచోవిన్యాసము ప్రసన్న గంభీరము. వారు చేయు సమన్వయసరణి వేద శాస్త్ర ప్రమాణ సిద్ధమై, ప్రభావోత్పాదకమై ప్రతివాదులను నిరుత్తరులనుచేయును,

ఒకమారు, జ్ఞానిజీవితములో కామ, క్రోధాది దోషములు ఉండునా, ఉండవా? అను ప్రశ్న పండితులు, సాధువులు, సాధకులైన భక్తుల మధ్య ఉత్పన్నమైనది. అంత, ఒకరు జ్ఞానిజీవితములో గూడా కామ, క్రోధాది వికారములు ఉన్నచో, దుఃఖము ఉండును, తత్త్వజ్ఞానము వలన దుఃఖనివృత్తి కాకపోయినచో తత్త్వజ్ఞాన ప్రాప్తికై ఎవరు ప్రయత్నింతురు? అనిరి. తత్త్వజ్ఞానము కలిగినను అవిద్యాలేశము ఉండును, దాని వలన కామ, క్రోధాది వికారములు కలుగవచ్చును అని మఱొకరు అనిరి. తత్త్వజ్ఞానము కలిగిన తరువాత అవిద్య ఉండదు, అవిద్యాలేశము సైతము ఉండదని మఱొక మహాత్ముడు వచించెను.

అంత, శ్రీకరపాత్రీస్వామివారు గంభీరవాణితో ఇట్లనిరి- ఔపనిషద మహావాక్య శ్రవణము చేత అఖండార్థ సాక్షాత్కారము కలుగును, అపుడు అవిద్య నివృత్తమగును అను మాట యుక్తమే. కాని, శరీరము ఉన్నంతవఱకు దానికి జరా, రోగాదులు ఉండును, స్వప్న, సుషుప్త్యాదులు ఉండును. సాక్షియొక్క బ్రహ్మత్వము జ్ఞాతమైనపుడు అంతఃకరణ భానమందు గాని, విషయభానమందు గాని, ఏమియును భేదము ఉండదు. బ్రహ్మవిద్య, భ్రమను మాత్రమే నివర్తింపజేయును గాని, భాసమానమగు ప్రపంచమును నివర్తింపజేయజాలదు. కావుననే సాక్షిభాస్యమైన అంతఃకరణమందు తత్త్వజ్ఞానోదయము కలిగిన తరువాత గూడా అంతఃకరణమందు వికారములు జనించినను, ముక్తికి ఏవిధమైన నిరోధము ఉండదు. ఏలయన, ఆత్మ, నిత్య ముక్త స్వరూపుడు. అవిద్యానివృత్తి, కేవలము ఉపలక్షణము మాత్రమే. కావున, తత్త్వజ్ఞానిజీవితములో గూడా వికారములు సంభవమే. శ్రీచరణుల సమన్వయ రీతి ఇది.

మఱొక ప్రసంగమున 'క్లీం' బీజము యొక్క తత్త్వమును ఇట్లు ప్రతిపాదించిరి- 'క్లీం' బీజము కామరాజబీజము. ఈ బీజాక్షరమందు "క్, ల్, ఈ, ం" అను అక్షరములు కలవు. శ్రీకృష్ణ

చంద్రుడు. పరమానందకందము, మదనమోహనుడు అయిన వ్రజేంద్రనందనుడు 'క్' అను అక్షరమునకు అర్థము. వృషభాను నందిని, రాసేశ్వరి అయిన రాధారాణి 'ల్' అను అక్షరమునకు అర్థము. ఈ అక్షరమును తంత్రశాస్త్రమందు 'కామకళ' అని అందురు. బిందువు (ం)నకు అర్థము రసోద్రేకము. కాగా, 'క్లీం' బీజముచేత అచింత్య పరమానంద సుధాసింధువైన శ్రీకృష్ణుడు, సుధాసింధువునందలి మాధుర్యసార సర్వస్వమునకు అధిష్ఠాత్రి అయిన రాధ, రాధాకృష్ణుల పరస్పర ప్రేమ, అనగా రాధాకృష్ణుల పరస్పరసమ్మిలనము చేత ప్రాదుర్భవించినలోకోత్తర రసోద్రేకము ప్రతిపాదించబడును. ఈ వివేచన ఎంత భావుకతాస్ఫోరకము! ఎంత వైదుష్య సముల్లసితము! ఈ భావన,నాన్యతోదర్శనీయమై ఉపాసకలోక హృదయావర్జకముగా ఉన్నదనుట అనుభవైక వేద్యము.

ఇట్టి మహాగంభీరము,భక్తిరసాభివ్యంజకము, అద్వైత బ్రహ్మ తత్త్వ ప్రతిపాదకమును అయిన గ్రంథమును నాబోటివాడు ఆంధ్రీకరింపబూనుట సాహసకార్యమే.అయినను, నా హృదయము శ్రీకరపాత్రీస్వామిచరణారవిందానురంజితమైనది. ఆ మహనీయుని ప్రతిభా వైదుష్యములే కాక, ఆయన తపోనిష్ఠ, అద్వైతజ్ఞాననిష్ఠ, ఈశ్వరోపాసన మొదలగు మహావిషయములు నా హృదయమును చిరకాలమునుండి ఆకట్టుకొనియున్నవి. ఆ మహనీయుని విజ్ఞానమును ఆంధ్రభాషలో జిజ్ఞాసువులైన పాఠకులకు అందించవలయును నను ఉత్కటమైన ఆకాంక్ష, నాహృదయములో చిరకాలమునుండి నెలకొనియున్నది. ఏదియో ఒక తపన, ఏదియో ఒక వేదన ఈ జీవుని వెన్నాడుచు వచ్చినది. గురుదేవతానుగ్రహము వలన, ఏతద్రచనావ్యాసంగమునకు పూనుకొంటిని. నాచేత ఈ పని చేయించుట ఈశ్వరసంకల్పము కాబోలు! కానిచో,ఆ మహనీయుని గ్రంథములు ఇంతదనుక ఆంధ్రభాషలో ప్రకాశితములు కాకపోవుట ఏమి? గురుదేవతానుగ్రహము వలన ఈ గ్రంథమును విజ్ఞులైన ఆంధ్రపాఠకులకు అందించుట నా భాగ్యముగా భావించుచున్నాను.

# కృతజ్ఞతానివేదనము

'తర్కవేదాన్త సార్వభౌమ' శ్రీ మండలీక వేంకటశాస్త్రిగారి స్మృతిచిహ్నముగా 'శ్రీమండలీకాశ్రమము' అను పేరున ఒక ఆధ్యాత్మిక సంస్థ శ్రీ కామకోటి పరమాచార్యులవారి ఆదేశానుసారము, తెనాలి నగరమున నెలకొల్పబడినది. చెన్నై నగర వాస్తవ్యులయిన బ్రహ్మశ్రీ చావలి శ్రీరామ్‌గారు ఈ ఆశ్రమవ్యవస్థాపకులు. వీరు ఆత్మగుణసంపన్నులు, శ్రీ పరమాచార్యులవారిపట్ల శ్రద్ధాభక్తి విలసితులు నయిన మహామనీషి. శ్రీ జగద్గురువుల ఆదేశానుసారము ఈ ఆశ్రమమునందు ప్రతి త్రయోదశినాడు వేదస్వస్తి, శంకర భాష్యప్రవచనము కొన్ని సంవత్సరములనుండి అవిచ్ఛిన్నముగ కొనసాగించుచున్న భక్తవరేణ్యులు. వీరు ఇచట, తమ బంధువగు బ్రహ్మశ్రీ తూములూరు సాయినాథ్‌గారి సహకారముతో ఈ కార్యక్రమమును నిర్వహించుచున్నారు. శ్రీ చావలి శ్రీరామ్‌గారు, నాకు ఆత్మీయుడైన శ్రీ సాయినాథ్‌గారల ప్రోత్సాహముతో నేను ఇచట నిత్యము వేదాన్త ప్రవచనము చేయుట జరిగినది. ఇదంతయు శ్రీ జగద్గురువుల అనుగ్రహవిశేషము. ఈ సహృదయులు నాపట్ల చూపిన ప్రేమాదరములకు, వారొసగిన ప్రోత్సాహమునకు నేనెంతయో కృతజ్ఞుడను. పరమేశ్వరుని అనుగ్రహవిశేషము చేత వీరిరువురు, సకుటుంబముగ, ఇతోఽధిక శ్రేయస్సును, సుఖసంతోషములను ఆత్మగుణసంపదను, నిర్విశేషానందమును పొందుదురుగాక!

ప్రవచనము జరుగుచున్నపుడు, శ్రోతృగణము ఉండవలయునుగదా! అట్టివారిలో ప్రధానులయినవారు బ్రహ్మశ్రీ షావుకారు సదాశివశర్మగారు. వారు ఇచట జరుగు ప్రవచనమునకు ఒక ప్రచోదకశక్తియని చెప్పవచ్చును. వారు వృత్తిరీత్యా ఉత్తమ పదవినందుకొనిన మహనీయులు. వారి ప్రవృత్తి మాత్రము ఆధ్యాత్మిక విషయములందే సంలగ్నమై ఉండును. ఈ మహనీయుడు వేదోక్త కర్మ, భక్తి, జ్ఞాననిష్ఠులు. వారు నిరంతరము

పురాణేతిహాస గ్రంథములను అధ్యయనము చేయుచు, భారత భాగవత, రామాయణాది గ్రంథములను అర్థావబోధతో పారాయణ మొనర్చిన ధీరులు. వారు ఇచట జరుగు ప్రవచనములందేగాక నా రచనావ్యాసంగమందు ప్రేమాదరములను చూపిన ఉదార మనస్వి. వైదిక కర్మ, భక్తి, జ్ఞాననిష్ఠులైన శ్రీ శర్మగారికి నేను హృదయపూర్వకముగ అభివందనములను తెలుపుకొందును.

అటులనే బ్రహ్మశ్రీ పోతుకుచ్చి గోపాలకృష్ణమూర్తిగారు శ్రీ మండలీకాశ్రమమందు జరుగు కార్యక్రమములలో విశేషమైన శ్రద్ధాసక్తులు చూపుచున్న మహనీయుడు. ఈయన వేదమార్గాను యాయి. నా ప్రవచనములందు, నా రచనలయందును విశేషమైన ప్రేమాదరములను చూపిన ఉదారచిత్తుడు. పరమేశ్వరానుగ్రహము చేత ఈ మహోదయుడు ఇతోఽధికమైన సుఖసంపదలతో వర్ధిల్లుగాక యని ఆశీస్సుల నందజేయుచున్నాను.

బ్రహ్మశ్రీ చెరువు శివరామకృష్ణశాస్త్రిగారు సాధుగుణ సంపన్నుడు, నిరంతరము ఆధ్యాత్మిక గ్రంథపఠనమందు కాలము వెళ్ళబుచ్చుచున్న సత్త్వగుణ విలసితుడు. ఈయన నాకు బంధు వర్గములోనివారు. ప్రవచన సమయములలో వీరు నాయందు ప్రదర్శించిన ప్రేమాదరములకు నే నేమి ఒసంగగలను! ఈయన వారి ఇష్టదేవతా ప్రసాదముచేత శ్రేయోమార్గమున ముందుకు పయనింతురు గాక యని మర్యాదాపురుషోత్తముడైన ఆ శ్రీరామ చంద్రదేవుని, ప్రార్థింతును.

బ్రహ్మశ్రీ నోరి సత్యనారాయణశాస్త్రిగారు తెనాలిలోని ఓరియంటల్ కళాశాలలో అధ్యాపకులుగా పనిచేయుచున్న పండితులు. వీరు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారి అను గ్రహమునకు పాత్రులై, వారిచేత మంత్రదీక్షితులై తన్మంత్ర జప, ధ్యాననిష్ఠులై జీవనయాపనము చేయుచున్నవారు. శ్రీ శాస్త్రి

గారికి శ్రీ కరపాత్రీ శ్రీచరణముల భక్తిసుధా తత్త్వమునందు విశేషమైన ఆదరము కలిగి, తన్మనన, నిదిధ్యాసనములందు మనస్సును లగ్నము చేసి, జీవితమును ధన్యమొనర్చుకొనుచున్న సాధుపురుషులు. గురుదేవతానుగ్రహముచేత శ్రీ శాస్త్రిగారు ఆత్మ గుణసంపదతో సుఖసంతోషములతో వర్తిలుదురుగాక !

ఈ సందర్భములో ప్రధానముగా పేర్కొనదగిన మహోదయులు ఇరువురు గలరు. వారిలో ఒకరు బ్రహ్మశ్రీ కంభంపాటి వేంకటసత్యనారాయణశర్మ గారు. ఈయన సహృదయమిత్రుడు. దైవారాధనమునందు మిక్కిలి ఆసక్తి కలవాడు. ఈ ప్రవచన కార్యక్రమ నిర్వహణములో భగవత్సేవాభావముతో ప్రవర్తించిన సాధుమూర్తి.

రెండవవారు, బ్రహ్మశ్రీ వేమూరు లక్ష్మీనారాయణ గారు. ఈయన అచ్ఛమైన, స్వచ్ఛమైన, నిర్మల హృదయుడు. ఈయన శ్రీవిద్యాదీక్షితుడై, నిరంతరము శ్రీ చక్రార్చనమందు బద్ధానురాగి యైన వైదిక మార్గనిష్ఠుడు. వీరిరువురు ఈమండలికాశ్రమ కార్యక్రమ నిర్వహణలో ఒసగిన సహకారము నాన్యతోలభ్యము. జగన్మాత యైన లలితాపరాభట్టారిక అనుగ్రహముచేత ఈ మహోదయు లిరువురును సర్వవిధశ్రేయస్సులను బడయుదురుగాక యని హార్దికములయిన ఆశీర్వచనములు పల్కుదును.

శ్రీ వై. వెంకటేశ్వరరావుగారు నాకు ఆప్తమిత్రులు. ఈయన M.A; పట్టభద్రులు. వీరి జీవితము అధ్యాత్మమార్గనిష్ఠము, గురుదేవతాభక్తి పరిప్లావితము. ఈ మిత్రుడు నాయందు, నారచనల యందు ప్రదర్శించిన ప్రేమాభిమానములు అసాధారణములు. ఈ మిత్రుడు గురుదేవతానుగ్రహముచేత అధ్యాత్మ మార్గమున పురోగమించుచు సకల శ్రేయస్సులను బడయుదురుగాక ! యని నిండుమనస్సుతో ఆశీర్వదింతును.

నా అలసతవలన నా రచనావ్యాసంగము ఎక్కడ కుంటు

పడునో అని తీయని బాధతో నిరంతరము హెచ్చరిక చేయుచు నా రచనకు అవ్యాజమైన ప్రేమతో దోహదము చేసిన ఆత్మీయులు బ్రహ్మశ్రీ లొల్ల సూర్యనారాయణగారు. ఈ మిత్రుడు పరమేశ్వరానుగ్రహమునకు పాత్రులై సకుటుంబముగ సుఖసంతోషములతో జీవనయాపనము చేయుదురుగాక యని హార్దికాశిషముల నంద జేయుచున్నాను.

శ్రీ కరపాత్రీ శ్రీచరణులచేత ప్రతిపాదింపబడిన వేదాన్త తత్త్వమునందలి సౌందర్య, సౌరస్యములను హృదయదఘ్నముగ ఆస్వాదించిన భావుకుడు, సహృదయ మిత్రుడు బ్రహ్మశ్రీ హరి వెంకటేశ్వరశర్మగారు, నా యీ రచనావ్యాసంగమందు నాకు చేదోడువాదోడుగ నుండి సహకరించినవారు. ఈ చిరంజీవి పరమానందకందమైన శ్రీకృష్ణచంద్రుని అనుకంపావిశేషముచేత నిరతిశయానందము నొందుగాక యని శుభాశీస్సుల నొసగుదును.

చిరంజీవి మా కౌతా శ్రీరామచంద్రమూర్తి నాకు బంధువు, ఆత్మసఖుడు.మా సోదరులు ఇరువురియందును నాన్యతోదర్శనీయమైన ప్రేమను, ఆత్మీయతను ప్రదర్శించిన ఉదాత్తహృదయుడు. ఇతడు నా వచనములందు, నా రచనలయందు శ్రద్ధాసక్తులను నెరపిన స్నిగ్ధమతి. స్వరాజ్యలక్ష్మీసహాయుడైన మా యీ'రాము' పరమేశ్వరానుగ్రహమునకు పాత్రుడై ఆత్మానందమును పొందుగాక యని ఆశీర్వదింతును.

శ్రీ కరపాత్రీ శ్రీచరణుల గ్రంథములను ఆంధ్రభాషలో తీసికొని వచ్చుట, అత్యావశ్యకమని సూచించి, ప్రోత్సహించినవారు మా గురువర్యులు 'బ్రహ్మవిద్యాలంకార' బ్రహ్మశ్రీ సూరి రామకోటి శాస్త్రిలవారు. శ్రీ గురుచరణుల ఆశీఃప్రభావము చేతనే ఈ రచనను కొనసాగింప గలిగితినని సవినయముగా మనవి చేయుచు ఆ శ్రీగురుమూర్తికి సప్రశ్రయ నమోవాకములు చెప్పికొందును.

నా శరీరస్థితి ననుసరించి లేఖనకార్యము కొనసాగుట దుస్తరము. మా చిరంజీవులు చావలి లలిత, M.A; జనస్వామి భారతి M.Sc; నేను ధారావాహికముగా చెప్పుచున్నప్పుడు ఎంతయో ఓర్పుతో, నేర్పుతో గ్రంథలేఖనము చేయుచుండెడివారు. వారి సాయమే లేకున్న, ఇంత గ్రంథమును వ్రాయుట నాకు దుశ్శక మయ్యెడిది. ఈశ్వరానుగ్రహముచేత ఈ చిరంజీవులు ఇతోఽధిక విద్యావినయసంపన్నలై సుశ్రీశోభితలై, వికసితమతులై జీవితములో ప్రగతిని సాధింతురుగాక అని ఆశీర్వదించుచున్నాను. అటులనే ముద్రణసమయములో పత్రసంశోధనమందు నాకు చేదోడుగా ఉన్న మా చిరంజీవి చావలి శ్రీరామ్ పరమానందకందమైన శ్రీకృష్ణ దేవుని కృపకు పాత్రుడై పురోభివృద్ధి చెందుగాక అని హార్దికములైన ఆశీర్వచనములను పలుకుదును.

నా రచనావ్యాసంగమునకు ఎట్టి విక్షేపములు లేకుండునట్లు చేసిన వ్యక్తి, మా సోదరుడు రామకృష్ణశాస్త్రి. మా మాతాపితరుల ఆశీర్వచనము వలన, మాకు నిరంతర సాహచర్యము లభించినది. తత్ఫలమే ఏతద్గ్రంథరచనాపరంపర. కాని, నా ప్రాణములో, నా హృదయములోగూడుకట్టుకొని ఉన్నయీ నా సోదరుడు రామకృష్ణ శాస్త్రి మా దుష్కర్మవశమున దారాపుత్రులను, సోదలమైన మమ్ము, దేహేంద్రియ సంఘాతమును త్రోసిరాజని 1-1-1996 న, ముక్కోటి ఏకాదశీ మహాపర్వదినమున తన పార్థివ శరీరమును వీడి, దివంగతుడైనాడు. ఇతడు అద్వయానందానుభూతికి సమష్టి కుటుంబమే ప్రధాన సాధనముగా భావించి, తద్రక్షణమునకై జీవిత మును సాగించిన ధీరోదాత్తుడు. ఇతడు ఉపాధ్యాయవృత్తి చిత్తశుద్ధితో నిర్వహించి అధికారుల మన్ననలను పొందిన ధీశాలి. మంచి వాక్చాతుర్యము, చక్కని లోకవ్యవహారనైపుణ్యము గల ప్రజ్ఞాశాలి. ఇతడు క్రియాశీల రాజకీయములలో పాల్గొనలేదుగాని, జాతీయ, అంతర్జాతీయ రాజకీయములందు తనదైనరీతిలోచక్కని అవగాహన

కలవాడు. జాతీయ దృక్పథము కల స్వదేశాభిమాని. ఇది, మా పితృపాదులనుండి ప్రాప్తమైన ఒక మహాగుణము. ఇతడు సహజముగా మృదుభాషి, మితభాషి. కాని, రాజకీయ విషయచర్చా సమయమున తీవ్రవాది. ఆ సమయమున వాని పలుకులు 'దారుణాఖండల శస్త్రతుల్యములై' వాడిగా, వేడిగా వెలువడుచుండెడివి.

ఈ నా సోదరుడు మూర్తీభవించిన భ్రాతృభావము. వానికి నా మాట శిరోధార్యము. చిన్ననాటినుండి మా హృదయములలో

> దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః ।
> తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః ॥"

అని శ్రీరామచంద్ర హృదయ వినిఃసృతమైన వచనము గాఢముగా హత్తుకొని మాకు మార్గదర్శకము, ఆదర్శప్రాయమును అయినది. నా జీవనాధారమైన అట్టి సోదరుడు నేడేడి! కర్తవ్యపరాయణుడయిన ఆ సోదరుడు నేడెక్కడ! ఒక సహృదయ మిత్రుడు, 'పోయినది శాస్త్రిగారు కాదు,పోయినది మీరండి'అన్నమాట సర్వథా అవితథ సత్యము. అతడు లేని నేను జీవన్మృతుడనే. అతడు భౌతిక శరీరమును వదలివేసి కూడా బంధువుల, ఆత్మీయుల హృదయములందు సజీవుడే అయిఉన్నాడు. వాని అంతఃకరణము తాదృశము. అంతఃకరణావచ్ఛిన్న చైతన్యమైన ఆ జీవుడు, కుసుమపేశలములైన మృదుమధురభావములతో ఆత్మీయుల హృదయావర్జనము చేసి, తన జీవితమును సార్థకము చేసికొనినాడు. సర్వబంధుజనమునకు తలలోని నాలుకయై వారి ప్రేమకు పాత్రుడై తన పార్థివ జీవితమును చాలించినాడు.

ఈ వేదన, ఈ వ్యథ అంతయు అవిద్యావిలాసము, నా అధ్యాస. మోహాచ్ఛన్నమైన అంతఃకరణము చేయు విలాపము, ప్రలాపము దక్క, పారమార్థిక సత్య మున్నది ఏదియు లేదని సవినయముగా మనవి చేయుచున్నాను. అయినను, మోహము

మోహమే కదా ! అది తన సహజ స్వభావమును ఎన్నడును వీడదు. ఇంత మనవి చేసియు ఆ సుకృతాత్ముని మధుర స్మృతిచిహ్నముగా ఈ 'భక్తిసుధ' ద్వితీయభాగమును ప్రకాశితము చేయుచున్నాను. పరమానందఘనుడైన శ్రీకృష్ణచంద్రుని అమేయ కృపావిశేషము వలన లింగశరీరధారియై ఎచటికో పయనించుచున్న ఆ జీవునికి పరమ శాంతి, ఉత్తమ గతి కలుగుగాక ! అని ఆ దేవదేవుని ప్రార్థించు చున్నాను.

ఈ గ్రంథము 'ఆర్ష భారతి : తెనాలి' పక్షమున ప్రకాశిత మగుట నాకెంతయో ప్రమోదావహమైన విషయము.

ఈ గ్రంథమును ఆదరాతిశయముతో నయనానందకరముగా ముద్రింపజేసిన శ్రీ గాయత్రీ ప్రింటర్స్ & బైండర్స్ యజమానులు శ్రీ పులికొండ రంగనాథగుప్తగారికి, వారి కార్యకర్తలకు అభినందన ములు పలుకుదును.

అందముగా బైండు చేసిన శ్రీ బి. వెంకటేశ్వర్లుగారికి ఆశీః పూర్వకముగా అభినందనలు తెలియజేయుచున్నాను.

"శ్రీకృష్ణ రుక్మిణీకాన్త గోపీజన మనోహర ।
సంసారసాగరే మగ్నం మాముద్ధర జగద్గురో ॥"

ఇట్లు
సుధీవిధేయుడు
జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి

గణేశచతుర్థి
16-9-1996

# సంస్మరణము

బ్రహ్మశ్రీ హరి వెంకటేశ్వరశర్మగారు M.A;

శ్రీ కరపాత్రీ శ్రీచరణుల హృదయోద్గారమైన యీ 'భక్తి సుధ'ను ఆంధ్రభాషలో వెలయించినవారు బ్రహ్మశ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. వీరు, సోదరత్రయముతో సమష్టికుటుంబ రక్షణము చేయుచు బంధువుల, మిత్రుల ప్రేమాదరములను చూర గొనిన ఆదర్శచరితులు. శ్రీరామకృష్ణశాస్త్రిగారు ఈ మహనీయునితో నిత్యసన్నిహిత సాహచర్యము కల అనుంగు సోదరులు. శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ఆధ్యాత్మిక గ్రంథపఠన, ప్రవచన, గ్రంథ రచనావ్యాసంగాదులకు అహరహము సహకరించిన, ప్రోత్సహించిన ఆదర్శ భ్రాతృమూర్తి. ఈ యిరువురి సౌభ్రాత్రము నేటికాలమున, ఆశ్చర్యజనకము, ఆనందసంధాయకము, సర్వజన ప్రశంస నీయము. కాని, విధి బలవత్తరము కదా: 1-1-96 న, ముక్కోటి ఏకాదశినాడు, శ్రీ రామకృష్ణశాస్త్రిగారు మా శాస్త్రిగారిని, సోదరులను దారాపుత్రులను వీడి, భౌతిక శరీరమును చాలించి పరమపదము నొందినారు. ఆ విషాదచ్ఛాయలో శోకాకులమైన నా హృదయము నుండి జాలువారిన ఛందోమయ సంస్మరణ మిది-

"సౌభ్రాత్ర మేతద్ధి కులానుకారి।"

1. దైనందినం జీవితం హి వ్యజ్యతే పురుషస్య యత్ ।
సాధు వాఽసాధు వా తద్ధి వ్యక్తిత్వం తస్య కథ్యతే ॥

2. వ్యక్తిత్వేన చ తేనైవ ప్రథతే జనసంసది ।
మిత్రేషు భ్రాతృషు స్వస్య బన్ధుష్వపి తథైవ చ ॥

3. సార్థకం తస్య వ్యక్తిత్వం మృతోఽపి బహుమన్యతే ।
న కేవలం బన్ధుభిశ్చ మిత్రైర్వా సోదరై రపి ॥

4. తాదృశః రామకృష్ణోఽయం యద్వ్యక్తిత్వంచిరంస్మృతమ్।
విస్మయానన్దజనకం సర్వేషాం సహభావినామ్ ॥

5. విరలాః సోదరా లోకే పరస్పర రతాః సదా ।
స్వార్థభావై రసంస్పృష్టాః అన్యోన్యం శుభకాంక్షిణః ॥

6. ఇతరేతర దుఃఖం వా సుఖం వాఽప్యాత్మనే హితమ్ ।
స్వకీయం భావయిత్వా యే సత్త్వశుద్ధా స్సమే స్థితాః ॥

7. తాదృశా స్సోదరా హ్యేతే జనస్వామి సహోదరాః ।
యేషాం హి పితరౌ ధన్యౌ సత్పుత్రజనకౌ నుతౌ ॥

8. దూరస్థా జీవయాత్రాయై ఏకత్రస్థా హి మానసైః ।
పరస్పర రతాఽస్మాకం జీవవే మార్గదర్శకాః ॥

9. సుఖం యథా భజన్తే హి సర్వే దుఃఖం తథైవ చ ।
సమం ధీరా భావయన్తః లోకాచార్యా హి తేఽధునా ॥

10. సమానేఽపి చ సౌభ్రాత్రే ప్రీత్యా ద్వన్ద్వం బభూవతుః ।
సుబ్రహ్మణ్యసుధీశ్చైవ రామకృష్ణశ్చ సత్యవాక్ ॥

11. భ్రాతృత్వం తాదృశం లోకే ఇతిహాసేషు శ్రూయతే ।
కేవలం వాగ్భరేవైవ నైవ కృత్యే దినే దినే ॥

12. రామలక్ష్మణయోః భ్రాత్రం ఇతిహాసే హ్యనన్వయమ్ ।
అనన్వయం చక్రతు స్తౌ స్వధర్మనిరతా విమౌ ॥

13. జ్యేష్ఠభ్రాతుః మన స్సమ్యక్ విజ్ఞాయ హిత మాత్మనః ।
భామేవానుజగౌ శశ్వత్ లోకం విస్మయతాం నయన్ ॥

14. ద్వితీయః రామకృష్ణోఽయం అద్వితీయే పథి స్థితః ।
సుబ్రహ్మణ్యం భ్రాతరం చాప్యద్వితీయం చకార యః ॥

15. ధన్యోఽయం యః స్వయం కాలధర్మే పథి చరన్నపి ।
భ్రాతరం స్థాపయామాస అద్వితీయే పరే పదే ॥

16. ఇయం సర్వా హి మహిమా సమష్టేః జీవనస్య హి ।
యచ్ఛ్రుత్వా మానవః శశ్వత్ సంసారం సాగరం తరేత్ ॥

తెనాలి,
గణేశ చతుర్థి.

హరి వెంకటేశ్వర శర్మా

నా ప్రాణములో ప్రాణమై
నా మనసులో మనసై
నా ఆలోచనలో ఆలోచనై

నా జీవన సర్వస్వమై
నా నిత్య సన్నిహిత సహచరుడై
మమ్ము వీడి దివికేగిన
మా సోదరుడు

రాము కి

శోక సంతప్త హృదయముతో

అన్నయ్య



యశఃకాయుడు

శ్రీ జనస్వామి రామకృష్ణశాస్త్రి

జననము : 30-6-1928

నిర్యాణము : 1-1-1996

శ్రీః

నమో భగవతే శ్రీ దక్షిణామూర్తయే

# భక్తిసుధ

## సుధాతరంగిణ్యాఖ్య

ఆంధ్రవివరణ సహితము

## ద్వితీయ భాగము

# శ్రీ గణపతితత్త్వము

### సుధాతరంగిణి

చిద్ఘనాయ ప్రసన్నాయ ప్రశుత్యాకాశవిహారిణే ।
అద్వైతామృతవర్షాయ శంకరాయ నమో నమః ॥

చిద్ఘనైకరసపూర్ణభారతీం
శాంత సూనృతపదాం సరస్వతీమ్ ।
కామకోటిమహితా మిడాం భజే
చంద్రశేఖర యతీంద్రరూపిణీమ్ ॥

సహస్రారః పుష్పగిరిః అద్వైతామృతనిర్ఝరః ।
తదమృత తరంగిణ్యాఽఽప్లావితః అభవోఽస్మ్యహమ్ ॥

శ్రీ పుష్పగిరిపీఠస్థాం నాదసింహస్వరూపిణీమ్ ।
విద్యా మభినవోద్దండాం ప్రణమామి హి భారతీమ్ ॥

శ్రీవిద్యారస మాపీయ సర్వశాస్త్రవిశారదః ।
శ్రీమద్భాగవతం తత్త్వం లోకానుగ్రహకాంక్షయా ॥

బ్రహ్మాత్మభావ మాపన్నః తన్మయేన స్వచేతసా ।
విభావ్య తేనే లోకేఽస్మిన్ శ్రీమద్భక్తిసుధాం ముదా ॥

కరపాత్రీతి విఖ్యాతః యతిచూడామణిః స్వయమ్ ।
వందే హరిహరానంద యతిచంద్రం శివం సదా ॥

పాతంజలే విమల శాంకరదర్శనే చ
పారంగతః నియతధర్మపథే రతశ్చ ।
యోఽధ్యాపయన్ పరమయా చ ముదా వినేయాన్
శ్రీవేంకటేశ్వరగురుం పితరం నతోఽస్మి ॥

నిర్మమం నిరహంకారం అద్వైతార్థ ప్రబోధకమ్ ।
రామకోటిగురుం వందే సర్వశాస్త్రార్థపారగమ్ ॥

తపోనిష్ఠాగరిష్ఠశ్చ కరపాత్రీ యతీశ్వరః ।
చిదానందస్య కృష్ణస్య తత్త్వం భక్తిసుధామయమ్ ॥

శ్రీవిద్యాపరమం గుహ్యం వేదాన్త ప్రతిపాదితమ్ ।
భక్తానాం సుఖబోధాయ బహుధా ప్రత్యపాదయత్ ॥

తదిదం పరమం తత్త్వం ఆన్ధ్ర్యం వివ్రియతే మయా ।
గురుప్రసాదయుక్తేన వినీతమతినాఽధునా ॥

సర్వజగన్నియంతయైన పూర్ణ పరమ తత్త్వమే గణపతి తత్త్వము. ఏలన,

"గణానాం పతిః గణపతిః ।"

"గణశబ్దః సమూహస్య వాచకః పరికీర్తితః ।"

అను వచనముల వలన, 'గణ'శబ్దము సమూహవాచకము. సమూహములను పాలించు పరమాత్మను 'గణపతి' అని అందురు. దేవాదులకు ప్రభువైనవానిని గూడా గణపతి అందురు. అథవా,

"మహత్తత్త్వాది తత్త్వగణానాం పతిః గణపతిః ।" అథవా,

"నిర్గుణ సగుణ బ్రహ్మగణానాం పతిః గణపతిః"

సర్వవిధములైన గణములకు సత్తా స్ఫూర్తులను ఒసగునట్టి పరమాత్మయే గణపతి. దీనిభావమేమన, "ఆకాశ స్తల్లింగాత్" అను న్యాయముచేతఎవరియందు బ్రహ్మతత్త్వముయొక్క జగదుత్పత్తి,

స్థితి, లయత్వములు జగన్నియంతృత్వ, సర్వపాలకత్వాది గుణములు ఉండునో ఆయనయే బ్రహ్మ అగును. ఆకాశము యొక్క జగదుత్పత్తి, స్థితి కారణత్వము,

"ఆకాశాదేవ ఖల్విమాని భూతాని జాయన్తే।"

అను శ్రుతివలన తెలియుచున్నది. కావున, ఆయన గూడా ఆకాశ పదవాచ్యుడైన పరమాత్మ అని భావించబడును. అట్లే—

"ఓం నమస్తే గణపతయే త్వమేవ కేవలం కర్తాఽసి,
త్వమేవ కేవలం ధర్తాఽసి, త్వమేవ కేవలం
హర్తాఽసి త్వమేవ కేవలం ఖల్విదం బ్రహ్మాఽసి।"

ఇత్యాది 'గణపత్యథర్వశీర్ష' వచనముల వలన గణపతి, బ్రహ్మయే అని తెలియుచున్నది.

అతీంద్రియము. సూక్ష్మాతిసూక్ష్మము నయిన నిర్ణయము కేవల శాస్త్రాధారము చేతనే చేయగలుగుదుము. శబ్దావగతి, శ్రోత్రము వలననే కలుగును. ఆరీతిగానే పూర్ణ పరమ తత్త్వావగతి శాస్త్రము వలననే కలుగును. కావుననే—

"తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి।"
"శాస్త్రయోనిత్వాత్।"

ఇత్యాది శ్రుతులు, సూత్రముల చేతను, అనేకవిధములైన యుక్తుల చేతను సర్వజగత్కారణమైన బ్రహ్మ, శాస్త్రైక సమధిగమ్యుడని సిద్ధించుచున్నది.శాస్త్రముకంటె అతిరిక్తములైన ఇతర ప్రమాణముల చేత వస్తు తత్త్వము అవగతమైనచో, శాస్త్రము, అనువాదకము మాత్రము మగుటచే వైయర్థ్యప్రసంగము దుర్వార మగును, కావున, గణపతితత్త్వమును అవగతము చేసికొనుటకు ముఖ్యముగా శాస్త్రమే ప్రమాణము. శాస్త్రానుసారముగా సమస్త దృశ్య ప్రపంచమునకు ప్రభువే గణపతి అని తెలియుచున్నది. ఏలన,

"గణ్యంతే బుద్ధ్యంతే తే గణాః"

అను వ్యుత్పత్తి వలన, దృశ్యమాత్రమైన సమస్తము గణము, తదధిష్ఠానమే గణపతి. కల్పిత వస్తువు యొక్క స్థితి, ప్రవృత్తి అధిష్ఠానము వలననే కలుగును. కావున, కల్పిత వస్తువునకు ప్రభువు, అధిష్ఠానమే అనుట యుక్తము. అపుడు భిన్న భిన్న పురాణములందు శివ, విష్ణు, సూర్య, శక్తి మున్నగువారందరు బ్రహ్మరూపముగా వివక్షితులైరి. బ్రహ్మతత్త్వము ఏకమే అయినపుడు,ఆ తత్త్వముయొక్క నానా రూపములు భిన్నభిన్నములుగా పురాణములందు ఎట్లు లభించుచున్నవి ?

"ఒకే పరమ తత్త్వము భిన్నభిన్న ఉపాసకుల భిన్న భిన్నములైన అభిలషితముల సిద్ధికై తన అత్యంత లీలాశక్తిచేత భిన్న భిన్న గుణగణసంపన్నుడై, నామరూపములు గలవాడై అభివ్యక్తమగుచున్నాడనియే దీనికి సమాధానము.వామనీత్వ, సర్వకామత్వ సర్వరసత్వ, సత్యసంకల్పత్వాది గుణవిశిష్టమైన బ్రహ్మతత్త్వమును ఉపాసించుట వలన, ఉపాసకులకు ఉపాస్యవిశేష గుణములే ఫలరూపముగా ప్రాప్తము లగును. సరిగా ఆ విధముగానే ప్రాప్తము లగును. సరిగా ఆరీతిగానే ప్రధానముగా విఘ్నవినాశకత్వాది గుణగణవిశిష్టమైన గణపతిరూపమందు ఆ పరమ తత్త్వమే ఆవిర్భూత మగును.

ఈవిధముగానే బాహ్యాభిమతములైన భిన్నబిన్న దేవతలు కూడా బ్రహ్మతత్త్వమే అయినపుడు, ఇంత ఏల ? సమస్త ప్రపంచము బ్రహ్మతత్త్వమే అయినపుడు, గణపతియే విశేషించి బ్రహ్మ అని ఏల చెప్పబడవలయును ? అధిష్ఠాన రూపము వలన, బాహ్యాభిమతములైన దేవతలు, తద్వస్తువులు అన్నియు బ్రహ్మరూపములని చెప్పవచ్చును. అయినను, తత్తద్గుణగణ విశిష్టరూపమైన బ్రహ్మత్వము కేవల శాస్త్రము వలననే తెలిసికొన

దగును. అనగా శాస్త్రమే ఏయే నామ, రూప, గుణములతో గూడిన తత్త్వములను బ్రహ్మ యని చెప్పుచున్నవో, ఆ తత్త్వములే బ్రహ్మవాచ్యము లగును. ఏలన, అతీంద్రియ వస్తుజ్ఞానము కలిగించుటయందు ఒక్క శాస్త్రము మాత్రమే ప్రమాణము కాగలుగునని చెప్పబడినది. ఇదియే పై ఆశంకకు సమాధానము. శాస్త్రములు, ముఖ్యముగా వేదములు, వేదానుసారులైన స్మృతీతి హాస పురాణాదులే అయి ఉన్నవి. ఈ విషయము, ముందు వివరించబడును. శాస్త్రములు గణపతిని పూర్ణబ్రహ్మ అని చెప్పు చున్నవి. పూర్వోక్త 'గణపత్యథర్వ' శ్రుతియందు గణపతి–

"త్వమేవ ప్రత్యక్షం తత్త్వమసి ।"

అని చెప్పబడెను. దీని అభిప్రాయ మేమనిన, గణపతి స్వరూప మందు నరుడు, గజము– ఈ యిరువురి సామంజస్యమే లభించు చున్నది. ఇది, ప్రత్యక్షముగానే పరస్పరవిరుద్ధములుగా ప్రతీయ మానమగు 'తత్' 'త్వం'పదార్థముల అభేదమును సూచించు చున్నదా? అన్నట్లు ఉన్నది. ఏలన, 'తత్'పదార్థము సర్వజగ త్కారణుడు,సర్వశక్తిమంతుడును అయినపరమాత్మ అగును.'త్వం' పదార్థము అల్పజ్ఞుడు, అల్పశక్తిమంతుడును అయిన జీవుడు అగును.ఆ యిరువురి ఐక్యము ఆపాతతః విరుద్ధమైనను,లక్షణయా, విరుద్ధాంశద్వయమును త్యాగమొనర్చిన, ఐక్యము సుసంపన్న మగును. ఆ రీతిగానే లోకమందు నర, గజములకు ఐక్యము అసమ్మతమైనను, లక్షణావృత్తి చేత విరుద్ధ ధర్మాశ్రయుడైన భగవంతునియందు తత్సమన్వయము కుదురును.

అథవా, 'తత్'పద లక్ష్యార్థము సర్వోపాధినిష్కృష్టము 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ', మఱియు, లక్షణలక్షితమైన బ్రహ్మ, అట్లే, 'త్వం'పదార్థము జగన్మయమైన సోపాధిక బ్రహ్మ. ఈ నర, గజములు రెంటికి, అఖండైకరసమైన 'అసి' పదార్థమందు

సమన్వయము సంగతము. ఈ రీతిగానే నర, గజస్వరూప సామంజస్యము గణపతిరూపమందు కలదు. 'త్వం' పదార్థము నరస్వరూపము, 'తత్' పదార్థము గజస్వరూపము. అఖండైకరస గణపతిరూపమైన 'అసి' పదార్థమందు ఈ రెంటికి సమన్వయము సుసంగతము.

శాస్త్రములందు 'నర' పదముచేత ప్రణవాత్మకమైన సోపాధిక బ్రహ్మ ప్రతిపాదించబడెను.

"నరా జ్జాతాని తత్త్వాని నరాణీతి విదు ర్బుధాః ।"

'గజ' శబ్దార్థము శాస్త్రములందు ఇట్లు చెప్పబడెను–

"సమాధినా యోగినో గచ్ఛన్తి యత్ర ఇతి గః,
యస్మాత్ బింబప్రతిబింబవత్తయా ప్రణవాత్మకం
జగ జ్జాయతే ఇతి జః ॥"

సమాధి వలన, యోగులు ఏ పరమ తత్త్వమును పొందుదురో, అది 'గ' వర్ణప్రతిపాద్యము. బింబమువలన ప్రతిబింబము ఉత్పన్నమైనట్లే కార్యకారణ స్వరూపము, ప్రణవాత్మకమును అయిన ప్రపంచము దేనివలన ఉత్పన్న మగునో, దానిని 'జ' యందురు.

"జన్మాద్యస్య యతః ।"

"యస్మా దోంకారసంభూతిః యతో వేదో యతో జగత్ ।"

ఇత్యాది వచనములు గూడా దీనిని సమర్థించుచున్నవి. సోపాధికుడు, 'త్వం' పదార్థాత్మకుడును అయిన నరుడు, గణేశుని పాదాది పర్యంత దేహము. ఇది, సోపాధిక మగుటచే నిరుపాధికాపేక్షయా నికృష్టము. కావుననే అధోభూతావయవము. నిరుపాధిక, సర్వోత్కృష్ట 'తత్' పదార్థమయుడైన గణపతి యొక్క కంఠాది మస్తక పర్యంతము గజస్వరూపము. ఏలన, అది నిరుపాధిక మగుటచే సర్వోత్కృష్టము. సమస్త పాదాది మస్తకపర్యంతము గణపతి దేహము 'అసి' పదార్థమైన అఖండైకరసము. ఆ గణేశుడు

ఏకదంతుడు. 'ఏక' శబ్దము 'మాయా' బోధకము 'దంత' శబ్దము 'మాయిక' బోధకము.

"ఏకశబ్దాత్మికా మాయా తస్యాః సర్వసముద్భవమ్ ।
దన్తః సత్తాధర స్తత్ర మాయావాచక ఉచ్యతే ॥"

అని మౌద్గల వచనము.

అనగా, గణపతియందు మాయ, తన్మాయిక సంయోగము వలన, ఆయన 'ఏకదంతు'డని వ్యవహరించబడును. గణపతి, వక్రతుండము కలవాడు.

"వక్రం ఆత్మరూపం ముఖం యస్య ।"

వంకరగా ఉన్న దానిని 'వక్ర'మందురు. ఆత్మస్వరూపము వక్రము. ఏలన, సమస్త ప్రపంచము మనస్సునకు, వాక్కునకు గోచరించును. కాని, ఆత్మతత్త్వము మనోవాక్కులకు విషయము కాదు, అనిర్వచనీయమని భావము. వక్రపదార్థము కంఠవినిర్గతము కాజాలదు.

"యతో వాచో నివర్తన్తే, అప్రాప్య మనసా సహ ।"

ఇత్యాది వచనములు సంగతములు, మఱియు—

"కంఠాధో మాయయా యుక్తం మస్తకం బ్రహ్మవాచకమ్।"
వక్త్రాఖ్యం తేన విఘ్నేశ స్తేనాయం వక్రతుండః ॥"

అను వచనమువలన ఉపర్యుక్త విషయము స్పష్టమగును.

విఘ్నేశ్వరుడు చతుర్భుజుడు గూడ. ఏలన దేవతలు, నరులు, అసురులు, నాగులు— ఈ నలుగురిని స్థాపించువాడు. అనగా, నియమనము చేయువాడు. చతుర్వర్గ (ధర్మ, అర్థ, కామ, మోక్ష) స్థాపకుడు, ఋగ్యజుస్సామాథర్వాది స్థాపకుడుగూడా అయి ఉన్నాడు.

"స్వర్గేషు దేవతా శ్చాయం పృథివ్యాం నరా స్తథాఽతలే ।
అసురా న్నాగముఖ్యాంశ్చ స్థాపయిష్యతి బాలకః ॥

తత్త్వాని చాలయతి విప్రా స్తస్మా న్మూషక చతుర్భుజః।
చతుర్ణాం ఏవిధానాం చ స్థాపకోఽయం ప్రకీర్తితః॥"

అను వచనములు ఉక్తవిషయమును విస్పష్టము చేయుచున్నవి.

ఆయన, తన నాలుగు హస్తములందు భక్తులను అనుగ్రహించుటకై పాశ, అంకుశ, వర,అభయ ముద్రలను ధరించును. భక్తుల మోహరూపమైన శత్రువును బంధించుటకై పాశమును ధరించును, సర్వ జగన్నియంతృరూపమైన బ్రహ్మ, అంకుశము చేతను, దుష్టులను నాశమొందించునట్టి బ్రహ్మ, దంతము చేతను సర్వకామనలను పూర్తిచేయు బ్రహ్మ, 'వర' ముద్రచేతను సూచించబడును. గణపతిదేవుని వాహనము మూషకము. సర్వాంతర్యామియు, సర్వప్రాణుల హృదయరూప బిలవాసియు అయి సర్వ జంతువుల (జీవుల) భోగములను అనుభవించునదే మూషకము.అది దొంగయు గూడ.ఏలన,జంతువుల అజ్ఞాన సర్వస్వమును హరించునట్టిది. దానిని ఎవరును, తెలియరు. ఏలన, మాయారూపముచేత నిగూఢమైన అంతర్యామియే సమస్త భోగములను అనుభవించును. కావుననే "భోక్తారం సర్వ తపసామ్" అని చెప్పబడినది. 'ముష స్తేయే' అను ధాతువునుండి 'మూషక'శబ్దము నిష్పన్న మయ్యెను. మూషకము ప్రాణుల సమస్త భోగ్యపదార్థములను దొంగిలించియు, పుణ్య పాప వివర్జితమై ఉండురీతిగానే మాయానిగూఢుడైన సర్వాంతర్యామి గూడా సమస్త భోగ్యజాతమును అనుభవించుచు, పుణ్య పాప వివర్జితుడై ఉండును. సర్వాంతర్యామియైన ఆ ఈశ్వరుడే గణపతిని సేవించుటకై మూషక రూపమును ధరించి, ఆ గణపతిదేవునికి వాహన మయ్యెను.

"మూషకం వాహనాఖ్యం చ పశ్యన్తి వాహనం పరమ్।
తేన మూషకవాహోఽయం వేదేషు కథితోఽభవత్॥

ముష స్తేయే తథా ధాతుః జ్ఞాతవ్యః స్తేయ బ్రహ్మధృక్ ।
నామరూపాత్మకం సర్వంతత్రాసద్ బ్రహ్మ వర్తతే ॥
భోగేషు భోగభోక్తా చ బ్రహ్మకారేణ వర్తతే ।
అహంకారయుతా స్తం వై న జానన్తి విమోహితాః ॥
ఈశ్వరః సర్వభోక్తా చ చోరవ త్తత్ర సంస్థితః ।
స ఏవ మూషకః ప్రోక్తో మనుజానాం ప్రచాలకః ॥"

ఈవిధముగా, గణపతిదేవుడు 'లంబోదరుడు'. ఏలన, ఆ గణపతిదేవుని ఉదరమునందే సమస్త ప్రపంచము ప్రతిష్ఠితమై ఉన్నది. ఆయన, ఎవరి ఉదరమునందును లేడు.

"తస్యోదరా త్సముత్పన్నం నానా విశ్వం న సంశయః ।"

అను వచనము వలన నానా నామరూపాత్మకమైన విశ్వము పరమేశ్వరుని (గణపతి) ఉదరమునుండియే సముద్భవించినదని తెలియుచున్నది. గణపతిభగవానుడు 'శూర్పకర్ణుడు'. యోగీంద్ర బృందముచే వర్ణ్యమానుడు, ఉత్తమ జిజ్ఞాసువుల వలన, శ్రూయమాణుడు గాన, హృదయగతుడై, శూర్పము (చేట) వలె, పాప పుణ్యరూపమైన, రజస్సును (రాగాది మాలిన్యమును) దూరము చేసి, బ్రహ్మ ప్రాప్తిని కలుగజేయువాడు గణేశ్వరుడు.

"రజోయుక్తం యథా ధాన్యం రజోహీనం కరోతి చ ।
శూర్పం సర్వనరాణాం వై యోగ్యం భోజనకామ్యయా ॥
తథా మాయావికారేణ యుతం బ్రహ్మ న లభ్యతే ।
త్యక్తోపాసనకం తస్య శూర్పకర్ణస్య సున్దరి ॥
శూర్పకర్ణం సమాశ్రిత్య త్యక్త్వా మలవికారకమ్ ।
బ్రహ్మైవ నరజాతిస్థో భవే త్తేన తథా స్మృతః ॥"

గణపతి 'జ్యేష్ఠరాజు' 'సర్వజ్యేష్ఠులకు అధిపతి. అథవా, సర్వజ్యేష్ఠులైన బ్రహ్మదుల మధ్య విరాజమానుడై ఉండువాడు.

ఆ గణేశుడే శివ, పార్వతుల తపస్సువలన ప్రసన్నుడై పార్వతీ తనయుడుగా ఆవిర్భవించెను.

శ్రీరామచంద్రుడు, శ్రీకృష్ణుడు, దశరథ, వసుదేవ సుతులుగా ప్రాదుర్భవించినను, వారికంటె అపకృష్టులు (తక్కువైనవారు) కాని రీతిగానే గణేశభగవానుడు శివపార్వతుల వలన జన్మించినను, వారికంటె అపకృష్టుడు కాడు. శివ వివాహ సమయమున, గణపతి ఉండుట, పూజింపబడుట ఏమియును ఆశ్చర్యకరమైన విషయము కాదు. 'పార్వతీదేవితపస్సు వలన, గోలోకనివాసి, పూర్ణబ్రహ్మయు అయిన శ్రీకృష్ణపరమాత్మయే గణపతిరూపముతో ప్రాదుర్భవించె నని 'బ్రహ్మవైవర్త పురాణము' చెప్పుచున్నది. కావున, గణపతి, శ్రీకృష్ణుడు, శివుడు మున్నగువారు ఏకతత్త్వస్వరూపులు. నిమ్నో దాహృత ఋగ్వేదమంత్రము ఈ తత్త్వమునే సూచించుచున్నది.

"గణానాం త్వా గణపతిం హవామహే
కవిం కవీనా ముపమశ్రవ స్తమమ్ ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనః శృణ్వన్నూతిభిః సీద సాదనమ్ ॥"

ఈ మంత్రముతో సమానమైన గణపతిస్తావక మంత్రము "గణానాం త్వా గణపతిగ్ం హవామహే" ఇత్యాదిగా యజుర్వేదము నందు గూడా కలదు. ఋగ్వేదమంత్రమునకు సర్వథా గణపతి స్తుతియందే తాత్పర్యము. యజుర్వేదాంతర్గతమైన మంత్రమునకు వినియోగము 'అశ్వ స్తవన'మందు ఉన్నను, కేవల అశ్వమందు మంత్రోక్త గుణములు అనుపపన్నములు. ఆ కారణముచేత అశ్వ ముఖముతో ఉన్న గణపతిస్తుతియే ఈ మంత్రముతో జరుగును. మంత్రార్థము ఈవిధముగా భావనీయము.

"హే వసో! వసతి సర్వేషు భూతేషు వ్యాపకత్వాదితి తత్సంబుద్ధౌ! గణానాం మహదాదీనాం అన్యేషాం వా సమూహానాం గణరూపేణ

సాక్షిరూపేణ, జ్ఞేయాధిష్ఠానరూపేణ వా 'గణ'సంఖ్యానే ఇత్యస్మాద్ గణ్యతే బుధ్యతే యోగిభిః సాక్షాత్క్రియతే యః స గణః తద్రూపేణ వా పాలకం, ఏతాదృశం త్వాం ఆహ్వాయామహే। తథా ప్రియాణాం వల్లభానాం, ప్రియస్య పాలకం। తచ్చైష తస్మైవ సర్వస్య ప్రేమాస్పదత్వాత్। 'ఆత్మనస్తు' కామాయ సర్వం ప్రియం భవతీతి శ్రుతేః। నిధీనాం సుఖనిధీనాం, సుఖనిధేః పాలకం త్వాం హవామహే ఆహ్వాయామహే। మదన్తఃకరణే ప్రాదుర్భూయ, స్వస్వరూపానన్దసమర్పణేన మమాపి పతి ర్భూయాః। పునః హే దేవ! అహం తే గర్భధం, బింబాత్మకం చైతన్యం, తథా చ- "మమ యోని ర్మహద్ బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్" ఇతి స్మరణాత్। ఆ- ఆకృష్య యోగబలేన అజాని స్వహృది స్థాపయాని, త్వం చ మమ హృది అజాసి-క్షిపసి స్వస్వరూపం స్థాపయసి।"

అధికారియైన ఉపాసకుడు గణపతిభగవానుని, ఇట్లు ప్రార్థించుచున్నాడు- 'హే సర్వాంతర్యామిన్! దేవాది గణములకు అధిష్ఠాన రూపముతోను, సాక్షిరూపముతోను, ప్రేయసులకు-వల్లభులకు ప్రియ రూపముతోను, లౌకిక ప్రేమాస్పదులకు పరమ ప్రేమాస్పద రూపముతోను లౌకిక సుఖజాతములను, అలౌకిక పరమానందమును పాలించునట్టి, అనగా స్వీయాంశను కలుగజేయునట్టి నిన్ను, నేను పతిగా ఆవాహనము జేయుచున్నాను. నీవు, నన్ను గూడా స్వరూపానందము నొసగుట ద్వారా పాలించుము. జగదుత్పాదనార్థమై, ప్రకృతిరూపమైన యోనియందు స్వకీయ చైతన్య ప్రతిబింబాత్మకరూపమైన గర్భమును ధరించునట్టి బింబచైతన్యమును నేను నా హృదయమందు విశుద్ధమైన అంతఃకరణముతో ధరించునట్లుగా అనుగ్రహించుమని ప్రార్థించుచున్నాను.

ఈవిధముగా మంత్రప్రతిపాద్యమైన గణపతితత్త్వము సర్వవిఘ్నవినాశకము. కావుననే-

"విఘ్ననాశనే శివసుతాయ వరదమూర్తయే నమః ।"

అని 'అథర్వశీర్షము'నందలి తొమ్మిదవ మంత్రమున చెప్పబడినది. ఈ వచనమునకు శ్రీ సాయణాచార్యులు

"సమయ కాలాత్మక భయహారిణే, అమృతాత్మక పద ప్రదత్వాత్"

అని వ్యాఖ్యానము చేసిరి. అనగా, గణపతి, కాలాత్మకమైన భయమును హరించువాడని అర్థము. ఏలన, ఆయన, అమృతాత్మక మైన పదము నొసగువాడు.

స్కన్ద, మౌద్గల పురాణములందు వినాయక మాహాత్మ్య విషయమునకు సంబంధించిన ఒక గాథ కలదు— 'ఒకానొక సమయమున' 'అభినందను'డను పేరు గల ఒక రాజు, ఇంద్రభాగరహిత మైన (ఇంద్రునకు హవిర్భాగము లేని) ఒక యజ్ఞమును ఆరంభించెను. ఈ విషయము తెలిసి, ఇంద్రుడు కుపితు డయ్యెను. అంత, ఇంద్రుడు కాలపురుషుని, పిలిపించి యజ్ఞభంగము చేయుమని ఆజ్ఞాపించెను. కాలపురుషుడు, యజ్ఞమును భగ్నము చేయుటకై విఘ్నాసురరూపములో ఆవిర్భవించెను. జన్మ, మృత్యుమయమైన ఈ జగత్తు, కాలాధీనమై ఉండును. కాలపురుషుడు ముల్లోకములందు సంచరించును, బ్రహ్మజ్ఞానియైన పురుషుడు కాలమును జయించి, అమృతస్వరూపు డగును. వైదిక, స్మార్త సత్కర్మానుష్ఠానము బ్రహ్మజ్ఞానసాధనము.

"స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ।"

సత్కర్మానుష్ఠానము వలన విశుద్ధాంతఃకరణుడైన పురుషునికి భగవత్తత్త్వ సాక్షాత్కారము కలుగును. భగవత్సాక్షాత్కారము పొందినవాని వలననే కాలము పరాజిత మగును. ఈ రహస్యము తెలిసికొని, కాలపురుషుడు సత్కర్మనాశనమునకై విఘ్నరూపుడై ప్రాదుర్భవించెను. సత్కర్మానుష్ఠానరహిత ప్రపంచము సదా

కాలాధీనమై ఉండును. కావుసనే కాలస్వరూపుడైన విఘ్నాసురుడు 'అభినందను'డను పేరు గల ఆ రాజును చంపి, అచటచట దృశ్య, అదృశ్యరూపముతో సత్కర్మను నాశము చేసెడివాడు. అపుడు, వసిష్ఠాది మహర్షులు విభ్రాంతులై బ్రహ్మను శరణు జొచ్చిరి. బ్రహ్మ యొక్క ఆదేశానుసారము వారు గణపతిని స్తుతించిరి. ఏలన, గణపతికి దక్క, ఏ దేవతకును, కాలనాశము చేయగల సామర్థ్యము లేదు. గణపతి అసాధారణ విఘ్నవినాశకత్వ గుణ సంపన్నుడు అని శ్రుతి, స్మృతి, శిష్టాచార, తద్వాక్యములు, శ్రుతార్థాపత్తి వలన అవగత మగును. శ్రీ గణేశుని వలన, విఘ్నా సురుడు పరాజితుడై ఆయన శరణుజొచ్చెను. ఆయన ఆజ్ఞకు బద్ధు డయ్యెను. కావుననే, గణపతికి 'విఘ్నరాజ, నామము గూడా ప్రసిద్ధము.

అప్పటినుండి, గణపతి పూజ, గణపతిస్మరణము లేక ఏ, సత్కర్మ జరిగినను,దానియందు తప్పక,విఘ్నము కలుగుచున్నది. ఈ నియమము వలననే విఘ్నము భగవదాశ్రితమై ఉన్నది. విఘ్నము కూడా కాలరూప మగుట వలన, భగవత్స్వరూపము.

"విశేషేణ జగత్సామర్థ్యం హన్తీతి విఘ్నః।"

బ్రహ్మాదులయందుగల జగత్సర్జనాది సామర్థ్యమును గూడా హననముచేయుదానిని విఘ్న మందురు. అనగా, బ్రహ్మాది సమస్త కార్య ప్రపంచము బ్రహ్మవిఘ్నములచే పరాభూతమగుట వలన, గణేశ్వరానుగ్రహము వలననే విఘ్నరహితులై కార్యనిర్వహణ మందు సమర్థులగుదురు. విఘ్నము, వినాయకుడు- ఈ యిరు వురును,భగవత్స్వరూపు లగుటవలన,స్తుతింపదగినవారు. కావుననే-

"భగవంతౌ విఘ్నవినాయకౌ ప్రీయేతామ్"

అని పుణ్యాహవచనమందు చెప్పబడును. విఘ్నము, గణపతి

వశమున గాక, మఱి ఎవరి వశమునను లేదు. యోగవాశిష్ఠమందు శాప మిచ్చుటకు ఉద్యుక్తుడైన భృగుమహర్షిని గూర్చి విఘ్నరూపుడైన కాలపురుషుడు ఇట్లనెను—

"మా తపః క్షపయా బుద్ధే కల్పకాల మహానలైః ।
యో న దగ్ధోఽస్మి మే తస్య కిం త్వం శాపేన ధక్ష్యసి ॥
బ్రహ్మాండావలయో గ్రస్తాః నిగీర్ణా రుద్రకోటయః ।
భుక్తాని విష్ణుబృందాని క్వ న శక్తా వయం మునే ॥"

దీనివలన, నిఃశ్రేయసమునకు సాధనభూతుడైన గణపతి యొక్క స్మరణము లేని సత్కర్మలన్నిటియందును కాలరూపమైన విఘ్నము కలుగుట అనివార్యమని స్పష్టమగును. కావున, విఘ్ననివారణమునకై గణపతిస్మరణము సమస్త కార్యములందును ఆవశ్యకము.

ఓంకారమే సర్వమంగళమయము. వేదోక్తములైన సమస్త కర్మలందును, ఉపాసనాదులందును ఓంకారమే స్మరించబడుచున్నది. కావున గణేశస్మరణము నిరర్థకమని అనినచో, యుక్తము కాదు. ఏలన, ఓంకారము గూడా సగుణ గణేశస్వరూపమే. 'మౌద్గల పురాణ'మందు గూడా ఇట్లు చెప్పబడెను—

"గణేశస్యాదిపూజనం చతుర్విధం చతుర్మూర్తిధారకత్వాత్ ।"

చతుర్ముఖుడైన బ్రహ్మ యొక్క నాలుగు ముఖములనుండి ఎనిమిది లక్షల పురాణములు ఆవిర్భవించినవి. తదనంతరము, ద్వాపరయుగాంతమునందు వ్యాసదేవుడు కలియుగమునందలి మందమతులైన జీవుల జ్ఞానముకొఱకై అష్టాదశ పురాణములను, అష్టాదశ ఉపపురాణములను రచించెను. ఆ పురాణములలో మొదటిది 'బ్రహ్మపురాణము'. ఆ పురాణమందు నిర్గుణతత్త్వము బుద్ధితత్త్వము కంటె అతీతమైన గణేశతత్త్వము వర్ణించబడినది.

చిట్టచివరి పురాణము 'బ్రహ్మాండపురాణము'. ఆ పురాణమందు సగుణ స్వరూపుడైన గణేశుని మాహాత్మ్యము ప్రతిపాదింపబడినది. ఏలన, ఆ పురాణము విశేషించి, ప్రణవాత్మకమైన ప్రపంచమును ప్రతిపాదనము చేయునట్టిది. ఉప పురాణములలో గూడా మొట్ట మొదటిది గణేశపురాణము. ఈ పురాణము సగుణ, నిర్గుణ గణేశుని ఏకత్వమును ప్రతిపాదించును. గజముఖాది మూర్తి ధరుడైన గణపతి యొక్క ప్రతిపాదనము గూడా చేయును. ఈ సందర్భములో, ఉప పురాణములు అపకృష్టములని చెప్పబడును. అది యుక్తము కాదు. ఏలన, ఉపేంద్రుడు ఇంద్రుని కంటె అపకృష్టుడు (తక్కువైనవాడు) కాని రీతిగానే, పురాణాపేక్షయా ఉప పురాణములు అపకృష్టములు కావు. 'మౌద్గలము' చిట్టచివరి ఉప పురాణము. ఈ ఉప పురాణమందు, యోగమయుడైన గణపతి యొక్క మాహాత్మ్యము ప్రతిపాదితము. ఈవిధముగా వేదములు, పురాణములు, ఉప పురాణములు మున్నగువాని ప్రారంభమున, మధ్యభాగమున, అంతమున, గణేశతత్త్వ ప్రతి పాదనము కన్పడును. ఇంతఏల ? బ్రహ్మ, విష్ణ్వాదులు గూడా, గణేశుని అంశలగుటచేతనే శాస్త్రప్రతిపాద్యులైరి. కొందరు బుద్ధి గుహయందు గల చిదాత్మరూపుడైన గణపతిని స్మరించి, సత్కర్మ లను ఆచరింతురు. మరికొందరు ప్రణవస్మరణ పూర్వకముగా సత్కర్మానుష్ఠానము చేయుదురు. మరికొందరు గజవదనాది అవయవములు గల విగ్రహమును ధరించిన గణపతిని స్మరింతురు. మఱికొందరు యోగమయుడైన గణపతిని స్మరింతురు. ఈ విధముగా, సమస్త శుభకార్యముల ఆరంభమునందు ఏదియో ఒక రూపముతో గణేశస్మరణము చూడబడుచున్నది.

ప్రాణప్రయాణసమయమునందును, పితృయజ్ఞాదుల యందును గణేశస్మరణము ప్రసిద్ధము కాదని కొందరు చెప్పుదురు.

ఇది సరికాదు. ఏలన, గయాస్థితమైన గణేశ పదము (గణపతి స్థానము) పితృముక్తిదాయకము. వేదోక్తమైన పితృయజ్ఞారంభము నందు గణపతిపూజ నిషిద్ధము కాదు. కావున, అచట గూడా గణేశ పూజనము జరుగును, జరుగుట యుక్తము గూడ. కావుననే శ్రుతి, గణాధిపతిని 'జ్యేష్ఠరాజ' శబ్దముతో సంబోధించును.

'గణేశపురాణము'నందు త్రిపురసంహార సమయమున శివుడు ఇట్లనెను–

"శైవై స్త్వదీయై రుత వైష్ణవైశ్చ శాక్తైశ్చ సౌరైరపి సర్వకార్యే ।
శుభాశుభే లౌకిక వైదికే చ త్వ మర్చనీయః ప్రథమం ప్రయత్నాత్ ॥"

'గణేశగీత'యందు మరణకాలమున గూడ, గణపతిస్మరణము చెప్పబడినది–

"యః స్మృత్వా త్యజతి ప్రాణ మన్తే మాం శ్రద్ధయాన్వితః ।
స యాతి అపునరావృత్తిం ప్రసాదా న్మమ భూభుజ ॥"

అనగా, శ్రద్ధాయుక్తుడై నన్ను స్మరించి, అవసానసమయమున, ప్రాణములను వదలినవాడు నా అనుగ్రహముచేత పునరావృత్తి రహితమైన పదమును పొందునని భావము.

'గణేశతాపిని' ఇట్లు చెప్పుచున్నది–

"ఓం గణేశం వై బ్రహ్మ, తద్విద్యాత్ । యదిదం కించ సర్వం భూతం భవ్యం సర్వ మిత్యాచక్షతే।"

ఈవిధముగా, పూర్ణ పరబ్రహ్మయైన పరమాత్మయే, నిర్గుణ, విఘ్నవినాశకత్వాది గుణగణవిశిష్టుడు, గజవదనాద్యవయవ మూర్తిధరుడు శ్రీగణేశుడు అయి ఉన్నాడు.

ప్రస్తుతము, కతిపయ గ్రంథచుంబకులు, పండితమ్మన్యులును

ఈవిధముగా పూర్ణ పరబ్రహ్మమైన పరమాత్మయే నిర్గుణ, విఘ్నవినాశకత్వాది గుణగణ విశిష్టుడు, గజవదనాద్యవయవ మూర్తిధరుడు, శ్రీగణేశుడును అయి ఉన్నాడు.

ప్రస్తుతము, కతిపయ గ్రంథచుంబకులు, పండితమ్మన్యులును అయిన పాశ్చాత్యుల శిష్యులు, బాహ్య కుసంస్కారములచే దూషితమైన అంతఃకరణములను సంస్కరించునట్టి శ్రీగణేశ తత్త్వమును విమర్శించుటకు సాహసించుచున్నారు. వారు తమ గురువులకు వ్యతిరేకముగా ఎంత విమర్శించగలరు ? వారు చెప్పిన దేమనిన, మొదట, గణపతి, ఆర్యుల దేవుడు కాడు. కాని, ఈ దేశవాసులైన అనార్యులను పరాజితులను జేసినపుడు, వారిని ఓదార్చుటకై గణపతిని తమ దేవతలలో నొకనినిగా కలిపివేసికొనిరి. ఈ విధమైన విద్వాంసులు కొన్ని పురాణములను, కొన్ని వేదమంత్రములను సంగ్రహము (సంకలనము) చేసి, తమ అనభిజ్ఞతను పరిచయము చేసికొనుచు శాస్త్రీయమైన గణపతిస్వరూపము సమాచ్ఛాదితమగునట్లుగా గణపతిస్వరూపమును వర్ణింతురు. కించిన్మాత్రముగా నయినను, తత్త్వజ్ఞానము కలవారికి, ఇటువంటి అసంబద్ధ ప్రలాపములు హేయములే. కాని, మూర్ఖులకు ఆ అసంబద్ధ ప్రలాపములు హేయములే. కాని, మూర్ఖులకు ఆ అసంబద్ధ ప్రలాపముల పట్ల, వ్యామోహము కలుగుట స్వాభావికమే.

ఎవరైనను, ఈ మహానుభావులను ఈ విధముగా ప్రశ్నించవలయును– 'గణేశతత్త్వ'మను పేరు గల ఒక తత్త్వము ఉన్నదని మీకెట్లు తెలియును ? పురాణాది శాస్త్రముల ద్వారా, లేక అచటచట గణపతివిగ్రహములను జూచి, తెలిసికొన్నారా? శాస్త్రముల వలననే గణేశతత్త్వము తెలిసికొనినచో, గణపతి, అనార్యుల దేవుడని ఎట్లు చెప్పనగును ? ఏలన, శాస్త్రముల వలననే ఆ గణపతి బ్రహ్మాది దేవతలకు సైతము, పూజ్యుడుగా కన్పడుచున్నాడు

కదా! విగ్రహములను జూచి, తెలిసికొనుట అను విషయము ఇక, మిగిలి ఉన్నది. దానిని ఉచిత మని భావించినచో, గణపతిని దేవత అని గాని, పూజ్యుడని గాని, తలంచుట కేవల మూర్ఖత్వమే అగును. కారణ మేమన, కాష్ఠ, మృత్, పాషాణాదులను అభిజ్ఞుడైనవాడు ఎవరు, పూజనీయములని తలంచును? అదృశ్య శక్తివిశేషమును ఆ విగ్రహమందు అవాహన చేసి, తత్పూజ చేయబడినదని చెప్పినను, తద్విశిష్ట దేవశక్తి ఏ ప్రమాణముచేత గుర్తించబడినది, అవాహనము చేయబడినది? దీనికి సమాధానముగా ఈ విషయము శాస్త్రముల చేతనే తెలియబడినదని చెప్పినచో, శాస్త్రములు గణేశ తత్త్వమును అనాదియైన ఈశ్వరుడని చెప్పినవి. కావున, ఆయన, అనార్యుల దేవత ఎట్లయ్యెను?

మఱొక విలక్షణ విషయ మేమనిన, శాస్త్రాధారముపైననే గణపతిని అనార్యాభిమతుడైన దేవుడని భావించుట, ఆర్యులు బయట నుంచిఎచటనుండియో ఇచటకువచ్చుట, భారతవర్షమున, ప్రాథమిక అనార్యుల నివాసము, అనార్యులదేవతయైన గణపతిని ఆర్యులు గ్రహించుట - ఇటువంటి తల, తోక లేని, అసంగత విషయములను అనార్యుల శిష్యులు దక్క, ఎవరికి స్ఫురించగలుగును? ఏసహృదయ పురుషుడైనను, వేద, పురాణాది శాస్త్రములను అంగీకరించుచు గూడా గణేశుని అనార్యదేవత్వమును స్వీకరించునా? వస్తుతః, ఇదంతయు, దూషిత సంస్కారములు, ఆచారశూన్యములు, స్వేచ్ఛా పూరితములును అయిన శాస్త్రముల పుస్తకీయ జ్ఞాన దుష్ఫలితమే. కావుననే, జ్ఞానలవ దుర్విదగ్ధులు, అనభిజ్ఞులకంటె గూడా శోచ నీయులుగా భావించబడుదురు. ఈ కారణముచేతనే మన దేశమున, ఏ సచ్ఛాస్త్రాధ్యయనమునకైనను, ఆచార్యపరంపరతో శాస్త్రీయ నిగూఢ రహస్యములను తెలిసికొనవలయు నని, పరస్పర విరుద్ధ ములుగా ప్రతీతము లగు వాక్యములను సమన్వయము చేయ

వలయు నను నియమము కలదు. ఇట్లు, జరుగకపోవుట వలననే భిన్నభిన్నములైన శ్రీ గణపతి లీలలు ప్రాణులను మోహింప జేయునవిగా ఉన్నవి. ఆ గణపతిదేవుని నిత్యత్వము, పార్వతీ పుత్రత్వము, శనిదృష్టిపాతము వలన శిరశ్ఛేదము, గజవదన సంధానాదులు జీవులను మోహితులను జేయుచున్నవి.

ఈ విషయము లన్నియు, కేవలము గణపతి విషయముననే కాదు, విశేషించి, శ్రీరామచంద్రాదుల విషయమున గూడా కలవు. అజత్వ, జాయమానత్వములు, నిత్యముక్తత్వ, సీతావిరహజన్య రోదనాదులు ఏతాదృశములే.

వస్తుతః, ఎవరు, భగవంతుని అఘటనాపటీయసి యైన మాయ యొక్క మహత్త్వమును తెలిసికొనలేరో, వారికి అచింత్య మహా మహిమ వైభవశాలియైన భగవంతుని నిర్గుణ, సగుణ లీలలకు సంబంధించిన జ్ఞానము ఎట్లు కలుగును ?

"అజాయమానో బహుధా వ్యజాయత ।"

"మత్‌స్థాని సర్వభూతాని ।"

"న చ మత్‌స్థాని భూతాని ।"

ఇత్యాది వచనముల అభిప్రాయము ఎట్లు తెలియును? సగుణ లీల, నిర్గుణ లీలకంటె భావుకుల దృష్టిలో దురవగాహము.

కావున, గోస్వామీతులసీదాసు, 'అనాదిదేవతలని భావించి గణేశాదుల రూపభేదమందును, శివపూజ్యత మున్నగు విషయ మందును, సంశయింప జనదు' అని చెప్పిరి. సర్వశ్రేష్ఠులైన తార్కికుల తర్కము భౌతికభావముల విషయమందే కుంఠీభూత మగును.అట్టి స్థితిలోవ్యాప్తి,లేక హేతు,హేత్వాభాస జ్ఞానరహితులైన ఆధునిక విద్వాంసులకు దేవతావిషయమున, లేక ఈశ్వరవిషయ మున, తర్కము చేయునట్టి అధికారము, ఏమి కలదు? ఆ మహాను

భావులు తర్కస్వరూపమును గూడా సరిగా నిరూపించ గలిగినచో, ధర్మమందు, దేవతావిషయమందు తర్కము పని చేయగలదో, లేదో, వారికి తెలియగలదు. గణేశుడు అనార్యుల దేవత అని, ఆది భారతవాసులు అనార్యులే అని మీరు ఎట్లు ఊహించగలిగితిరి ? అని వీరిని ఎవరైనను ప్రశ్నించినచో, వీరు కపోలకల్పన, మిథ్యాభూతమైన చరిత్ర దక్క, ఏమి చెప్పగలరు ? కాని, వీరు చెప్పినట్టి భ్రమపూర్ణమైన, నిరాధారమైన ఆధునిక చరిత్రలు మాన్యములైనచో, ప్రాచీనములు, ఆధ్యాత్మికములు, గంభీర భావపూర్ణములును అయిన మన ఇతిహాసములు (చరిత్రలు) ఏల మాన్యములుకావు ?

కానిండు. ఆస్తికులైనవారు, పూర్వోక్త ప్రమాణముల చేత నిర్ధారితమైన గణపతితత్త్వమును శ్రద్ధాయుక్తులై సమస్త కర్మల యందును ఆరాధించవలయును. పారలౌకికమైన తత్త్వనిర్ధారణ మందు శాస్త్రము మాత్రమే ఆదరణీయము. కావుననే, శ్రీకృష్ణ పరమాత్మ, భగవద్గీతయందు ఇట్లు చెప్పిరి–

“తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥”

శ్రీ మహాగణపతిః ప్రీయతామ్

# 2. నిరాకారము నుండి సాకారము

## సు ధా త రం గి ణి

నిర్గుణ, నిరాకార, నిర్వికార, పరబ్రహ్మ పరమాత్మ, సాకారుడు కాజాలడని కొందఱు చెప్పుదురు. ఈ విషయముపై అనేక పర్యాయములు శాస్త్రార్థములు జరిగినవి. వారి శాస్త్రార్థములందు యుక్తులకు ప్రాధాన్యము ఉండెను. వేద మంత్రములచేత ఈశ్వరుడు సాకారుడన్న విషయమును ఋజువు చేయుట ప్రధానమై ఉండెను. కాని, ప్రస్తుతము తమను వేదాంతులమని చెప్పికొనువారు గూడా అవతారముల అస్తిత్వమును అపలాపము చేయసాగుదురు.

"ఈశ్వరో నావతరతి, వ్యాపకత్వాత్, ఆకాశవత్ ।"

అని వారు చెప్పుదురు. దీని అర్థమేమన, ఈశ్వరుడు అవతరించడు. ఏలన, ఆయన వ్యాపకుడు, ఆకాశమువలె. ఈ అనుమానరచనచేత ఈశ్వరుని అవతారము బాధిత మగును. దీనిపైన, ఇట్లు చెప్ప వచ్చును– 'ఈ అనుమానమందలి దృష్టాంతమే అసిద్ధము. ఏలన, ఆకాశము గూడా వాయురూపమున అవతీర్ణ మగును. వాయు, అగ్ని, జలాదుల క్రమముతో పృథ్వీరూపముతో గూడా ఆ ఆకాశమే అవతరించును.' వేదాంతుల సిద్ధాంతము ననుసరించి ఈ సమాధానము చెప్పబడినది.

కాని, నైయాయికుల సిద్ధాంతానుసారము ఏమి సమాధానము? అని అడిగినచో, ఇట్లు చెప్పవలసివచ్చును– 'వ్యాపకత్వ హేతువు అనైకాంతికము. ఏలన, వ్యాపకత్వము నైయాయికుల ఆత్మ యందు ఉండును. కాని, అచట అవతరణము జరుగును. సాకార మగుటయే అవతారపదమునకు అర్థము. నైయాయికులు చెప్పునట్టి వ్యాపక ఆత్మపదార్థము, శరీరము కలదైనపుడు పరమాత్మ,

దేహవంతుడు ఏల కాజాలడు ? ఈ ఆక్షేపమునకు 'ఆత్మకు కర్మ ఉండుననియు, పరమాత్మకు ఉండదనియు చెప్పినచో, ప్రపంచ సృష్టి, పాలనాది కర్మలు ఈశ్వరునకు గూడా ఉండుననియే సమాధానము చెప్పుదుము. అయినను, దేహారంభమునకు ప్రయోజకము లైన కర్మలు ఈశ్వరునకు లేవు కదా ? అని శంకించవచ్చును. భోగారంభకము ఏదన్న విషయము శాస్త్రైకగమ్యము. ఫల వైచిత్ర్యమువలన, హేతువైచిత్ర్యమును ఊహించవచ్చును. కాని, ఏ కర్మవలన, ఏ ఫలము లభించును ? ఏతన్నిర్ణయము అనుమానముచేత కలుగదు. జీవుల జన్మలకు ఆరంభకములైన కర్మలను తెలిసికొనుటకు శాస్త్ర ప్రామాణ్యము అపేక్షితమైనపుడు, శాస్త్ర ప్రామాణ్యము మాన్యమైనపుడు, ప్రాణుల క్షేమమునకై అచింత్య దివ్య లీలాశక్తి చేతనే పరమేశ్వరుని దివ్యజన్మ, కర్మయే కాగలుగును. దీనిపైన అవతారము జరుగదు. కాని, భక్తుని భావనచేతనే విధురపరిభావిత కామినీసాక్షాత్కారమువలె కృష్ణాదుల స్వరూపము దర్శనమిచ్చునని మధుసూదన సరస్వతీస్వామి చెప్పిరి" అని కొందఱు చెప్పుదురు. కాని, ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఏలన,

> "అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।
> ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా ॥"

అనెడి ఈ గీతా మూల వచనము వలన అజుడు, అవ్యయుడు నయిన ఈశ్వరునకు మాయవలన జన్మ సిద్ధించును. మధుసూదన సరస్వతియు-

> "వంశీవిభూషితకరాత్ నవనీరదాభాత్
> పీతాంబరా దరుణబింబఫలాధరోష్ఠాత్ ।
> పూర్ణేందుసుందరముఖా దరవిందనేత్రాత్
> కృష్ణాత్పరం కిమపి తత్త్వ మహం న జానే ॥"

ఈవిధముగా శ్రీకృష్ణుని విషయమందు తమ అభిప్రాయమును వ్యక్తము చేయుచున్నారు.

ఆచార్యులు, భగవంతుని స్వరూపవర్ణనము చేసిన ప్రతి స్థలమందు, భగవంతుడు వస్తుతః, అజుడు, సర్వభూతాంతరాత్మ అయ్యు, తన దివ్య లీలాశక్తి చేత శరీరధారియై ప్రస్ఫురించు చుండుననియు చెప్పుచుండిరి. ఘృతవర్తికాసంబంధము వలన, నిరాకారమైన అగ్నియే దాహకత్వ, ప్రకాశకత్వవిశిష్టమైన దీప శిఖగా అభివ్యక్తమగును. ఆ రీతిగానే నిరాకారుడైన భగవంతుడు లీలాశక్తిసంసర్గమువలన సాకారుడై ప్రతీయమానుడగును. ఘృత వర్తికాదులు తటస్థములుగా ఉండియే దీపశిఖకు కారణభూతము లగును. దీపశిఖకు లోపల, బయట శుద్ధమైన అగ్నియే ఉండును. అటులనే లీలాశక్తి, తటస్థముగానే ఉండును. భగవంతుని స్వరూప మందు బాహ్యాంతరములంతట, శుద్ధమైన చిదానందమే ఉండును. అథవా, జలమే శైత్యసంసర్గము చేత హిమముగా (మంచుగా) వ్యక్తమగును. ఆ రీతిగానే అచింత్య, విశుద్ధ, సత్యసంబధముచేత సచ్చిదానందబ్రహ్మ, సాకారుడగును. సచ్చిదానందబ్రహ్మయే అనిర్వచనీయ ఆధ్యాసిక మాయాసంబంధముచేత నామ, రూప, క్రియాత్మకమైన ప్రపంచముగా ప్రకటమగును. ఆ విధముగానే విశుద్ధమైన సత్త్వము యొక్క ఆధ్యాసిక సంబంధముచేత బ్రహ్మ, ఆకృతి దాల్చిన దేహధారి అగుచున్నాడు. కనీసము అకాశాది ప్రపంచము వలె, సాకారబ్రహ్మ స్థితిత్వమును కరుడుగట్టిన వేదాంతులు గూడా అంగీకరించియే తీరవలయును.

సాధారణముగా బాధ్యత్వమును, మిథ్యాత్వమును, అబాధ్య త్వమును, సత్యత్వమును గ్రహించి, ముందుకు పోయినచో, శుక్తిరూప్యాదులకంటె అబాధ్య ఘటాది కార్యములకు సత్యత్వము కలదు. మృత్తికాపేక్షయా ఘటాదులందు బాధ్యత్వము ఉండుట వలన మిథ్యాత్వము కలదు. తదపేక్షయా ముక్తికయందు అబాధ్య

త్వము ఉండుటవలన, సత్యత్వము కలదు. ఈవిధముగానే అపర జల, అగ్ని, వాయు, ఆకాశాదులందు కార్యముకంటె, కారణమందు సత్యత్వము, కారణాపేక్షయా కార్యమందు మిథ్యాత్వము కలుగును. ఈ దృష్టితో పారమార్థికమైన సత్తకంటె,కించిత్ న్యూనసత్తాకత్వమే ఆ దివ్యశక్తియొక్క వ్యావహారికత్వము. కావున, బ్రహ్మయందు పారమార్థిక దృష్టితో అజాయమానత్వము (జన్మించకపోవుట) ఉన్నను, వ్యావహారికదృష్టితో జాయమానత్వము (జన్మించుట) ఉండవచ్చును.

సమాన సత్త గల భావ, అభావములకే విరోధము ఉండును. విషమ సత్తగల భావాభావములకు విరోధము కలుగదు. కావుననే ఆ రెండును, (భావాభావములు రెండును) ఒకే స్థలమున గూడా ఉండవచ్చును. కావున, ఒక శక్తికయందు వ్యావహారిక సత్తచేత రూప్యము (రజతము) యొక్క అభావము, ప్రాతిభాసిక సత్తచేత రూప్యాభావము ఉండుటలో విప్రతిపత్తి ఏమియును లేదు. ఈ దృష్టితోనే పరమాత్మయందు పారమార్థిక సత్త వలన జన్మాభావ దృష్టివలన జన్మయొక్క అభావము ఉండుటయందు గూడా ఆపత్తి ఏమియును ఉండజాలదు. 'దృష్టిసృష్టివాద'దృష్టితో అవతారము ఏవిధముగాను, సిద్ధించదని చెప్పవచ్చును.కాని, ఇదియు, సంగతము కాదు. ఏలన, 'దృష్టిసృష్టి' వాదమున గూడా ఆకాశాది ప్రపంచ సత్త్వము (అస్తిత్వము) కలదు. కనీసము సాకార బ్రహ్మ యొక్క అస్తిత్వమును తావన్మాత్రముగా నయినను, అంగీకరించి తీరవలయును. విధురపరిభావిత కామినీసాక్షాత్కారము కంటె సర్వవ్యాపియైన శ్రీకృష్ణుని సాక్షాత్కారము విలక్షణము. విధుర పరిభావిత కామినీసాక్షాత్కారము కంటె కేవలకామినీ సాక్షాత్కారము విలక్షణము. అపుడు కృష్ణసాక్షాత్కారము విలక్షణము ఏల కాదు ? తేలిన సారాంశ మేమనిన, ఏ దృష్టిచేతనైనను, వ్యవహారమును ఉపపాదించవలసి యుండును.

"వ్యాఘూతావధి రాశంకా"

లోక వ్యాఘాతమే శంకకు అవధి. ప్రపంచ స్వరూప నిషేధ పక్షమందు గూడా శ్రవణ, మనన సాక్షాత్కారాదులను ఉపపాదించ వలసి యుండును. అయిన, ఆ శ్రవణ, మననాదుల ఉపపాదనము చేయవలసి ఉన్నప్పుడు అవతార ప్రతిపాదనము సముచితమే. అట్లైనచో 'దృష్టిసృష్టి' వాదమందు అవతారము పొసగదు అని చెప్పుటయే వ్యర్థము. ఆ పక్షమందు ఆకాశాది ప్రపంచమే కుదరదు. అప్పుడు అవతారము పొసగదు అని విశేషముగా చెప్పుట వ్యర్థము. ఏ దృష్టితో నయినను జీవ, జగత్, ఈశ్వరులే ఏర్పడనిచో, ఆ పక్షమందు అవతారము గూడా ఏర్పడనిచో, దోష మేమియును లేదు. ఇచట, విచారము ఈశ్వరుని అవతారమునకు సంబంధించినది. అది ఈశ్వరునే సిద్ధింపజేయదు. అట్టి పరిస్థితిలో అది అవతారమును ఏల అంగీకరించును ? వస్తుతః,

"బిభే త్యల్పశ్రుతా ద్వేదో మామయం ప్రహర్ష్యతి"

అనగా, అల్పశ్రుతుడైనవాడు నన్ను ప్రహరించునని అల్పశ్రుతుని వలన వేదము భయపడునని భావము. శాస్త్రములందలి భిన్న భిన్న వాదములను ఆచార్యపరంపరంతో అధ్యయనము చేయక, ఆ శాస్త్రముల అభిప్రాయము తెలియదు. ప్రాణి, శాస్త్రవచనముల చేతనే తనకు అనర్థమును తెచ్చుకొనును. కొందఱు,

"మాయాఖ్యాయాః కామధేనోః జీవేశౌ వత్సకావుభౌ ।
యథేచ్ఛం పిబతాం ద్వైతం తత్త్వం త్వద్వైత మేవ హి ॥"

జీవేశ్వరులు ఇరువురును, మాయ అను కామధేనువు యొక్క లేగదూడలు. యథేచ్ఛముగా ద్వైతమునే ఆస్వాదింతురు. తత్త్వము మాత్రము అద్వైతమే అని భావము. ఈ వచనములను చదివి, ఉపాసనకు తిలాంజలి ఇచ్చుచున్నారు. కొందఱు ఈశ్వరుడు

జీవకల్పితుడు' అని వాచస్పతిచే ప్రతిపాదించబడిన సిద్ధాంతమును చూచి, ఈశ్వరుని, పరిహసింప మొదలిడుచున్నారు. వాస్తవిక విషయ మేమనిన, బంగారమును, కామినిని, లేక అన్నపానములను సత్యమని భావించి, ప్రాణులు వాటియందు ఆసక్తు లగుచున్నారు. కాని, భగవంతుని మిథ్యాత్వమునకు సంబంధించిన అభినివేశమే వారికి కళ్యాణదాయకమని, అనిపించుచున్నది.

వస్తుతః, రామాయణమందలి రామచంద్రుడు, భాగవత మందలి శ్రీకృష్ణుడు, విష్ణుపురాణమందలి విష్ణువు, శివ, స్కంద పురాణములందు గల శివుడు కేవల ఆభాసమాత్రులు కారు. కాని, అధిష్ఠానభూతమైన బ్రహ్మయే ఈ స్థలములలో విష్ణ్వాది నామము లతో పేర్కొనబడెను. 'మాయాభాసుడు ఈశ్వరుడు, అవిద్య యందు చైతన్యాభాసుడు జీవుడు'-ఈ పక్షమును అంగీకరించిన చోట గూడా కేవలాభాసులు ఈశ్వరాదులు కారు. కాని, అధిష్ఠాన సహితమైన ఆభాసయే ఈశ్వరాది రూపమున అంగీకార్యము. భాగవతాదులందు అధిష్ఠానప్రధానమైన బ్రహ్మరూపమే కృష్ణుడని, రాముడని భావించబడెను. కావుననే,

"ఏక స్త్వమాత్మా పురుషః పురాణః సత్యః స్వయం
జ్యోతిః అనన్తః ఆద్యః"

ఇత్యాది వచనములచేత పరమాత్మ పురుషోత్తముడు, సత్యస్వరూపుడు, స్వయంజ్యోతి అని చెప్పబడెను. ఈ స్థితియే విష్ణుపురాణ, శివపురాణములందలి విష్ణు, శివాది స్వరూపములకు సంబంధించినవై ఉన్నవి.

భాగవతమందు భగవంతుని స్వరూపములు మాయాతీత, అనంత, సచ్చిదానంద రూపములుగా చెప్పబడినవి.

"సత్య జ్ఞానానంత ఆనందైకరసమూర్తయః ।
అస్పృష్ట భూరిపమాహాత్మ్యా అపి హ్యుపనిషద్దృశామ్ ॥"

ఎవరు బ్రహ్మకు అద్భుత, అనంత బ్రహ్మాండముగా చూపెనో, వత్స సహితముగా గోపాలకులను అనేక విష్ణురూపము లలో ప్రదర్శించెనో, శివుడు ఎవరి చరణావనేజనమును (పాదోదకమును) తన శిరస్సుపైన దాల్చెనో, ఆ శ్రీకృష్ణుడు మూర్తి త్రయాతీతుడైన ఒకానొక అవికృత చిదానందఘనుడే అని శ్రీ శంకరాచార్యులు గూడా చెప్పుచున్నారు.

బ్రహ్మాండాని బహూని పంకజభవాన్ ప్రత్యండ
మత్యద్భుతాన్ ।
గోపాన్ వత్సయుతా నదర్శయ దజం విష్ణూ
నశేషాంశ్చ యః ॥"
"శంభుః యచ్చరణోదకం స్వశిరసా ధత్తే చ
మూర్తి త్రయాత్ ।
కృష్ణో వై పృథగస్తి కోఽప్యవికృతః సచ్చిన్మయో నీలిమా॥"

మహాత్ముడైన తులసీదాసు కూడా వ్యాపకుడు, నిరంజనుడు, నిర్వికారుడైన పరమాత్మయే కౌసల్యఒడిలో రామచంద్రుడై వ్యక్తమయ్యెనని చెప్పుచున్నారు.

అఘాసురుని ముఖమందు కృష్ణప్రవేశమును భాగవతము శుద్ధ సచ్చిదానంద బ్రహ్మయొక్క ప్రవేశమనియే భావించెను. గోవత్సములు, గోపబాలకులు అఘాసురుని ముఖమున ప్రవేశించి నపుడు, కృపామయుడైన భగవంతుడు, ఆనందకంద స్వరూపుడును అయిన శ్రీకృష్ణచంద్రుడు గూడాఆ అఘాసురుని ముఖమందు ప్రవేశించెను. శ్రీకృష్ణపరమాత్మ, స్వమహిమచేత అఘాసురుని చంపినపుడే అమృతవర్షిణియైన దయాదృష్టితో గోపబాలకులను పునరుజ్జీవితులను చేసినపుడే, అఘాసురుని శరీరమునుండి ఒక జ్యోతి బయల్వెడలి శ్రీకృష్ణస్వరూపమందు ప్రవేశించెను. ఇది వినినంతనే పరీక్షిత్తునకు గో, బ్రాహ్మణ మాంస, రుధిరములను

భక్షించునట్టి అఘాసురునకు ఇట్టి దుర్లభమైన గతి ఎట్లు లభించెను? అని ఆశ్చర్యము కలిగెను. అంత, శుకాచార్యుడు ఇట్లు పలికెను—

"సకృద్యదంగ ప్రతిమాన్తరాహితాం
మనోమయీం భాగవతీం దదౌ గతిమ్ ।
స ఏవ నిత్యాత్మసుఖానుభూతిభి
ర్వ్యుదస్తమాయోఽన్తర్గతో హి కిం పునః ॥"

అనగా, ఎవరి శోభాయుక్తములైన అవయవముల మంగళమయ మానస ప్రతిమను సౌభాగ్యవంతులైనవారు ఒకమారైనను, హృదయమందు ధరించి భగవద్గతిని పొందుదురో, మాయచేత అసంస్పృష్టుడు, నిత్యుడు, చిదానందాత్మయు నయిన ఆ భగవంతుడే, ఎవరిలోపల ప్రవేశించెనో; ఇక, అతడు భగవద్గతి పొందుటలో ఆశ్చర్యమేమి కలదు అని భావము. కావుననే పరమేశ్వరుని ప్రాదుర్భావ ప్రయోజనము గూడా ధర్మ గ్లానియొక్క నివృత్తి అధర్మాభ్యుత్థాన నివృత్తిపూర్వకముగా ధర్మస్థాపనము, సాధు పరిత్రాణము, దుష్కృతివినాశమే కాక, నిర్మలాత్ములైన పరమహంసలకు భక్తియోగము విహితమొనర్చుటయై ఉన్నది.

ప్రకృతి, ప్రాకృత ప్రపంచాతీత శుద్ధ పరబ్రహ్మమైన కృష్ణుడే దివ్యలీలాశక్తిసంబంధము చేత సగుణుడై సచ్చిదానంద రూపముతో ఆవిర్భవించి, యోగీంద్రుల, మునీంద్రుల నిర్మలమైన మనస్సులను ఆకర్షించును. ప్రకృతి గాని, లేక ప్రాకృత ప్రపంచము గాని, సత్యానృతవివేకము గల నిర్మలాత్ములైన ఆ పరమహంసల మనస్సును ఆకర్షించజాలవు. కావుననే వారికి భజనీయమైన వస్తువు, శుద్ధ బ్రహ్మయే. ఇక్షురస పరిణామమైన శర్కర, కందము యొక్క మాధుర్యము, ఇక్షురసముకంటె విలక్షణముగా ఉండును. ఆరీతిగానే, శుద్ధ సచ్చిదానందముకంటె తత్త్వతః, విలక్షణము కాకపోయినను, భగవంతుని సగుణ స్వరూపము

అద్భుతము, చమత్కారపూర్ణమును అయి ఉండును. ఇంత మాత్రమే రెంటికి గల భేదము. ఇక్షుదండమందు దైవవశముచేత మధురఫలము పండినట్లు, చందనవృక్షమున, మనోహర పుష్పములు పూచినట్లు, పరమానంద రసరూపమైన నిర్గుణ పరబ్రహ్మయందు సగుణ, సాకార బ్రహ్మ ఉండును. నిర్గుణ బ్రహ్మానుభవము గల జనకాదుల చిత్తము గూడా సగుణ, సాకార స్వరూపమందు ముగ్ధమగుటకు కారణ మిదియే.

కేవల నేత్రముతో సూర్యదర్శనము చేయుటయందు కంటె దూరవీక్షణయంత్రోపహితమైన నేత్రముతో సూర్యదర్శనము చేయుటలో చమత్కారము కలుగును. అవిధముగానే కేవల నిర్మలాంతఃకరణము చేత చూచుట కంటె, పవిత్రమైన అంతఃకరణముతో లీలాశక్తిచేత సాకారముగా అభివ్యక్తమైనభగవంతుని దర్శనమందు వైలక్షణ్యము ఉండును.నిరుపాధిక స్వరూపము నిరతిశయమనుటలో ఏమియును ఆక్షేపము లేదు. అన్యాన్య ప్రపంచము గూడా బ్రహ్మయొక్క పరిణామమే, వివర్తమే అయినను, అది, తామస, రాజస ప్రకృతిచేత-రజస్తమోలేశానువిద్ధ సత్త్వాత్మికయైన ప్రకృతిచేత ఆవృతమై ఉండును. భగవత్స్వరూపము విశుద్ధ సత్త్వాత్మిక అయిన యోగమాయచేత, లేక దివ్యలీలాశక్తిచేత సాకారముగా అభివ్యక్తమైన బ్రహ్మ, నిరావరణ మయియే ఉండును. దూరవీక్షణాది యంత్రములు నేత్రమునకు, సూర్యునకు మధ్య ఉండి, సూర్యస్వరూపదర్శనమునకు సహాయకముగా ఉండును. అన్య పాషాణాదులు సూర్యదర్శనమునకు ప్రతిబంధకములుగా ఉండును. ఆరీతిగానే దివ్య లీలాశక్తి, పరమాత్మ దర్శనమునకు తోడ్పడును; ఇతరములైన రాజస, తామస శక్తులు ప్రతిబంధకము లగును.

కొందఱు, ప్రకృతికంటె భిన్నముగానే భగవంతుని అంతరంగ

శక్తిని భావించిన, మఱి కొందఱు మహాశక్త్యంతర్గతమైనను, ఆ శక్తిని దివ్యమని తలంచుదురు. గులాబి విత్తనమందు కంటక, పత్ర, నాళ, స్కంధాదుల ఉత్పాదినీశక్తి కంటె సౌందర్య, మాధుర్య, సౌరభ్య, సౌగంధ్యసంపన్నమైన పుష్పమును ఉత్పాదనము చేయు శక్తి, విలక్షణమై ఉండును. అటులనే ప్రపంచోత్పాదినులయిన ఇతర శక్తులకంటె సగుణ, సాకార భగవంతుడు అభివ్యక్త మగుటకు అనుకూలమైన లీలాశక్తియందు చమత్కార పూర్ణమైన విలక్షణత్వము ఉండును. తేలిన సారాంశ మేమన, శుద్ధ పరబ్రహ్మయే నిరాకార రూపముతోనే, సగుణ, సాకార రూపముతో ఆవిర్భూత మగును. అపుడే సద్భావముతో గాని, దుర్భావముతో గాని, అలసభావముతో గాని, ఏ భావముతో నయినను, సేవించుట వలన, ప్రాణులకు సద్గతి కలుగును. కావుననే భాగవతము ఇట్లు చెప్పుచున్నది–

"నిఃశ్రేయసార్థాయ వ్యక్తి ర్భగవతః ప్రభో
అవ్యయస్యాప్రమేయస్య నిర్గుణస్య గుణాత్మనః ॥"

అనగా, ప్రాణుల క్షేమము కొఱకై అవ్యయుడు, అప్రమేయుడు, నిర్గుణుడు, గుణాంతరాత్మయును అయిన భగవంతుడు, సాకార స్వరూపముతో అభివ్యక్తి నొందునని భావము. ఈ స్వరూపమందు కామ, క్రోధ, స్నేహములతో ఏవిధముగా నయినను, చిత్తము లగ్నము చేయుట వలన, ప్రాణికి క్షేమము కలుగును–

"కామం క్రోధం భయం స్నేహ మైక్యం సౌహృద మేవ చ।
నిత్యం హరౌ విదధతో యాన్తి తన్మయతాం హి తే ॥"

సరియే, ఎవరైనను, చింతామణిని దీప మనుకొని, తీసికొనుటకు వెళ్ళినను, అచట, దీపము లభించదు, చింతామణియే లభించును. అట్లే పరాత్పరుడు, పూర్ణతముడు, పురుషోత్తముడును అయిన శుద్ధ సచ్చిదానంద పరబ్రహ్మను ఒకడు జారుడని,

మఱొకడు శత్రువని, మిత్రుడని, ఏదియో అనుకొని ప్రవర్తించు గాక. కాని, అచట శుద్ధ పరబ్రహ్మయే_ పరమాత్మయే లభించును గాని, ప్రాకృతవస్తువు లభించదు. కావుననే కొందఱు వ్రజాంగనలు జారబుద్ధితో గూడా శ్రీకృష్ణుని, సేవించి ముక్తలైరి_

"తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాఽపి సంగతాః ।
జహు ర్గుణమయం దేహం సద్యః ప్రక్షీణబన్ధనాః ॥"

పతిచేతను, సోదరులచేతను నిరోధించబడుటవలన, వ్రజాంగనలు కొందఱు మదనమోహనుని వేణునాదముచేత ఆకర్షించబడినపుడు, బృందావనచంద్రుడైన శ్రీకృష్ణచంద్రుని సాన్నిధ్యమునకు పోజాలకపోయిరి. ఆ గోపాంగనలు కృష్ణభావనాభావిత మనస్కలై నేత్రములు నిమీలిత మొనర్చి, అచటనే ధ్యానించసాగిరి. ప్రియతముడైన శ్రీకృష్ణుని విరహముచే కలిగిన తీవ్ర తాపము వలన వారి అశుభ కర్మలు ప్రక్షాళితములైపోయినవి. ధ్యానము వలన, ప్రాప్తించిన అచ్యుతుని పరిరంభణము (కౌగిలింత) వలన కలిగిన ఆనందోద్రేకముతో సమస్త శుభ కర్మల ఫలము గూడా సమాప్తమయ్యెను. అథవా, ఆయనయొక్క దుస్సహ విరహజన్యమైన తీవ్ర తాపము చేత ప్రపంచమందలి అశుభ కర్మలే కంపించిపోయినవి. ధ్యానమునందు లభించిన అచ్యుతుని ఆశ్లేషమువలన ప్రపంచమందలి సమస్త మంగళములు తమనుఅల్పమైనవానినిగా తెలిసికొని, బలహీనములయ్యెను. ఈవిధముగా వెంటనే క్షయించిన బంధము కలవారై జారబుద్ధి చేత గూడా ఆ పరమాత్మనే పొంది, వ్రజాంగనలు గుణమయములైన పంచకోశములనుండి (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములనుండి), లేక, దేహత్రయము నుండి (స్థూల, సూక్ష్మ, కారణశరీరత్రయము నుండి) ముక్తలైరి.

భావుక హృదయులైన భక్తులు ఈ సగుణ స్వరూప చింతన

మును సకలము,సుగమము,శ్యామీభూతమైన(నల్లనైన) బ్రహ్మయే అని చెప్పిరి. 'అద్వైతసిద్ధి'రచయిత ఇట్లు చెప్పుచున్నారు- ఎవరు నిర్గుణ, నిరాకార, నిర్వికార, బ్రహ్మయొక్క ఉపాసనను ధ్యానాభ్యాసముచేత వశీకృతమైన మనస్సుతో చేయుదురో, వారు చేసిన చేయుదురుగాక. కాని, నా నేత్రానందమునకై (చమత్కారమునకై) కాళిందీపులినములందు శ్యామ తేజోయుక్తమైన తత్త్వమే ప్రస్ఫురిత మగుగాక-

> "ధ్యానాభ్యాసవశీకృతేన మనసా తన్నిర్గుణం నిష్క్రియమ్।
> జ్యోతిః కించన యోగినో యది పరం పశ్యన్తి పశ్యన్తు తే ॥"
> అస్మాకం తు లోచనచమత్కారాయ భూయాచ్చిరం ।
> కాళిందీపులినేషు యత్కిమపి తన్నీలం మహో ధావతి ॥"

కొందఱు భావుకులైన భక్తులు వ్రజాంగనల పుంజీభూత ప్రేమనే కృష్ణుడని భావించిరి. మఱి కొందఱు యదువంశీయుల మూర్తీభవించిన భాగధేయమునే (అదృష్టమునే) శ్రీకృష్ణుడని తలచిరి. శ్రోత్రియులు శ్రుతులయందు గల గుప్తవిత్తమునే శ్యామీభూతమైన బ్రహ్మ అని భావించిరి.

> "పుంజీభూతం ప్రేమ గోపాంగనానాం మూర్తీభూతం
> భాగధేయం యదూనామ్।
> ఏకీభూతం గుప్త విత్తం శ్రుతీనాం శ్యామీభూతం
> బ్రహ్మ మే సన్నిధత్తామ్ ॥"

పూర్ణానురాగరససారమైన సరోవరమునుండి సముద్భవించిన పంకజమే శ్రీకృష్ణుడని ఒకరు చెప్పిరి. మఱొకరు అట్లు కాదు, సచ్చిదానందరససారమైన సరోవరమునుండియే ఈ కృష్ణ కువలయము (కృష్ణుడను కలువపువ్వు) ప్రాదుర్భవించెనని పలికిరి. ఈ కువలయము ఎట్టిదనిన, భృంగములు (భక్తుల మనోభ్రమరములు) ఇంతవఱకు ఆ కువలయమును ఆఘ్రాణించనేలేదు. ఇట్లు

చెప్పికొందము- 'ఆ భ్రమరములు అనాదికాలమునుండియు, ఆ శ్రీకృష్ణ సౌందర్య కువలయ మకరందమును పానము చేయుచునే ఉన్నవి. అయినను, వానికి ప్రతిదినము, ప్రతిక్షణము దానియందు నూతనత్వమే స్ఫురించుచున్నది. అనగా, ప్రతిక్షణము, దానియందు నవీనత్వమే భాసించుచున్నదని భావము.

"తస్యాం ప్రియుగం నవమ్"

ఈవిధముగానే కవీంద్రులన్న వాయువులు సైతము ఇంతదనుక, ఈ కువలయ కీర్తిసౌరభమును అపహరించలేకపోయినవి. అనగా, ఆ వాయువులకు గూడా నవీనతాస్ఫూర్తియే కలుగుచున్నదని భావము. ఊర్మికణభారముచేత- సాంసారికములైన షడూర్ములచేత ఈ కువలయము ఆహతము కాలేదు. ఇంత యేల? నేటివఱకు ఎవరును ఈ కువలయమును చూడనైనను చూడలేదు.

"అనాఘ్రాతం భృంగైః అనపహృత సౌగంధ్య మనిలైః
అనుత్పన్నం నీరేషు అనుపహత మూర్మికణభరైః।
అదృష్టం కేనాపి క్వచన చ చిదానందసరసో
యశోదాయాః క్రోడే కువలయ మివౌజ స్తదభవత్।"

దేవకీదేవి, ముక్తులైన మునీంద్రులు అన్వేషించదగిన అద్భుతమైన ఒక ఫలమును పండించెను. వ్రజేంద్ర గృహిణియైన నందరాణి (యశోద) ఆ ఫలమును పోషించెను. శ్రీ వ్రజసీమంతినులు (గోపస్త్రీలు) ఆ ఫలమును అనుభవించిరి.

"ముక్తమునీనాం మృగ్యం కిమపి ఫలం దేవకీ ఫలతి।
తత్పాలయతి యశోదా ప్రకామ ముపభుంజతే గోప్యః॥"

సచ్చిదానంద పరబ్రహ్మకు సగుణ,సాకార రూపము ఉండును. ఈ విషయము 'కేనోపనిషత్తు'నందు గూడా ప్రసిద్ధము. దేవాసుర సంగ్రామమందు పరమేశ్వరానుగ్రహము వలన దేవతలకు

విజయము కలిగెను. కాని, దేవతలు తమ శ్రమఫలమే ఇది అని భావించిరి. వీరికి సైతము గర్వము కలిగినచో, అసురులకంటె ఈ దేవతలయందు భేదము ఏమి ఉండును? అని భగవంతుడు భావించెను.

"అసుష ప్రాణోపలక్షితేషు అనాత్మసు రమన్తే
యే తే అసురాః।" అథవా,
"అశోభనే అనాత్మని రమన్తే యే తే అసురాః।"

అనగా, అశోభనమైన అనాత్మలందు రమించువారు అసురులని చెప్పబడుదురు. భగవంతుడు ఈ విధముగా ఆలోచించి, పరమ ప్రకాశమయము, సగుణము, సాకారము, దివ్యమును అయిన రూపములో అభివ్యక్తమయ్యెను. ఆ స్వరూపమును చూచినంతనే దేవతలు భయపడిరి. ఇతడు మిత్రుడా, లేక శత్రువా? అను విషయమును తెలిసికొనుటకై అగ్ని, వాయువులను, ఇంద్రుని, పంపిరి. అగ్ని వాయువులు ఆ పరమాత్మ సమక్షమున, ఒక తృణమును సైతము కదిలించుటకు గాని, దగ్ధము చేయుటకు గాని, సమర్థులు కారైరి. అగ్ని, వాయువు లిరువురును ఏమియును తెలిసికొనలేక, తిరిగివచ్చిరి. అంత, ఇంద్రుడు వెళ్ళెను. ఇంద్రుని రాకను చూచుట తోడనే ఆ ప్రభువు, అంతర్హితుడయ్యెను. ఇంద్రుడు లజ్జితుడై అచటనే ఆ స్వరూపమును తెలిసికొనవలయునను జిజ్ఞాసతో తపస్సు చేయసాగెను. అనేక దినముల తపస్సుచేత పరమేశ్వరి అయిన 'ఉమ' (బ్రహ్మవిద్య) సాక్షాత్కరించెను. ఆమె, ఇంద్రునికి బ్రహ్మను పరిచయము చేసెను. బ్రహ్మజ్ఞానులగుటచేతనే దేవతల యందు అగ్ని, వాయు, ఇంద్రులు ప్రధానులు. వారియందు గూడా ఇంద్రుడు మొదట, బ్రహ్మయొక్క పరిచయమును పొందెను గాన, ఆయనయే శ్రేష్ఠుడుగా భావించబడెను.

"బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే"

ఇత్యాది శ్రుతుల వలన, ఈవిషయములు స్పష్టములు.

'ఛాందోగ్యోపనిషత్తు' నందు గూడా సూర్యమండలాన్గతుడు, హిరణ్మయుడు, హిరణ్యశ్మశ్రువు, తేజోమయుడును అయిన ఒక పరమ పురుషుని వర్ణనము కలదు. అది గూడా సచ్చిదానంద బ్రహ్మకు సంబంధించినదియే అయిన సగుణ, సాకార రూపము. ఈ విషయము ఉత్తర మీమాంసా శాస్త్రమందు—

అన్తస్తద్ధర్మోపదేశాత్"

అను సూత్రముచేత గూడా స్పష్టము. శ్రీశంకరభగవత్పాదులు విశుద్ధ సత్త్వ ప్రధానమైన మాయాసంబంధము చేత పరమాత్మకు విగ్రహము ఏర్పడగలదని చెప్పిరి. అది, భూతగుణములైన శబ్దాదులచే యుక్తమై ప్రతీతమైనను, శుద్ధ సచ్చిదానంద బ్రహ్మయే. శబ్దాదిమత్త్వ ప్రతీతి (శబ్దము కలిగియున్నట్లు భాసించుట) దానియందు భ్రాంతి మాత్రమే. కైవల్యోపనిషత్తునందు—

"ఉమాసహాయం పరమేశ్వరం విభుమ్"

అను వచనముచేత గూడా ఉమామహేశ్వర స్వరూపము వర్ణితము.

"అతో దేవా అవన్తు నో యతో విష్ణుర్విచక్రమే ।
పృథివ్యాః సప్త ధామభిః"

అను మంత్రమున, విష్ణువు,గాయత్ర్యాది సప్తఛందస్సుల చేత దేశముపైన వివిధ క్రమణ చరణవిన్యాసములు చేయునని చెప్పబడినది.

"ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్ ।
సమూఢమస్య పాంసురే ।"

అను మంత్రము వలన త్రివిక్రమావతారమును ధరించిన పరమేశ్వరుడు దృశ్యమానమగు ఈ విశ్వమును తన చరణములతో ఆక్రాంత మొనర్చెనని, తన చరణముతో మూడు విధములైన

పాదవిన్యాసము చేసెనని తెలియుచున్నది. ఈ విష్ణువుయొక్క ధూళియుక్తమైన పాదస్థానమందు సమస్త విశ్వము అంతర్భూతమై ఉండు నని తెలియుచున్నది.

"త్రీణి పదా విచక్రమే విష్ణుర్గోపా అదాభ్యః।
అతో ధర్మాణి ధారయన్"

ఈ మంత్రమునందు గూడా ఎవరు హింసించబడజాలరో, ఆ సర్వ జగద్రక్షకుడైన విష్ణువు, అగ్నిహోత్రాది కర్మలను పోషించుచు పృథివ్యాది స్థానములందు తన మూడు పాదములతో క్రమణము చేసెనని వర్ణించబడినది. ఈ విధముగా అనేక శ్రుతులయందు పరమాత్మయొక్క సగుణ, సాకార రూపము వర్ణించబడినది.

"ప్రజాపతి శ్చరతి గర్భే అన్త రజాయమానో బహుధా విజాయతే। తస్య యోనిం పరిపశ్యన్తి ధీరా స్తస్మిన్ హ తస్థు ర్భువనాని విశ్వా।"

ఈ మంత్రమునందు గూడా ప్రజాపతి, గర్భములోపల ప్రవేశించును, ఆయన, స్వరూపముచేత అజుడయ్యును (జన్మలేనివాడై గూడా) అనేక రూపములతో ప్రకటమయ్యెను, ఆయన, ప్రకటమగుటకు గల ధర్మరక్షణాది ప్రయోజనములను ధీరులైనవారు ఎఱుంగుదురని చెప్పబడినది.

"యా తే రుద్ర శివా తనూ రఘోరా పాపకాశినీ।
తయాన స్తనువా శన్తమయా గిరిశన్తాభిచాకశీహి॥"
"నీలగ్రీవాః శితికంఠాః"

ఇత్యాది అనేక స్థానములందు పరమేశ్వరుడే నీలకంఠుడైన మహాదేవుడుగా వర్ణించబడెను.

"ఏషో హి దేవః ప్రదిశోఽను సర్వాః పూర్వో హి జాతః స ఉ గర్భే అన్తః। స ఏవ జాతః స జనిష్యమాణః ప్రత్యఙ్ జన స్తిష్ఠతి సర్వతోముఖః॥"

ఈ మంత్రమునందు ఈ యీశ్వరుడే, సర్వదిశలయందు వ్యాపించి, మొదట గర్భమున ఉండి, అభివ్యక్తమయ్యెను. సర్వతో ముఖుడైన ఆ పరమేశ్వరుడే పూర్వము అనేక రూపములతో జన్మించెను, ముందు గూడా జన్మించును అని చెప్పబడినది.

"అజోఽపి సన్ అవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా ॥"

ఈ శ్లోకముపైన నిమ్నలిఖితమైన అభిప్రాయము శ్రీ కేశవ కాశ్మీరికి సంబంధించినది- "నేను అజుడను. అనగా జీవులవలె కర్మనిమిత్తముగా అపూర్వమైన దేహగ్రహణము చేయను. అవ్యయాత్మను, పూర్వదేహవియోగము లేనివాడను. అయినను. నా ప్రకృతిని (స్వభావమును), అసంగత్వ, అజేయత్వ, అనతిక్రమణీయత్వాదులను వీడకయే నా మాయచేత- సంకల్పముచేత లోక హితార్థమై జన్మింతును." ఈ వ్యాఖ్యానమందు 'ప్రకృతి' శబ్దమునకు అర్థము స్వభావమనియు "మాయా తు వయునం జ్ఞానమ్" అను నిఘంటువచనము వలన 'మాయా' శబ్దమునకు అర్థము జ్ఞానమనియు గ్రహించబడినది.

"అజాయమానో బహుధా విజాయతే"

అను శ్రుతిచేత గూడా ఇదియే స్పష్టమగుచున్నది.

"ఆనందరూప మమృతం యద్విభాతి ।"
"ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।"

"హిరణ్యకేశః హిరణ్యశ్మశ్రుః ఆప్రణఖాగ్రాత్ సువర్ణః ।"

ఇత్యాది శ్రుతులవలన, భగవంతుని సగుణస్వరూపము తెలియును.

"యో వేత్తి భౌతికం దేహం కృష్ణస్య పరమాత్మనః ।
ముఖం తస్యావలోక్యాపి సచైలం స్నాన మాచరేత్ ॥"

"స సర్వస్మాత్ బహిష్కార్యః శ్రౌత స్మార్త విధానతః ।"

"న భూతసంఘసంస్థానో దేహోఽస్య పరమాత్మనః।"

"అస్యాపి దేవ వపుషో మదనుగ్రహస్య స్వేచ్ఛామయస్య న తు భూతమయస్య కోఽపి।"

ఇత్యాది భారత, భాగవతాది వచనములచేత గూడా భగవంతుని స్వరూపము అభౌతికమని చెప్పబడెను. భౌతికమని భావించువాడు పాతకి అనియు చెప్పబడెను.

శ్రీమధుసూదనసరస్వతి ఇట్లనుచున్నారు- "సర్వజ్ఞుడైన ఈశ్వరునికి ధర్మాధర్మములు లేకపోవుటవలన ఆయనకు జన్మ చెప్పుట పొసగదు." నూతన ఇంద్రియాదులను గ్రహించుట జన్మ అనియు, పూర్వము గ్రహించబడిన దేహేంద్రియాదుల వియోగము మృత్యువు అనియు చెప్పబడును. ఈ రెండు విషయములను అజుడు, అవ్యయుడును అయిన పరమాత్మయందు సంభవములు కావు. ఈశ్వరుని శరీరము స్థూలమైన భూతకార్యమైనచో, లేక, వ్యష్టి రూపమైనచో, ఈశ్వరుడు గూడా జాగ్రదవస్థాభిమానులైన జీవులవంటివాడే అగును. సమష్టిరూపమైనచో, విరాట్ జీవరూపుడగును. సూక్ష్మభూతకార్యము, లేక వ్యష్టిరూపము అయినచో, స్వప్నావస్థాభిమానియగు జీవుడగును. సమష్టిరూపుడైనచో, హిరణ్యగర్భుడగును. పరమేశ్వరుని భౌతిక స్వరూపము జీవావిష్టము ఎన్నడును కాజాలదు.

జీవావిష్టమైన శరీరమందే 'భూతావేశన్యాయము' చేత ఈశ్వరుడు ప్రవేశించును. కాని, ఇది, యుక్తము కాదు. ఏలన, ఈ శరీరమందు జీవునికే సుఖదుఃఖాది అనుభవములు కలుగును, ఈశ్వరునకు కలగవు. అపుడు అంతర్యామిగా సర్వత్ర పరమేశ్వరుని ప్రవేశము సిద్ధించుచున్నదిగాన, ఇటువంటి శరీరవిశేషమును స్వీకరించుట వ్యర్థమే. ఆ శరీరమందు జీవునికి భోగము పొసగదు. అపుడు దానిని జీవశరీరమని చెప్పుటకు వలనుపడదు. కావున,

ఈశ్వరునకు భౌతికశరీరము ఏవిధముగానైనను ఏర్పడజాలదు. ఈ విషయములను నిరాకరించుచు భగవంతుడు ఇట్లనుచున్నాడు- "నేను అజుడను, అవ్యయుడను అగుచు గూడా, బ్రహ్మాది స్తంబ పర్యంతము గల సమస్త ప్రాణులకు ఈశ్వరుడనై గూడా నా విచిత్ర శక్తిమతి, అఘటితఘటనాపటీయసి, ఉపాధిభూతయు నయిన మాయను నా చిదాభాసచే వశీభూత మొనర్చుకొని మాయ యొక్క పరిణామవిశేషముల చేతనే దేహవంతునివలె జన్మించినట్లు ప్రతీతుడ నగుచున్నాను. అనాదియైన మాయయే యావత్కాల స్థాయి అగుటచేత నిత్యమని చెప్పబడుచున్నది. ఆ మాయయే నాయందు జగత్కారణత్వమును అపాదించుచున్నది. ఆ మాయ నా ఇచ్ఛచేతనే ప్రవర్తమానయై విశుద్ధ సత్త్వమయమైన నా మూర్తి అని చెప్పబడును,తన్మూర్తివిశిష్టమైన నాయందు అజత్వ, అవ్యయత్వ, ఈశ్వరత్వములు ఉపపన్నములగును.కావుననే శ్రుతి,

"ఆకాశశరీరం బ్రహ్మ"

అని చెప్పుచున్నది. ఆకాశము (అనగా, మాయయే) భగవంతుని శరీరము. భౌతిక శరీరము లేనపుడు భగవంతునియందు మనుష్య త్వాది ప్రతీతి ఎట్లు కలుగుచున్నది? అని శంక, జనించవచ్చును. దీనికి సమాధానమేమనిన, ఆత్మమాయ (భగవంతునిమాయ) వలననే లోకానుగ్రహము కొఱకై భగవంతునియందు మనుష్య త్వాది ప్రతీతి కలుగును. ఈ విషయమే మోక్షధర్మమందు ఇట్లు చెప్పబడినది-

> "మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద ।
> సర్వభూతగుణై ర్యుక్తం న తు మాం ద్రష్టు మర్హసి ॥"
> "నైతత్ త్వయేతి విజ్ఞేయం రూపవానితి దృశ్యతే ।
> ఇచ్ఛ న్ముహూర్తాత్ నశ్యేయ మీశో౽హం జగతః ప్రభుః ॥"

అనగా, హే నారద! కారణోపాధికుడను,పరమేశ్వరుడను అయిన

నన్ను, భూతగణ, శబ్దాదిసహితుడనుగా చూచుచున్నావు. ఇది, నా మాయయే. కారుణోపాధికుడ నయిన నన్ను చర్మచక్షుస్సుతో ఎవరును చూడజాలరు అని భావము.

పరమేశ్వరునియందు శరీర-శరీరిభావమునే కొందఱు అంగీకరించరు. సచ్చిదానందఘన, నిర్గుణ, పరిపూర్ణ పరమాత్మయే భగవంతుని దేహమని వారు చెప్పుదురు. భగవంతునికంటె భిన్నముగా భౌతిక, లేక మాయిక విగ్రహము ఆయనకు ఏదియును లేదు.

"ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః"

"అవినాశీ వా అరేఽయ మాత్మా అనుచ్ఛిత్తిధర్మా"

ఇత్యాది శ్రుతివచనముల వలనను,

"అసంభవస్తు సతోఽనుపపత్తేర్నాత్మాఽశ్రుతే
ర్నిత్యత్వాచ్చ తాభ్యః"

ఇత్యాది సూత్రములవలనను వస్తుతః, భగవంతుడు జన్మ, వినాశ రహితుడు, సర్వభాసకుడు, సర్వకారణస్వరూపుడు, మాయకు అధిష్ఠానరూపుడును అగుటచే సర్వభూతములకు ఈశ్వరుడై కూడా స్వీయ, ఏకరస సచ్చిదానందఘన స్వభావమందే ఉండి, శరీర-శరీరి భావము లేకయే శరీరివలె వ్యవహరించునని విదితమగును. దేహరహితమైన సచ్చిదానందఘన స్వరూపమందు దేహప్రతీతి ఎట్లు కలుగుచున్నది ? దీనికి సమాధానము "ఆత్మమాయయా" అని చెప్పబడినది. నిర్గుణుడు, శుద్ధ రసస్వరూపుడు, దేహ-దేహిభావశూన్యుడును అయిన భగవంతునియందు దేహరూపప్రతీతి మాయామాత్రము. ఈ విషయమునే శ్రీమద్భాగవతమందు గూడా ఇట్లు చెప్పబడినది—

"కృష్ణమేన మవేహి త్వమాత్మాన మఖిలాత్మనామ్ ।
జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాభాతి మాయయా ॥"

"అహో భాగ్య మహో భాగ్యం నందగోప వ్రజౌకసామ్ ।
యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనమ్ ॥"

ఇత్యాది వచనముల వలన,సమస్త ప్రాణుల అంతరాత్మ, శ్రీకృష్ణుడే. ఆయనయే తన మాయచేత జగత్కల్యాణమునకై దేహము కలవాడు వలె భాసించుచున్నాడు. పూర్ణ సచ్చిదానందఘన స్వరూపుడు వారికి మిత్రుడై ఆవిర్భవించుట నందగోప వ్రజవాసుల లోకోత్తర సౌభాగ్యము అని భావము.

కొందఱు నిరవయవ, నిర్వికార, పరమానందము యొక్క అవయవ-అవయవి భావమే వాస్తవికమని భావింతురు. కాని,

"నిర్యుక్తికం బ్రువాణశ్చ నాస్మాభి ర్వినివార్యతే ।"

అను న్యాయము చేత వారికి మేము ఏమియు చెప్పదలచుటలేదు. ఇట్లు సంభవమైనచో, సంభవ మగుగాక. ఈవిషయమున-

"కర్మణా జాయతే జన్తుః కర్మణైవ ప్రలీయతే"

అను వచనము ననుసరించి, కర్మల వలననే ప్రాణుల జన్మ, వినాశములు కలుగుచుండును. పరమేశ్వరునియందు జన్మ హేతువులైన పుణ్య, పాపములు లేకపోవుటచేత ఆయనకు జన్మ, అసంభవము. అయినను, మాయాసంబంధముచేత పరమేశ్వరునికి జన్మ అసంభవము కాదు. కావుననే అజుడు, అవ్యయుడు, నిరవయవుడును అయినను, భగవంతుడు మాయాసంసర్గము చేతనే జన్మించును అని శ్రీశంకరానందులు చెప్పుదురు. శ్రీకృష్ణ పరమాత్మ యొక్క జన్మ, కర్మనిమిత్తమైనది కాకపోయినను, తన్నియామకుడు ఒకడు తప్పక ఉండును అనెడి భ్రమను తొలగించుట కొఱకే భగవంతుడు ఇట్లు చెప్పెను-

"భూతానా మీశ్వరోఽపి సన్"

అనగా, ప్రాణులకు(జీవులకు)ఈశ్వరుడున్నను, 'ఏష సర్వేశ్వరః'

ఇత్యాది శ్రుతివచనముల ననుసరించి, సర్వప్రాణినియంత పరమాత్మయే. ఆయన, ఎవరిచేతను నియోజ్యుడు కాడు. ఈవిధముగా అజుడు, అవ్యయాత్మ, ఈశ్వరుడయ్యు, స్వీయదైవీప్రకృతి, మాయాసహకారము చేత ఆయన, ఉత్పత్తి నొందగలడు. వహ్ని యందలి దగ్ధృత్వశక్తి వలె, పరమేశ్వరాభిన్నయైన శక్తియే ఆ పరమేశ్వరుని మాయాశక్తి. ఈ విషయమే–

"దేవాత్మశక్తిం స్వగుణై ర్నిగూఢామ్ ।"

ఇత్యాది శ్రుతులచే ఉగ్గడించబడినది. ఆ మాయశక్తి వలననే భగవంతుడు జన్మ కలవాడుగా ప్రతీతుడగును. వస్తుతః, భగవంతుడు నిష్కల, నిష్క్రియ స్వరూపుడే.

ఈ విషయమున, ఆనందతీర్థులు ఇట్లు చెప్పుదురు– 'భగవంతుడు అజుడు, అవ్యయాత్మ అయినను, ప్రకృతిచేత జన్మ కలవాడన్నట్లు, వసుదేవాదుల వలన జన్మించినట్లు ప్రతీయమానుడగును. ఈ సిద్ధాంతమందు భగవంతుని దేహము అవ్యయము. ఆ దేహమునే నానావిధములైన అవతారములకు నిధానమనియు, అవ్యయమైన బీజ (కారణ) మనియు భావించిరి–

"ఏతన్నానావతారాణాం నిధానం బీజ మవ్యయమ్ ।"

ఈ మతమున, 'ఆత్మమాయ' అనగా, ఆత్మజ్ఞాన మని అర్థము. ఏలన, ప్రకృతి వేఱుగా నిర్దేశించబడినది.

"మతిః క్రతు ర్మనీషా మాయా"

ఇత్యాది కోశవచనములందు 'మనీష' అను అర్థమున 'మాయా' శబ్దము పఠితమైనది.

శ్రీమద్రామానుజాచార్యులు ఇట్లు చెప్పుదురు– 'భగవంతుడు తన అజత్వ, అవ్యయత్వ, సర్వేశ్వరత్వాది సమస్త ఐశ్వర్యములను వీడకయే తన ప్రకృతియందు, అనగా, స్వభావమందు ఉండియే స్వసంకల్పముచేత (స్వేచ్ఛతో) అవతరించును.'

"ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్"

"య ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః"

ఇత్యాది శ్రుతులు భగవంతుని సగుణ, సాకార స్వరూపమును స్పష్టీకరించుచున్నవి. వీరి సిద్ధాంతమున గూడా

"మాయా తు వయునం జ్ఞానమ్ ।"

ఇత్యాది అభియుక్తుల వచనము వలన, మాయ అనిన, జ్ఞానమనియే అర్థము. ఆత్మమాయ అనగా ఆత్మ సంకల్పము. కావున, భగవంతుడు ఆత్మ సంకల్పము చేతనే తన అపహతపాప్మత్వాది ఐశ్వర్యస్వభావమును వీడకయే దేవ, మనుష్యాది రూపములతో ప్రతీతుడగును.

"అజాయమానో బహుధా విజాయతే"

ఈ శ్రుతియొక్క అభిప్రాయము గూడా భగవంతుడు అన్యపురుష సాధారణమైన జన్మ లేనివాడయ్యు, స్వసంకల్పముచే, దేవాది రూపముతో జాయమానుడగుచుండును.

శ్రీ నీలకంఠుడు ఇట్లు నుడువును—

"అజోఽపి సన్ అవ్యయాత్మా"

అను శ్లోకము చేత దేహవిశిష్టుడైన పరమాత్మకే అజత్వము, అవ్యయత్వము చెప్పబడెను. దేహాదిరహితుడైన కేవలాత్మకు అజత్వము, అవ్యయత్వము "నత్వేవాహం జాతు నాసం" ఇత్యాది శ్లోకముల చేత పూర్వమే చెప్పబడినది. "భూతానా మీశ్వరోఽపి సన్" అనెడి వచనముచేత దేహవిశిష్టుడైన పరమేశ్వరునికే ఈశ్వరత్వము విస్పష్టము చేయబడినది. అన్యథా, దేహాదులచేత నికృష్టులమైన అస్మదాదులకు గూడా ఈశ్వరత్వము "తత్త్వమసి" మున్నగు వచనముల చేత స్పష్టమే. ఆదిత్యాంతర్యామియైన పరమేశ్వరుడు హిరణ్యశ్మశ్రుత్వాది విశిష్టమైన దేహము, జన్మ, మరణము కలదని ఎవరును చెప్పజాలరు. ఏలన, ఫలముయొక్క పరాకాష్ఠ హిరణ్మ

గర్భదేహప్రాప్తియే. హిరణ్యశ్మశ్రుత్వాది విశిష్టమైన స్వరూప మైనచో, అకర్మజ మగుటవలన (కర్మవలనపుట్టినది కాకపోవుట వలన) నిత్యమే అయి ఉన్నది.

"పురుషో హ వై నారాయణోఽకామయత అత్యతిష్ఠేయం సర్వాణి భూతాని । అహమేవేదం సర్వం స్యామ్ ఇతి స ఏతం పురుషమేధం పంచరాత్రం యజ్ఞక్రతు మపశ్యత్ ॥"

ఇత్యాది శతపథ బ్రాహ్మణ వచనముల వలన పంచరాత్రాఖ్యకర్మ విశేషఫలమే నారాయణుని సర్వభూతాతిక్రమణలక్షణమైన ఈశ్వర త్వము అని కొందఱు చెప్పుచున్నారు. కాని, ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఏలయన, ఇచట, 'నారాయణ' శబ్దము చేత హిరణ్యగర్భుడే వివక్షితుడు. స్వభావము చేతనే పూర్ణకాముడైన పరమేశ్వరునియందు ఇచ్ఛ ఉదయించజాలదు. "సోఽకామయత" ఇత్యాది వచనముల వలన పరమేశ్వరునియందు. గూడా కోరిక ప్రసిద్ధము. కాని,ఇట్లు చెప్పుట సరి కాదు. ఏలన,

"ఆప్తకామస్య కా స్పృహా ?"

"లోకవత్తు లీలాకైవల్యమ్ ।"

ఇత్యాది శ్రుతులచేత సూత్రములచేత, నిష్కాముడైన పరమేశ్వరుని యందు గూడా లీలచేతనే అనంత బ్రహ్మాండసృష్టి చెప్పబడినది. కావున, భగవంతుని శరీరము కర్మఫలము కాదు. కావుననే భౌతికము కూడా కాదు. ఏలన, విరాట్, సూత్రాత్మకంటె అతిరిక్తమైన భౌతిక శరీర మన్నది ఉండదు.అయిన, భగవద్విగ్రహమునకు ఉపాదాన మేది ? అను శంక ఉదయించవచ్చును. అవిద్య, ఉపాదాన మని చెప్ప జనదు. ఏలన, స్వప్రకాశుడు, జ్ఞానస్వరూపుడును అయిన పరమాత్మయందు అవిద్య ఉండుట సంభవము కాదు. జీవుని అవిద్య, భగవచ్ఛరీరమునకు ఉపాదాన మనియు చెప్ప జనదు. ఏలన,ఇట్టి స్థితిలో భగవచ్ఛరీరము శుక్తి రజతాదుల వలె కల్పితమే

అని చెప్పవలసివచ్చును. శుద్ధ చైతన్యమే భగవంతుని శరీరము అని గూడా చెప్పవలనుపడదు. ఏలన, బోధ(జ్ఞానము), చైతన్యము సాకారములుగా ప్రసిద్ధములు కావు. ఏదోవిధముగా చైతన్యమే భగవంతుని శరీరమని అంగీకరించినచో, చైతన్యము వలెనే భగవద్విగ్రహము కూడా అతీంద్రియ మగును. ఇట్టి స్థితిలో భగవద్విగ్రహమునకు ఉపాదానమేది ? అను ప్రశ్న ఉండనే ఉండును.

దీనికి సమాధానము నీలకంఠపండితుడు ఇట్లు చెప్పెను– 'భగవంతుడు స్వీయ ప్రకృతిని ఆశ్రయించి, ఆత్మమాయచేత ఆవిర్భూతుడగును. జీవాత్మ, అనాత్మభూత, తేజోబన్నాత్మిక (అగ్ని, జల, పృథివ్యాత్మిక), లేక పంచభూతాత్మికయైన ప్రకృతి యొక్క సహాయముతో జన్మించును. భగవంతుడు ప్రత్యక్చైతన్యాభిన్నమైన స్వరూపసాహాయ్యము గైకొనియే అనగా, 'మఱొక ఉపాదానమును అపేక్షించకయే స్వమాయచేత దేవ, మనుష్యాది రూపముతో అభివ్యక్తమగును. ఒకానొక మాయావి (ఐంద్రజాలికుడు) తన స్థానమునుండి అప్రచ్యుత స్వభావుడై ఉండియే అదృశ్యుడై, స్థూల,సూక్ష్మ భూతముల సహాయమును గ్రహించకయే కేవల మాయతోసూత్రమార్గము ద్వారా ఆకాశముపైకి ఎగబ్రాకుచు తనవంటివాడే అయిన మఱొక ఐంద్రజాలికుని, సృష్టించును. సరిగా, అట్లే కూటస్థుడు, చిన్మయుడును అయిన భగవంతుడు తన మాయ చేత చిన్మయ శరీరమును సృష్టించును. సూత్రారోహణమువలె బాల్య, యౌవనాది దశలను ప్రదర్శించును. ఐంద్రజాలికునికి, భగవంతునికి గల భేద మేమనిన, ఐంద్రజాలికుడు తన ఇంద్రజాలమును ఉపసంహరించుచు, మఱొక ఐంద్రజాలికుని మాయనుగూడా ఉపసంహారము చేయును. భగవంతుడు మాయను, విగ్రహమును రెంటిని ఉపసంహారము చేయుడు. ఈ దృష్టితోనే, హిరణ్యశ్మశ్రుత్వాది విశిష్టమైన చైతన్యమును–

"అస్త స్తద్ధర్మోపదేశాత్"

అను సూత్రముచేత వియదాదులకు (ఆకాశాదులకు) ఉపాదానము సర్వేశ్వరుడు అని చెప్పబడెను. కావుననే మఱొక స్థలమున గూడా

"నిత్యైవ సా జగన్మూర్తిః"

ఇత్యాది వచనములచేత భగవన్మూర్తి, నిత్యుడని చెప్పబడెను.

"దేవానాం కార్యసిద్ధ్యర్థ మావిర్భవతి సా యదా ।
ఉత్పన్నేతి తదా లోకే సా నిత్యాఽప్యభిధీయతే ॥"

ఇత్యాది వచనములచేత నిత్యభగవన్మూర్తి ప్రయోజననిమిత్తమైన ప్రాదుర్భావమే, 'ఉత్పత్తి' శబ్దముచే వ్యపదేశించబడినది.

శ్రీశంకరభగవత్పాదులు ఇట్లు వచింతురు— 'అజుడు, జన్మ రహితుడు, అవ్యయాత్మ, అక్షీణ జ్ఞానశక్తి స్వభావుడు, బ్రహ్మాది స్తంబపర్యంతము సమస్తభూతములకు ఈశ్వరుడును అయిగూడా భగవంతుడు (ఎవరి వశమున సమస్త జగత్తు ఉన్నదో, ఎవరివలన, ప్రాణి, మోహితుడై వాని అంతరాత్మ, ప్రత్యక్ చైతన్యాభిన్నమైన వాసుదేవుని ఎఱుంగదో) ఆ తన వైష్ణవీమాయను స్వవశము చేసికొని, ఆత్మమాయచేత దేహవంతుడుగాను, జన్మించినవాడుగాను ప్రతీతుడగును.'

"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్ ॥"

అనగా, ఎపుడెపుడు ప్రాణుల అభ్యుదయమునకు, నిఃశ్రేయసమునకు సాధనభూతము, వర్ణాశ్రమాది లక్షణమును అయిన ధర్మమునకు గ్లాని కలుగునో, అధర్మమునకు అభ్యుత్థానము కలుగునో, ఆ సమయములందు నేను నా ఆత్మను సృజించుదును. సన్మార్గస్థులైన సాధువుల రక్షణముకొఱకు పాపకర్ములైన ప్రాణుల వినాశము

కొఱకును, ధర్మమును చక్కగా స్థాపించుటకును నేను భిన్న భిన్న యుగములందు అవతరించుదును.

ఈ విషయమున, శ్రీమద్రామానుజాచార్యులు ఇట్లు చెప్పుదురు- 'ఏ ధర్మాత్ములైన వైష్ణవాగ్రగణ్యులు నన్నుసమాశ్రయించుటయందు ప్రవృత్తులగుదురో, వాక్కు, మనస్సులకంటె నా నామ, కర్మస్వరూపములు అతీతములగుటచే నా దర్శనము లేక, తమ ధారణపోషణములకు సైతము సుఖమును పొందక, అణుమాత్రమైన కాలమును గూడా కల్పసహస్రములుగా భావింతురో, ఎవరి శరీరములు శిథిలప్రాయము లగునో, వారికి నా స్వరూపమును, చేష్టితములను (కర్మలను), దర్శనమును, ఆలాపమును న్నగువానిని ప్రదానము చేసి, వారి పరిత్రాణమునకై వారికి వ్యతిరేకులైనవారి వినాశనమునకై స్వస్వరూపమును ప్రదర్శించుట ద్వారా క్షీణ వైదిక ధర్మమును స్థాపించుటకై దేవ, మనుష్యాది రూపములో భగవంతుడు అవతరించును.'

"జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥"

అనగా, హే అర్జున ! దివ్యము, అలౌకికము, మాయారూపమును అయిన నా జన్మను, సాధుపరిత్రాణాదికర్మను తత్త్వతః, తెలిసినవాడు, ఈ దేహమును వీడి, నన్ను జేరును, మఱల జన్మించడు అని భావము.

శ్రీమద్రామానుజాచార్యులు ఈ శ్లోకభావమును ఇట్లు వివరింతురు- 'ఓ అర్జునా ! నా జన్మ, కర్మలు మూలభూతయు, త్రిగుణాత్మకయును అయిన ప్రకృతియొక్క సంసర్గమువలన సంభవించినవి కావు. నా జన్మ, సర్వేశ్వరత్వ, సర్వజ్ఞత్వ, సత్యసంకల్పత్వాది సమస్త కళ్యాణగుణయుక్తమైనవి. సాధుపరిత్రాణము, మత్సమాశ్రయణమే ఏకైక ముఖ్య ప్రయోజనముగా గల నా దివ్య, అలౌకిక జన్మను,

చేష్టితములను తత్త్వతః, యథాతథముగా తెలిసినవాడు ప్రస్తుత దేహమును పరిత్యజించి, పునః జన్మ గ్రహణము చేయడు, నన్నే చేరును. నా అలౌకిక జన్మ, చేష్టితముల యథార్థ జ్ఞానము వలన నా సమాశ్రయమును వ్యతిరేకించువారందఱి పాపములు నష్టమగును. అట్టి ప్రాణి, నన్ను సర్వదా పొందును.

పూర్వోక్త శ్లోకముల వ్యాఖ్యానముల వలన భగవంతుని సగుణ, సాకార, సచ్చిదానంద స్వరూపము సిద్ధించునని స్పష్టమగుచున్నది. ప్రపంచము సత్యము అని వాదించువారు భగవంతుని సాకార విగ్రహమును, తల్లీలాశక్తిని అంగీకరించుచున్నవారు కొందఱు దివ్య అచిత్ తత్త్వము వలన, భగవంతుని విగ్రహము ఏర్పడునని అంగీకరింతురు. మఱియు, అనేకులు చిదానంద తత్త్వమే సాకార విగ్రహము కలదై వ్యక్తమగునని అంగీకరింతురు. అద్వైత వేదాంతానుసారము, ఒక పక్షమున విశుద్ధ సత్త్వముచేతనే భగవంతుని విగ్రహము రూపొందును. దానినే మాయ అని అనవచ్చును. ఈ దృష్టితోనే భగవంతుని విగ్రహము మాయామయమని చెప్పబడును. భాగవతము 'హే ప్రభో, నీవు ప్రాణుల క్షేమమునకై విశుద్ధ సత్త్వమును సమాశ్రయింతువు' అని చెప్పుచున్నది-

"సత్త్వం విశుద్ధం శ్రయతే భవాన్ స్థితౌ"

నీవు విశుద్ధ సత్త్వమయమైన విగ్రహమును ధరించువాడవు కాక పోయినచో, అజ్ఞాననాశకమైన అపరోక్ష జ్ఞానమే కలుగదు అని గూడా చెప్పబడెను. సర్వేంద్రియములకు, అంతఃకరణవృత్తులకు భాసకమైన ఆత్మజ్ఞానము కలిగినను, నిష్ప్రపంచ, నిరుపద్రవ, సర్వభేదవివర్జిత, స్వప్రకాశ, నిరావరణ తత్త్వము యొక్క అపరోక్ష సాక్షాత్కార మగుట దుర్లభ మగును. కాని, నీ సగుణ, సాకార విగ్రహధ్యానము చేయుటచేత ఏకాగ్రత, నిర్వృత్తికత

(వృత్తిరాహిత్యము) కలుగును. దానివలన, ద్రష్టృ-దర్శన-దృశ్య భేదశూన్యము సర్వావభాసకము, అఖండమును అయిన అద్వైత తత్త్వజ్ఞానము కలుగును-

"సత్త్వం న చేత్ ధాతరిదం నిజం భవేద్విజ్ఞాన
మజ్ఞానభిదాఽపమార్జనమ్ ।
గుణప్రకాశై రనుమీయతే భవాన్ ప్రకాశతే యేన చ
యస్య వా గుణః ॥"

'భగవంతుని విగ్రహము భగవదిచ్ఛామయము'- అను పక్షమందు గూడా విశుద్ధసత్త్వమే ఇచ్ఛ-

"అస్యాపి దేవవపుషో మదనుగ్రహస్య స్వేచ్ఛామయస్య
న తు భూతమయస్య కోఽపి ।
నేశేమహిత్వవసితుం మనసాన్తరేణ సాక్షా త్తవైవ
కిముతాత్మసుఖానుభూతేః ॥"

భక్తుని భావనయే భగవంతుడని కొందఱు చెప్పుదురు. భక్తుని భావన, అత్యంత ప్రధానము. భక్తుని భావముననుసరించి భగవంతుడు తన రూపమును రూపొందించుకొనును. కేవల భావనయే భగవంతుడుకాడు-

"యద్యద్ధియాత ఉరుగాయ విభావయన్తి తత్తద్వపుః
ప్రణయసే సదనుగ్రహాయ ।"

అనగా భక్తులు భక్తియుక్తమైన ప్రజ్ఞచే ఏ రూపమును భావన చేయుదురో, నీవు ఆ యా స్వరూపమునే ధరించుదువు. విశుద్ధ సత్త్వము, లీలాశక్తియొక్క సంబంధముచేత నిర్వికారుడు, నిరాకారుడునయిన పరమాత్మయే సాకారుడై ప్రకటమగును. ఉదకము మంచుగా అగుటకు శైత్యము నిమిత్తమైనట్లే నిరాకారుడు, నిర్వికారుడును అయిన పరమాత్మ, సాకారుడగుటకు విశుద్ధ సత్త్వము

నిమిత్త మగును. రెండవ పక్షముయొక్క సిద్ధాంతమే మనిన, కూటస్థుడు, నిర్వికారుడును అయిన శుద్ధ పరమాత్మ యే దేహవంతుడుగా ప్రతీతుడగును. వస్తుతః, దేహ-దేహి భావము లేనే లేదు. శ్రీకృష్ణచంద్రుని జన్మ, కర్మ, సమస్తము దివ్యము. అనగా, సమస్తము విశుద్ధ బ్రహ్మ యే. బ్రహ్మ కంటె అతిరిక్తమైన ఏ వస్తువును లేదు. భగవంతుని అచింత్య శక్తి, అన్యాన్య ప్రాపంచిక శక్తుల కంటె విలక్షణము, పరమశుద్ధమును అయినను, అనిర్వచనీయతాంశమందు సమానమే. ఈ విధముగా అద్వైత సిద్ధాంత రక్షణముతోబాటు, భగవంతుని సగుణ, సాకార స్వరూపము గూడా సిద్ధించును. సర్వదా భగవంతుని అవతారవిషయమున, అవాంతర మతభేదములు ఉన్నను, ఏ సనాతన ధర్మమును అవలంబించువానికైనను వివాదము లేదు. భగవాన్ భాష్యకార శ్రీశంకరాచార్యులు తమ "ప్రబోధసుధాకరము" అను గ్రంథమందు మహోత్సాహముతో సగుణ, నిర్గుణ స్వరూపముల ఐక్యమును ప్రతిపాదించి యున్నారు. ఆ ఆచార్యపాదులే బదరీనారాయణ, హృషీకేశాది అనేక మూర్తులను ప్రతిష్ఠించిరి. అద్వైత సంప్రదాయమునకు చెందిన ఆచార్యులనేకులు సగుణ,సాకార భగవంతుని స్వరూపమును సమర్థించిరి. కావున, 'నిరాకార బ్రహ్మ, సాకారుడు కాజాల'డన్న వచనము ఏవిధముగాను సంగతము కాదు.



# 3. భగవదవతార ప్రయోజనము

సుధా తరంగిణి

భగవంతుడు అవతారమును గ్రహించుటకు అనేక ప్రయోజనములు కలవు— ధర్మగ్లాని, అధర్మవృద్ధి (అభ్యుత్థానము) యొక్క నివృత్తి, ధర్మసంస్థాపనము, సన్మార్గగాములైన సాధువుల రక్షణము, దుష్టసంహారము మొదలైన ఈ ప్రయోజనము లన్నియు సాక్షాత్తుగా శ్రీముఖుడైన భగవంతుడు చెప్పినవే కుంతీ మహారాణి "నిర్మలాత్ములు పరమహంసలును అయిన మహామునీంద్రులకు భక్తి యోగమును ఉపదేశించుటకై భగవంతుడు అవతరించును" అని చెప్పెను.

"తథా పరమహంసానాం మునీనా మమలాత్మనాం ।
భక్తియోగవిధానార్థం కథం పశ్యేమ హి స్త్రియః ॥"

పరమహంసల ప్రత్యక్ చైతన్యాభిన్నమైన విశుద్ధ బ్రహ్మ యొక్క అపరోక్ష సాక్షాత్కారమును భక్తియోగముద్వారా సరసము, సుశోభితమును జేసి వారిని శ్రీపరమహంసలనుగా చేయుటకై నీవు అవతరింతువు అని భావము. భగవత్ప్రేమ (భక్తి) లేక, నైష్కర్మ్య జ్ఞానము శోభించదు.

నైష్కర్మ్య మప్యచ్యుతభావవర్జితం న శోభతే జ్ఞానమలం
నిరంజనమ్ ।"

వేదాంతవేద్యుడు, అదృశ్యుడు, అగ్రాహ్యుడును అయిన భగవంతుడు తన అచింత్య, దివ్య లీలాశక్తిచేత పరమ మనోహర, సగుణ, సాకార, సచ్చిదానందఘన రూపమున వ్యక్తమై, నిర్మలాత్ములైన పరమహంసలకు భజనీయుడై, వారికి విధాయకుడగును. భగవదవతార ప్రయోజనములు అనేకములు కలవు. వాని ఇయత్తా (ఇంతయనిపరిమాణ) నిర్ణయమును ఎవరును చేయజాలరు. ఈ ప్రయోజనములకు అనేక ఉద్దేశ్యములు కలవు. కాని, ఇచట, ఒకటి, రెండు ప్రయోజనములను గుఱించియే ఆలోచించవలసియున్నది.

"నృణాం నిఃశ్రేయసార్థాయ వ్యక్తిర్భగవతః ప్రభోః।
అవ్యయస్యాప్రమేయస్య నిర్గుణస్య గుణాత్మనః॥"

అవ్యయుడు, అప్రమేయుడు, నిరాకారుడు, నిర్వికారుడు, నిర్గుణుడు, గుణనిధియు నయిన భగవంతుడు,అనంతకోటి కందర్ప (మన్మథ) మదమోచనుడైన శ్రీకృష్ణచంద్ర పరమానందకంద రూపముతో జనసాధారణముయొక్క కళ్యాణార్థమై అభివ్యక్తుడగును. ఈ శ్లోకమందు 'నృణామ్' శబ్దమునకు 'నరమాత్రాభిమానియైన' అని అర్థము. ఎట్లనిన, 'న కర్మ లిప్యతే నరే' ఈ మంత్రమును వ్యాఖ్యానించుచు, శ్రీమచ్ఛంకరభగవత్పాదులు ఈ అర్థమునే చెప్పియున్నారు. విశుద్ధ, సచ్చిదానందఘనమైన పరబ్రహ్మాత్మను గుర్తించినవాడు నర, నాగ, దేవ, గంధర్వాది కార్యకారణసంఘాతముల కంటె భిన్నమైన అంతరాత్మను దర్శించును. అతడు నరమాత్రాభిమాని కాడు. స్వధర్మానుష్ఠాన, ఉపాసన, శ్రవణ, నిదిధ్యాసనాదుల ద్వారా తమ శుద్ధ స్వరూపసాక్షాత్కారము పొందినవారైనచోవారునిఃశ్రేయసరూపులే. కాని,స్వస్వరూపసాక్షాత్కారమందు అసమర్థులైనవారినిఃశ్రేయసము నకై భగవంతుడు శ్రీకృష్ణరూపముతో ఆవిర్భవించెను. కావుననే అదృశ్య, అగ్రాహ్య, అలక్షణ, అచింత్య, అవ్యపదేశ్యమైన బ్రహ్మ సాక్షాత్కారమందు, లేక ఉపాసనమందు చిత్తమే లగ్నముకాని, అత్యంత బహిర్ముఖులైన ప్రాణులకు గూడా భగవంతుని మనోహర స్వరూపమందు చిత్తము నివిష్టము కాగలదు. కావుననే కామ, క్రోధ, భయ, స్నేహముల చేతను, లేక ఐక్యభావము చేతను, భగవంతుని యందు ఏదో కొలదిగా మనస్సును ప్రవేశింపజేసి, ప్రాణి, సంసారబంధమునుండి విముక్తుడై భగవద్రూపుడగును.

"కామం క్రోధం భయం స్నేహమైక్యం సౌహృదమేవ చ।
నిత్యం హరౌ విదధతో యాన్తి తన్మయతాం హి తే॥"

కంసుడు భయముచేతను, శిశుపాలుడు ద్వేషముచేతను, కుబ్జ, కామముచేతను శ్రీకృష్ణునిలో లీనమయిరి. చంపవలయు నను కోరికతో 'పూతన' కాలకూట విషలిప్తమైన స్తనమును అందించియు (స్తన్యమును స్రావించియు) కృతకృత్యురాలైనది. కొంతమంది వ్రజాంగనలు పూర్ణతమ పురుషోత్తముడైన ఆ భగవంతునే జార బుద్ధితో చింతన మొనర్చి, తల్లీన లయిరి. ఆ వ్రజాంగనలు తత్త్వ సాక్షాత్కారము లేకయే శ్రీకృష్ణుడు జారుడని తలంచుచునే బ్రహ్మయందు లీనమయిరని చెప్పవచ్చును. అపుడైనచో, వశ్యజ్ఞానాకతయే ఉండదు. ఇట్టి స్థితిలో

"నైన మవిదితో దేవో భునక్తి।"

"ఋతే జ్ఞానాత్ న ముక్తిః।"

'భగవంతుడు ప్రత్యక్ చైతన్యరూపముతో సాక్షాత్కరించక, సాధకుని, రక్షించడు. జ్ఞానవిరహితముగా ముక్తి లభించదు' అను శ్రుతివచనములు విరోధించును. వస్తుతః, శ్రీకృష్ణుడు బ్రహ్మయే అనిచెప్పినచో,ఆయనకుజ్ఞానాపేక్షఉండదు. తెలిసియో, తెలియకయో విషయమును ఏ కొలదియైనను సేవించుటచేత గూడా అది, ఫలము నిచ్చును. అమృతము గూడా జ్ఞాన, అజ్ఞానములందు సర్వథా తన ఫలమును తప్పక ఇచ్చియే తీరును. అట్లే శ్రీకృష్ణుడు బ్రహ్మ. బ్రహ్మబుద్ధిచేతగాని, జారబుద్ధిచేతగాని, ఆయనను సేవించినచో అవశ్యము దానికి ఫలము లభించును.

కాని, దీనిపైన ఇట్లు చెప్పబడును— 'వస్తుదృష్టితో సమస్త విశ్వమే బ్రహ్మ. అపుడు సర్వప్రాణులకు పతి, పుత్ర, శత్రు, మిత్రులు బ్రహ్మస్వరూపులే అగుదురు. వారిని చింతించుటవలన గూడా ముక్తి లభించవలయును.' కావున, ఈ బ్రహ్మాకారవృత్తి చేత మూలాజ్ఞానము నష్టమైనపుడు, నిరావరణమైన బ్రహ్మ సాక్షాత్కారమే మోక్షమునకు కారణ మగును. నిరావరణ బ్రహ్మానుభవము

కలుగక, పతి. పుత్రాది ప్రేమ సావరణము, భిన్న భిన్న ప్రపంచాకారములోనుండి వివర్తితమైన బ్రహ్మకు సంబంధించిన ప్రీతి మోక్షమునకు హేతువు కాజాలదు.

దీనిపైన అభిజ్ఞులు చెప్పునదేమనిన, నిరావరణ బ్రహ్మను భవమే మోక్షకారణము, దానికై బ్రహ్మకారవృత్తి, లేక బ్రహ్మ విజ్ఞానము అపేక్షితమనుట ఉచితమే. కాని, శ్రీకృష్ణుడు లౌకిక పతి, పుత్రాదులవలె సావరణ బ్రహ్మ, లేక వివర్తిత బ్రహ్మ కాడు. కాని, ఆయన నిర్గుణ, నిరావరణ, శుద్ధ బ్రహ్మయే. కావున, ఆయన యొక్క అనుభవము, మనస్సునందు ఆయనపట్ల, ఆసక్తి తప్పక ముక్తికి మూలము.

"ఋతే జ్ఞానా న్న ముక్తిః"

ఇత్యాది శ్రుతులు సావరణ బ్రహ్మకు సంబంధము గల స్థానముల యందు సమన్వయము నొందును. శ్రీకృష్ణుడు నిరావరణ బ్రహ్మ. కావున, ఇచట విషబుద్ధితో త్రాగినను అమృతము అమృతత్వము నొసగినట్లుగానే జారబుద్ధి, లేక శత్రుబుద్ధితో గూడా నిరావరణ మైన శ్రీకృష్ణ సేవ, మోక్షమునకు మూల ముగును.

చింతామణియందు దీప మన్న బుద్ధితో ప్రవృత్తి కలిగినను, చింతామణికే లాభము కలుగును. ఆ రీతిగానే నిరావరణ బ్రహ్మ యైన శ్రీకృష్ణునియందు శత్రుబుద్ధితో, లేక జారబుద్ధితో గూడా ప్రవృత్తి కలిగినపుడు, ప్రవర్తించినవారికి శుద్ధబ్రహ్మ ప్రాప్తియే కలుగును, జారుడు గాని, శత్రువు గాని లభించడు. శుద్ధ బ్రహ్మ, కూటస్థుడు, అదృశ్యుడు. కావున, విశుద్ధ సత్త్వ, దివ్యలీలాశక్తి సంబంధము వలననే ఆ శుద్ధ బ్రహ్మకు శ్రీకృష్ణరూపములో అభి వ్యక్తిని అంగీకరించవలసి వచ్చును అని చెప్పవచ్చును. ఇట్టి స్థితిలో శక్తియొక్క వ్యవధానము ఉండుటచేత ఆవరణమును అవశ్యము అంగీకరించవలసియుండును. అయిన, శ్రీకృష్ణుడు

నిర్గుణుడు, నివారణ స్వరూపుడు ఏవిధముగా అయ్యెను ? దీనికి సమాధానమేమనిన, మేఘాదుల సంబంధమందు సూర్యస్వరూపము ఆవృతమైనటులనే రాజస, తామస ఉపాధుల సంబంధముచేత బ్రహ్మస్వరూపము ఆవృతమగును. ప్రపంచ స్వరూపముగా వివర్తమునొందిన బ్రహ్మ, రాజస, తామసోపాధుల సంసర్గముచేత ఆవృతమై ఉండును. కాని, విశుద్ధ సత్త్వ, దివ్యలీలాశక్తి, అత్యంత స్వచ్ఛము. పరిశుద్ధమైన కాచదూరవీక్షణయంత్రము, లేక కళ్ళజోడు (ఉపనేత్రము) యొక్క సంబంధముచేత సూర్యస్వరూపము ఆవృతము కాదు. కాని, నిరావరణుడైన సూర్యునికంటె, సూర్యుని దర్శనము స్పష్టముగా కలుగును. అట్లే లీలాశక్తి సంబంధము వలన, శ్రీకృష్ణరూపములో అభివ్యక్తుడైన పరబ్రహ్మ, ఆవృతుడు కాడు. కాని, నిరావరణ బ్రహ్మకంటె గూడా సుందర, మధుర, మనోహరరూపుడై అభివ్యక్తుడగును. శీతలత్వ సంబంధముచేత మంచుగా అయిన జలము ఆవరణరహితమే అని భావించబడును. ఆరీతిగానే శ్రీకృష్ణరూవములో వ్యక్తమయిన బ్రహ్మ, గుణకృతమైన ఆవరణమునుండియు, ప్రభావమునుండియు వినిర్ముక్తుడగుట వలన, నిర్గుణుడు, ఆవరణరహితుడని తలంచబడును. ఈ అభిప్రాయముతోనే-

"హరిర్హి నిర్గుణః సాక్షాత్"

ఇత్యాది వచనములు ప్రవృత్తములైనవి. నిర్గుణ, గుణాగార, అవ్యయ, అప్రమేయ, పరబ్రహ్మయే శ్రీకృష్ణరూపములో ప్రాణుల కళ్యాణార్థమై అభివ్యక్తమయ్యెను. ఆయనయొక్క మంగళమయ శరీరమందలి సౌందర్య, సారస్య, మాధుర్యములు ప్రాణుల మనస్సును హఠాత్తుగా ఆకర్షించును. పాషాణ, వజ్ర సదృశమైన హృదయమును ద్రవీభవింపజేసి నవనీతమువలె కోమలముగా, సరసముగా చేయును. సౌందర్య-మాధుర్య-సౌరస్య-

సౌగంధ్యసుధాజలనిధి అయిన శ్రీకృష్ణుని శోభాయుక్తమైన శరీర మందు ఇంద్రియములకు, మనస్సునకు స్వాభావికమైన ఆసక్తి కలుగును. అమృతమయ ముఖచంద్రునియందు మనస్సునకు, నేత్రములకు ఎంతఆసక్తి కలుగుననిన, అవి అచటనుండి మఱలి వచ్చుట గూడా విస్మరించును. ఏ మనస్సు, విషయములనుండి ఒక్క క్షణకాలమైనను వేఱు కాజాలదో, ఆ మనస్సే భగవంతుని యందు ఆసక్తమై విషయములను మఱచిపోవును. ఇక, జ్ఞాన, విజ్ఞానాపేక్షితములైన దివ్య గుణములన్నియు తత్సేవకై వ్యగ్రము లగును. ఏతాదృశ పరమ మధుర మనోహరుడైన భగవంతుని యందు ప్రీతి, ఆసక్తి కలుగుట స్వాభావికమే. ప్రీతి కలుగక పోయినను, కామ, ద్వేష, ఈర్ష్యా, క్రోధాదులు కలిగినను, ప్రాణులకు, క్షేమము కలుగును.జారబుద్ధి మఱొక స్థలమున ఘోర నరకమునకు మూలమగును. ఆ జారబుద్ధియే భగవద్విషయమున పరమ కళ్యాణహేతువగును. సువర్ణ ముద్రికను, దివ్య రత్నమును జోడించుటయందు లక్కయొక్క విలువ పెరిగినట్లే, భావుకుడయిన భక్తుడు, భగవంతుడు– వీరిమధ్య సంబంధమును సుస్థిర మొనర్చు టకు జారబుద్ధి గూడా అతి మూల్యము కలదగును. అన్యత్ర, 'జార'శబ్దమునకు–

"జరయతి సర్వాన్ గుణాన్ ధర్మ స్వర్గాపవర్గాన్ ఇతి జారః।"

ఈ వ్యుత్పత్తి ననుసరించి 'జారు'డనగా సమస్త గుణములను, లేక ధర్మమును, స్వర్గమును, అపవర్గాదులను నాశనము చేయువాడు అని అర్థము. కాని, ఇచట–

"జరయతి అవిద్యాం తత్కార్యాత్మకం బంధ మవిద్యా
గ్రంథిం కామాన్ వా ఇతి జారః"

అను వ్యుత్పత్తిని అనుసరించి ఎవరు అవిద్యాగ్రంథిని దగ్ధము చేయునో, ఎవరు అవిద్యను, తత్కార్యాత్మకమైన బంధమును

నాశనము చేయునో, అథవా, సమస్త కామవాసనలను దగ్ధ మొనర్చి నాశనము చేయునో, అట్టి పరమాత్మయే 'జారుడు' అని అర్థము.

ఈవిధముగా అతి సాధారణులైన, అతి ఉల్బణులైన (గ్రంథి యుక్తులైన) ప్రాణుల సద్గతికొఱకే శ్రీభగవదవతారము సంభవించును. భగవంతుడు తనవే అయిన సౌశీల్య, సౌందర్య, వాత్సల్యాది గుణగణముల సాఫల్యమునకై ఈ మర్త్యలోకమందు అవతరించును అని అభిజ్ఞుల కథనము. ఇట్లు, అవతరించకపోయినచో, ఆయనకు గల పతితపావనత్వాది గుణగణములు వ్యర్థములగును, వంధ్యము లగును (వట్టిపోవును). తన అనంతత్వమును, అనంత కోటి బ్రహ్మాండ నాయకత్వమును విస్తరించి, వానరములతో కలసి మెలసి, ఆత్మీయతతో వ్యవహరించుటయే అద్భుత సౌశీల్యము.

గృధ్రరాజును (జటాయువును) తన ఒడిలోనికి తీసికొని, తన ముఖారవిందముచేత ఆ జటావుయొక్క అవయవములను మార్జనము చేయుట, నయనాశ్రువులతో అభిషేకము చేయుట "తాతా, తాతా" అను మధుర వచనామృతముచేత సంతుష్టుని గావించి, సురేంద్రాది స్పృహణీయమైన దివ్యగతి నొసగుట, మధుర ముఖచంద్రదర్శన మొసగుట, విభీషణ, సుగ్రీవాదులతో మైత్రి సల్పుట, హనుమంతునికి ఋణి యగుట ఆయనయందు గల అద్భుత సౌశీల్యము.

"ఏకైకస్యోపకారస్య ప్రాణాన్ దాస్యామి తే కపే।
శేషస్యేహోపకారాణాం భవామ ఋణినో వయమ్॥"

ఈ వచనములు రామసౌశీల్యమును చాటి చెప్పుచున్నవి.

ఈ కార్యములు సాకేతలోక, గోలోకములందును, నిరాకార, నిర్గుణరూపమునందును అసంభవములు. శ్రీరామునిచే పరాజితుడై అతని గుల్ముమగుట, వ్రజాంగనలను వెన్నతో నిండిన కుండలపైన

నాట్యము చేయించుట, శ్రుతివచనములకు, మునీంద్రులకు అగోచరుడై గూడా చిత్రకూటమందలి కోల, భిల్ల వచనములను పెద్ద ఆసక్తిగా వినుట, ఎవరి ఛాయాస్పర్శ తగిలినను, మార్జనము, అపేక్షితమగునో ఆ నిషాదునితో సఖ్యము చేయుట, మహాపతితురాలిని జగత్పావనగా ఒనర్చుట మొదలగు కార్యములు అవతారమును గ్రహించక జరుగుట అసంభవము. కావున, ప్రభువు, తన ప్రయోజనము నిమిత్తమే ఈ గుణములను సంపాదించుటకై. తిరుగులేని సాఫల్యమును సంపాదించుటకై మనమధ్య అవతరించును. శ్రీజగన్నాథ పండితరాయలు గంగానదితో ఇట్లనెను– "హే అంబ! నీ మనస్సునందు అనేక దినములనుండి ఎవరిని తరింపజేయుటకు ఏ తీర్థము గాని, తపస్సు గాని, జపముగాని, వ్రతము గాని, ఏ దేవత గాని సమర్థులు కారో, అట్టి ఉత్కటమైన పతితుని, పాతకిని నేను పావనమొనర్తునను ఇచ్ఛ కలదు. ఓ తల్లీ! నేను ఆ నీ కోరికను పూర్తి చేయుటకై వచ్చితిని. నావంటి పాతకి మహాపతితుడు మఱొకడు ఎచట లభించును? అమ్మా! ఇదిగో, నన్ను తరింపజేసి, నీ అభిలాషను పూర్తి చేసికొనుము." సరిగా, మనవంటి పతితులతోను, దీనులతోను నిండియున్న ఈ మర్త్య లోకమున, ప్రభువైన భగవంతుడు దయతో వచ్చియుండనిచో, కనీసము ఆయనయందు గల దీనవత్సలత్వము, పతితపావనత్వము మొదలైన గుణములు వ్యర్థములే అగును. కావున, ఆ సమస్త గుణముల సాఫల్యమునకై భగవంతుడు అవతరించును. దీన వాత్సల్యము, పతిత పావనత్వము, సౌశీల్యము, ఔదార్యము కారుణ్యసింధుత్వము మొదలగు గుణములచేతనే ప్రేరేపించబడి, ప్రభువు పతితుల కళ్యాణాభిలాషతో పై నుండి క్రిందికి అవతరించును. ఇది సత్యము. కావున, నిజముగా ఎవరును నిరాశోపహతులు కాజనదు.



# 4. జ్ఞానము, భక్తి

## సుధాతరంగిణి

జ్ఞానము గొప్పదా, భక్తి గొప్పదా? అని, ప్రజలు మహా కుతూహలముతో ప్రశ్నింతురు. కొందఱు, జ్ఞానమహిమను చూపుచు భక్తియొక్క అపకర్షను చూపుదురు. మఱి కొందఱు, భక్తిమహిమ ముందు జ్ఞానము అపకృష్టమని ప్రతిష్ఠాపింతురు. ఒకరు, భక్తిని, జ్ఞానసాధన మని చెప్పిన, మఱొకరు జ్ఞానము భక్తికి సాధనమని చెప్పుదురు. గోస్వామీ తులసీదాసు జ్ఞానము వలన, విశ్వాసము వలన, ప్రీతి జనించునని చెప్పిరి. ప్రీతి లేక, భక్తిభావము సుదృఢము కాదనియు చెప్పుదురు. భక్తి యన్న మణిని పొందుటకు జ్ఞాన, వైరాగ్యములు సాధనములని భావించిరి.

భక్తి లేక, జ్ఞానమును అన్వేషించువారు మందభాగ్యులు. పాలకై కామధేనువును వదలి, అర్కవృక్షమును (జిల్లేడుచెట్టును) అన్వేషించునట్టివారై విఫలు లగుదురు. శ్రీమద్భాగవతమందు గూడా ఇట్లు చెప్పబడెను–

"యేఽన్యేఽరవిన్దాక్ష! విముక్తమానిన
స్త్వయ్యస్తభావా దవిశుద్ధబుద్ధయః।
ఆరుహ్య కృచ్ఛ్రేణ పరం పదం తతః
పతన్త్యధోఽనాదృత యుష్మదంఘ్రయః॥"

అనగా, హే కమలనయన! జ్ఞానప్రభావముచేత, తమను విముక్తుల మని ఎఱింగినవారు, లేక జ్ఞానుల మని భావించువారును, కాని, నీ చరణారవిందములందలి ప్రేమచేత (భక్తిచేత) బుద్ధి, శుద్ధము కానివారు, అతికష్టముమీద, ఉన్నత పదము నొందినను, పునః

పతితు లగుదురు. ఏలన, వారు, నీ చరణకమలమును ఆదరించిన వారు కారని భావము.

> "నానువ్రజతి యో మోహాత్ వ్రజన్తం హరి మీశ్వరమ్ ।
> జ్ఞానాగ్నిదగ్ధకర్మాఽపి స భవే ద్రాక్షసాధమః॥"

అనగా, శ్రీహరి రథయాత్రలో ఎవడు మోహవశుడై ఆ శ్రీహరిని అనుసరించడో, అతడు జ్ఞానాగ్నిదగ్ధకర్ముడయ్యు, రాక్షసాధము డగును అని భావము-

> "జ్ఞానే ప్రయాస ముదపాస్య సమన్త ఏవ జీవన్తి
> సన్ముఖరితాం భవదీయ వార్తామ్ ।
> స్థానే స్థితాః శ్రుతిగతాం తను వాఙ్మనోభి ర్యే
> ప్రాయశోఽప్యసి తై స్త్రిలోక్యామ్ ॥"

అనగా, ఎవడు జ్ఞానప్రయాసను వీడి, సాధువులను సైతము ముఖరితము చేయునట్టియు, శ్రవణ కుహరములందు పొందిన భగవత్కథాలాపమును త్రికరణములతో, అనగా వాఙ్మనఃకాయములతో ప్రణామము చేయుచు, జీవనయాపనము చేయునో అతడు లోకత్రయమందు అజేయుడైన భగవంతుని, జయించును. అనగా, వాఙ్మనసాతీతుడైన భగవంతుని, తన శరీరమునకు, మనస్సునకు వశుని గావించుకొనును.

> "తథా న మాధవ తావకాః క్వచిత్ భ్రశ్యన్తి మార్గా
> త్త్వయి బద్ధసౌహృదాః ।
> త్వయాఽభిగుప్తా విచరన్తి నిర్భయా వినాయకా
> నీకప మూర్ధసు ప్రభో ॥"

అనగా, భగవంతునితో ఎవరికి సుదృఢమైన సౌహార్దము ఉండునో, అట్టి భగవద్భక్తులు, ఎన్నడును మార్గభ్రష్టులు కారు. ఇంతియే కాక, వారు భగవంతునిచే సురక్షితులై విఘ్నసేనానుల శిరస్సు

పైన, పాదవిన్యాసములు చేయుచు,నిర్భయముగా సంచరింతురని భావము.

"యా నిర్వృతి స్తనుభృతాం తవ పాదపద్మధ్యానాత్
భవజ్జన కథా శ్రవణేన వా స్యాత్ ।
సా బ్రహ్మణి స్వమహిమన్యపి నాథ మాభూత్
కిన్త్వ న్తకాసిలులితాత్ పతతాం విమానాత్ ॥"

అనగా, భక్తులకు భగవంతుని శ్రీచరణారవింద ధ్యానమందు ఆనందము (రసము) లభించును. అథవా, భగవద్భక్తుల చరిత్ర శ్రవణమువలన ఏ ఆనందము వ్యక్తమగునో,అది స్వప్రకాశకుడు, స్వమహిమస్థితుడును అయిన భగవంతునియందు గూడా వ్యక్తము కాదు. ఇక అంతకుని (యముని) ఖడ్గముచేత విలులితములైన (జారిపడిన) విమానములనుండి క్రిందికి పడిపోవువారి సుఖములు ఏమి చర్చించదగినవి ? ఇంతియేకాక, జ్ఞానము కలిగినపుడు గూడా భక్తి లేని ఆ జ్ఞానమునకు శోభ లేదు

"నైష్కర్మ్య మప్యచ్యుతభావవర్జితం న శోభతే
జ్ఞానమలం నిరంజనమ్ ।
కుతః పునః శశ్వదభద్ర మీశ్వరే న చార్పితం
కర్మ యదప్యకారణమ్ ॥"

చుక్కానిపట్టువాడు లేని ఓడవలె భగవద్భక్తి లేని జ్ఞానము శోభించదు.

జ్ఞానము, వైరాగ్యము, ధర్మము, కర్మ–ఇవి అన్నియు ప్రేమలక్షణమైన భక్తిచేతనే సుశోభితము లగును. ఆ భక్తి లేక, అన్నియు నిరర్థకములై పోవును.

దీనితోపాటు జ్ఞానోత్కర్షపక్షము గూడా ప్రసిద్ధమే అయి ఉన్నది.

"నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే ।"

అనగా, జ్ఞానముతో సమానమైన పవిత్ర వస్తువు ఏదియు లేదని భావము.

"వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ।"

సమస్తము వాసుదేవుడే అను జ్ఞానము కల మహాత్ములు అత్యంత దుర్లభులని భావము. జ్ఞానమును వదలి, మఱొక మార్గము కళ్యాణ మార్గమే కాదు. జ్ఞానము లేక, ముక్తి కలుగనేరదు.

"తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి నాన్యః పంథా
విద్యతేఽయనాయ ।"
"ఋతే జ్ఞానాత్ న ముక్తిః"
"నైన మవిదితో దేవో భునక్తి ।"

అనగా, ఈ దేవుడు ప్రాణియొక్క అంతరాత్మయై గూడా జ్ఞాన రహితుని, పాలించడు. అనగా, సర్వానర్థములనుండి విముక్తుని చేయుడు. జ్ఞాని, సాక్షాత్తుగా తన ఆత్మయే అని శ్రీకృష్ణపరమాత్మ నుడివెను-

జ్ఞానీత్వాత్మైవ మే మతమ్ ।"
"తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే ।"

అనుచు, సమస్త భక్తులకంటె, జ్ఞానియైన భక్తుని విశేషమును భగవంతుడు స్వయముగా అంగీకరించుచున్నాడు.

ధర్మముచేత వైరాగ్యము, యోగముచేత జ్ఞానము, జ్ఞానముచేత మోక్షము కలుగునని వేదములు వర్ణించుచున్నవి. భేద జ్ఞానము పోక,భగవంతుడైన రామచంద్రుడు గూడా భవజాలమును హరింపజేయ జాలడు అని గోస్వామీ తులసీదాసు గూడా జ్ఞానమే సాక్షాత్తుగా మోక్షప్రదమని చెప్పిరి.

దీనితోపాటు ద్వైతము అజ్ఞానకార్యమైనపుడు తన్నివృత్తికై

జ్ఞానము అపేక్షితమే అగును అనియు తులసీదాసు స్పష్టము చేయుచున్నారు. జ్ఞానసాధనములలో భక్తి, ఒక సాధనమని స్పష్టముగా చెప్పబడినది.

"మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ ।"

"మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే ।
స గుణాన్ సమతీత్య ఏతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥"

"యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥"

"శ్రద్ధాభక్తిధ్యాన యోగా దవేహి ।"

ఇత్యాది శ్రుతిస్మృతివచనములచేత భక్తివలననే బ్రహ్మాత్మతత్త్వ సాక్షాత్కారము కలుగునని స్పష్టము చేయబడుచున్నది.

ఈ రెండు పక్షములను గురించి సమాలోచనముచేయుటకు ముందు తెలియదగినది ఏమనిన, 'భక్తి' పదము ఎచట ప్రయోగించబడుచున్నది ? వైదికుల దృష్టిలో కర్మ, ఉపాసన, జ్ఞానము. ఈ మూడు సాధనములు ప్రాణుల శ్రేయస్సునకు మూలములు. కర్మవలన, మలనివృత్తి (దోషనివృత్తి), ఉపాసనమువలన, విక్షేప నివృత్తి, జ్ఞానము వలన ఆవరణనివృత్తి జరుగును. మలము, (దోషము), విక్షేపము, ఆవరణము- ఈ మూడు ఉపద్రవముల వలన, అంతరాత్మ ఉపద్రుతమై అనంతములైన అనర్థములను అనుభవించుచున్నది.

ఈ మూడు సాధనముల (కర్మ ఉపాసనాజ్ఞానముల) వలన, మూడు ఉపద్రవములును నివృత్తము లైనపుడు, అంతరాత్మ, శుద్ధ ప్రత్యక్చైతన్యాభిన్నమైన పరబ్రహ్మస్వరూపముతో ఉండును. ఈ పక్షమున, వేదశాస్త్రానుసారముగా దేహేంద్రియ, మనోబుద్ధి,చిత్తాహంకారములకు సంధ్యావందనము,పితృతర్పణము,

వైశ్వదేవము, అగ్నిహోత్రము, దర్శపూర్ణమాస, చాతుర్మాస్య మున్నగు శ్రౌత, స్మార్త కర్మలక్షణములైన చేష్టలే కర్మలు. సగుణము, సాకారము, సచ్చిదానందఘనము, పరబ్రహ్మకారా కారితము, స్నిగ్ధమును అయిన అంతఃకరణముయొక్క వృత్తి పరంపరయే ఉపాసనము, లేక భక్తి. సగుణము, నిరాకారము, పరబ్రహ్మకారాకారితమును అయిన అంతఃకరణవృత్తి, నిరాకార, బ్రహ్మకారవృత్తి గూడా ఉపాసనము, లేక 'భక్తి' అని చెప్పబడును. నిర్గుణ, నిరాకార, బ్రహ్మకారవృత్తిని జ్ఞాన మనియు, సగుణ, సాకార, బ్రహ్మకార స్నేహాత్మకవృత్తిని 'భక్తి' అనియు కొందఱు చెప్పుదురు.

వస్తుతః, బ్రహ్మకార వృత్తిపరంపరను, కర్మ అని,జ్ఞానమని రెండును చెప్పవచ్చును. కాని, సారాంశమేమనగా ప్రమాణ, వస్తు పరతంత్రమైన వృత్తి, జ్ఞానము, పురుషతంత్రమైన మానసవృత్తి కర్మ. అదియే శ్రద్ధ, స్నేహ సహకృతమైన ఉపాసనము, లేక భక్తి. జ్ఞానమందు ప్రాణి, పరతంత్రుడై ఉండును. ఘ్రాణేంద్రియ ముతో గంధమునకు సన్నికర్ష కలిగినపుడు, ఇచ్ఛ లేకపోయినను, గంధజ్ఞానము కలుగును. కావున, జ్ఞానమందు పురుషునకు స్వాతంత్ర్యము లేదు. కాని, ధ్యానము, లేక ఉపాసనమందు ప్రాణి, స్వతంత్రుడై ఉండును. శాస్త్రానుసారముగా భగవద్విగ్రహ కల్పన చేసి, ప్రాణి, ధ్యానము చేయవచ్చును. ఈ దృష్టితో శ్రద్ధా స్నేహసహితమైన ఉపాస్య బ్రహ్మస్వరూపాకార వృత్తి ప్రవాహము ఉపాసన. ఆ ఉపాస్యస్వరూపము, నిర్గుణనిరాకారము, సగుణ నిరాకారము,సగుణ సాకారము అని మూడు విధములుగా ఉండును. వస్తు,ప్రమాణాధీనమైన ఉపాస్యాకారవృత్తి, జ్ఞానమని చెప్పబడును. ఆ జ్ఞానము ఉపాసనామహిమ వలననే కలుగును. కాని, వేదాంతుల దృష్టిలో అనాది, అనిర్వచనీయ మూలాజ్ఞాననివర్తకము నిర్గుణ, నిరాకారము యొక్క జ్ఞానము అగును. కావున, అదియే 'జ్ఞాన' పదముచేత ఎక్కువగా వ్యపదిష్ట మగును.

ఆ జ్ఞానము శాంతము, శుద్ధమును అయిన మనస్సుచే సహకృతమైన మహావాక్యము వలననే కలుగును. లేక, మహావాక్యాభ్యాసముచేత జన్యమైన సంస్కార సమూహము చేత సహకృతము, శాంతమును అయిన మనస్సుచేత కలుగును. తదితరజ్ఞానము, లేక సాక్షాత్కారము, ఉపాసనాయుక్తమైన మనస్సుచేత కలుగును. పరోక్షజ్ఞానము, వేదాదిశాస్త్రములచేత గూడా కలుగును. ఈ సిద్ధాంతము ననుసరించి శాస్త్రానుసారముగా ఏదియో ఒక ఉపాస్యస్వరూపముయొక్క శ్రద్ధాస్నేహసహితమైన ధ్యానము ఉపాసన; అదియే భక్తి. ఈవిధముగా సగుణ భగవంతునియందు వలెనే నిర్గుణబ్రహ్మయందుగూడా భక్తి ఉంటును. ఈ భక్తిచేత విక్షేప నివృత్తి, చిత్తైకాగ్రత, భగవత్ప్రసన్నత లభించును. అపుడు, నిర్విఘ్నముగా వేదాంతశ్రవణాదులచేత నిర్గుణ, నిరాకార, నిర్వికారమైన బ్రహ్మసాక్షాత్కారము కలుగును. కావుననే శాస్త్రములందు వేదాంతశ్రవణాదుల ద్వారా భగవత్సాక్షాత్కారమునకు భగవద్భక్తి, లేక ప్రపత్తి, ముఖ్య సాధనమని చెప్పబడినది.

"తం హ దేవ మాత్మబుద్ధి ప్రకాశం
ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే ।"

అని శ్రుతి చెప్పుచున్నది. అనగా, ఆత్మబుద్ధిని ప్రకాశిత మొనర్చునట్టి దేవునకు నేను శరణాగతుడను అని భావము.

"తమేవ చాద్యం పురుషం ప్రపద్యే ।"

అనగా, నేను ఆ ఆద్య పురుషుని శరణు వేడుచున్నాను.

"యమేవైష వృణుతే తేన లభ్యః ।"

వరణము (వరించుట), భజనము, భక్తి, ప్రార్థనచేతగూడా భగవత్ప్రాప్తి, అనగా జ్ఞానము కలుగును.

"దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తి
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ।"

అనగా, శ్రద్ధతో సేవించునట్టి భక్తులకు నేను బుద్ధియోగమును (జ్ఞానమును) ఒసంగుదును. దానివలన వారు నన్ను చేరుదురు. నేను స్వయముగానే జ్ఞానదీపముచేత వారి అజ్ఞానమును నాశము చేయుదునని భగవద్వచనము.

"భక్త్యా మా మభిజానాతి"

అనగా, భక్తుడు, భక్తిద్వారా నన్ను చక్కగ తెలిసికొనును.

"క్లృపి సంపద్యమానే చ"

అను వార్తికమునకు భట్టోజీ దీక్షితులు—

"భక్తిః జ్ఞానాయ కల్పతే, సంపద్యత ఇత్యర్థః"

అని చెప్పెను. అనగా భక్తియే, జ్ఞానాకారముగా పరిణితమగునని భావము. సారాంశమేమన, మృత్పిండమే ఘటాకారముగా పరిణామము చెందినట్లుగానే భక్తియే, జ్ఞానరూపముగాను, శుద్ధ సచ్చిదానందఘన బ్రహ్మసాక్షాత్కారరూపముగానుపరిణతమగును. సగుణ, సాకారపర బ్రహ్మయందు ఆసక్తమైన చిత్తము ప్రేమోద్రేకముచేత చేష్టారహితమైనపుడు, ఏ ప్రమేయము గూడా ప్రతీయమానము కాదు. ప్రమేయప్రతీతి నశించినపుడు, ప్రమాణము, ప్రమాణాశ్రయమైన ప్రమాత, ప్రతీతము కాకపోవుట స్వాభావికము. ఆ స్థితిలో వేదాంతముచేత ప్రమాత, ప్రమాణము, ప్రమేయము— మూడింటిని అవభాసింపజేయు రూపముతో శుద్ధ పరబ్రహ్మ సాక్షాత్కారము కలుగును. చిత్తము చేష్టారహితము కాక, ప్రమాతృ, ప్రమాణ ప్రతీతి ఎన్నడును నశించదు. అది, నశించక, సర్వోపద్రవవినిర్ముక్త,నిర్వికల్ప,చిదానందస్వరూప బ్రహ్మసాక్షాత్కారము కలుగజాలదు.

అష్టాంగయోగము యొక్క ఉపయోగము గూడా భగవదుపాసనముద్వారా చిత్తము యొక్క నిర్విచేష్టతయందు గలదు.

కావుననే, కపిల-దేవహూతి సంవాదమందు సగుణసాకార ధ్యానము అధికముగా ప్రశంసించబడినది. భగవంతుని చరణారవింద మకరంద రసాస్వాదనమందు పరవశమైన మనస్సు, సహజము గానే ప్రశాంతతను పొందును. ఆ భగవంతుని నఖమణిచంద్రిక చేత ధౌతప్రాయమైన (పరిశుద్ధమైన) మనస్సు, భగవంతుని అమృతమయ ముఖచంద్రుని సౌందర్య, మాధుర్య సుధాసమా స్వాదనము నిరంతరము చేయుచు, నిర్విచేష్టమగును. అంతియే! ఇక, ఆ ప్రేమానందమందు విలీనమైన మనస్సును విచలితము చేయక,

"తచ్చ త్యక్త్వా మహారోహో న కించిదపి చిన్తయేత్ ।"

"ఏక మేకతరాభావే యదా నోపలభ్యామహే ।
త్రితయం తత్ర యో వేద స ఆత్మా స్వాశ్రయాశ్రయః"

అను వచనానుసారము ఆ సమయమున, ప్రమాతృ, ప్రమాణ, ప్రమేయ, తదభావములకు భాసకమైన శుద్ధ పరబ్రహ్మ, స్వతః, ప్రకాశమానుడగును. అపుడు అచట కేవల మహావాక్యముయొక్క మహాశక్తివలన,అనాద్యావరణము శాశ్వతముగా నశించును.

ఈవిధముగా ద్రవీభూత, స్నిగ్ధ చిత్తముయొక్క భగవదాకారాకారిత వృత్తిరూపమైన భక్తియే నిర్గుణ, నిరాకార, నిర్వికార పరబ్రహ్మగా అభివ్యక్తమగును. అపుడు, దానివలన, శుద్ధ బ్రహ్మాత్మనాఽవస్థానరూపమైన మోక్షము స్వయముగా సిద్ధించును. కావున, కొందఱు మహాత్ములు, భక్తిచేతనే మోక్షము కలుగునని భావించిరి. ఇట్టి స్థితిలోగూడా-

"తమేవ విదిత్వాఽతిమృత్యు మేతి నాన్యః
పంథా విద్యతేఽయనాయ ।"

ఇత్యాది శ్రుతులకు విరోధము కలుగదు. ఏలన, జ్ఞానము ద్వార

కోటియందు ఇచట గూడా మాన్యమే. పిండ కపాలాధుల(మన్ను, కుండపెంకులు) ద్వారముననే, మృత్తిక, ఘటమునకు కారణ మగుచున్నది. అటులనే జ్ఞానద్వారముననే భక్తి, మోక్షమునకు కారణ మగును.

ఇంతియే కాక, ఆచార్యులు ఎడనెడ, 'భక్తి' శబ్దమునకు జ్ఞాన మని అర్థము చెప్పిరి. ఇటువంటి అర్థము ఆపాతతః (బాహ్యమునకు) పక్షపాతపూర్ణముగా అనిపించును. కాని, పర్యాలోచించినపుడు, ఇది అనుచితమని ప్రతీతము కాదు. "భజనం భక్తిః" అను ఈ వ్యుత్పత్తి ననుసరించి, భజనమే లేక సేవనమే 'భక్తి' అని చెప్పబడును. ఈ సేవ, కేవల కాయిక వ్యాపారము మాత్రమే కాదు. కాని, శరీరము, ఇంద్రియములు, మనస్సు- ఈ మూడింటి చేత సేవ్యమానుడైన భగవంతుని సేవ చేయబడును. ఇంతఏల ?

"కృష్ణసేవా సదా కార్యా మానసీ సా పరా మతా ।"

అను వచనము ననుసరించి, మహానుభావులు మానసమైన సేవనే పరా సేవ, లేక ముఖ్య సేవ అని భావించిరి. శ్రీకృష్ణసేవ, ఎల్లప్పుడు చేయవలయును. మానసమే అయిన ఆ సేవగూడా ముఖ్యసేవయే అగును.

కర, చరణాదుల చేత చేయు సేవ, పరిచర్య కావచ్చును. కాని, ఇది మానస సేవ ఎట్లగును? అను ప్రశ్న ఇచట, కలుగుచున్నది. ఈ విషయముపై మహానుభావులు ఇట్లు చెప్పిరి-

"చేత స్తత్ప్రవణం సేవా ।"

అనగా, చిత్తము శ్రీకృష్ణునియందు ఉన్ముఖ మగుటయే సేవ. దీని తాత్పర్యమేమనిన, భగవంతుని వైపునకు భగవత్స్వరూపాకారాకారితమైన మనోవృత్తి ప్రవాహమే, భగవంతునికి చేయు మానస సేవ. తత్సిద్ధికొఱకే తనుజా సేవ, విత్తజా సేవ, ఉభయవిధమైన సేవ

"తత్సిద్ధ్యై తను విత్తజా ।"

అపేక్షితమగును అను వచనము తను,విత్తజా సేవను చెప్పుచున్నది. ఈవిధముగా మానసికవృత్తి ప్రవాహము కూడా సేవయే. తేలిన సారాంశ మేమనిన, సేవ్యాకారమైన మానసీవృత్తియే సేవ్యుడైన భగవంతుని సేవ. ఇచటగూడా కొందఱుమహానుభావులు అనుకూలకృష్ణాకార వృత్తిని(కృష్ణానుస్మరణమును) 'భక్తి'అనిచెప్పుచున్నారు.కొందఱు కృష్ణాకారవృత్తి మాత్రమునే 'భక్తి' లేక 'సేవ' అని భావించు చున్నారు. ఆ వృత్తి, అనుకూలమైనను కావచ్చు, ప్రతికూలమైనను కావచ్చును. సేవ్యాకార వృత్తి భక్తి అయినచో, సేవ్యుడు నిర్గుణ, నిరాకార, నిర్వికార స్వరూపుడైనచో, నిర్గుణ, నిరాకార, నిర్వికార బ్రహ్మకారాకారితమైన వృత్తియే, 'భక్తి' అగును. అపుడు, అది వస్తు, ప్రమాణపరతంత్రమైన జ్ఞానరూపమైనను. కావచ్చు,పురుష తంత్రమైన ఉపాసనారూపమైనను కావచ్చును. నిర్గుణ, నిరాకార, నిర్వికార పరబ్రహ్మకారాకారిత వృత్తి తప్పక, 'భక్తి' పదముచేత వ్యపదేశ్యము కాగలదు. కావుననే

"భజతి విషయాకారతాం ప్రాప్నోతి ఇతి భక్తిః జ్ఞానమ్ ।"

అను వ్యుత్పత్తి ననుసరించిగూడా విషయాకారత్వమును పొందు నట్టి జ్ఞానము 'భక్తి'శబ్దమునకు అర్థ మగును. ఈ పక్షమందు

"భక్త్యా మా మభిజానన్తి ।"

అను స్థలమున, 'భక్తి'శబ్దముచేత జ్ఞానలక్షణమైన చతుర్థ భక్తియే వివక్షితము. ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని అని భక్తులు నాలుగు విధములుగా ఉందురు. వారి భక్తియు, నాలుగు విధములు గానే ఉండును. జ్ఞానియొక్క భక్తి జ్ఞానరూపమే. జ్ఞానిదృష్టిలో ప్రత్యక్చైతన్యాభిన్నుడైన భగవంతునికంటె భిన్నమైన మఱొక వస్తువు పూర్వము లేదు, ప్రస్తుతములేదు, రాబోవు కాలమందు

ఉండదు. కావున, ఆ జ్ఞానికి ఏకమాత్ర ప్రీతి (భక్తి) భగవంతుని యందే ఉండును. ఈవిధముగా అతడు(జ్ఞాని)ఇతరులకంటెవిశిష్టుడు.

"జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్।"

అను వచనము ననుసరించి భగవంతుడు ఆ జ్ఞానిని తన ఆత్మగానే భావించును.

ప్రకాశ్యమును (ప్రకాశింపదగినదానిని) ప్రకాశమానము చేయు ప్రకాశము, ప్రకాశ్యాకారమై ప్రకాశ్యవస్తువు యొక్క ఆకారమును పొందును. ఈ దృష్టితో జ్ఞేయాకారత్వమును పొందిన జ్ఞానము 'భక్తి' శబ్దముచేత చెప్పబడినది. ఈ దృష్టితోనే శ్రీశంకర భగవత్పాదులు ఈవిధముగా నుడివిరి–

"మోక్షకారణసామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ।
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యపరే జగుః॥"

మోక్షకారణ సామగ్రియందు భక్తియే శ్రేష్ఠము. స్వస్వరూపానుసంధానమే 'భక్తి' అని భావము. ఇచట, సేవ్యాకారాకారితమైన వృత్తిని 'భక్తి' అని చెప్పినపుడు, ఒక సేవకుడు తప్పక మిగిలి ఉండవలయును.కాని, ఇటువంటి స్థితిలో అద్వైతవాదమే సిద్ధించదు. ఏలన, వ్యావహారిక సత్త గల సాధకుడే పారమార్థిక విశుద్ధ చిదానందాత్మతత్త్వమును తనకు సేవ్యముగా చేసికొనును. సేవ్యమైన ఆ నిరాకారముకంటె భిన్నమైనవన్నియు,వ్యావహారికములే అగును. పారమార్థిక వస్తువు అవ్యవహార్యమైన ఒక్క పరమాత్మతత్త్వమే ఉండును కదా ? అను శంకకు ఏమియును విలువ లేదు.

"అక్షమా భవతః కేయం సాధకత్వప్రకల్పనే।
కిం న పశ్యతి సంసారం తత్రైవాజ్ఞానకల్పితమ్॥"

ఇంత యైనను, ఈ సిద్ధాంతమందు ఉపాసనారూపమైన భక్తి, జ్ఞానముకంటె, వేఱుగా మాన్యము, ఆదరణీయమే అగును.

తత్కృప చేతనే ఈ భక్తి కూడా లభించుమ. ఇంతేకాక, సరిగా దీనికి విరుద్ధముగా అన్యాన్య 'బ్రహ్మసూత్ర' భాష్యకారులు ఉపాసనమే 'భక్తి' అనియు, తద్భిన్నమైన జ్ఞానమన్న పేరు గల మఱొక స్వతంత్ర వస్తువు లేదనియు, చెప్పుచున్నారు.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా ।"

ఇచటగూడా, ఈ సిద్ధాంతమందు వస్తుప్రమాణతంత్రమైన తత్త్వ జ్ఞానము మాత్రమే వివక్షితము కాదు. ఏలన, దానికి ఉపయోగము ఏమియును లేదు. 'రాజుకలడు' అను జ్ఞానమాత్రముచేత ఏమియును సిద్ధించదు. కాని, స్వసంబంధిత్వేన, రాజునకు సంబంధించిన జ్ఞానమే ఉపకారకము కాగలదు. సరిగా, ఈరీతిగానే వేదాన్తవేద్య మైన బ్రహ్మజ్ఞానము నిరర్థకము. కాని,

"గతిర్భర్తా ప్రభుః సాక్షీ శ్రీనివాసః శరణం సుహృత్ ।"

ఇత్యాది వచనముల ననుసరించి, స్వసంబధిత్వేన జ్ఞానపూర్వక ఉపాసనారూపమైన విశిష్టజ్ఞానమే,

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా ।"

"బ్రహ్మవిదాప్నోతి పరమ్ ।"

ఇత్యాది శ్రుతులందు, సూత్రములందును, వివక్షితము. కావుననే

"య ఏవం వేద ।"

ఇత్యాది స్థలములందు వేదముచేత, ఉపాసనమే సర్వమాన్యమై అలరారుచున్నది. కావున, జ్ఞానకాండను వేఱుగా కల్పించుట వ్యర్థము.

కర్మకాండ, ఉపాసనాకాండ- ఈ రెండే, శ్రుతులయందు గలవు. జ్ఞానకాండను వేఱుగా అంగీకరించినను, అది, కర్మోపాసనలు రెంటికి సాధనము. కర్మసంబంధి జ్ఞానము చేతనే కర్మానుష్ఠానము జరుగును. ఉపాస్యజ్ఞానము చేతనే తదుపాసనము జరుగును. ఈ

పక్షమందు, నిర్గుణ, నిరాకార బ్రహ్మ, సర్వథా అమాన్యుడే. (మాన్యుడే కాడు). ఆ పక్షమందు సంసారము, లేక బంధము సత్యమే. కావున, జ్ఞానమువలన, సంసారనాశము, బంధనాశము జరుగుట అసంభవము. కావున, భక్తి, ప్రార్థనాదులచేతనే బంధము నుండి ముక్తి లభించును, విశిష్టమైన ఆనందలాభము సంభవమగును. ఈ పక్షమున జ్ఞానముకంటె భక్తియొక్క ఉత్కర్ష స్పష్టము. కాని, కర్మఫల మగుటవలన, ముక్తి అనిత్యమని భావింతురు. ఆ కారణముచేత వారు భయభీతులగుదురు. బంధము, సంసారము సత్యమైనచో, దానిఆత్యన్తిక నివృత్తి అసంభవమనివారు తలంతురు. వారు భగవంతుడు, సగుణుడు, సాకారుడని భావించినట్లే నిర్గుణుడు, నిరాకారుడని గూడా తలంతురు. కర్మోపాసనల మహత్త్వమును అంగీకరించినట్లే జ్ఞానకాండ మహత్త్వమును గూడా అంగీకరింతురు. వారి సిద్ధాంతమందు పైన పేర్కొనిన సిద్ధాంతము సుతరాం మాన్యము కాదు.

అయినను, మహానుభావులు కొందఱు, కర్మకాండ, ఉపాసనా కాండ, జ్ఞానకాండలు వేఱువేఱని భావించుచు గూడా భక్తి, జ్ఞానము కంటె ఉత్కృష్టమని పలుకుదురు. అపుడు. గూడా వారికి జ్ఞానలబ్ధమైన బ్రహ్మ సగుణ, సాకార పరబ్రహ్మకంటె, నిమ్నకోటికి చెందినవాడే. జ్ఞానప్రధానమైన సచ్చిదానంద బ్రహ్మ, జ్ఞాన ప్రాప్యము, ఆనంద ప్రధానమైన బ్రహ్మ, భక్తిప్రాప్యము. వేదాన్తవేద్యమైన బ్రహ్మ, ఆతపము (ఎండ) వంటిది. భక్తిలభ్యుడైన భగవంతుడు సూర్యునివంటివాడు. ఈ సిద్ధాంతమందు గూడా జ్ఞానముకంటె, భక్తి, ఉత్కృష్టమని అంగీకరించబడును. ఈ మతముల యందు సైతము,

"సా పరానురక్తి రీశ్వరే ।"

'ఈశ్వరునియందు పరమానురాగమే, భక్తి' అను భక్తిలక్షణము

మాన్యము. ఈ భక్తి, 'మర్యాదాభక్తి' 'పుష్టిభక్తి,' అథవా, 'వైధీ' భక్తి 'రాగానురాగా' భక్తి అను భేదముతో ద్వివిధముగా ఉండును.

స్వతః ప్రాప్తము, విధిగమ్యమును అయిన భగవత్సేవ, 'మర్యాదాభక్తి', 'వైధీభక్తి' అనబడును. భగవత్కృపా ప్రాప్తము, కామిన్యాది ప్రీతి సదృశమైన రాగవశమున చేయునట్టి భగవత్సేవ 'పుష్టి' లేక 'రాగానురాగా'భక్తి అనబడును. ఈ భక్తి, పరమ ప్రేమరూపము, స్వతఃసిద్ధము, భగవంతుని పరమాంతరంగమైన శక్తిరూపము. ఇది, హేతు, ఫల భావరహితమైనది.

"స వై పుంసాం పరో ధర్మో యతో భక్తి రథోక్షజే।
అహైతుక్య ప్రతిహతా యయాఽఽత్మా సంప్రసీదతి ॥"

భగవన్నామ సంకీర్తనాదిలక్షణమైన భక్తియే పురుషులకు (జీవులకు) పరమ ధర్మము. దీనివలన, అధోక్షజుడైన భగవంతుని యందు అహైతుకీభక్తి, అప్రతిహతభక్తి జనించును. తత్కారణము చేత అంతరాత్మకు సంప్రసాదము (ప్రసన్నత)కలుగును. ఇచట, 'యతః' అను పంచమీవిభక్త్యంత పదముచేత భక్తియొక్క కార్య, కారణభావము నిర్ధారితమైనపుడు, దానిని 'అహైతుకీ భక్తి' అని ఎట్లు చెప్పనగును? అని ప్రశ్న ఉదయించును. ఈ ప్రశ్నకు సమాధాన మేమనిన, వాస్తవమునకు భక్తికి కారణము ఏర్పడుట లేదు. భగవత్కృపయే కారణమని చెప్పెద మన్నచో సముడైన భగవంతునియందు విషమమైన కృప, ఎట్లు సంభవము? కృప గూడా సమమైనదని చెప్పెదమన్నచో సర్వులకు భక్తిప్రాప్తి కలుగవలయును. భగవత్కృపచేత కలిగినదని చెప్పెదమనినచో, ఇదియు సంగతము కాదు. ఏలన, అదియు సమమైనదే.

"సర్వభూతేషు యః పశ్యేత్ భగవద్భావ మాత్మనః।
భూతాని భగవత్యాత్మన్యేష భాగవతోత్తమః ॥" ఒకవేళ-

"ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సుచ ।
ప్రేమ మైత్రీ కృపోపేక్షా యః కరోతి స మధ్యమః ॥"

అను లక్షణము ననుసరించి, మధ్యమ భక్తుని కృపచేత భక్తి, ఉదయించుటను అంగీకరించిన, అదియు, సరి కాదు. ఏలన, శ్రద్ధాపురః సరముగా మధ్యమభక్తుని సేవ చేతనే మధ్యమ భక్తుని కృప లభించగలదు. కాని, శ్రద్ధ గూడా భక్తియే. ఆ భక్తి, మొదట ఎట్లు లభించును? సాధనము, సాధ్యము అని భక్తియే ద్విప్రకారకముగా ఉండును. దానియందు గూడా అవస్థాభేదమాత్రముచేత సాధ్య, సాధనభావము లేర్పడును. అపక్వమైన ఆమ్రము (పండని మామిడికాయ) పక్వమైన ఆమ్రఫలమునకు కారణమైన రీతిగానే సాధనరూపమైన భక్తికి, సాధ్యరూపమైన భక్తితో సాధ్యసాధన భావము కలుగును.

"సర్వాభిలాషితాశూన్యం జ్ఞానకర్మాద్యనావృతమ్ ।
ఆనుకూల్యేన కృష్ణానుస్మరణం భక్తి రుచ్యతే ॥"

సర్వాభిలాషావర్జితము, జ్ఞానకర్మానావృతము, ఆనుకూల్యమును అయిన శ్రీకృష్ణానుస్మరణమే భక్తి.

ఈ సిద్ధాంతములందు భక్తియే సర్వస్వము. దాని కొఱకే సమస్త సాధనములు. జ్ఞాన, మోక్షాదులు ఆ భక్తికి విఘ్నములు. భక్తజనులు భుక్తి, ముక్తి, విరక్తి అన్నింటిని పరిత్యజించి ఈ భక్తినే అభిలషింతురు. కావుననే గొప్ప, గొప్ప నిర్మలాత్ములైన పరమహంసలు, మహామునీంద్రులు గూడా అద్వైత, అఖండ బ్రహ్మనుండీ మనస్సును మరల్చి, సగుణ, సాకార భగవంతుని యందు మనస్సును సంలగ్నము చేయుదురు.

"తస్యారవిన్దనయనస్య పాదారవిన్దకింజల్కమిశ్ర
తులసీమకరన్దరేణుః ।

అన్తర్గతః స్వవివరేణ చకార తేషాం సంక్షోభ మక్షర
జుషామపి చిత్తతన్వోః ॥"

అనగా, అరవిందాక్షుడైన భగవంతుని చరణారవింద మకరంద మిశ్రితమైన తులసీమకరందరేణువులు, ఘ్రాణేంద్రియరూపమైన స్వవివరము (నాసికారంధ్రము) ద్వారా సనకాదిమునుల హృదయాంతర్గతములైనపుడే, అక్షరబ్రహ్మనిష్ఠులైన సనకాదులకు గూడా శరీరమందు, మనస్సునందు క్షోభ కలిగెను. అనగా, శరీరమందు పులకావళి (శరీరమున గగుర్పాటు) నయనములందు అశ్రువులు, మనస్సున, ద్రవత్వము ఉత్పన్నమయ్యెను.

"స్వసుఖనిభృతచేతా స్తద్వ్యుదస్తాన్యభావో ఒప్యజిత
రుచిర లీలాకృష్టసార స్తదీయమ్।
వ్యతనుత కృపయా య స్తత్త్వదీపం పురాణం తమఖిల
వృజినఘ్నం వ్యాససూనుం నమామి ॥"

"స్వసుఖేనైవ నిభృతం పరిపూర్ణం చేతో యస్య స తథోక్తః, తేనైవ నిరస్తః అన్యస్మిన్ పదార్థే భావో భావనా అస్తిత్వ బుద్ధిః యస్య తథోక్తః."

శ్రీ శుకాచార్యుని చిత్తము స్వరూపభూతమైన పరమానందసుధా సింధు పరిపూర్ణమయ్యెను. 'తద్వ్యుదస్తాన్య భావమ్' అనగా, స్వసుఖ నిభృతచేతస్కుడగుటచేతనే అన్యపదార్థవిషయకమైన అస్తిత్వ బుద్ధి ఆయనకు నశించెను. సర్వత్ర, కేవలము ఏకమాత్ర పరమ తత్త్వమునే దర్శించుచుండెను. సుందరమైన భగవల్లీల వలన ఆ శుకదేవుని ధైర్యము గూడా శైథిల్యమందెను. ఆయన, స్వయముగా ఇట్లనెను—

"పరినిష్ఠితోఽపి నైర్గుణ్యే ఉత్తమశ్లోకలీలాయా ।
గృహీతచేతా రాజర్షే! ఆఖ్యాగాం సంహితా మిమామ్ ॥"

అనగా, నా మనస్సు నిర్గుణపరబ్రహ్మయందు పరినిష్ఠితమైఉన్నను, ఉత్తమశ్లోకుడైన భగవంతుని లీల, నాచిత్తమును ఆకర్షించెను. శ్రీహరిగుణములచేతఆక్షిప్తమతినై బాదరాయణమహర్షిపుత్రుడనైన నేను శ్రీమద్భాగవతసంహితను అధ్యయనము చేసితిని–

"హరేర్గుణాక్షిప్తమతి ర్భగవాన్ బాదరాయణిః ।
అధ్యగాత్ మహదాఖ్యానం నిత్యం విష్ణుజనప్రియః ॥"

"ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథాఒప్యురుక్రమే ।
కుర్వన్త్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః ॥"

అయినను, వేదాంతులు దీనియందలి కొన్ని అంశములందు వైమత్యమే కలిగియున్నారు. వారి దృష్టిలో నిరతిశయ పరమానంద రసాత్మక వస్తువే బ్రహ్మ. అంతకంటె అధికమైన ఫలమును పద్దైనను కల్పించుట అసంభవము. 'అనంత'పదసమభివ్యాహృతమైన 'బ్రహ్మ'శబ్దమునకు నిరతిశయమైన 'బృహత్' అనియే అర్థము. సర్వవిధ పరిచ్ఛేరహితమైనదే నిరతిశయమైన 'బృహత్' అగును. ఈ విధముగా అయినవుడు గూడా సోపప్లవము అస్వప్రకాశమును అయినచో, ఆ నిరతిశయ బృహత్స్వరూపము బ్రహ్మ పదార్థ మగుటకు యోగ్యము కాదు. కావున, స్వప్రకాశము, పరమానందము, రసాత్మకమును అయినదే ఆ బ్రహ్మ కావలయును. ఈవిధముగా అనంత, స్వప్రకాశ పరమానందమే బ్రహ్మ. ఆ తపము కంటె సూర్యునియందు అతిశయము ఉండును. తాదృశమైన అనంత అతిశయత్వకల్పనము చేసి, చేసి విధాతయొక్క మతి ఎచట పరిశ్రాంత మగునో, అదియే బ్రహ్మ. ఆ బ్రహ్మయందే సమస్త విశ్వము కల్పితము. ఆ బ్రహ్మనుండియే జీవాది వివిధ సంసారము ఉపస్థిత మగును. ఆ పరబ్రహ్మయొక్క సాక్షాత్కారాత్మకమైన జ్ఞానము చేతనే సర్వానర్థములు నివృత్తము లగును.

కర్మోపాసనాదులందు దేనిచేతనైనను ఉత్పన్నమగు మోక్షము ద్వైతాత్మక మగుటచే ఒక్క సంసారమే ఉన్నది. దానితోపాటే ఉత్పాద్య, ప్రాప్య, సంస్కార్య, వికార్యరూపములైన కర్మఫలము లన్నియును అనిత్యమైన రీతిగానే కర్మోపాసనాదులచే ప్రాప్యమైన మోక్షము గూడా అనిత్యమే అగును. నిష్ప్రపంచ అద్వైతసుఖము కొఱకే సమస్త విశ్వమునకు నిద్రయందు, లేక సుషుప్తియందు ప్రవృత్తి కలుగుచున్నది. నింబవృక్షమందు గల పురుగునకు నింబ వృక్షమందే మాధుర్యము అనిపించును. దానికి పంచదార యందలి తీపిదనమునకు నవ్వు వచ్చును. అట్లే, వాదిత్ర (వాద్యము) నృత్య, గీతాది ద్వైత సుఖమందు ఆనంద మనుభవించు ప్రాణు లకు అద్వైత సుఖమందు ఆనందము లభించదు. ఆ అద్వైత సుఖము ఎటువంటిదనిన,అజ్ఞానముచేత ఎవరైనను, దానిని ద్వేషిం చినను, అది తన స్వభావానుసారముగా అందఱకు ప్రేమాత్మకమై అందఱియందును వ్యక్తమయియే ఉండును. ఆత్మజ్ఞానమును, ఆత్మమహిమను జూచి ఎవరికైనను విసుగుదల కలుగవచ్చును. కాని,ఆత్మోత్కర్షమును-తన గొప్పదనమును అందఱును కోరుదురు. ఆ ఆత్మను అందఱును ప్రేమించక తప్పదు.

మన సిద్ధాంతమందు, మన అభినివేశమందు, మన దేశ, గ్రామ, కుల, కుటుంబ, క్షేత్ర, విత్త, రాజ్యాదులందు ప్రేమ ఉన్నపుడు, మనకు మనయందు ప్రేమ ఉండదా ? పరమాత్మ యొక్క విగ్రహములందే మనకు ఇష్టమైన మూర్తియందే ప్రేమ కలుగును. మనకు ఇష్టముకాని పరమాత్మ యొక్క మూర్తియందు ప్రేమ, కలుగక పోవుటయే కాక, ద్వేషము గూడా కలుగును. ఇట్టి స్థితిలో తన ఆత్మయందు ఎవరికైనను, ప్రేమ కలుగదా ? శైవులు విష్ణుమూర్తిని, వైష్ణవులు శివమూర్తిని ఆత్మసంబంధము లేకపోవుటచేతనే ద్వేషించుదురు. తన ఇష్టదైవమందు, లేక వ్యక్తి

యందు అందఱికి ప్రేమ ఉండియేతీరును. దీనితోపాటు, ఆత్మ మహిమను సహించనివాడు గూడా తన గొప్పదనమును వాంఛించును. తన సిద్ధాంతముయొక్క మహత్త్వమును అభిలషించును. ఇదియే ఏల? 'అహం బ్రహ్మాస్మి' అను సిద్ధాంతఖండనము చేయువారే అంతమున, స్వయముగా భగవద్రూపులై రాసలీలాభినయము చేయుటకు సాహసింతురు.

వారి భక్తులు,వారిని ప్రత్యక్ష అవతారపురుషులని చెప్పుదురు. వారి, గురువులు, విని, విని ప్రసన్నులగుదురు. ఒకరు తాను వృషభానునందిని (రాధిక) అవతారమని భావించిన మఱి కొందరు తాము ప్రేయసీ ప్రియతములు (రాధాకృష్ణుల) అవతారము లనియే భావింతురు. తమ భక్తుల చేత అంగీకరింప చేయుదురు. ఇది అంతయు, స్వాభావికమైన (జీవసహజమైన) ఆత్మ ప్రేమయొక్క వికృత రూపమే. కావుననే శ్రుతిమాత 'సమస్తము ఆత్మయొక్క ప్రేమశేషమే అని చెప్పినది. దేవతయందు గూడా, ఆత్మార్థమే ప్రేమ కలుగును. ఆత్మకళ్యాణకారకము, ఆత్మహితైషి అయిన దేవతయందు ప్రేమ (భక్తి) ఉదయించును. తద్విపరీతమైన వస్తువునందు ద్వేషము కలుగును. ఈ విధముగానే అతి నిమ్న శ్రేణికి చెందిన జీవులు, అత్యున్నత శ్రేణికి చెందిన జీవులు, సుషుప్తియందు నిష్ప్రపంచ సుఖానందమును అనుభవించదలంతురు. అధికముగా చెప్పనేల? అత్యున్నత కోటికి చెందిన ఈశ్వరుడు సైతము, యోగనిద్రయందు ఆ నిష్ప్రపంచ అద్వైతసుఖానుభవమందే విలీనమగును. దివ్యాతిదివ్య, వైషయిక సుఖసామగ్రులు ఎదురుగా ఉన్నపుడు గూడా యోగనిద్ర ద్వారా నిష్ప్రపంచ అద్వైతసుఖమందే అత్యధిక ప్రవృత్తి కలుగును. ప్రాణులు దివ్యకాంతాదుల స్పర్శసుఖమునుండి విరతులై సౌషుప్తానందమును కోరుదురు. కావున, సాధారణ

సౌషుప్త అద్వైతసుఖమందు ప్రాణులకు ఇటువంటి ప్రేమ కలుగుచున్నదనిన, నిష్ప్రపంచ, నిరావరణ, అద్వైత బ్రహ్మానంద మహిమను ఎవరు, ఎట్లు వర్ణించగలరు!

కావుననే ద్రష్ట, దర్శనము, దృశ్యము యొక్క సమాప్తి ఎచట అగునో, అదియే అపరిచ్ఛిన్నమైన సుఖము. ఆ సుఖమునే 'భూమా' అని అందురు.

"యత్ర నాన్యోఽన్యత్పశ్యతి నాన్యోఽన్యచ్ఛృణోతి సభూమా, యో వై భూమా తత్ సుఖమ్, యదల్పం తన్మర్త్యమ్ నాల్పే సుఖమస్తి ॥"

అనగా, ఎచట, అన్యుడు అన్యమైనదానినే చూచునో, వినునో అచట, అల్పమైన సుఖమే కలదు. ఈ దృష్టితో అనంత, అఖండ, భూమారూపమైన బ్రహ్మయే పరమ సుఖము. ఆ సుఖముకంటె, అధికసుఖకల్పన చేయుట సర్వథా అశాస్త్రీయము. ఈ అనంత అఖండ, భూమా బ్రహ్మయే, సగుణ, సాకార, సచ్చిదానంద బ్రహ్మ అయి ఉన్నాడు. ఈ బ్రహ్మయే తన అత్యంత దివ్య లీలాశక్తిచేత శివ, విష్ణు, ఉమా, గణపతి, భాస్కర రూపముతో గూడా ఉపాస్యుడగుచున్నాడు.

రామ, కృష్ణ, నృసింహాది రూపముతో విష్ణువుయొక్క ఉపాసనమే జరుగును. ఆరీతిగానే శివ, విష్ణ్వాదిరూపముతో ఒకే పరమ తత్త్వము ఉపాసించబడుచున్నది.

పరమ తత్త్వమే అతి దివ్యమైన తన లీలాశక్తిచేత సగుణ, సాకార, సచ్చిదానందఘన రూపములో అభివ్యక్తమగును. ఆ పరమ తత్త్వముయొక్క ఏ రూపమందైనను, ఉత్కటమైన ఉత్కంఠ, ప్రీతియే భక్తి. భక్తి, జ్ఞానముల ఉత్కర్షల చింతనము వ్యర్థము. 'భక్తి' అను మహారాణి శుభాశీర్వాదము

చేతనే వివేక మను మహారాజుచేతనే ప్రబోధ మను (జ్ఞానమను) చంద్రుడు ఉదయించును. వివేకమునకు మోహముతో అనాది కాలమునుండి సంఘర్షము జరుగుచు వచ్చుచున్నది. మోహపక్షమున, కామ, క్రోధ, అహంకార, లోభ, దంభాది అనేక భటులు కలరు. వివేకపక్షమున, వైరాగ్యము, విచారము, శమము, దమము, క్షమ, దయ, శ్రద్ధ, నివృత్తి మొదలగు పెక్కురు భటులు కలరు. సేనాసహితముగా మోహముపైన విజయము సంపాదించి, ప్రభోధ సహితముగా పరమపురుషుడైన, భగవదంశభూతుడైన జీవాత్మ, కృతకృత్యుడై భక్తిమాతృచరణముల సన్నిధికి జేరి ప్రణామము చేయును. భక్తిమాత, వానిని ఆశీర్వదించి ఇట్లు చెప్పును–

"వత్స ! నేను చిరకాలమునుండి ఏవిధముగా ప్రబోధచంద్ర సహితమైన వివేకము విజయము పొంది, స్వభావముచేత శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావుడైన పరమ పురుషుని, స్వస్వరూపస్థునిగా చేసికొనునా ? అని చింతించుచున్నాను. నేడు, ఆ నా మనోరథ మీడేరెను. వత్సా ! నేను ఆశీర్వదించుచున్నాను."

జీవాత్మ, కృతకృత్యుడై ఇట్లు పలుకును– "అమ్మా ! నీ శుభానుసంధానముచేతనే, నేను కృతకృత్యుడనైతిని. ఇపుడు నేను నీ చరణా. విందములందు నా శ్రద్ధ, సదా స్థిరముగా ఉండవలయునని కోరుకొనుచున్నాను." ఈవిధముగా ప్రబుద్ధుడైగూడా జీవాత్మ భక్తి దేవీ ప్రియుడై ఉండును. ఇట్టి స్థితిలో భక్తియొక్క ఉత్కర్ష ఎంత చెప్పినను, అల్పమే అగును. శ్రీమద్భాగవతమాహాత్మ్యమందు జ్ఞాన, వైరాగ్యములు భక్తిమహారాణిపుత్రులని చెప్పబడినది. ఈ భక్తి, జ్ఞాన, వైరాగ్యములు మూడును కలియుగమందలి పాషండుల వలన జర్జరములు జీర్ణశీర్ణములైనవని ప్రదర్శించబడినది. శ్రీమద్బృందావనధామ సంసర్గముచేత భక్తిదేవి, నవీన

స్వరూపము గల తరుణి అయినది. కాని, అచట జ్ఞాన, వైరాగ్యములను గ్రహించువారు ఎవరును లేకపోయిరి. కావున, ఆ రెండును (జ్ఞానవైరాగ్యములు రెండును), ఉన్నవి ఉన్నట్లుగానే జీర్ణ, శీర్ణ క్షుత్ క్షామయుక్త శుష్కకంఠులై మూర్ఛితావస్థలోనే పడియున్నవి. శ్రీభక్తిదేవత,స్వయంనవీన,సురూపవతి అయిన తరుణి అయిగూడా తన పుత్రుల (జ్ఞాన, వైరాగ్యముల)దుర్దశను గాంచి, ఖిన్నురాలై ఆలోచించుచున్నది. ఆమె (భక్తిదేవి) భావమేమన, తల్లి జరఠ (వృద్ధురాలు) అగుట ఉచితము, పుత్రుల జరఠత్వము– వార్ధకము అవశ్యము చింతాజనకము.

ఒకానొక సమయమున, వృద్ధురాలైన ఒక వైశ్య స్త్రీ ఒక మహాత్ముని, ఈవిధముగా వరదానమును అర్థించసాగెను– 'ఓ మహానుభావా ! నా పుత్రులు, మనుమలు నన్ను తమ భుజములపై నిడికొని దహనక్రియకు వచ్చునట్లుగా అనుగ్రహించుడు.' అంత, ఆ మహాత్ముడు 'జీవించియుండగానే రావలయునా,లేక చనిపోయిన తరువాత రావలయునా ? అని ప్రశ్నించెను. సారాంశమేమనిన, కళ్యాణమయి, కరుణామయి, పుత్రవత్సలయైన మాత, తన కనుల ముందు తన పుత్రులు, మనుమలు సుఖముగా ఉండవలయుననియు, మృతినొందరాదనియు, తానే వారిముందు మరణించవలయు ననియు వాంఛించును. కుమారుల, మనుమల రోగమును, తన మీదికి ఆహ్వానించుకొనును. సరిగా, ఇదేవిధముగా,భక్తిమాతకు గూడా తన పుత్రులైన జ్ఞాన, వైరాగ్యముల వృద్ధియందే సుఖ సంతోషములు కలుగును. ఆమె, వారి అనిష్టమును చూడజాలదు. వారియెదుట ఆమె (భక్తి), తన నిధనమును (మృత్యువును) కోరుకొనును. తల్లి, మొదట పుత్రులు లేక, తనను వంధ్యగా భావించును;తన జీవితము వ్యర్థమని తలచును.పుత్రులు కలుగుటకై వివిధ దేవతలకు మ్రొక్కుకొనును. పుత్రుడు గర్భమున పడినంతనే

ఆమె సంతోషమునకు మేర ఉండదు. గర్భస్థుడైన బాలకుని హస్త పాదాదుల ఉత్క్షేపణమువలన కష్టము కలిగినను,దానిని దోషముగా తలంచదు. ఇపుడు పుత్రుడు పెద్దవాడైనాడని తెలిసికొని ప్రసన్నురాలగును. పుత్రజననమందు ప్రాణాంతకమైన కష్టమును సహించియు, ఆనందముతో పొంగిపోవును. తాను చలిలో ఉండి, పిల్లవానిని వెచ్చని ప్రదేశమున పరుండబెట్టును. మల, మూత్రాదులను తనపై ఉంచుకొనును.మాతృహృదయము ఎంత ఉదారము! ఆమె తన శిశువునిమిత్తమై ఏమి యేమి చేయునో, చెప్పజాలము. సరిగా, ఈ విధముగానే జ్ఞాన, వైరాగ్యరూపమైన పుత్రోత్పత్తి కలుగక, భక్తి, తనను వంధ్యగా భావించును. ఆ పుత్రోత్పత్తికై అఙ్జులు జాచి, దేవతలకు మ్రొక్కుకొనును. తరువాత, లాలించి, పాలించి పెద్దవానిని జేయును. ఆ జ్ఞాన, వైరాగ్యములు జీర్ణములు శీర్ణములును అగుట చూచి, ఆమె, చింతాక్రాంత యగును, ఖేదము నొందును. వాని మూర్ఛను, జీర్ణత్వ, శీర్ణత్వములను పోగొట్టుటకై, మఱల మహాత్ముల సన్నిధికేగి ఉపాయములను కోరును.

శ్రీభక్తిదేవి, అత్యంత ప్రియపుత్రులైన జ్ఞాన వైరాగ్యముల అపకర్షను గుఱించి చింతించుటయే కాదు. ఆమె (భక్తి) జ్ఞాన, వైరాగ్యములన్న పుత్రులు లేక, తనను వంధ్యగా భావించును. జ్ఞాన, వైరాగ్యముల జన్మ, అభివృద్ధి, ఔన్నత్యములందే తనను సౌభాగ్యవతిగా భావించును. పుత్రులు లేని తల్లి శోభించదు. తల్లి, స్వర్గమునకు వెళ్ళినపుడే పుత్రుడు సార్థకజన్ముడు కాజాలును. తత్త్వ జ్ఞానము, వైరాగ్యము అనిన, భక్తునికి ఏవగింపు కలుగుట, ఆ జ్ఞాన, వైరాగ్యములు అపకృష్టమైనవని సిద్ధింపచేయుటకై ప్రయత్నించుట, ఎంతవఱకు సంగతము ? ఇంతియేకాక, తల్లిపట్ల, పుత్రులకు గల కర్తవ్యమేమో, ఆలోచించదగిన విషయము. శాస్త్రములు పుత్రునికి తల్లి తండ్రులే పరమ దైవతములని

చెప్పినవి. సాక్షాత్తుగా ఉమామహేశ్వరుల రూపముతో మాతాపితరులను ఆరాధించవలయును.

"మాతృదేవో భవ, పితృదేవో భవ ।"

అని శ్రుతి, తండ్రికంటె గూడా తల్లియొక్క మహిమ పదిరెట్లు ఎక్కువ అని నిమ్నోదాహృత వచనము చెప్పుచున్నది.

"పితు ర్దశగుణా మాతా గౌరవేణాతిరిచ్యతే ।"

ఇట్టి స్థితిలో పుత్రుడు ఎంత ఉన్నతి పొందినను, ఎంత గొప్ప పూజ్యుడైనను, అతడు సర్వదా మాతృభక్తి కలిగి ఉండుట అనివార్యము. అట్లు కానిచో, అతడు కృతఘ్నుడని భావించబడును. అతడు ఉద్ధరించబడుట అసంభవము. కావున జ్ఞాన, వైరాగ్యములు ఉచ్చతమములై గూడా పరమ పూజ్యతమములై గూడా తను మాతృదేవతయైన భక్తిమహారాణి చరణములందు అవశ్యము పూర్ణమైన శ్రద్ధ కలిగి ఉండును.

ఇట్టి స్థితిలో ఎంత జ్ఞాని అయినను, ఎంతటి వైరాగ్యముకలవాడు అయినను, భక్తిని నగణ్యమని భావించి, నికృష్టమని తలంచి అనాదరము చేసినచో, అతడు జ్ఞానియే కాడు, నిజమైన అజ్ఞాని, కృతఘ్నుడే అగును. కావుననే వేదాంతాచార్య ప్రవరులైన శ్రీశంకర భగవత్పాదులు ఇట్లు చెప్పిరి-

"యావజ్జీవం త్రయో వంద్యా వేదాన్తో గురు రీశ్వరః ।
ఆదౌ విద్యా ప్రసిద్ధ్యర్థ్యం కృతఘ్నత్వాపనుత్తయే ॥"

అనగా, వేదాంతము, గురువు, ఈశ్వరుడు- ఈ ముప్వురు యావజ్జీవము సర్వదా వందనీయులు. మొదట, విద్యాప్రాప్తినిమిత్తము, అనంతరము కృతజ్ఞతను ప్రకటించి, కృతఘ్నతను దూరాపాస్తము చేయునిమిత్తము వందనము చేయవలయునని భావము. కావుననే శాస్త్రములందు ఎచటను భక్తి, లేక జ్ఞానము నిందించబడలేదు. భక్తి లేక, జ్ఞానము జనించుటయే దుర్లభము. కావుననే

"భక్త్యా మామభిజానాతి ।"

ఇత్యాది వచనములు భక్తియొక్క ఉత్కర్షను చెప్పుచున్నవి. భక్తి రహితముగా అంతరాత్మ, పరిశుద్ధము కాదు, దృఢమైన జ్ఞానము ఉదయించదు. కావున, భక్తి లేక, ముక్తిని పొందితిమని భావించు వారు జ్ఞానులే కారు.

అటువంటివారే కర్మలచేత సత్కులజన్మ, విద్య, త్యాగము మున్నగు ఉన్నత పదమందు ఆరూఢులై కూడా కామాది దోషముల చేత భ్రష్టులగుదురు.

"యేఽన్యేఽరవిందాక్ష విముక్తమానినః ।"

ఇత్యాదివచనములు ఇటువంటివారికొఱకే ప్రవృత్తములైనవి. ఇచట 'పద'శబ్దమునకు అర్థము బ్రహ్మపదప్రాప్తి. బ్రహ్మపరోక్షసాక్షాత్కారము అని చెప్పబడలేదు. ఏలన, బ్రహ్మపదము నొందిన తరువాత మఱల పతనము ఉండదు.

"న స పునరావర్తతే, న స పునరావర్తతే ।"

నిరాకార, నిర్వికార బ్రహ్మపరోక్ష సాక్షాత్కారము కలిగినపుడు మఱల కర్మప్రరోహణము (కర్మలు పుట్టుట) గూడా అత్యంత శ్రుతివిరుద్ధము. కావున, అదియును ఆదరణీయము కాదు.

"జ్ఞానాగ్నిదగ్ధకర్మాణి ।"

ఇత్యాది వచనముల తాత్పర్యము, భగవదనుగమనప్రశంసయందే అయి ఉన్నది. 'అపి' శబ్దము వలన గూడా ఈ భావమే వచ్చుచున్నది. రథయాత్రచేయుచున్న భగవంతుని జూచి, ఆయనను అనుసరించకపోవుట, మహాపరాధము. కావున, తప్పక రథయాత్ర వెంట పోవలయును. అట్లు భగవంతుని, అనుసరించనట్టి జ్ఞానాగ్ని దగ్ధకర్ములకు గూడా దండనము లభించుననిన, ఇతరుల కథ చెప్పనేల ?

"న హి నిందా నింద్యం నిందితుం ప్రవర్తతే, అపితు
విధేయం స్తోతుమితి న్యాయాత్ ।"

అను వచనము వలన,నిందకు తాత్పర్యము నింద్యమైన వస్తువును నిందించుటయందు కాదనియు, ఒకానొక విధేయమును స్తుతించుట యందే అనియు తెలియవలయును. ఈ విధముగానే,

"జ్ఞానే ప్రయాస ముదపాస్య ।"

ఇత్యాది శ్లోకములచేత జ్ఞానప్రయాసత్యాగ తాత్పర్యము గూడా భగవచ్చరిత్ర శ్రవణాది లక్షణము, భగవద్భక్తి సహితమును అయిన జ్ఞానప్రయాసమే సఫలమగును అని చెప్పుటయందే కలదు. ప్రత్యేకించి, అచట, 'జ్ఞాన'శబ్దముచేత శాస్త్రీయమైన పరోక్ష జ్ఞానమే వివక్షితము. అనగా, ప్రాణి, శ్రుతిగతమైన భగవద్వార్త యందు అనాదరణము కలుగునంతగా కేవల శాస్త్రీయ జ్ఞానమందు ప్రయత్నము చేయరాదని భావము. కారణమేమనిన, భగవద్భక్తి రహితముగా భ్రమనివర్తకమైన బ్రహ్మపరోక్షసాక్షాత్కారము కలుగ జాలదు.

"శ్రేయః శ్రుతిం భక్తి ముదస్యతే విభో
క్లిశ్యన్తి యే కేవల బోధలబ్ధయే ।
తేషా మసౌ క్లేశలఏవ శిష్యతే నాన్యద్యథా
స్థూలతుషావఘాతినామ్ ॥"

అనగా సర్వవిధములైన కళ్యాణము లొసగునట్టియు, అథవా, సర్వవిధ శ్రేయోనిర్ఘరిణి అయిన భక్తిమహారాణిని వీడి, కేవల శాస్త్రీయ జ్ఞానమును పొందుటకై కష్టపడువారికి క్లేశము దక్క, మఱి ఏమియు మిగులదు. ఊకను దంచునట్టివారికి కష్టము దక్క మఱేదియు, లభించదు అని భావము.

కావున, భక్తిసహితమైన జ్ఞానప్రయాసాదులే సఫలములు కాగలుగును. ఏవంవిధమైన అనేక ఇతర వచనములు గూడా కలవు.

భక్తి లేని యజ్ఞము, వేదము, తపస్సు మున్నగునవి నిష్ఫలము లని చెప్పబడినది.

"నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥"

హే అర్జున! నీవు నన్ను చూచినట్లు,వేదములు,తపస్సు, యజ్ఞము, దానము, ఇజ్యల వలన నేను చూడబడజాలను అని భావము.

"భక్త్యాత్వనన్యయా శక్య అహ మేవంవిధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప॥"

కాని, అనన్యమైన భక్తితో ఈ విధమైన నా స్వరూపమును తెలిసి కొనగలడు, చూడగలడు. అట్లు దర్శించి, నాలో ప్రవేశించనుగూడా ప్రవేశించగలడు. ఇచట, భక్తిరహితముగా వేద, యజ్ఞ, దానాదుల వలన భగవత్సాక్షాత్కారము కలుగదు అనియే అర్థము చెప్పుట ఉచితము.అట్లు కాకపోయినచో, వేద,యజ్ఞ,దానాదుల ఉపయోగము లేదని సిద్ధించును. కాని,

"వేదైశ్చ సర్వై ర మేవ వేద్యః।"

"యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్।"

ఇత్యాది వచనముల వలన, భగవత్ప్రాప్తియందు వేద, యజ్ఞ, తపో, దానాదులన్నింటికి పూర్ణమైన ఉపయోగము కలదని విస్పష్ట మగుచున్నది.

"నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న
బహునా శ్రుతేన।"

ఇత్యాది శ్రుతులకు గూడా ఇదియే స్థితి. కారణమేమన,

"శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః।"

"ఋతం చ స్వాధ్యాయ ప్రవచనే చ।"

"స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్।"

ఇత్యాది శ్రుతిస్థలములందు శ్రవణ, మననాదులు బ్రహ్మసాక్షాత్కారమునకు సాధనములని చెప్పబడినది. కావున, భగవద్భక్తి, అథవా, భగవద్వరణము లేక, కేవలశ్రవణ, మననాదులచేత బ్రహ్మపరోక్షసాక్షాత్కారము కలుగదు.భగవన్నామము అనాదియైన మొట్టమొదటి సంఖ్యతో సమానము.సమస్తసాధనములు శూన్యము (౦)తో సమానములు. సంఖ్యలేక, శూన్యములకు ఏమియు విలువ లేదు. కాని, సంఖ్య ఉన్నప్పుడు శూన్యములకు పది రెట్లు విలువ పెరుగును. ఇచట, గమనించదగిన విశేషమేమనిన, శూన్యముగూడా వ్యర్థము, అనాదరణీయము కాదు. ఒక కాగితము మీద ఒక సంఖ్య తరువాత పది సున్నలు ఉండును. ఆ పది సున్నలను తుడిచివేసి కేవలము ఒక సంఖ్యనే ఉంచినపుడు, ఎంత భేదముండును ? ఈ విధముగానే భగవన్నామరహితములైన సాధనములు శూన్యములవలె నిస్సారములు. అది ఉన్నపుడు శూన్యాత్మకములైన ఆ సాధనముల విలువ ఎంతో అధికముగా పెరుగును.

"హరేర్నామైవ నామైవ నామైవ మమ జీవనమ్ ।
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా ॥"

ఇత్యాది వచనములకు గూడా ఇదియే అర్థము. భగవన్నామరహితముగా, భక్తివిరహితముగా ఏ సాధనములు గూడా సఫలములు కాజాలవు. తల్లి లేక, పుత్రుడు ఉండుట అసంభవమైనపుడు, భక్తిలేక, జ్ఞానము కలుగుట, ఎట్లు సంభవము ? కావున, భక్తిని వీడి, జ్ఞానమునకై ప్రయత్నించుట, క్షీరమునకై కామధేనువును వదలుకొని,జిల్లేడుచెట్టును అన్వేషించుట ఎంత వ్యర్థమైన కార్యమో, అంత వ్యర్థము. సత్య క్షీరాపేక్ష ఉన్నచో, కామధేనువును సేవించుటయే యుక్తము. ఈవిధముగానే సత్యమైన, శుద్ధమైన జ్ఞానము అపేక్షితమైనచో, భక్తిమహారాణిసేవ, యుక్తమే.

ఈ వచనములచేత అన్యసాధనములను, లేక జ్ఞానమును

ఏవిధముగానైనను, అనాదరింపజనదు. అట్లు కానిచో, శాస్త్రీయము లైన విధినిషేధముల ఉల్లంఘనము చేయుటవలన, నామాపరాధ దోషము అనివార్య మగును.

శ్రీమద్భాగవాతాది సద్గ్రంథములందు భక్తిజన్యమైనజ్ఞానము చేతనే పరమ తత్త్వప్రాప్తి కలుగునని ప్రతిపాదించబడినది—

"ఏవం విశుద్ధమనసో భగవద్భక్తియోగతః ।
భగవత్తత్త్వవిజ్ఞానం ముక్తసంగస్య జాయతే ॥"

భగవద్భక్తియోగము వలన, విశుద్ధమనస్కుడు, నిస్సంగుడును అయిన ప్రాణికి భగవత్తత్త్వజ్ఞానప్రాప్తి, సిద్ధించునని భావము.

"పురేహ భూమన్ బహవోఽపి యోగిన స్త్వదర్పితేహా
నిజకర్మలబ్ధయా ।
విబుధ్య భక్త్యైవ కథోపనీతయా ప్రపేదిరేంఽజోఽచ్యుత
తే పరాం గతిమ్ ॥"

అనగా, హే భూమన్! యోగీశ్వరులు అనేకులు నీ చరణారవిందము లందు స్వీయ కర్మలను సమర్పించి విశుద్ధాంతఃకరణులు, విరక్తులును లయి త్వత్కథాశ్రవణము వలన లభించిన భక్తి చేత నీ తత్త్వమును తెలిసికొని, నిన్ను పొందుచున్నారు. భగవత్కథా శ్రవణాది భాగవత ధర్మములను నిరంతరము సేవించి, భక్తిని, విరక్తిని, భగవద్జ్ఞానమును పొంది, నిన్ను జేరుచున్నారు అని భావము.

"భక్త్యా మా మభిజానాతి ।"

అను వచనభావము స్పష్టమే. భగవత్ప్రేమ (భక్తి) చేతనే భగవత్కృప లభ్య మగును.ఆయనకృపవలననే ప్రాణి,ఆ పరమేశ్వరుని తెలిసికొనగలుగును.

"యమేవైష వృణుతే తేన లభ్యః ।"

ఈవిధముగా భగవద్భక్తి వలననే భగవత్కృప, భగవద్ జ్ఞానము ఉపలబ్ధ మగును. జ్ఞానమువలన, భగవంతుని సహజసిద్ధమైన పరమ భక్తి ప్రకట మగుట స్వాభావికమే. భక్తివిషయము ఎవరు తలంచుదురు? భగవత్సాక్షాత్కారము వలననే సంసార బంధము నశించును. ఈ విధముగా భక్తిపక్షముకంటె గూడా జ్ఞాన పక్షమందు భగవన్మహిమ అధికమని తెలియును.

ఒకడు, భగవత్తత్త్వజ్ఞానమునకు సంబంధించిన భావముతో భగవంతుని, భజించును. మఱొకడు ప్రేమతోనే భగవద్భక్తి కలిగి యుండును అన్నది వేఱే విషయము. భగవత్తత్త్వజ్ఞానరూపమైన ఫలము ఇరువురికిని కలుగును. ఒకడు పుణ్యప్రాప్తికై గంగా స్నానము చేయును. వానికి, పుణ్యమే కలుగును. కాని, తాపాది నివృత్తి గూడా ఆనుషంగికముగా (గౌణముగా) లభించును. మఱొకడు తాపనివృత్తికై గంగాస్నానము చేయును. వానికిగూడా ఆనుషంగికముగా పుణ్యము ప్రాప్తమగును. ఈరీతిగానే ఒకడు జ్ఞానప్రాప్తి ద్వారా పాప, తాపములను నాశమొందించుకొనుటకు భక్తిగంగలో స్నానము చేయును. వానికి గూడా లోకోత్తరమైన భగవత్ప్రేమానంద సుఖము లభించును. మఱొకడు భగవత్ప్రేమానందము కొఱకే భక్తితో భగవంతుని సేవించును. వానికి గూడా జ్ఞానప్రాప్తి, పాప, తాపనివృత్తి, తన్మూలభూతమైన జ్ఞానము లభించును. ఈవిధముగా భక్తునికి జ్ఞానప్రాప్తి, మోక్షము అవశ్యము కలుగును. కాని,జ్ఞానరహితమైన ఏ సాధనముచేతనైనను, మోక్షము లభించునని అంగీకరించినచో, బంధము యొక్క సత్యత్వము, మోక్షముయొక్క కృత్రిమత్వము, అనిత్యత్వము అపరిహార్య మగును. కావుననే, జ్ఞానయోగముచేత, లేక భక్తి యోగముచేత జ్ఞానప్రాప్తి సిద్ధించక, మోక్షము కలుగునని చెప్పుట మిక్కిలి అశాస్త్రీయము. మోక్షమును అభిలషించక, కేవల భక్తిని వాంఛించువారి స్థితి భిన్నము.

నిర్గుణ, నిరాకార, నిర్వికార పరబ్రహ్మోపాసనయందు మహా కష్టము ఉన్నది. కాని, భగవద్భక్తుడైనచో, భగవంతుని చరణారవిందములను ఆశ్రయించి, అనాయాసముగా భవసాగరమును తరించును. (దాటును). ఇంతయేల, వానికి భవసాగరము, దానిని దాటుట రెండును, సమానమే అగును. భగవంతుని శ్రీచరణముల భక్తి మహిమచేత మంగళమయమైన ఆయన భక్తి మహిమ చేత స్వర్గము, అపవర్గము (మోక్షము), దిక్కులు, ఈశాన్యాది విదిక్కులు సమస్తము, మంగళమయములే అగును. దానిని వదలుట, గ్రహించుట అను భావనయే నశించును. ఎవరికైనను క్షీరసాగరమును దాటుటయందు ఆసక్తి ఉండును. ఆ క్షీరసాగరమును ఈది దాటవలసివచ్చినప్పుడు, కష్టమునకు అంతమన్నది ఉండదు. కాని, ఆ క్షీరసాగరమును దాటుటకై దివ్య ఉపభోగ సామగ్రీ సంపన్నము, సర్వాంగసుందరమును అయిన నావ, లభించినచో తన్నావికాసంచాలకుడు తనకు ప్రియతముడు, ప్రాణధనమును అయిన భగవంతుడైనచో,సముద్రమును దాటుటయందు ఏమి కష్టము ఉండును? ఆనందముతో సర్వసుఖానుభవములను పొందుచు, దివ్యశబ్దమును, దివ్యస్పర్శను, దివ్యగంధమును, దివ్యరసమును ఆస్వాదించుచు, అనగా, తన ప్రియతముడైన భగవంతుని సౌగంధ్యమును, సంస్పర్శను అనుభవించుచు ప్రియతముడైన భగవంతుని అమృతమయ ముఖచంద్రుని సౌందర్య, మాధుర్య, సౌరస్యసుధాస్వాదనము చేయుచు భక్తుడు ఆనంద పులకితుడగును. అతనికి భవసాగరము, భవసాగరమును దాటుటయందు ఏమియు విశేషము ఉండదు. భవసాగరమును దాటి, భగవంతుని దివ్యమాధుర్యాదులనుఅనుభవించునో,వానిఅనుభవము భవసాగరమందే కలుగసాగును. భవసాగరమందలి పాప, తాపముల స్పర్శగూడా వానికి ఉండదు. కావుననే భగవన్నామస్మరణము వలన భవసాగరము శుష్కమైపోవునని (ఎండిపోవునని) చెప్ప

బడును. ఈ కారణముచేతనే భక్తులు వైకుంఠ, కైలాసాది పదమును పొందియు, లోకకళ్యాణార్థమై తిరిగి వచ్చుదురు. జీవులను, భక్తి అనెడి దివ్య నౌకయందే కూర్చుండబెట్టుకొని **అవతలి తీరమునకు** జేర్చుదురు.

ఈ కథనము అనేక అంశములలో యుక్తమైనదే. కాని, ఇచట గూడా సగుణోపాసనమునకు, నిర్గుణోపాసనమునకు గల తారతమ్యమునే చెప్పవచ్చును. కాని, జ్ఞానమునకు, సగుణోపాసనమునకు గల తారతమ్యముచెప్పవలనుపడదు. భగవద్గీతయందలిపండ్రెండవ అధ్యాయమందు అర్జునుడు శ్రీకృష్ణుని, ఇట్లు ప్రశ్నించును— ఓ ప్రభూ ! ఎవరు నీ విశ్వరూపమందు, లేక నీ సగుణ, సాకార, సచ్చిదానందస్వరూపమందు మనస్సు లగ్నము చేసి, నిన్ను ఉపాసించుదురో, ఎవరు అక్షర, అవ్యక్తస్వరూపమునుఉపాసింతురో, వారిరువురిలో ఎవరు అతిశయమైన యోగవేత్త ? అనగా బ్రహ్మ ప్రాప్తికి ఉపాయము తెలిసినవారు ?

"ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే ।
యేచాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥"

అంత, భగవానుడిట్లు చెప్పెను— 'ఎవరు నా సగుణ, సాకార, సచ్చిదానంద స్వరూపమందు మనస్సును చక్కగా ప్రవేశింపజేసి, నిత్య యుక్తులై ఉందురో, పరమ శ్రద్ధతో నన్ను ఉపాసించుదురో, వారు నాదృష్టిలో సర్వాతిశాయులైన ముక్తులు. ఎవరు ఇంద్రియ గ్రామమును సంయమనము చేసి అనిర్దేశ్య, అక్షర, అవ్యక్త, సర్వవ్యాపి, అచింత్య, కూటస్థ అచల బ్రహ్మస్వరూపమును ఉపాసించుదురో, ఆ మహానుభావులు సర్వభూతహితరతులై నన్నే పొందుదురు. అయినను, వారికి (నిర్గుణోపాసకులకు) క్లేశము అధికతరము. ఏలన, దేహవంతులకు (దేహాభిమానము కలవారికి) అవ్యక్త గతి అతికష్టముతో లభించును.

ఇచట దేహవంతుడనిన, దేహాభిమాని అనియే అర్థము. అట్లు కానిచో, 'దేహవాన్' అను పద ప్రయోగమే వ్యర్థమగును. ఏలన, ఉపాసనము లన్నియు దేహవంతునికే(దేహాభిమానికే)అయి ఉన్నవి. దేహాభిమానము లేనివారికి ఉపాసనాపేక్ష,తత్సంభావనయే లేదు. నిర్గుణోపాసనము ఎవరికిని సంభవము కాదని చెప్పవలను పడదు. ఏలన, ఇట్టి స్థితిలో నిర్గుణోపాసనావిధానమే వ్యర్థమై పోవును. అశక్యమైనదానిని ఉపదేశించునట్టి శాస్త్రముల శాస్త్రత్వము గూడా సందేహాస్పదమగును. 'దేహాభిమానియే దేహవంతుడు'అనెడి అర్థము వివక్షితము. సర్వథా, ఇచట ఉన్నదినిర్గుణోపాసన, సగుణోపాసనముల ఉత్కర్షాపకర్షల ప్రశ్న. సగుణోపాసనముయొక్క ఉత్కర్షయే ఈ ప్రశ్నకు సమాధానము. అర్జునుడు అడిగిన ప్రశ్నకు సమాధానము వికల్పపురఃస్సరముగా చెప్పబడినదని తత్త్వవేత్తలు చెప్పుదురు. అనగా, ఇది సారళ్యాభిప్రాయముతో ఉత్కర్షాపకర్షలను గురించి ప్రశ్నయా, లేక ఫలోత్కర్షచేత ఉత్కర్షాపకర్షల ప్రశ్నయా? మొదటిపక్షము ననుసరించి సగుణోపాసనము సరళమగుటచే శ్రేష్ఠమని సమాధానము.

"మయ్యావేశ్య మనో యే మామ్ ।"

అను వాక్యముచే పైరీతిగా సమాధానము చెప్పబడినది.

"తే ప్రాప్నువన్తి మామేవ ।"

అను వచనము రెండవ పక్షమును గ్రహించి చెప్పబడినది. అనగా నిర్గుణోపాసనము నన్ను పొందియే ఉన్నదని భావము.

ఇచట, 'ఏవ' కారమునకు సంబంధము 'ప్రాప్నువన్తి' అను క్రియతో చెప్పబడును. ఏలన,ఉపాసనమును అనుసరించి,ఉపాసకునకు, ఉపాస్యుడు తప్పక లభించును. కావున 'మాం'తో 'ఏవ' కారముయొక్క సంబంధము వ్యర్థమై 'ప్రాప్నువన్తి' క్రియతోనే 'ఏవ' కారమునకు సంబంధము కలుగును. అపుడు, దానివలన

వ్యవచ్ఛేదము కలుగును. దీనివలన, కలుగు సారాంశ మేమనిన నిర్గుణోపాసనము భగవంతునికి ప్రాప్తమయియే ఉన్నది. కావున, భగవత్ప్రాప్తికి సంబంధించిన ఉత్కర్షాపకర్షల ప్రశ్న ఏల ఉత్పన్నమగును? ఇచట, ప్రసంగానుసారముగా 'అస్మద్' 'మాం' మొదలగువానికి ఒకప్పుడు నిర్గుణబ్రహ్మ అని అర్థమైనచో, మఱొక సమయమున, సగుణబ్రహ్మ అని అర్థ మగును. ఏలన, భగవంతుడు నిర్గుణబ్రహ్మ, సగుణబ్రహ్మ కూడా అయి ఉన్నాడు.

'మయ్యావేశ్య' ఇత్యాది స్థలములందు 'మయి' శబ్దమునకు అర్థము సగుణ, సాకార, సచ్చిదానందబ్రహ్మ అని తెలియనగును.

"తే ప్రాప్నువన్తి మామేవ।"

అను స్థలమున, 'మాం' పదమునకు నిర్గుణబ్రహ్మ అని అర్థము. ఏలన?

"యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్।"

అను సిద్ధాంతము ననుసరించి, సగుణోపాసకులకు భగవంతుడు సగుణరూపముతో ప్రాప్తమైన౯ నిర్గుణోపాసకులకు నిర్గుణరూపముతో లభించును.

"యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తమ్।"

అను ప్రసంగమందు నిర్గుణోపాసనము ప్రకృత విషయమై ఉండుట స్పష్టము. కావున, అట్టి ఉపాసనమునకు నిర్గుణబ్రహ్మ, ప్రాప్తించుట యుక్తమే. ఈ దృష్టితో ఇచట 'మాం' శబ్దమునకు అర్థము నిర్గుణ బ్రహ్మ అని అంగీకరించుటయే యుక్తము. కావుననే ఫలదృష్టితో నిర్గుణోపాసనము శ్రేష్ఠము. సరళతాదృష్టితో సగుణోపాసనము శ్రేష్ఠము.

యమునాజలము శ్రేష్ఠమా, లేక గంగాజలమా? అన్న ప్రశ్నకు యమునాజలము శ్రేష్ఠమని సమాధానము చెప్పబడినది. తరువాత, గంగాజలమును గుఱించి అడిగినపుడు గంగాజలము

అమృతము అని సమాధానము చెప్పబడినది. ఈవిధముగానే ఇచట గల ప్రశ్న, సమాధానములు ఉన్నవని కొందఱు అందురు. జలములలో యమునాజలము శ్రేష్ఠము.సరిగా ఆరీతిగానే,సగుణోపాసనము శ్రేష్ఠమా, లేక నిర్గుణోపాసనము శ్రేష్ఠమా? అన్న ప్రశ్నకు సగుణోపాసనము శ్రేష్ఠము, నిర్గుణోపాసనము అయినచో, ఉపాస్య స్వరూపమే అగునని సమాధానము చెప్పబడినది.

"తే ప్రాప్నువన్తి మామేవ।"

కావున, దానికి సంబంధించిన ఉత్కర్షాపకర్షల ప్రశ్న వ్యర్థము. ఈరీతిగానే కాళిదాసమహాకవికి, దండికవికి గల ఉత్కర్షకు సంబంధించిన ప్రశ్నకు సరస్వతీదేవి "కవిర్దండీ కవిర్దండీ" అని సమాధానము చెప్పెను. కాళిదాసు, నేను ఎవరిని? అని ప్రశ్నించినపుడు-

"త్వం త్వమేవ।"

నీవు నాస్వరూపమే అని సమాధానము చెప్పెను. ఈరీతిగా నిర్గుణోపాసనముకంటె నిర్గుణబ్రహ్మజ్ఞానము భిన్నము. నిర్గుణ బ్రహ్మజ్ఞాన సాక్షాత్కారము, ఉపాసనాద్వయము యొక్క ఫలమే అయి ఉన్నది. వేదాంతమహావాక్య శ్రవణ,మనన,నిదిధ్యాసనములు చేసి, బ్రహ్మసాక్షాత్కారమును పొందు మార్గము జ్ఞానమార్గము. తాత్పర్యనిర్ణయమందు, మననాదులందు ప్రయత్నము చేసి, ఆచార్యునివలన, నిర్గుణ స్వరూపము నెఱింగి శ్రద్ధతో దానినే నిరంతరము ఉపాసించుట నిర్గుణోపాసనము.

"అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।"

కావున, ఇచట జ్ఞాన, భక్తులకు గల ఉత్కృష్టత్వ, అపకృష్టత్వములకు సంబంధించిన ప్రశ్నయే లేదు.ఇంతియేకాక, సాంఖ్యమునకు, యోగమునకు గూడా ఉత్కర్షాపకర్షల ప్రశ్న లేదనియే తెలియవలయును. ఏలన, సాంఖ్యమనగా, జ్ఞాననిష్ఠ, యోగమనగా కర్మనిష్ఠ. కావున, వీనికి (సాంఖ్య, యోగములకు) విషయము

గూడా ఇచట లేదు. విశేషించి, నిర్గుణోపాసనము సగుణోపాసనము రెండును కర్మనిష్ఠలో అంతర్భూతములే. ఏలన, పురుషతంత్రమైన మానసిక ధ్యానాది క్రియ గూడా కర్మ అయి ఉన్నది. కావున, శ్రీవిద్యారణ్యులు 'పంచదశీ' గ్రంథమందు దీనిని యోగ మని భావించిరి–

"యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే ।"

అని చెప్పిరి. అనగా, జ్ఞాననిష్ఠులకు నిర్గుణమైన ఏ బ్రహ్మపదము లభించునో, యోగులకు గూడా, అనగా నిర్గుణబ్రహ్మోపాసకులకు గూడా సాక్షాత్కారక్రమముతో ఆ బ్రహ్మపదమే లభించునని భావము.

నిర్గుణోపాసన మహిమ వలన గూడా నిర్గుణబ్రహ్మ సాక్షాత్కారము కలుగునని అంగీకరించబడుచున్నది. కాని, అది విధురపరిభావితమైన కామినీసాక్షాత్కారము వలె భ్రమాత్మకము కాదు. కాని, ప్రమాణ సంవాదము గలదనుటచే ప్రమాత్మకమే (భక్త్యాత్మకమే) అగును. గంధర్వశాస్త్రాభ్యాసను (సంగీత శాస్త్రాభ్యాసము) వలన కలిగిన సంస్కారసముదాయ సవ్యపేక్షము, మనస్సంయుక్తమును అయిన శ్రోత్రేంద్రియముచేత షడ్జత్వాది సంస్కారమువలె, లేక రత్నపరిచాయకమైన శాస్త్రాభ్యాసజన్య సంస్కార సంస్కృతమైన మనస్సంయుక్త చక్షురింద్రియముచే రత్నసాక్షాత్కారమువలె వేదాంతాభ్యాసజన్య సంస్కారప్రచయ సవ్యపేక్షము, సమాహితమును అయిన మనస్సుచేత బ్రహ్మసాక్షాత్కారమును అంగీకరింతురు. ఏవిధముగానైనను, నిర్గుణబ్రహ్మోపాసనమందు కష్టము ఉన్నది. ఏ వస్తుచింతనమైనను, లేక తదాకారాకారితమైన వృత్తిప్రవాహమైనను, అది ప్రతీతమైనపుడే కలుగ జాలును. ఇచట, మనస్సునందు శబ్ద, స్పర్శ, రూప, రసాదులలో ఏ పదార్థస్ఫురణ మైనను తప్పనిసరిగా ఏర్పడి ఉండునని మనము చూచుదుము. ఏవిధమైన దృశ్యపదార్థస్ఫూర్తి ఉన్నను, నిర్వికల్ప,

నిర్దృశ్య బ్రహ్మస్ఫురణము అసంభవము. 'నేడు ఏకాదశి' ఈ శబ్దమును ఆధారముగాచేసికొని ప్రాణులు ఏకాదశీవ్రతమును అనుష్ఠింతురు, తచ్చింతనము చేయుదురు. అయినను, తత్స్వరూప విశేషజ్ఞానము కలుగదు. ఇది మఱొక ఉపాసనావిధానము. ఆ రీతిగానే నిర్గుణ, నిరాకార, నిర్వికార బ్రహ్మతత్త్వము కలదు. ఇటువంటి పరోక్ష శబ్దజ్ఞానమును ఆధారముగా చేసికొని స్వరూపవిశేషము తెలియకయే చింతనరూపమైన ఉపాసనము జరుగవచ్చును. అయినను, నిర్వికల్పమైన వస్తుస్ఫురణము కలిగినపుడే సరియగు ఉపాసనము సిద్ధించును. అపుడు తదాకారాకారితమైన వృత్తిసంతానమును,లేక ప్రవాహమును ముందుకు సాగించవచ్చును. కావున,మృత్తికాది మూర్త ద్రవ్యముల ఉత్సారణమే(త్రవ్వుటయే) కూపనిర్మాణమై ఉన్నది. అథవా, ఘటముచేత జలాదినిష్కాసనమే (నీరు మున్నగువానిని తోడిపోయుటయే) దానిని ఆకాశముతో నింపుట అగును. అట్లే చిత్తమునుండి దృశ్య వికల్పమును(నానా నామరూపాత్మకమైన ప్రపంచమును) తీసివేయుటయే దానిని (చిత్తమును) బ్రహ్మాకారము చేయుట అని తెలియనగును. దానినే నిర్గుణోపాసన మందురు. ఈ నిర్గుణోపాసనమునకు ఫలము బ్రహ్మ సాక్షాత్కారము, అవిద్యానివృత్తి, తత్కార్యాత్మకమైన ప్రపంచ నివృత్తి కలుగును, ప్రత్యక్చైతన్యాభిన్నమైన బ్రహ్మస్వరూ పావస్థితి అయి ఉన్నది. తదనంతరము అభ్యుదయరూపము, నిఃశ్రేయసరూపమును అయిన ఏ ఫలము గూడా శేషించి ఉండదు.

నిర్గుణోపాసనా సంస్కారములు స్థిరముగా నుండుటవలన, వేదాంతశ్రవణ, మననాదుల ద్వారా తత్త్వసాక్షాత్కారమందు గూడా సౌకర్యము ఉండును. కారణమేమన, నిరాలంబమైన, లేక నిర్వికల్పాలంబమైన మనసునకే బ్రహ్మసాక్షాత్కారమందు ఎక్కువ ఉపయోగము కలదు. ఇది అంతయు ఉన్నను, నిర్గుణోపాసనము,

దేహాభిమానులకు అత్యంత కఠినము. వాయువును బంధించుట, లేక భాద్రపదమాసమందు ప్రవహించునట్టి అఖండ గంగా ప్రవాహమును అపుట కష్టమగుచందముగానే ప్రపంచోన్ముఖమైన వృత్తి ప్రవాహమును నిరుద్ధ మొనర్చుట, నిర్వికల్ప, నిర్దృశ్య బ్రహ్మాకారవృత్తిని కలిగియుండుటయు కష్టము. ఇట్లు కలిగియుండుట, పూర్ణవివేక, వైరాగ్యసంపన్నుడైన పురుషునకు సంబంధించినదే అయిన విషయము. కావుననే,

"అత్యన్త వైరాగ్యవతః సమాధిః సమాహితస్యైవ
దృఢప్రబోధః ।"

అని చెప్పబడినది. సగుణోపాసనము కఠినమైనను, దానియందు గూడా బాహ్యవిషయములనుండి, మనస్సును ప్రత్యావర్తనము చేసి (మరల్చి), భగవత్స్వరూపమందే లగ్నము చేయవలసి వచ్చినను, నిర్గుణోపాసనాపేక్షయా సరళము. కారణమేమన, మంగళమయమైన భగవన్నామమును నిరంతరము స్మరించుటవలన, ఆ భగవంతుని పరమపవిత్ర సచ్చారిత్రమును అభ్యాసము చేయుటవలన (ఆచరించుటవలన), భగవంతుని మధుర, మనోహర, మంగళమయ మూర్తి, మనస్సునందు ప్రకటమగును. అపుడు, భక్తిచేత తదాకారాకారిత వృత్తి ప్రవాహరూపమైన ఉపాసనము గూడా జరుగసాగును. భగవచ్చరిత్రాదుల మాధుర్యము వలన, అపుడపుడు, రాగముతో గూడా ప్రాణులకు ప్రవృత్తి కలుగును. ఈవిధముగా సగుణోపాసనమందు సరళత్వము (కష్టరాహిత్యము), నిర్గుణోపాసనమందు కష్టము కలదు. కావున, సగుణోపాసనము శ్రేష్ఠము.

ఇచట, ఒక ప్రశ్న ఉత్పన్నమగుచున్నది. అధిక కష్టమైనను, నిర్గుణోపాసనాఫలము గొప్పది, అదియే, శ్రేష్ఠము. అధిక ఫలమునకై కఠిన పరిశ్రమ, అధికతర క్లేశము, దాని అపకర్షకు

కారణము కాజాలదు. మహాఫలమునకై అధిక క్లేశము కలుగుట యుక్తమే. సగుణోపాసనము సరళమైనను దాని ఫలము ఒకవిధ మైన సంసారమే అయిన బ్రహ్మలోకాది ప్రాప్తియే. అచట, అవిద్యకు, తత్కార్యాత్మక ప్రపంచమునకు ఆత్యంతిక నివృత్తి కలుగదు. నిర్గుణోపాసనము వలన, నిరావరణ బ్రహ్మసాక్షాత్కారము, తదాత్మనాఽవస్థానము (బ్రహ్మస్వరూపముతో ఉండుట) కలుగును. అటులయినచో, నిర్గుణోపాసనము కంటె, సగుణోపాసనము ఎట్లు శ్రేష్ఠమని చెప్పనగును? దీనికి సమాధాన మేమనిన, సగుణోపాసనము సరళ మగుటతోబాటు, దానివలన అంతరాత్మ, పరిశుద్ధ మగును, వివేక, వైరాగ్యాదులు లభించును, శ్రవణ, మననాది క్రమముతో బ్రహ్మసాక్షాత్కార ప్రాప్తి సిద్ధించును. అథవా, అచట భగవత్కృప వలననే తత్త్వసాక్షాత్కారము, కైవల్యము ప్రాప్త మగును. భగవదుపాసనము వలన భగవత్కృప, భగవత్కృప వలన జ్ఞానయోగ్యత ప్రాప్తమైనపుడు, ఒకే మహావాక్యముచేత తత్త్వసాక్షాత్కారము కలుగును. ఎవరు, సమాహితచిత్తులై ప్రేమ పూర్వకముగా నన్ను సర్వదా సేవింతురో, వారికి, నన్ను జేరగల బుద్ధియోగమును (జ్ఞానయోగమును) ఒసంగెదనని, శ్రీకృష్ణ పరమాత్మ, స్వయముగా ఈవిషయమును అంగీకరించెను.

"మచ్చిత్తాః మద్గతప్రాణాః బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ ॥
ఏవం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపాస్యన్తి తే ॥
తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥"

ఈ విషయమును శ్రీకృష్ణపరమాత్మ, 'స్వయముగా అంగీ కరించెను– ఎవరు సర్వదా సమాహితచిత్తులై, ప్రీతిపూర్వకముగా

నన్ను భజించుదురో, వారికి, నన్ను జేరునట్టి బుద్ధియోగమును (జ్ఞానయోగమును) ఒసగుదును. ఎవరు మచ్చిత్తులై (నాయందే చిత్తమును లగ్నము చేసినవారై), మద్గతప్రాణులై, నా వచసములు, ప్రబోధములయందే సంతుష్టులై రమణమొనర్చుచుందురో, అట్టివారిపైన కృపతో వారి అజ్ఞానాంధకారమును నాశమొందించుదు నని భావము.

ఈవిధముగా, భగవత్కృపావిశేషముచేత సగుణోపాసకులకు భగవంతుని నిర్గుణస్వరూపసాక్షాత్కారము కలుగును.

శ్రవణాదులందు ప్రవృత్తి ద్వారా, లేక ఈ జీవితమందు భగవత్కృప ద్వారా తత్త్వసాక్షాత్కారము కలుగకపోయినను, మరణకాలమందు తత్త్వసాక్షాత్కారప్రాప్తి సంభవ మగును. యావజ్జీవితము ప్రాణి, ప్రారబ్ధానుసారముగా దారి తప్పి తిరుగ వలసివచ్చును. పురుషార్థయోగ్యత ఉన్నను, భగవంతుడు గూడా వాని పురుషార్థయోగ్యతకై ప్రతీక్షించును. కాని, మరణకాలమందు, భగవంతుడు మఱల తన అనుకంపావిశేషము వలన, వానికి సులభుడగును. ఆ సమయమున, భగవంతుడు జీవుని అసమర్థతను గుర్తించుచు, జీవుని ప్రాథమిక భావములను జూచి, తన సహజానుకంపతో జీవునికి క్షేమమును కలుగజేయును.

"అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ ! నిత్యయుక్తస్య యోగినః ॥"

అనగా, అనన్యచిత్తముతో సర్వదా, నన్ను యోగయుక్తుడై భజించుచుండువానికి, నేను చివఱకు సులభుడ నగుదును అని భావము. ప్రాణనిరోధ, సమాధ్యాదులను అభ్యాసము చేయకపోయినను, మృత్యుసమయము మందలి విషమ వేదనాకాలమందు, నేను నా కృపావిశేషముచేత వానికి సులభుడ నగుదును. ఒకవేళ,

ఇట్లు జరుగకపోయినను, మరణానంతరము, వానికి బ్రహ్మలోక ప్రాప్తి కలుగును. అచట, తన భావనానుసారముగా శివ, విష్ణ్వాది స్వరూపప్రాప్తి కలుగును. అనేకవిధములైన ఆనందములు కలుగును. అచట, శ్రవణ, మననాదుల వలన, తత్త్వసాక్షాత్కారము కలిగి, కల్పాంతమందు కైవల్యపదము లభించును. ఈవిధముగా తత్ఫలమే (నిర్గుణోపాసనాఫలమే) లభించును. కాని, సగుణోపాసన మందు సరళత్వము ఉన్నది, నిర్గుణోపాసనమందు కష్టము ఉన్నది. కావున, సగుణోపాసనము శ్రేష్ఠము. ఈ విషయమే భాగవతమందు రెండుశ్లోకములలో చెప్పబడినది-

"పానేన తే దేవ కథాసుధాయాః
ప్రవృద్ధా భక్త్యా విశదాశయా యే।
వైరాగ్యసారం ప్రతిలభ్య బోధం యథాఽంజసా
ఽన్వీయు రకుంఠధిష్ణ్యమ్ ॥

తథాఽపరే చాత్మసమాధియోగబలేన జిత్వా
ప్రకృతిం బలిష్ఠామ్।
త్వామేవ ధీరాః పురుషం విశన్తి తేషాం శ్రమః
స్యా న్నతు సేవయా తే ॥"

హే దేవ! సుధీగణము నీ కథాసుధాపానము చేసి, దానిచేతనే ప్రబుద్ధమైన భక్తిద్వారా నిర్మలాశయులై, వైరాగ్యసారబోధను పొంది, అకుంఠధిష్ణ్యులై నన్ను పొందుదురు. అట్లే, ఇతర మహాను భావులు, ఆత్మసమాధియోగముచేత, అనగా ఆత్మసంబంధమైన శ్రవణ, మనన, వివేచనాదిక్రమముతో సాక్షాత్కరించుకొని, బలిష్ఠ మైన ప్రకృతిని (దేహాదుల స్వాభావిక ప్రవృత్తిని, జయించి) నిన్నే చేరుదురు. నీ ప్రాప్తి (భగవత్ప్రాప్తి) ఇరువురికిని సమానమైనను, రెండవ పక్షమువారికి (నిర్గుణోపాసకులకు) శ్రమ, అధికము. మొదటి పక్షమువారికి, అంత శ్రమ లేదు. మొదటి సాధకునికి,

సాధనముగా కథాసుధాపానము కలదు. అపుడు, తన్మహిమచేతనే భక్తి, అంతఃశుద్ధి, వైరాగ్యము, విజ్ఞానము లభించును. రెండవ వారికి, ఆత్మానాత్మవివేక వైరాగ్యసహితమైన శ్రవణాదులద్వారా, శరీర త్రయమునుండి, కోశపంచకమునుండి చైతన్యవివేచనము చేయవలసి ఉండును. ఆంతర, బాహ్య, వ్యష్టి, సమష్టి ప్రపంచము చేత, ప్రత్యక్ చైతన్యాభిన్నమైన శుద్ధబ్రహ్మాన్వేషణము చేయవలసి ఉండును. యోగాభ్యాసముచేత బాహ్యవృత్తినిరోధము, అంతఃకరణమందు సర్వవృత్తినిరోధము చేయవలసివచ్చును.

ఈ శ్లోకముల ననుసరించి—

"తే ప్రాప్నువన్తి మామేవ।"

అను వాక్యార్థము,

"త్వామేవ ధీరాః విశన్తి।"

అను వాక్యముయొక్క అర్థము సమానమే కావలయును, అనగా, సగుణోపాసకుడు, ఉపాసనాప్రభావముచేత జ్ఞానము ద్వారా ఏ భగవంతుని, జేరునో, నిర్గుణోపాసకుడు గూడా ఆ భగవంతునే జేరును. నిర్గుణోపాసకునకు ప్రాప్యమగు తత్త్వము, సగుణోపాసక ప్రాప్యతత్త్వముకంటె భిన్నము కాదు. ఇదియే రెండు స్థలము లందు గల 'ఏవ'కార స్వారస్యము.

"పురేహ భూమన్ బహవోఽపి యోగిన స్త్వదర్పితేహా
నిజకర్మలబ్ధయా।
విబుద్ధ్య భక్త్యైవ కథోపనీతయా ప్రపేదిరేఽచ్యుత
తే గతిం పరామ్॥"

అను వచనముచేత గూడా భగవచ్ఛరణసమర్పణబుద్ధితో కర్మాను ష్ఠానము, కథాసుధాపానము, దానిచేత భక్తి, భక్తివలన జ్ఞానము పొందిన తరువాత, మోక్షప్రాప్తి చెప్పబడినది.

నిర్గుణోపాసనమందు గూడా భగవత్కృప అనివార్యమే అని చెప్పవచ్చును.

"యో వై బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై, తగ్ంహ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే ॥"

"తమేవ చాద్యం పురుషం ప్రపద్యే ॥"

ఇత్యాది వచనముల ననుసరించి, జ్ఞానపక్షమందు సైతము, భగవచ్ఛరణాగతితో, భగవత్కృపను ప్రతీక్షించవలసియే ఉండును. సగుణోపాసనము వలన, భగవత్కృప కలిగినట్లే నిర్గుణోపాసనము వలనగూడా భగవత్కృప కలుగును.

సగుణనిర్గుణ స్వరూపములు రెండును భగవత్సంబంధులే అయినపుడు, సగుణోపాసనము వలన, భగవత్కృప కలుగక పోవుటకుగల కారణమేమిఉండును? మీదుమిక్కిలి, నిర్గుణస్వరూపము అంతరంగము, సగుణస్వరూపము నిర్మల సత్త్వసాపేక్షమును అయినపుడు, అంతరంగ, ప్రియతమ నిరపేక్ష నిర్గుణస్వరూపమును ఉపాసించునట్టి ఉపాసకునియందు అధికమైన కృప కలుగవలయును. కావున, నిర్గుణోపాసనముచేతగూడా భగవత్కృపవలన, తత్త్వసాక్షాత్కార మగును. ఈ పక్షమందే–

"ఏవం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।"
"మచ్చిత్తా మద్గతప్రాణాః ।"
"దదామి బుద్ధియోగం తమ్ ।"
"తేషా మేవానుకంపార్థమ్ ।"
"నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ।"

ఇత్యాది వచనము లన్నియు సంగతములగును. భగవంతుని చరిత్ర శ్రవణము వలన, భక్తి సంభవమైనట్లే వేదాంత వాక్యముల

ద్వారా భగవంతుని ప్రత్యక్ చైతన్యాభిన్నమైన బ్రహ్మస్వరూప శ్రవణముచేత గూడా పరిపూర్ణ భక్తి ఉదయించగలదు. అట్లైనచో, నిర్గుణోపాసనముకంటె సగుణోపాసనము ఎట్లు శ్రేష్ఠము? మీదు మిక్కిలి, నిర్గుణస్వరూపము అంతరంగనిరపేక్ష మగుటవలన, పూర్ణ భక్తికి ఆస్పద మగును. నిర్విశేషమైన ఆలంబనము వలన,చిత్తము యొక్క నిరాలంబత్వమునకు ఎక్కువ సహాయము లభించును. అయినను, నిర్గుణోపాసనముకంటె సగుణోపాసనము సుగమ మని తప్పక అంగీకరించవలసియే ఉండును. నిర్గుణోపాసనము, నిర్గుణ బ్రహ్మసాక్షాత్కారమునకు ఎక్కువ అనుకూలము. జ్ఞానప్రాప్తియు, భగవత్కృప వలననే కలుగును. కృపాదిగుణములు ఎవరియందు ఉండునో, ఆయన, సగుణ బ్రహ్మ యని కొందఱి సిద్ధాంతము. శ్రీశంకరభగవత్పాదులు నిర్గుణ బ్రహ్మను గుఱించి ఇట్లు చెప్పిరి–

> "ఉదాసీనః స్తబ్ధః సతత మగుణః సంగరహితో
> భవాం స్తాతః కాఽతః పర మిహ భవే జ్జీవనగతిః ।
> అకస్మా దస్మాకం యది న కురుషే స్నేహ మథ తద్
> వసస్వ స్వీయా స్తర్వి మలజఠరేఽస్మి న్ పునరపి ॥"

హే దేవ! నీవు ఉదాసీనుడవు, స్తబ్ధుడవు, నిర్గుణుడవు, సంగరహితుడవును అయిన మా తండ్రివి. ఇపుడు, నా గతి ఏమి? ఓ దేవా! నీవు ప్రయోజనరహితముగామాయెడ స్నేహముతో ఉండకపోయినను, మా హృదయము నీ భవనము ఆ హృదయమందు నీవు నివసించుము అని భావము.

ఈవిధమైన స్తోత్రముచేత నిర్గుణ స్వరూపమందు దయా, కృపారూపమైన గుణముల అస్తిత్వము ఉండదని స్పష్టమగుచున్నది. కావుననే మాయామోహనివృత్తికై భగవంతుని మాయ వర్ణించబడుట యుక్తము–

"మాయాం వర్ణయతోఽముష్య ఈశ్వరస్యానుమోదతః।
శ్రద్ధయా శృణ్వతో రాజన్ మాయయాఽఽత్మా న ముహ్యతి॥"

భగవంతుని మాయను శ్రద్ధతో వర్ణనము, శ్రవణము, అనుమోద నము చేయునట్టి పురుషుని ఆత్మ, మాయచేత మోహితము కాదు. ఇచట భగవదీయ, భగవద్వశీభూతయు నయిన మాయ వర్ణించ బడెను. కావుననే మాయామోహమునుండి ముక్తి లభించును. ఆ విధముగానే భగవత్సాపేక్షమైన భగవదీయ సత్త్వమును వర్ణించుట చేత, ఆ సత్త్వము వలన, జ్ఞానము లభించును. ఆ జ్ఞానము ద్వారా 'కంటకేన కంటకోద్ధారః' ముల్లుచేత ముల్లును తీయుట అను న్యాయముచేత గుణనివృత్తి కలుగును.

ఈవిధముగా, సగుణోపాసనమందు సరళత్వము ఉండును. భగవత్కృపకు అవకాశముండును. అట్లైనను, భగవత్కృపకంటె గూడా భక్తియొక్క క్షమామహత్త్వము ఎక్కువ అని భావించ బడును. ఆరీతిగానే, నిర్గుణోపాసనము, స్వయముగా కృపతో ప్రాణికి క్షేమము చేయగలుగును. సగుణుడైన భగవంతుడే తన నిర్గుణ స్వరూపమును ఉపాసించువానియందు పరిపూర్ణమైన కృప దాల్చును. అటుపిమ్మట, దేహాభిమానము నశించినపుడు, నిర్గుణో పాసనము గూడా సరళము కాగలుగును.

"తయోస్తు కర్మసంన్యాసాత్ కర్మయోగీ విశిష్యతే।"

అను వచనముచేత కర్మసంన్యాసము కంటె కర్మయోగము శ్రేష్ఠ మగుట సంభవము. అట్లే నిర్గుణోపాసనము కంటె సగుణోపాసనము శ్రేష్ఠమని చెప్పుట యుక్తము. ఏ దృష్టిచేతనైనను, సంన్యాసమే శ్రేష్ఠము అగును. కాని,

"సంన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః।"

"న కర్మణామనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।"

ఇత్యాది వచనముల వలన యోగము (కర్మయోగము), లేక

నైష్కర్మ్యము ప్రాప్తమే కాజాలదు, యోగము లేక,సంన్యాసము కేవల దుఃఖమునకు మూలము. నిర్గుణ, నిరాకార స్వరూపోపాసనము కంటె సగుణ, నిరాకార ఉపాసనము సరళము. సగుణ, నిరాకారోపాసనముకంటె సగుణ సాకార బ్రహ్మోపాసనము సరళము. మనస్సును మొట్టమొదట ఆకారమును, గుణమును చింతించుట యందును, తరువాత నిర్గుణ, నిరాకార కేవల బ్రహ్మయందును లగ్నము చేయుచు ఉండవలెను. ఈవిధముగా అనాయాసముగా చిత్తము పరమ తత్త్వమందు పరినిష్ఠిత మగును. నిర్గుణ, నిరాకార పరబ్రహ్మయే సగుణ, సాకార పరబ్రహ్మయందు వ్యక్తమైనపుడు, నిర్గుణ, సగుణ స్వరూపములకు భేద మన్నదియే ఉండదు. ఇంతయైనను, నిర్గుణోపాసనమందు క్లేశము, సగుణోపాసనమందు సరళతయే ఉండును.నిర్గుణ స్వరూపమందు చిత్తమునకు స్వారసిక ప్రవృత్తి కలుగదు.సగుణ స్వరూపమందుస్వారసిక ప్రవృత్తి కలుగును. ఈ దృష్టులతో సగుణోపాసనను శ్రేష్ఠమని చెప్పుట యుక్తమే.

ఈరీతిగా, కర్మలేని సన్న్యాసము కేవల దుఃఖమునకు మూలమే అగును. నిజమైన సంన్యాసము ఆ కర్మచేతనే కలుగును. కర్మానుష్ఠానము చేయక, నైష్కర్మ్యసిద్ధి కలుగనే కలుగదు. అపుడు సంన్యాసముకంటె కర్మ, శ్రేష్ఠమని చెప్పుట యుక్తమే. ఈ విధముగానే సగుణోపాసనారహితముగా చిత్త శుద్ధిగాని, నిర్గుణోపాసనము గాని సుతరాం కుదురదు. తదనంతరము అతి సరళముగా నిర్గుణోపాసనము, తత్త్వసాక్షాత్కారము కలుగును. అపుడు, నిర్గుణోపాసనము కంటె సగుణోపాసనము శ్రేష్ఠమని చెప్పుట ఉచితమే. కొందఱు 'వానరీవృత్తి, బైడాలకీవృత్తి' చేతగూడా భక్తిమహత్త్వమును చెప్పుదురు. బిడాలశిశువు (పిల్లిపిల్ల) స్వయముగా చేష్టా

రహితమై ఉండును. దానిని భరించుట, పోషించుట, పైకి లేపుట, క్రిందికి దించుట సమస్తము తల్లియైన పిల్లి మీదనే ఆధారపడి ఉండును. వానరశిశువు, తానే తల్లిని జాగ్రగా పట్టుకొనును. ఈవిధముగానే భక్తుడు కేవలము భగవంతునిఆశ్రయించి ఉండును. వాని రక్షణభారమును భగవంతుడే వహించును.

"తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్ ।"

కాని, జ్ఞాని, స్వయముగా జ్ఞానబలముచేత సంసారబంధనమునుండి విముక్తుడగును.

ఒక బాలకుడు స్వయముగా తండ్రిచేయి పట్టుకొని నడచును. అతడు క్రింద పడుట సంభవము కావచ్చును. కాని, ఆ పిల్లవాని చేయి పట్టుకొని తండ్రి నడచుచుండును. ఆ పిల్లవాడు మాత్రము ఎగురుచు, దుముకుచు, నడచుచు భయరహితుడయియే ఉండును. ఈ రీతిగానే భగవంతునికి ఆత్మసమర్పణము చేసి, భక్తుడు భయరహితుడగును.

జ్ఞానులు, భక్తులు- ఇరువురికిని వివిధములైన కామ, క్రోధాది ఉపద్రవములు ఉండును. అచట, జ్ఞాని భగవదాశ్రితుడై ఆ ఉపద్రవములనుండి తప్పించుకొనుటకు ప్రయత్నించును. కాని,భక్తుని, భగవంతుడే రక్షించును. ఈ అభిప్రాయముతోనే జ్ఞాన వైరాగ్యాదులు గల వ్యక్తులపైన మాయాప్రభావము పడును. భక్తుల మీద మాయాప్రభావము పడదు.

భక్తిపైన మాయాకృతమైన ప్రభావములు వ్యర్థములగును. ఆ కారణము చేతనే భక్తిని 'దివ్యమణి' అని చెప్పిరి. జ్ఞానముపైన ఉపద్రవములు సఫలమగుటకు అవకాశము కలదు. కావుననే ఆ జ్ఞానమును 'దీప'మని చెప్పిరి. భగవంతుని, శరణుజొచ్చి, ఆయనకు ఆత్మసమర్పణము చేసి, ప్రాణి అత్యంత నిర్భయుడగును.అపుడు వానికి రక్షకుడు భగవంతుడే అగును.

ఇచట, జ్ఞానపక్షమును సమర్థించువారు చెప్పునదేమనిన, జ్ఞానము దీపము కాదు, మణియును కాదు, కేవలము దివ్యభాస్కరుడు. ఆ జ్ఞానసూర్యుడు ఉదయించినంతనే అవిద్య, అంధకారము, అవిద్యవలన కలుగు ఉపద్రవములు, తత్సంబంధులైన ఉలూకములు (గుడ్లగూబలు) మొదలైనవి అన్నియు, నశించును. అవిద్య, తత్కార్యమైన ప్రపంచము నశించుటకు మఱొక ఉపాయమే లేదు. శరణాగతి, ఆత్మసమర్పణము గూడా సంపూర్ణముగా జ్ఞానపక్షమందే సంగత మగును. జ్ఞానములేక, ప్రాణి, దేహేంద్రియ, మనోబుద్ధులను గూడా సమర్పణము చేయగలుగును. కాని, ఆత్మ సమర్పణము, ప్రత్యక్ చైతన్యాభిన్నమైన పరబ్రహ్మజ్ఞానము కలిగినపుడే సంభవమగును. ఘటాకాశము మహాకాశమందు ఆత్మ సమర్పణము చేయును. తరంగము, మహాసముద్రమందు ఆత్మ సమర్పణము చేయును. ఆరీతిగానే జీవాత్మ, దేహేంద్రియ, మనో బుద్ధి, అహంకారములకంటె భిన్నమైన చిదాత్మరూపమును శుద్ధ బ్రహ్మయందే సమర్పణము చేయును. ఆశ్రయత్వేన, లేక సంరక్షకత్వేన వరణరూపమైన శరణాగతి లభించును.

"మామేకం శరణం వ్రజ।"

"మామేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే।"

ఇత్యాది వాక్యములందు పూర్వోక్తపక్షము సమర్థించబడినది. భగవత్స్వరూపమైన ప్రపత్తి, లేక శరణాగతియందు మాయ నివృత్త మగును. అపుడే సర్వానర్థములు నివృత్తము లగును.

భగవత్ప్రీతి, భక్తి పరమ కళ్యాణమయమై ఉండును. దీనియందు సంశయమే లేదు. మహానుభావులు భక్తి, జ్ఞానముల సాధ్య, సాధన స్వరూపములందు భేదమును చెప్పిరి. ద్రవీభూతమైన మనస్సు యొక్క సగుణ, సాకార, సచ్చిదానందఘన, పరబ్రహ్మకారాకారితమైన మానసిక వృత్తియే భక్తి. ద్రవాపేక్ష లేని

మనస్సు యొక్క నిర్వికార పరబ్రహ్మాకారమైన మానసవృత్తియే జ్ఞానము. భగవద్గుణగణముచే అలంకృతమైన గ్రంథముల శ్రవణ, మననములచేత భక్తి ఉదయించును. సాధనసంపన్నుడై శుద్ధ, బుద్ధ, ముక్త బ్రహ్మబోధకములైన వేదాంత గ్రంథముల శ్రవణముచేత జ్ఞానము కలుగును. భక్తియందు ప్రతి ప్రాణికి అధికారము కలదు, జ్ఞానమందు సాధనచతుష్టయసంపన్నుడైన ఉత్తమాధికారికే అధికారము ఉన్నది. జ్ఞానఫలము బ్రహ్మాత్మనా అవస్థానము. నిఖిల రసామృతమూర్తి అయిన భగవదాకారాకారితము, మానసీవృత్తి రూపమునయిన భక్తికి ఫలము భగవత్సాయుజ్యాది ప్రాప్తి. కాని. సాంప్రదాయికుల దృష్టిలో భగవత్సామీప్యాది ప్రాప్తియే ముఖ్య ఫలము. భక్తికి ఫలము భక్తియే. అంతకంటె అధికమైన ఫల మేదియును లేదు-

"మద్గుణగణ శ్రుతిమాత్రేణ మయి సర్వగుహాశయే ।
మనోగతి రవిచ్ఛిన్నా యథా గంగాంభసోఽంబుధౌ ॥"

అనగా, భగవంతుని గుణగణ శ్రవణమాత్రముచేత సముద్రోన్ముఖమైన గంగాప్రవాహము వలె, సర్వగుహాశాయి (సర్వహృదయ గుహాంతర్వర్తి) అయిన భగవంతునియందు గంగాజలమువలె ద్రవీభూతమైన నిర్మల మానసిక వృత్తిప్రవాహమే భక్తి.

"భగవాన్ పరమానందస్వరూపః స్వయమేవ హి ।
మనోగత స్తదాకార రసతా మేతి పుష్కలామ్ ॥"

పరమానందస్వరూపుడు, రసాత్మకుడును అయిన భగవంతుడే భక్తుని ద్రవీభూతమైన మనస్సునందు వ్యక్తమై 'భక్తి' శబ్దముచేత చెప్పబడును. కోమలచిత్తుడైన ప్రాణి, భక్తికి ముఖ్యాధికారి.

సాధనాభ్యాసముచేత కఠినమైన చిత్తమందు గూడా ద్రవత్వమున్నను. ఆ చిత్తమునకు జ్ఞానము మంచిది. జ్ఞాని, నిర్గుణ

భక్తియే కాక, సగుణ భక్తియు కలవాడై ఉండును. కాని, వానికి భక్తికి భగవత్ప్రేమానందమునకు సంబంధించిన రసాస్వాదన రూపమైన దృష్టఫలమే ఉండును. ముక్తిరూపమైన అదృష్టఫలము జ్ఞానముచేతనే వానికి ప్రాప్తమగును. శిశుపాలాది తామస, రాజస భక్తులకు ముక్తిరూపమైన అదృష్టఫలమే కలుగును, దృష్టఫలము కలుగదు. కాని, భక్తునికైనచో, ప్రేమానందమయమైన దృష్ట ఫలము, జ్ఞానము, క్రమముగా ముక్తిరూపమైన అదృష్టఫలము గూడా ప్రాప్తమగును.

"దేవానాం గుణలింగానా మానుశ్రవిక కర్మణామ్ ।
సత్త్వ ఏవైకమనసో వృత్తిః స్వాభావికీ తు యా ।
లక్షణం భక్తియోగస్య నిర్గుణస్యేత్యుదాహృతమ్ ॥"

శబ్ద, స్పర్శాది విషయోపలబ్ధిచేత అనుమితమగు (ఊహించబడు) శ్రౌత, స్మార్త కర్మపరాయణములైన అంతర, బాహ్య సాధనములకు సత్త్వమందు (సత్త్వోపాధికుడైన విష్ణువు, లేక సత్తామాత్రుడైన పరబ్రహ్మయందు) స్వాభావికమైన వృత్తియే భక్తి. అనగా, శ్రౌత, స్మార్త కర్మలచేత శుద్ధ, నిర్మల బాహ్యేంద్రియములయొక్క, అంతఃకరణముయొక్క బ్రహ్మప్రవణత, లేక భగవత్పరాయణతయే భక్తి. ఈ భక్తి, భుజించిన అన్నమును జఠరాగ్ని పచనము చేసినట్లే (జీర్ణము చేసినట్లే) అన్నమయాది పంచ కోశములను దగ్ధము చేయును.

"జరయత్యాశు యా కోశం నిగీర్ణ మనలో యథా ।"

నిర్గుణ బ్రహ్మయందు, లేక సగుణబ్రహ్మయందు, తత్రాపి కామ, క్రోధ, స్నేహములవలన ఏదియో ఒక రీతిగా కలుగునట్టి మానసికమైన ఉన్ముఖతయే భక్తి.

వ్రజాంగనలు భగవంతుని వియోగాగ్నిచే స్థూల, సూక్ష్మ, కారణ శరీరత్రయమును, అన్నమయాది పంచకోశములను దగ్ధ

మొనర్చి, విశుద్ధమైన పరమానందరసాత్మక బ్రహ్మను పొందిరి. భక్తిసంబంధులైన కొన్ని లక్షణములు సగుణస్వరూపమందు నిర్గుణ స్వరూపమందును సాధారణముగా గోచరించును. కొన్ని లక్షణములు సగుణభక్తియందే పర్యవసానము నొందును. జ్ఞానికి, నిర్గుణపరబ్రహ్మయందు స్వాభావికమైన భక్తి అవశ్యము ఉండును. దానితోబాటు సగుణభక్తి గూడా ఉండును. ఈ ఆశయముతోనే నిమ్నోదాహృత వచనము చెప్పబడినది–

"తథా పరమహంసానాం మునీనా మమలాత్మనామ్ ।
భక్తియోగవిధానార్థం కథం పశ్యేమ హి స్త్రియః ॥"

అనగా, హేదేవ ! నిర్మలాత్ముడవైన నీవు పరమహంసలైన మహా మునీంద్రులకు భక్తియోగమును విహిత మొనర్చుటకై సగుణ, సాకారస్వరూపమును గ్రహించుదువని కుంతీదేవిశ్రీకృష్ణపరమాత్మతో పలికెను. నిర్గుణ, నిరాకార, నిర్వికారస్వరూపము సమస్త ప్రాణులకు నిరతిశయము, నిరుపాధికమును అయిన పరప్రేమకు ఆస్పదము. అయినను అనాది మహామాయాప్రభావముచేత ఆ నిర్గుణస్వరూపము యొక్క పరమానంద రసరూపత్వము,పరప్రేమాస్పదత్వము తిరోహితమైనట్లు కన్పడును.

తియ్యని పంచదార గూడా పిత్తదోషగ్రస్తమైన జిహ్వ గల ప్రాణికి కటువుగా అనిపించును. అట్లే, నిరతిశయ, నిరుపాధిక, పరప్రేమాస్పదము, ప్రత్యక్చైతన్యాభిన్నమును అయిన నిర్గుణ బ్రహ్మయందు ప్రేమయొక్క లోపము భాసించును. కావుననే అవివేకులకు విషయములందు,కాముకునకు కామినియందు ఉత్కట మైన ప్రేమ ఉండును. అట్లే, భగవంతునియందు మనస్సునకు ఆసక్తి ఉండవలయునని వివేకము కలవారు అభిలషింతురు.

"ముక్తానామపి సిద్ధానాం నారాయణపరాయణః ।
సుదుర్లభః ప్రశాంతాత్మా కోటిష్వపి మహామునే ॥"

కోటి సంఖ్యాకులైన ముక్తపురుషులు,సిద్ధులయందు గూడా నారాయణపరాయణుడు సుదుర్లభుడని భావము.

జ్ఞానులయందు గూడా ప్రారబ్ధకర్మ శేషించి ఉన్నకారణము చేత దృశ్య, ద్వైతదర్శనకాలమందు, శుద్ధచిదాత్మతత్త్వమునకు సంబంధించిన పూర్ణరసాత్మకతానుభవము, నిరతిశయమైన ప్రేమ, వ్యక్తము కాదు. కావుననే సవిశేష, సాకార, స్వజనరూపముతో ప్రకటమైన పరమాత్మతత్త్వమందు శుద్ధమైన భక్తి, ప్రీతి అపేక్షిత మగును. కావుననే, జ్ఞానులైన మహానుభావులకు గూడా భగవంతుని మధుర చరిత్రలందు, మంగళమయమైన మూర్తియందును ఆకర్షణము కలుగును. కాని, ఇంతమాత్రముచేత వారు, జ్ఞాననిష్ఠ నుండి, నిర్గుణ సిద్ధాంతము నుండి ప్రచ్యుతి చెందిరని భావించుట కేవలము అవివేకము (బాల్యచేష్ట).

పరమ విరాగియైన జనకునికి సీతాదేవిని చూచినంతనే ధైర్యము జారిపోయినదని చెప్పుటయందుగల తాత్పర్యమేమనిన, పరమ బ్రహ్మనిష్ఠుడైన విదేహుని మోహ, జ్ఞాన,వైరాగ్యశైథిల్యము చెప్పబడినది. ఇది, కేవలము శ్రీరామచంద్రుని స్నేహమహిమ.

ఈవచనముల తాత్పర్యమేమనిన, కేవల అంతఃకరణముతో అనుభూతమైన నిర్గుణబ్రహ్మాపేక్షయా, దివ్యలీలాశక్తియుక్తమైన బ్రహ్మయందు విశిష్టమైన సరసత అనుభవించబడును. ఒకడు, ఆదిత్యమండలమును కంటితోనే అనుభవించును, మఱొకడు, దూర వీక్షణయంత్రోపహితమైన నేత్రములచేత ఆ భాస్కరునే అనుభవించును (చూచును). మొదటి అనుభవముకంటె, రెండవ అనుభవమందు విశేషము ఉండురీతిగానే కేవలాంతఃకరణము వలన కలుగు తత్త్వానుభవముకంటె, దివ్యలీలాశక్తియుక్తమైన బ్రహ్మ తత్త్వమందు విశిష్ట మాధుర్యము అనుభూయమానమగును. కాని, సర్వోపాధి వినిర్ముక్తుడు, బ్రహ్మభావాపన్నుడును అయిన

ముక్తునికి, అభేదేన, అఖండరసాత్మక వస్తువుయొక్క అనుభూతి కలుగును. పుష్పమందు ఘ్రాణశక్తి ఉన్నప్పుడే, పుష్పమందలి మనోహర సౌగంధ్యము సంపూర్ణముగా ఆస్వాదించబడగలుగునని వివేకవంతులు చెప్పుదురు. ఈ దృష్టితో అత్యంతాభేదమందే అనంత రసము అనుభూయమాన మగును.అయినను,జీవన్ముక్తికాలమందు అంతఃకరణాది ఉపాధులు విద్యమానములే అయి ఉండును.కావున, ఆ అంతఃకరణముద్వారా పరిపూర్ణముగాఅపరిమితమైన ఆనందానుభూతి కలుగదు. దివ్యలీలాశక్తి సంబంధముచేత ఎచటయినను అత్యధిక రసానుభూతి కలుగును. ఇంతియే కాక, రాగానుగాప్రీతికై, సగుణబ్రహ్మ, ఉపాసించబడును. కావుననే ముక్త్యాది నిరపేక్షులై, జీవన్ముక్తులయినవారు భగవంతుని సగుణ రూపమును ప్రేమింతురు–

"ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే ।
కుర్వన్త్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః ॥"

అనగా, ఆత్మారాములు, చిద్గ్రంథి వీడిన మునులు గూడా ఉరుక్రముడైన భగవంతునియందు భక్తి కలిగియుందురు. కృతకృత్యులు, పూర్ణకాములు, ఆప్తకాములు, పరమ నిష్కాములైనను, భగవంతుని అద్భుత గుణముల ప్రభావము చేత భగవంతుని వైపునకు ఆకృష్టులగుదురు. పూర్ణకామునికి భక్తియందు ప్రవృత్తి అనుచితమే అని అనిపించినను, భగవంతుని అద్భుత గుణములే ఈ అనౌచిత్యమునకు సమాధానము చెప్పును. త్రిపురసుందరీపూజా రహస్యమందు అద్వైతవాదియైన జ్ఞానికి భక్తివిధము ఇట్లు చెప్పబడినది–

"యత్సుభక్తై రతిశయప్రీత్యా కైతవవర్జనాత్,
స్వభావస్య స్వరసతో జ్ఞాత్వాఽపి స్వాద్వయం పదమ్ ।
విభేదభావ మాహృత్య సేవ్యతేఽత్యన్త తత్పరైః ॥"

సుభక్తులైన జ్ఞానులు ఫలానుసంధానురూప కైతవ వర్జితులై (కాపట్యము లేనివారై), పరమ తత్త్వమును ఆరాధింతురు. అజ్ఞాని కైనచో, ఏదియో ఒక కామనయే ఉండును.

"ప్రయోజన మనుద్దిశ్య న మన్దోఽపి ప్రవర్తతే।"

ప్రయోజనము లేక, మందుడు సైతము ప్రవర్తించడుకదా ! అట్టి స్థితిలో కృతకృత్యుడు, జీవన్ముక్తుడు సగుణ భగవద్భజమందు ఏల ప్రవర్తించును ? అని ఇచట ప్రశ్న ఉదయించును. దీనికి సమాధాన మేమనిన, 'స్వభావస్య స్వరసతః' అనగా, వానికి భజించు స్వభావ మేర్పడును.

"స్వభావో భజనం హరేః"

అద్వైతతత్త్వము నెఱింగియు, స్వభావము చేతనే ఆహార్యమైన ద్వైతముతో ప్రీతిపూర్వకముగానే జ్ఞాని, తత్పరతతో భగవంతుని సేవించును–

"పారమార్థిక మద్వైతం ద్వైతం భజనహేతవే।
తాదృశీ యది భక్తిః స్యాత్ సా తు ముక్తిశతాధికా ॥"

'పారమార్థికము అద్వైతము, భజనమునకు ద్వైతము'– ఈ భావముతో భక్తి ఉన్నచో, ఆ భక్తి, ముక్తి శతముకంటె శ్రేష్ఠము అని భావము.

"ద్వైతం మోహాయ బోధాత్ప్రాక్ జాతే బోధే మనీషయా।
భక్త్యర్థం కల్పితం ద్వైత మద్వైతాదపి సున్దరమ్ ॥"

అద్వైతసాక్షాత్కారమునకు పూర్వము, ద్వైతము కేవలము మోహము కొఱకే అయి ఉండును. కాని, తత్త్వబోధ కలిగిన తరువాత, భక్తికొఱకైన ద్వైతము, అద్వైతముకంటె గూడా సుందరమైనది అని భావము.

తత్త్వవేత్తయొక్క అద్వైతాత్మావస్థానము, భగవద్భజనము

రెండును, సమానమే. తత్త్వజ్ఞానియైనను, వ్యవహారమందు భేద భావముతో సరసముగా ఉండును. ప్రియురాలు తన మేలి ముసుగును అడ్డుపెట్టుకొని, ప్రియతముని, వీక్షించుట సరసముగా ఉన్నట్లే, జ్ఞానియొక్క భగవద్భజనము సరసముగా ఉండును.

"ప్రియతమహృదయే వా ఖేలతు ప్రేమరీత్యా
పదయుగపరిచర్యాం ప్రేయసీ వా విధత్తామ్ ।
విహరతు విదితార్థో నిర్వికల్పే సమాధా
ననుభజనవిధౌ వా తుల్య మేతద్ద్వయం స్యాత్ ॥"

"విశ్వేశ్వరోఽపి సుధియా గలితేఽపి భేదే
భావేన భక్తిసహితేన సమర్చనీయః ।
ప్రాణేశ్వర శ్చతురయా మిలితేఽపి చిత్తే
చైలాంచలవ్యవహితేన నిరీక్షణీయః ॥"

అయస్కాంతమణియందు లోహమును ఆకర్షించగల విచిత్ర సామర్థ్యము ఉండును. అట్లే, భగవంతునియందు ఆత్మారాములను ఆకర్షించునట్టి సామర్థ్యము కలదు. ఈ దృష్టితోనే సనకాదులవలె, శుకాదులవలె ఎంతటి పరమ హంసలైనను,మహామునీంద్రులైనను, భగవంతుని స్వరూపమాధుర్యము చేత, సరసములైన చరిత్రముల చేత ఆకర్షితులగుదురు—

"తస్యారవిందనయనస్య పదారవింద కింజల్కమిశ్ర
తులసీమకరందరేణుః ।
అంతర్గతః స్వవివరేణ చకార తేషాం సంక్షోభ మక్షరజుషా
మపి చిత్తతన్వోః ॥"

అరవిందాక్షుడైన భగవంతుని శ్రీచరణారవిందముల కింజల్క మిశ్రితమైన తులసీదళ మకరందము హృద్గతమైనంతనే సనకాది

మునీంద్రుల నిర్వికార చిత్తమందు గూడా క్షోభ జనించెను అని భావము.

"స్వసుఖనిభృతచేతా స్తద్వ్యుదస్తాన్యభావో౽ప్యజిత
రుచిర లీలాకృష్టసారః ।"

స్వరూపభూతమైన పరమానందముతో నిండిన చిత్తము గలవాడు, నిరస్త ద్వైతజాలము కలవాడును అయిన శ్రీశుకాచార్యుడు గూడా భగవంతుని లీలలకు ముగ్ధుడై ఆకృష్టుడయ్యెను. ఇక, ఇతరుల విషయము చెప్పనేల ? స్వయముగా అనంతకోటి బ్రహ్మాండనాయకుడైన భగవంతుడే తన విచిత్ర సౌందర్య, మాధుర్యములకు ముగ్ధుడయ్యెను-

"యన్మర్త్యలీలౌపయికం స్వయోగం మాయాబలం
దర్శయతాగృహీతమ్ ।
విస్మాపనం స్వస్య చ సౌభగర్ధేః పరం పదం భూషణ
భూషణాంగమ్ ॥"

భగవంతుడు అత్యంత అద్భుతమైన స్వీయయోగమాయా శక్తిచేత భూషణములను గూడా భూషిత మొనర్చునట్టి మంగళమయమైన శరీరమును ధరించును. ఆ శరీరముచేత ఆయన, తానే మోహితుడగును. ఆ భగవంతునికి స్వయముగా విస్మయము కలుగసాగును. లోకపాలుల కిరీటపంక్తులచే పూజింపబడు పాదపీఠముచే అసమానమైన అతిశయము గలవాడు, ప్రభువును అయిన భగవంతుడు శ్రీనందరాణియొక్క మణిమయస్తంభములందు, లేక ప్రాంగణమందు ప్రతిబింబితమైన శోభాయుక్తమైన తన శరీరమును చూచినప్పుడు ఆ శరీరసౌందర్య,మాధుర్యములకు ముగ్ధుడై తత్పరిరంభణమునకై వ్యగ్రచిత్తుడగును. అట్లు, ఆశ్లేషము చేసికొనుటయందు అసఫలుడైనపుడు తల్లి ముఖమును చూచి, రోదించసాగును.

"రత్నస్థలే జానుచరః కుమారః సంక్రాన్త మాత్మీయ
ముఖారవిందమ్ ।
ఆదాతుకామ స్తదలాభఖేదాత్ నిరీక్ష్య ధాత్రీవదనం రురోద॥"

ఇట్టి స్థితిలో యోగీంద్రులైన మునీంద్రులు ఆయనయందు ముగ్ధులై రన్నచో, ఇందులో ఏమి ఆశ్చర్యము ఉన్నది? కాని, దీనివలన జ్ఞానమునకు న్యూనత్వము కలుగదు. ఏలన, జ్ఞానము, జ్ఞాని, భక్తి మహారాణిని సర్వదా పూజించుటయందే వారి గొప్ప దనము. యోగ్యుడైన పుత్రుని కర్తవ్యము ఇదియే. ఇటువంటి పుత్రునివలననే పుత్రవతియైన యువతి, ధన్యత చెందును.

ఓమ్ తత్ సత్



# 5. భక్తిరసామృతాస్వాదనము

సుధాతరంగిణి

భగవద్ధర్మముచేత ద్రవీభవించిన శుద్ధ హృదయమందు ప్రాదుర్భూతము, నిరుపమ సుఖసంవిద్రూపము, దుఃఖచ్ఛాయా వినిర్ముక్తము అయిన భక్తిమాహాత్మ్యము అచటచట శాస్త్రములందు వర్ణించబడిఉన్నది. సర్వాధిష్ఠానము, పరమానంద స్వరూపము, ఔపనిషదమును అయిన పరమ పురుషుని రసస్వరూపము, "రసో వై సః" ఇత్యాది శ్రుతులయందు ప్రసిద్ధము. లౌకికములైన ఆనందములందు గూడా రసస్వరూపుడైన ఆ భగవంతుని ఆంశిక (పాక్షిక) అభివ్యక్తియే ఉండును. రసవిషయము, రసాశ్రయము- వానియందలి మాలిన్యముచేత శుద్ధమైన రసమందు గూడా మాలిన్యము ప్రతీత మగును. భక్తిరసాయనకారుడు-

"కించ న్యూనాం చ రసతాం యాతి జాడ్యవిమిశ్రణాత్ ।"

అని చెప్పెను. అనగా, విషయావచ్ఛిన్నమైన చైతన్యమే ద్రవావస్థాపన్నమైన (ద్రవస్థితిని పొందిన) అంతఃకరణవృత్తియందు ఉపారూఢమై భావరూపత్వమును పొందును, అనంతరము, రస స్వరూపమగును.లౌకిక రసము పరమానందస్వరూపము కాజాలదు. కాని, భక్తిరసమందు అనవచ్ఛిన్న, చిదానందఘన స్వరూపుడైన భగవంతుని స్ఫూర్తి ఉండును. కావున, అది (భక్తిరసము) పరమానందస్వరూపము. ఆ కారణముచేత కృష్ణవిషయకమైన రతిని (ప్రీతిని)రసరూపమని కాక,భావరూపమనియే కొందఱు భావింతురు. ఏలన, దేవతావిషయకమైన రతి (ప్రీతి) భావరూపమే అయి ఉండును. కాని, వారి మతము సరి కాదు. ఎందువలననిన, కృష్ణ భిన్నమైన దేవతావిషయక రతి, భావరూపమై ఉండును. శ్రీకృష్ణ

పరమాత్మ, పరమానందస్వరూపుడు. కావున, కృష్ణవిషయకమైన రతి, రసరూపమే అగును, భావరూపము కాదు. కాంతాది విషయకమైన రతియొక్క రసత్వము భగవద్విషయకమైన రతియొక్క రసత్వమువలె పరిపుష్టమై ఉండదు. శ్రీమధుసూదనసరస్వతీస్వామి-

"పరిపూర్ణరసా క్షుద్రరసేభ్యో భగవద్రతిః ।
ఖద్యోతేభ్య ఇవాదిత్యప్రభేవ బలవత్తరా ॥"

అని తన 'భక్తిరసాయన'మందు చెప్పిరి. అనగా, భగవద్విషయకమైన రతి, పరిపూర్ణమైన రసస్వరూపమైన కారణముచేత, క్షుద్ర కాంతాదివిషయకమైన రతికంటె, సూర్యప్రభ, ఖద్యోతములకంటె (మిణుగురు పురుగులకంటె) బలవత్తరమైనట్లు, బలవత్తరమై ఉండును అని భావము.

విషయము, ఆశ్రయము-రెండును, లేక ఆ రెంటిలో ఏదియో ఒకటి రసాత్మకమైనచో రతి గూడా విశుద్ధ రసస్వరూప మగును. విశేషించి, సంయోగ, వియోగాత్మకము, ఉద్బుద్ధ ఉభయవిధమును అయిన శృంగారము, రససారసర్వస్వమును అయిన భగవంతుడే మానసిక వృత్తియందు విశిష్టమైన రసభావమును పొందును. రసమందు రసోద్రేకకల్పన జరిగినట్లే ఇచట గూడా కల్పన చేయబడినది. భగవంతుని హృదయమందు గల పూర్ణానురాగము రససారసాగరసముద్భూత, నిర్మల, నిష్కలంక, చంద్రస్వరూపిణి, శ్రీవృషభానునందిని అయిన రాధారాణియందు, రాధారాణి, హృదయమందు విరాజిల్లుచున్న శ్రీకృష్టవిషయక ప్రేమరససార సాగరుడు, రససముద్భూత చంద్రరూపుడును అయిన వ్రజేంద్ర నందనుడు శ్రీకృష్ణుడు. కావున, ఇచట, ప్రేమ, సదానందైక రసస్వరూపము. ఏలన, విషయము, ఆశ్రయము- రెండును రసస్వరూపములే. మఱొక స్థలమందైనచో విషయము, ఆశ్రయము- రెండును విజాతీయములై ఉండును. అవి రసస్వరూపములు కావు.

ఈవిధముగానే భగవల్లీల, లీలాప్రదర్శనము చేయు స్థానము, లీలాపరికరములు, ఉద్దీపనాది సామగ్రి గూడా రసస్వరూపములే. సచ్చిదానందరససారమైన సరోవరమునుండి సముద్భూతమైన సరోజము (పద్మము) కేసరములు, పరాగము, మకరంద స్వరూపమైన వ్రజము (వ్రేపల్లె), వ్రజాంగలు, శ్రీకృష్ణుడు, తత్ప్రేయసి శ్రీవృషభానునందిని అయిన రాధారాణి, అందఱును రసాత్మకులుగానే స్పష్టమగుదురు.

"యత్ర ప్రవిష్టః సకలోఽపి జన్తురానందసచ్చిద్
ఘనతా ముపైతి ।"

"సత్య జ్ఞానానంతానందమాత్రైకరసమూర్తయః ।"

ఇత్యాది వచనములు ఈవిషయమును ధ్రువీకరించుచున్నవి.

ఈ విషయములన్నియు, బ్రహ్మవాదమునందే సంగతము లగును. కావున, బ్రహ్మవిత్తముడైన శ్రీమధుసూధనసరస్వతి 'భక్తిరసాయనమును' బ్రహ్మవాదము యొక్క అనురోధమువలననే రచించిరి. భక్తిరసామృతరసికులయిన ఇతర మహానుభావులు గూడా ముక్తులైన మునులు వ్యాకులతతోఅన్వేషించుచున్నఫలమే దేవకీదేవిగర్భమున ఫలించెను, యశోద ఆ ఫలమునే పోషించి పాలించెను, గోపికలు యథేష్టముగా ఆ పలమునే అనుభవించిరి. యశోదయొక్క మంగళమయమైన అంకమున నీలకమలమువలె చిదానందసరోవరమునుండి శ్యామతేజస్సు ప్రకటమయ్యేను అని చెప్పిరి. ఇతర భక్తులు ఈవిధముగా చెప్పుదురు_ 'భృంగములు ఆస్వాదించని, వాయుచాలితము కాని సౌగంధ్యము గల జలమందు ఉత్పన్నము కాని, తరంగకణతాడితము కాని, ఎవరును, ఎచటను చూడని ఫలమది.

'ఒక భక్తుడు ఇట్లనును_' నిగమవనములందు నిరంతరము అన్వేషించుచు, అత్యంతము ఖేదయుక్తులైనవారు ఈ ఉపదేశమును

వినుదురుగాక, ఉపనిషత్తుల పరమ తాత్పర్యమునకు విషయము, ప్రత్యక్చైతన్యాభిన్నమును అయిన పరబ్రహ్మ, గోపికాగృహమున ఉలూఖలమునకు బంధించబడి ఉన్నాడు.'

మఱొక భక్తుడు ఇట్లు పలుకును— 'సఖి ! కౌతుకమైన ఒక విషయము వినుము. శ్రీమన్నందరాజ ప్రాంగణమున గోధూళిధూసరితమైన వేదాంతసిద్ధాంతము 'థై, థై 'అని నాట్యము చేయుచుండగా నేనుచూచితిని."

మఱొక భక్త కవి, 'శ్యామల, మోహమయమూర్తి అయిన భగవానుడు, గోపాంగనల పుంజీభూతమైన ప్రేమయే అన్నట్లు ఉన్నాడు, అథవా, యదువంశీయులమూర్తీభవించిన సౌభాగ్యమా అన్నట్లు ఉన్నాడు.' అథవా, శ్రుతుల గుప్తవిత్తమైన బ్రహ్మయా అన్నట్లు ఉన్నాడు—

"ముక్తమునీనాం మృగ్యం కిమపి ఫలం దేవకీ ఫలతి ।
తత్పాలయతి యశోదా ప్రకామ ముపభుంజతే గోప్యః ॥"

"అనాఘ్రాతం భృంగై రనపహృత సౌగంధ్య మని లై
రనుత్పన్నం నీరేష్వనుపహత మూర్మికణభరైః ।
అదృష్టం కేనాపి క్వచన చ చిదానన్దసరసో
యశోదాయాః క్రోడే కువలయమివ తదౌజః సమభవత్ ॥"

"పర మిమ ముపదేశ మాద్రియధ్వం నిగమవనేషు
నితాన్తఖేదఖిన్నాః ।
విచినుత భవనేషు వల్లవీనా ముపనిషదర్థ ములూఖలే
నిబద్ధమ్ ॥"

"శృణు సఖి ! కౌతుక మేకం నన్దనికేతనాంగణే
మయా దృష్టమ్ ।
గోధూళిధూసరితాంగో నృత్యతి వేదాన్తసిద్ధాన్తః ॥"

"పుంజీభూతం ప్రేమ గోపాంగనానాం మూర్తీభూతం
భాగధేయం యదూనామ్ ।
ఏకీభూతం గుప్తవిత్తం శ్రుతీనాం శ్యామీభూతం
బ్రహ్మ మే సన్నిధత్తామ్ ॥"

నిఖిల రసామృతమూర్తిఅయిన భగవంతుని మంగళమయ అలంకారాది సామగ్రి అంతయు, రసస్వరూపమే. సౌరభ్యముతో ఆయనకు ఉద్వర్తనము (నలుగుపెట్టుట), స్నేహముచేత అభ్యంజనము, మాధుర్యముతో, లేక స్వావయవ తేజస్సుతో స్నానము, లావణ్యముతో మార్జనము, సౌందర్యముతో అనులేపనము, త్రైలోక్యలక్ష్మి (శోభ)తో అలంకారము జరుగును.

వృషభానునందిని (రాధిక) గూడా మహాభావస్వరూపిణి. సఖుల ప్రణయరూపమైన మంచి గంధముచేత ఆమెకు నలుగు పెట్టుట, కారుణ్యామృతధారతో, లావణ్యామృతధారతో, తారుణ్యామృత ధారతోను స్నానము, లజ్జారూపమైన పట్టువస్త్ర పరిధానము, శ్యామల, ఉజ్జ్వల కస్తూరీవిరచితమైన శరీరము, కంప, అశ్రు, పులక, స్తంభాది అలంకారస్వరూపములు రత్నములు, శ్రీకృష్ణుని పరిధానము, పీతాంబరము శ్రీరాధారాణి, శ్రీరాధారాణియొక్క కజ్జల (కాటుక), మృగమద, కర్ణోత్పల, పీతాంబరాదులు శ్రీకృష్ణుడే-

"శ్రవసోః కువలయ మక్ష్ణో రంజన మురసో మహేన్ద్ర
మణిదామ ।
బృన్దావనతరుణీనాం మండన మఖిలం హరిర్జయతి ॥"

శృంగారరసమునకు అంగిత్వము, ఉజ్జ్వలత్వము, అనౌపచారికముగా రాధాకృష్ణులందే సంగతమగును. కృష్ణవిషయకమైన కామ, క్రోధ, భయాదులు గూడా కృష్ణప్రాప్తియందే పర్యవసానము నొందును. ఎవరైనను, దీపమన్న బుద్ధితో చింతామణిని గ్రహించుటకు ప్రవృత్తుడైనచో, వానికి చింతామణియే లభించును.

ఆరీతిగానే జార, చోరాది భావనతో గూడా కృష్ణునియందు ప్రవృత్తి గలవాడు భగవత్ప్రాప్తినే పొందును. లౌకికమైన జారధర్మము, పరలోకాదులను నాశమొందించును. భగవంతుడు పంచకోశములను, అవిద్యను, కామమును, కర్మాదులను నాశమొందించును. కావున, కృష్ణుడు జారుడు—

"తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాఽపి సంగతాః।
జహు ర్గుణమయం దేహం సద్యః ప్రక్షీణబంధనాః ॥"
"కామం క్రోధం భయం స్నేహ మైక్యం సౌహృదమేవ వా।
నిత్యం హరౌ విదధతో యాన్తి తన్మయతాం హి తే ॥"

ఇత్యాది వచనములు ఇందుకు ప్రమాణములు. అనిమిత్తమైన (అవ్యాజమైన) భక్తియే కోశములను జీర్ణింపజేయును. అయినను, సనిమిత్తమైన భక్తియొక్క పర్యవసానము గూడా అనిమిత్తమైన భక్తియందే అగును. అనిమిత్తమైన పరాభక్తి స్వతఃసిద్ధము. అయినను, పచ్చి మామిడికాయ పండిన మామిడిపండునకు కారణమైనట్లే అపరాభక్తి, పరాభక్తికి కారణమగును. ఈవిధముగా అంగీకరించినపుడే—

"అనిమిత్తా భాగవతీ భక్తిః సిద్ధే ర్గరీయసీ।"
"అహైతుక్యవ్యవహితా భక్తి ర్భగవతో నృప।
జరయత్యాశు యా కోశం నిగీర్ణ మనలో యథా ॥"
"భక్త్యా సంజాతయా భక్త్యా.......... ॥"

ఇత్యాది వచనములకు సంగతి కుదురును. రసాత్మకమైన ప్రేమ, రసస్వరూపమే. ప్రాదుర్భావసమయమున, భగవంతుడు కొలది హేతువునైనను అపేక్షించడు. ఆయన స్వరూపమందు అపరాధ పరంపరచేత హాని గాని, ప్రణామపరంపర చేత వృద్ధిగాని, కలుగదు. ఆ భగవంతుడు స్వీయ రసాస్వాదనమును, అమృతాస్వాదనమును

గూడా అల్పమొనరించును. అయసను, ముల్లోకముల దుఃఖమును నాశమొందించును. అట్టి మహా ప్రేమను వాక్కునకు విషయముగా జేసి, అల్పమైనదిగా ఏల చేయవలయును?—

"ప్రాదుర్భావదినే న యేన గణితో హేతు స్తనీయానపి ।
క్షీయేతాపి న చాపరాధవిధినా నత్యా న యో వర్ధతే ॥
పీయూషప్రతివాదనస్త్రిజగతీదుఃఖద్రుహః సాంప్రతమ్ ।
ప్రేమ్ణ స్తస్య గురోః కిమద్య కరవై వాఙ్నిష్ఠతాలాఘవమ్ ॥"

వాక్కునకు విషయముగా చేసినంతనే ప్రేమ, అల్పమైనను అగును, లేక, అస్తమించును. రసికుల ప్రేమ ఒక దీపమువంటిది. ఆ ప్రేమ, హృదయరూపగృహములను నిశ్చలముగా ప్రకాశితము చేయును. ఆ ప్రేమజ్యోతిని వదనద్వారమున బహిర్గతము చేసినచో, అది ప్రశమితమైపోవును, లేక, మందమైపోవును—

"ప్రేమాద్వయో రసికయోరపి దీప ఏవ హృద్వేశ్మ
భాసయతి నిశ్చలమేవ భాతి ।
ద్వారాదయం వదనతస్తు బహిష్కృతశ్చేత్ నిర్వాతి శీఘ్ర
మథవా లఘుతా ముపైతి ॥"

ముక్తిని కోరునట్టి పరమ విరక్తుడు గూడా ఈ భక్తిని అభిలషించును—

"కామం భవః స్వవృజనైః నిరయేషు నః స్యాత్ చేతోఽలి
వద్యది ను తే పదయో రమేత ।"

కావున, నాల్గవ పురుషార్థమైన మోక్షమందు భక్తి, పర్యవసానము చెందును. భక్తిరసాయనకారుని సిద్ధాంతమందు సగుణ బ్రహ్మయందువలె, నిర్గుణబ్రహ్మయందు గూడా భక్తి అంగీకరించ బడెను—

"దేవానాం గుణలింగానా మానుశ్రవిక కర్మణామ్ ।
సత్త్వ ఏవైకమనసో వృత్తిః స్వాభావికీ తు యా ॥"

"లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య హ్యుదాహృతమ్ ॥"

అను వచనములు భక్తిరసాయనకారుని సిద్ధాంతమునకు ప్రమాణములు. పై వచనములకు నిష్కృష్టమైన అర్థమేమనిన, అనుశ్రవిక (వైదిక) కర్మలచేత ఆరాధ్యుడు, సత్త్వాదిగుణములుగల దేవతల మధ్య సత్త్వోపాధికుడైన విష్ణువునందు స్వాభావికమైన ఏ మానస వృత్తి ఉండునో, దానిని నిర్గుణభక్తియోగమని చెప్పుదురు.

వేదములు, తదనుకూలములైన శాస్త్రములు భగవంతునికి సంబంధించిన రామ, కృష్ణ, శివ, విష్ణ్వాది స్వరూపముల ఏ ఉపాసనమును చెప్పినవో, ఆ స్వరూపములందలి భక్తి,రసస్వరూపమే. అయినను, సర్వరసములు అనాయాసముగా సాక్షాత్తుగా కృష్ణుని యందే సంగతములగును. కావుననే భక్తిరసాయనకారుడు-

"పరమ మిహ ముకున్దే భక్తియోగం వదన్తి ।"

అను వచనమందు ప్రత్యేకముగా 'ముకుంద' శబ్దమును ప్రయోగించిరి. భక్తిరసమునకు ఆలంబన విభావము సర్వాంతర్యామి, సర్వేశ్వరుడును అయిన భగవంతుడే అని రాబోవు గ్రంథమందు స్పష్టము చేయబడును. విశేష ప్రేమనిరూపణ ప్రసంగమందు ఇట్లు చెప్పబడెను-

"ద్రుతే చిత్తే ప్రవిష్టా యా గోవిందాకారతా స్థిరా సా భక్తి
రిత్యభిహితా .........॥"

భగవద్ధర్మముచేత ద్రవీభూతమైన చిత్తమందు ప్రవేశించిన స్థిర గోవిందాకారతయే 'భక్తి' అని చెప్పబడును.

కర్మ, ఉపాసనా, జ్ఞానములను అవగతము చేయునట్టి సమస్త శాస్త్రముల తాత్పర్యము అంతఃకరణశుద్ధికై, మలవిక్షేపనివృత్తి పూర్వకముగా భగవదుపాసనము, భగవత్స్వరూపజ్ఞానము ద్వారా పరమ పురుషార్థరూపమైన భక్తియందే కలదు. ద్రవావస్థను పొందిన

చిత్తము నిత్యబోధ సుఖాత్మ, విభువును అయిన భగవంతుని గ్రహించినచో, ఇక మిగిలినది ఏమి ఉండును ?

"భగవన్తం విభుం నిత్యం పూర్ణం బోధసుఖాత్మకమ్ ।
యది గృహ్ణాతి ద్రుతం చిత్తం కిమన్య దవశిష్యతే ॥"

అని భక్తిరసాయనవచనము.

విషయమునందు చిత్త కాఠిన్యము, భగవంతునియందు చిత్త ద్రవత్వము ఉండవలయును.

"కాఠిన్యం విషయే కుర్యాద్ ద్రవత్వం భగవత్పదే ।"

ఆనందము నుండియే సమస్త భూతజాతము ఆవిర్భవించును, ఆనందము వలననే జీవించును, ఆనందమందే ఉపసంహృత మగును—

"ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, ఆనందేన జాతాని జీవన్తి, ఆనందం ప్రయన్త్యభిసంవిశన్తి ॥"

కావున, సమస్త ప్రపంచము పరమానందరసస్వరూపమే. కాని, స్వప్నాది ప్రపంచమువలె బాధిత మగుట వలన,భగవంతుని స్ఫూర్తి కలిగినపుడు ప్రపంచము నివృత్త మగును. అపుడు, భగవద్రూపమే శేషించి ఉండును. అధిష్ఠానజ్ఞానముచేత అధ్యస్తమైన పదార్థము నివృత్తమగును. దీనివలన, విషయ విషయకములైన సమస్త ప్రేమలు భగవంతునియందే పర్యవసితములగును.

భగవత్ప్రేమను పొందుటకై సాధకునికి క్రమముగా మహాపురుషుల సేవయందు, వారు ఆచరించు ధర్మమందును శ్రద్ధ, భగవద్గుణశ్రవణమందు రతి (ప్రేమ), స్వరూపప్రాప్తి, ప్రేమవృద్ధి, భగవత్స్ఫురణము, భగవద్ధర్మమందు నిష్ఠ మున్నగునవి అపేక్షితములగును.

"ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే ।
కుర్వన్త్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః ॥"

ఆత్మారాములు, ఆప్తకాములు, పూర్ణకాములు,పరమనిష్కాములును అయిన మహామునీంద్రులు గూడాభగవంతుని భజింతురని భావము.

సర్వాధిష్ఠానము, ప్రత్యక్ చైతన్యాభిన్నము నయిన పరబ్రహ్మయొక్క సాక్షాత్కారము ద్వారా సర్వవిధములైన భేదములు నశించినపుడు ఎవరి మనస్సు ఆనందపరిపూర్ణ మగునో, వారికి,వారికంటె భిన్నముగా భగవంతుని స్ఫురణమే కలుగజాలదు. వారియందు రాగము కలుగుటకు అవకాశమే లేదు. అట్టిస్థితిలో భక్తి సుతరాం అసంభవము అని కొందఱు చెప్పవచ్చును. కాని, ఇది యుక్తము కాదు. ఎందుచేతననగా, వారికి స్వారసిక ప్రేమచేత భేదమునకు సంబంధించిన ఆహార్యజ్ఞానము కలుగును (బాధకాలికమైన ఇచ్ఛవలన కలుగు జ్ఞానము ఆహార్యజ్ఞానమని చెప్పబడును). ఆహార్యజ్ఞానము ద్వారా రాగము, భక్తియు కలుగవచ్చును. 'త్రిపురసుందరీరహస్యము' అను గ్రంథమందు ఈ విధముగా చెప్పబడినది_ భక్తులైనవారు ప్రత్యక్ చైతన్యాభిన్నమైన పరబ్రహ్మను తెలిసికొని అతిశయమైన ప్రీతితో ఫలాభిసంధిరహితులై ఆహార్యజ్ఞానము ద్వారా భేదభావకల్పనము చేసికొని మహా తత్పరతతో స్వభావసిద్ధముగానే భగవంతునియందు స్వాభావికమైన భక్తి కలిగియుందురు.

"యత్సుభక్తై రతిశయప్రీత్యా కైతవవర్జనాత్ ।
స్వభావస్య స్వరసతో జ్ఞాత్వాఽపి స్వాద్వయం పదమ్ ।
విభేదభావ మాహృత్య సేవ్యతేఽత్యన్తతత్పరైః ॥

ఆహార్యజ్ఞానము ద్వారా వ్యామోహప్రసక్తి కల్పించబడ జాలదు. ఏలన, భగవానుడు సత్యమునకు గూడా సత్యము ('సతస్య సత్యమ్'). రాజు కానివానిని, రాజుగా జేయువాడు రాజరాజు అని చెప్పబడును. అట్లే భగవంతు అసత్యమును సత్యముగా జేయును. అనగా, పారమార్థిక సత్యముకంటె కించిన్న్యూనమైన

సత్త గల, భజనోపయోగి అయిన మఱొక సత్యము అంగీకరించ బడును. కావున, పారమార్థికమైన అద్వైత సిద్ధాంతము యథా తథముగానే ఉండును. పారమార్థిక అద్వైతజ్ఞానము కలిగినపుడు, భజనోపయోగి అయిన ద్వైతమును అంగీకరించి, భగవంతుని, భజించును. ఇటువంటి భక్తి, ముక్తిశతముకంటె అత్యంత శ్రేష్ఠము. ప్రత్యక్చైతన్యాభిన్నమైన పరబ్రహ్మవిజ్ఞానము కలుగుటకు పూర్వము: ద్వైతము బంధహేతువు. కాని, విజ్ఞానము కలిగిన తరువాత, భేదము, మోహము నివృత్తము అగుటవలన, భక్తి కొఱకై భావిత మైన ద్వైతము, అద్వైతముకంటె అత్యంత సమీచీనము–

"పారమార్థిక మద్వైతం ద్వైతం భజనహేతవే।
తాదృశీ యది భక్తిః స్యాత్ సా తు ముక్తిశతాధికా ॥"
"ద్వైతం మోహాయ బోధాత్ ప్రాక్ జాతే బోధే మనీషయా।
భక్త్యర్థం భావితం ద్వైత మద్వైతాదపి సున్దరమ్ ॥"

గాఢమైన అనురాగమందును, ఆలింగనాది రసాస్వాదన మందును ప్రవీణురాలు, పతివ్రతయు నయిన నాయిక, రసవిశేష వికాసమునకై మేలి ముసుగు చాటునుండి, తన ప్రియతమునికై నిరీక్షించును. ఆ రీతిగానే తత్త్వసాక్షాత్కారసంపన్నుడు, అభేదాను భవము కలవాడును అయిన విద్వాంసుడు (జ్ఞాని) గూడా రస విశేషోపచయమునకై భేదభావముతోనే భగవంతుని, అర్చింపగోరును–

"విశ్వేశ్వరోఽపి సుధియా గలితేఽపి భేదే భావేన
భక్తిసహితేన సమర్చనీయః।
ప్రాణేశ్వర శ్చతురయా మిలితేఽపి చిత్తే
చేలాంచలవ్యవహితేన నిరీక్షణీయః ॥"

ప్రియుని వక్షఃస్థలముపైన విలాసపూర్ణముగా కాంతాసంచ రణము, లేక పాదయుగళసేవ, సమానమైన చందముగానే జ్ఞాని యొక్క తత్త్వనిష్ఠ, భగవత్పూజ– రెండును సమానమే–

"ప్రియతమ హృదయే వా ఖేలతు ప్రేమరీత్యా
పదయుగపరిచర్యా ప్రేయసీ నా విధత్తామ్ ।
విహరతు విదితార్థో నిర్వికల్పే సమాధౌ
నను భజనవిధౌ వా తుల్య మేతద్ద్వయం స్యాత్ ॥"

ప్రాతిభాసిక ప్రపంచముకంటె, ఘటాదులు సత్యవస్తువులు. ఆ ఘటాదులు స్వకారణమైన మృదపేక్షయా అసత్యములై ఉండును. అథవా, మృదాది పదార్థములు సైతము స్వకారణాపేక్షయా, అసత్యములగును. ఆ విధముగానే పారమార్థిక సత్తాపేక్షయా, స్తర(భూమికా) భేదము చేత కించిన్న్యూన సత్త గల వస్తువు అపారమార్థిక మగును. ఈ సత్తయే భగవల్లీలాపరికరమునకు సంబంధించిన సత్త. కావున, సిద్ధాంతతః, అద్వైతము యథాతథముగానే ఉండును. దానికి వ్యాకోపము కలుగదు.

చిత్తద్రుతికి కారణములు అనేకములు. తద్భేదము వలననే భక్తియందు భేదము ఉండును–

"చిత్తద్రుతేః కారణానాం భేదాత్ భక్తిస్తు భిద్యతే ।"

శరీర విశేషమునకు సంబంధించిన స్పృహ ఉన్నప్పుడు, సంనిధాన, భేదముచేత కామము ద్వివిధముగా ఉండును. దానివలన, ద్రవీభూతమైన చిత్తమందు శ్రీకృష్ణనిష్ఠతయే సంభోగ, విప్రలంభాఖ్య రతి. ఈరీతిగానే క్రోధ, స్నేహ, హర్షాదులవలన కలిగిన చిత్తద్రుతియందు గూడా రతి కలుగునని తెలియవలయును,

"కామజే ద్వే రతీ శోక హాస భీ విస్మయా స్తథా ।
ఉత్సాహో యుధి దానే చ భగవద్విషయా అమీ ॥"

శృంగార, కరుణ, హాస్య, ప్రీతి, భయానక, అద్భుత, యుద్ధవీర, దానవీరము లన్నియు వ్యామిశ్రణము (కలయిక) వలన కలుగును.రాజస, తామస భక్తులు అదృష్టఫలము మాత్రమే

కలిగి ఉండును. మిశ్రిత భక్తి, దృష్టాదృష్ట ఉభయఫలము కలదై ఉండును. ఈవిధముగానే సాధకులందు గల విశేషము వలన, శుద్ధ సత్త్వోద్భవఫలము గూడా అయి ఉండును.

సనకాది సిద్ధులయందు భక్తి, దృష్టఫలము కలదై ఉండును. నిదాఘతాప సంతప్తుడైన వ్యక్తికి, గంగాస్నానము దృష్టాదృష్ట ఫలము కలదై ఉండును. అట్లే, వైధీ భక్తియందు గూడా సుఖాభివ్యక్తి ఉండును. కావున అది, దృష్టాదృష్టఫలకమై ఉండును. శీతవాతాతురుడైన పురుషుడు, గంగాస్నానము చేసినచో దానివలన అదృష్టఫలము మాత్రమే కలుగును. దృష్టాంశము ప్రతిబద్ధమగును. ఆవిధముగానే రాజస, తామస భక్తియందు దృష్టాంశము ప్రతిబద్ధమై ఉండును. గంగాస్నానము చేసినపుడు, పునః, గంగాస్నానము చేయువారికి, దృష్టమాత్రఫలము కలుగురీతిగానే జీవన్ముక్తుల భక్తి, దృష్టఫలమాత్రపర్యవసాయినియై ఉండును.

"రాజసీ తామసీ భక్తి రదృష్ట ఫలమాత్రభాక్ ।
దృష్టాదృష్టోభయఫలా మిశ్రితా భక్తి రిష్యతే ॥
శుద్ధ సత్త్వోద్భవాఽప్యేవం సాధకేష్వస్మదాదిషు ।
దృష్టమాత్రఫలా సా తు సిద్ధేషు సనకాదిషు ॥
దృష్టాదృష్టఫలా భక్తిః సుఖవ్యక్తే ర్విధేరపి ।
నిదాఘదూనదేహస్య గంగాస్నానక్రియా యథా ॥
రజస్తమోఽభిభూతస్య దృష్టాంశః ప్రతిబధ్యతే ।
శీతవాతాతురస్యేవ నాదృష్టాంశస్తు హీయతే ॥
తథైవ జీవన్ముక్తానా మదృష్టాంశో న విద్యతే ।
స్నాత్వా భుక్తవతాం భూయో గంగాయాం క్రీడతాం యథా ॥"

గాలిలో పెట్టిన దీపజ్వాలవలె రజస్తమస్సులచే అభిభూతులైన శిశుపాలాదులకు స్వప్రకాశానందాకారము గూడా బుద్ధివృత్తి

ప్రవాహసుఖాభివ్యంజకము కాజాలదు. ప్రతిబంధము నశించినపుడు సుఖాభివ్యక్తి కలుగును. చిత్తము ద్రవించినపుడే భక్తి కలుగును. ఆ చిత్తద్రుతి కలుగనపుడు, వేనమహారాజు భక్తుడును కాలేదు, వానికి ఫలమేమియును లభించలేదు. శిశుపాలుడు భగవత్సత్తను అంగీకరించెడివాడు. కాని, వేనుడు భగవత్సత్తనే అంగీకరించెడివాడు కాడు. అతడు నాస్తికుడు. కావున, వానికి భగవత్సంబంధమే కలుగ

"అద్వేష్టృత్వాదివత్ తేషాం స్వభావో భజనం హరేః ।"

సాధనాభ్యాసము, పరిపాకావస్థాభేదము చేత, 'తస్యైవాహమ్'– నేను ఆయనకు సంబంధించినవాడనే, "మమైవాసౌ" ఇతడు నాకు సంబంధించినవాడే, "సో౽హం" నేను అతడినే–ఈవిధముగా మూడు విధములైన భావములు ఉండును. మూడవ భావమునకు ఉదాహరణములు,

"కృష్ణో౽హం పశ్యత గతిమ్"

"అహం బ్రహ్మ పరంధామా"

"మధురిపు రహ మితి భావనశీలా"

ఇత్యాదులు–

"మామేకం శరణం వ్రజ"

ఇత్యాది గీతోపసంహారాత్మకమైన శ్లోక తాత్పర్యము గూడా చివరిదైన మూడవ భావనయే. 'ఏకము, అద్వితీయము, త్రివిధ భేద శూన్యమును అయిన 'మాం' ప్రత్యక్ చైతన్యాభిన్న పరబ్రహ్మనైన నన్ను 'శరణం' ఘటాకాశమునకు మహాకాశమువలె, తరంగమునకు జలరాశివలె ఆశ్రయుడ ననియు, లేక రక్షకుడ ననియు నిశ్చయముగా తెలిసికొనుము.

"నైన మవిదితో దేవో భునక్తి"

ఈ శ్రుతిని అనుసరించి ప్రత్యగభిన్నతారూపముతో విదితమైన బ్రహ్మయే అవిద్యను, అవిద్యాకార్యాత్మకమైన ప్రపంచమును అపనయనము చేయువాడు (నశింపజేయువాడు) గాన, ఆయన రక్షకుడు.

పరబ్రహ్మ, పరమాత్మకంటె అభిన్నుడైనపుడే ప్రత్యగాత్మకంటె అభిన్నుడగుటచేత పరబ్రహ్మకు అపరోక్షత్వము, అనౌపాధిక, అనతిశయ పరప్రేమాస్పదత్వము సిద్ధించును. ప్రత్యగాత్మకంటె

భిన్నముగా తటస్థుడైన పరమాత్మగా ఉండిపోయినచో, ఉపయుక్త ములైన విషయములు సద్ధింపజాలవు.

"ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి ।"

అను శ్రుతి, ప్రత్యగాత్మకు శేషరూపముతోనే సర్వప్రేమాస్పద త్వము చెప్పుచున్నది. మన క్షేమమునకై భగవద్భజనము' ఔర సహితమైన మధుర పానమువలె ఉండును. ఏలన, స్వాస్థ్యము కొఱకు కటుమిశ్రిత గుడోదకమును గూడా త్రాగుదురు. అపుడు, భగవంతునియందు సాతిశయమైన ప్రేమయే ఉండును,నిరతిశయ మైన ప్రేమ ఉండదు. ప్రత్యగాత్మస్వరూపము భగవంతుడుగా భావించబడినపుడే భగవంతుని నిరుపాధిక పరప్రేమాస్పదత్వము సంగత మగును.

"యత్సాక్షా దపరోక్షాద్ బ్రహ్మ ।"

అను శ్రుతివచనము బ్రహ్మయొక్క అవేద్యత్వముచేతనే (తెలియ బడకపోవుట అను గుణముచేతనే) అపరోక్షత్వమును చెప్పినది. ప్రత్యగాత్మకంటె భిన్నమైన తటస్థ బ్రహ్మకు ఏవిధముగాను ఈ అపరోక్షత్వము పొసగజాలదు. ఆత్మకంటె భిన్నమైన పదార్థము యొక్క సిద్ధి, ప్రమాణాధీనమయియే ఉండును.స్వతః భాసమానము స్వారసికము, అనతిశయమును అయిన ప్రేమస్వరూపమే భగవంతుడు. కావుననే శ్రీశుకాచార్యుడు సర్వులకు అంతరాత్మ, శ్రీకృష్ణుడని చెప్పెను–

"కృష్ణమేన మవేహి త్వ మాత్మాన మఖిలాత్మనామ్ ।
జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాభాతి మాయయా ॥"

కావుననే బ్రహ్మవిద్వరిష్ఠులకు గూడా చిత్తమందు హఠాత్తుగా తత్పరమాత్మస్ఫురణము కలుగును.

యావన్నిరంజన మజం పురుషం జరన్తం సంచిన్తయామి
సకలే జగతి స్ఫురన్తమ్ ।

తావద్ బలాత్ స్ఫురతి హన్త హృదన్తరే మే గోపస్య
కోఽపి శిశు రంజనపుంజమంజుః ॥

క్లేశే క్రమాత్ పంచవిధే క్షయంగతే యద్ బ్రహ్మసౌఖ్యం
స్వయ మస్ఫురత్పరమ్ ।
తద్వ్యర్థయన్ కః పురతో నరాకృతిః శ్యామోఽయ
మామోదభరః ప్రకాశతే ॥"

ప్రస్తుత గ్రంథకర్త అయిన శ్రీమధుసూదన సరస్వతీ స్వామిచరణుల నిమ్నోదాహృత వచనములు గూడా గలవు-

"వంశీవిభూషితకరాత్ నవనీరదాభాత్ పీతాంబరా
దరుణబింబఫలాధరోష్ఠాత్ ।
పూర్ణేందుసుందరముఖా దరవిందనేత్రాత్ కృష్ణాత్పరం
కిమపి తత్త్వ మహం నజానే ॥"

"ధ్యానాభ్యాసవశీకృతేన మనసా తన్నిర్గుణం నిష్క్రియం
జ్యోతిః కించన యోగినో యది పరం పశ్యన్తి పశ్యన్తు తే ।
అస్మాకం తు తదేవ లోచనచమత్కారాయ భూయాచ్చిరమ్
కాళిందీపులినేషు యత్ కిమపి తన్నీలం మహో ధావతి ॥"

"అద్వైతవీథీపథికై రుపాస్యాః స్వారాజ్యసింహాసన లబ్ధదీక్షాః।
శఠేన కేనాపి వయం హఠేన దాసీకృతా గోపవధూ విటేన ॥"

ఈరీతిగానే శ్రీ శుక,సనకాదులకు,శంకర,సురేశ్వర, చిత్సుఖ, సర్వజ్ఞాత్మ, శ్రీధరస్వామి మున్నగు వేలకొలది బ్రహ్మవిద్వరిష్ఠులకు గూడా తాదృశమైన అకైతవ (కపటములేని) ప్రేమ (భక్తి) ఉండెను. భగవంతుడు, స్వయముగానే "ఏకభక్తిర్విశిష్యతే" అను శబ్దములతో పైన పేర్కొనబడిన అర్థములనే సమర్థించెను.

"సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః సర్వం వేద ।"

ఇత్యాది శ్రుతివచనములు ఎవరినైనను,అనాత్మ అని భావించుట

అనర్థకారకము అని చెప్పుచున్నవి. ఇట్టిస్థితిలో భగవంతుని,అనాత్మ అని తలచు విషయమే ఎట్లు జనించును? ప్రేమయందు వ్యవధాన మును సహించగల ఓర్పు ఉండదు. కావుననే దూరమందు గాని, లేక వ్యవహిత ప్రదేశమందు గాని, స్వాభావిక, స్వారసిక, అకైతవ ప్రేమ కలుగదు. ఈ కారణముచేతనే భగవంతుడు సర్వాంతరుడు, పరమ సన్నిహితుడు, లేక ప్రత్యగాత్మ అని చెప్పబడెను–

"కైతవరహితం ప్రేమ న తిష్ఠతి మానుషే లోకే।
యది భవతి కస్య విరహః విరహే భవతి కో జీవతి॥"

అను వచనము ప్రసిద్ధమే.

అత్యంత కళ్యాణగుణగణనికరుడు, 'భూమా' అయిన భగ వంతుని అఘటితఘటనాపటీయసి, సదసద్విలక్షణ, ఏకమాత్ర సమస్త ఆశ్చర్యనివాసభూమి, అనంత శక్తికేంద్రభూతయు నయిన మాయాశక్తిప్రవాహమున పడిన ప్రపంచమందు సూక్ష్మ పర్యాలోచనము చేసినపుడు, బుద్ధిమంతులకు క్రమముగా ఆత్మయే సర్వోత్కృష్టమైన తత్త్వముగా స్పష్టమగును. కొందఱు ఆత్మను అణుపరిమాణ మనియు, మఱి కొందఱు మధ్యమపరిమాణమనియు, మఱొకరు విభువు అనియు అంగీకరింతురు.విభుత్వవాదులలో గూడా కొందఱు ఆత్మను 'అచిత్' అనియు, మఱి కొందఱు'చిత్'అనియు. మఱికొందఱు 'చిదచిత్'అనియు, అసంగము, చిత్స్వరూపమనియు భావింతురు. తదన్యులు అయినవారు క్లేశ, కర్మ, విపాక, ఆశయ ములచే అపరామృష్టమైన విశిష్ట ఆత్మ యొక్క సర్వజ్ఞత్వమును, సర్వశక్తిమత్త్వమును, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావత్వమును అంగీకరింతురు. దీనియందే సద్వితీయత్వ, చిదచిద్విశిష్టత్వ, చిదచిద్భిన్నాభిన్నత్వ రూపమైన మూడవ పక్షమందు గూడా స్వాభావికమైన భేదాభేదము, ఔపాధికమైన అత్యంత భేదాభేద పక్షము, శుద్ధాద్వైతము, అద్వైతపక్షము గూడా కలవు.అయినను,

భక్తిరసాయనకారుడు అద్వైత సిద్ధాంతానుయాయి. పరమార్థతః భోక్తయొక్క ఆత్మ, భగవంతుడే అని ఔపనిషద సిద్ధాంతము. శ్రీమద్భాగవతమందు గూడా వస్తుభూతమైన తత్త్వము ఆ బ్రహ్మయే అని చెప్పబడెను. సర్వవిధ భేదశూన్యము, స్వప్రకాశమును అయిన అద్వయ జ్ఞానమునే తత్త్వవేత్తలయినవారు తత్త్వమని చెప్పుదురు. దేశకృత, కాలకృత, వస్తుకృత పరిచ్ఛేదశూన్యమగుటచే ఆ జ్ఞానమే అనంతము, అవేద్యమును అయి ఉన్నది. అపరోక్షమగుటచేత స్వప్రకాశము,అద్వితీయమునయిన కారణముచేత సర్వోపద్రవవివర్జితము అందువలన,పరమానంద స్వరూపము, త్రికాలాబాధ్యమును అగుటవలన పరమ సత్యము. ఆ తత్త్వమే (సత్యమే) నిరతిశయమైన 'బృహత్' అగుట వలన బ్రహ్మ, ఆత్మలకు ఆత్మ అగుట వలన పరమాత్మ, అచింత్య, అనంత భగములు (సమగ్ర ఐశ్వర్యము, ధర్మము, యశస్సు. శ్రీ, జ్ఞాన, వైరాగ్య, మోక్షములు), కళ్యాణగుణగణములచేత సేవించబడువాడు అగుటవలన, భగవంతుడని చెప్పబడుచున్నాడు-

"వదన్తి తత్తత్త్వవిద స్తత్త్వం యద్జ్ఞాన మద్వయమ్ ।
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి కథ్యతే ॥"

కొందఱు బ్రహ్మకు, భగవంతునికి భేదము కలదని అంగీకరించి ఈ శ్లోకమునకు వ్యాఖ్యానము చేసిరి. బ్రహ్మ, జ్యోతిస్సు, భగవంతుడు, జ్యోతిష్మంతుడు అని వారు చెప్పుదురు. జ్యోతీరూపుడగుటచే బ్రహ్మయొక్క అమూర్తత్వమును, ప్రాకృత గుణగణరహితు డగుటచే నిర్విశేషత్వమును, వారు అంగీకరింతురు. జ్యోతిష్మంతుడగుటచేత భగవంతుడైన శ్రీకృష్ణునికి మూర్తత్వమును, అప్రాకృత, అనంత కళ్యాణ గుణగణాకారుడు అగుటచేత సవిశేషత్వమును అంగీకరింతురు. కాని, వారి కథనము సంగతము కాదు. ఏలన, లక్షణభేదముచేత లక్ష్యభేదము, లక్షణైక్యముచేత లక్ష్యైక్యము కలుగును. ఉపర్యుక్త శ్లోకమందు తత్త్వలక్షణము-

"తత్త్వం యద్జ్ఞాన మద్వయమ్ ।"

అని ఒకే విధముగా చెప్పబడినది. కావుననే బ్రహ్మకు, పరమాత్మకు, భగవంతునికి ఏమియును భేదము లేదు.

మఱికొందఱు శ్రీకృష్ణభగవానుని, ఆదిత్యస్థానీయుడుగాను, బ్రహ్మను కిరణస్వరూపునిగాను భావించిరి. కాని, వారి ఆలోచన గూడా కేవల భావమూలకమేగాని, తాత్త్వికము కాదు. తాత్త్వికమని అంగీకరించినపుడు, భగవంతుడు ఔపనిషదుడు కాజాలక పోవును.

"యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనమ్ ।"

అని శ్రీమద్భాగవతమందు భగవంతుడైన శ్రీకృష్ణుడు పూర్ణబ్రహ్మ అని చెప్పబడెను.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా ।"

ఇత్యాది చతుర్లక్షణి అయిన ఉత్తరమీమాంసయందు బ్రహ్మవిచారమే చెప్పబడెను గాన, బ్రహ్మయే ఔపనిషద తత్త్వము. ఒకవేళ, జ్యోతి, జ్యోతిష్మంతుడు అను భేదమును అంగీకరించినచో స్వగత భేదము సుస్థితమగును. అపుడు, అనుపచరితమైన (ప్రధానమైన) అద్వయత్వము చెప్పుటకు వలనుపడదు. భేదమును అంగీకరించనిచో, ధర్మధర్మి భావము పొసగజాలదు. విరుద్ధమగుటవలన సహజమైన భేదాభేదమును చెప్పుటకు వీలు లేదు. ఔపాధికమైన భేదాభేదము అయథార్థమే అయి ఉన్నది. కావున, తన్మూలకమైన వాదము గూడా అవాస్తవికమే. అచింత్య భేదాభేదము గూడా సరి కాదు. ఏలన, అచింత్యత, మూడు విధములుగా కలుగును. తత్త్వము మనోవాచామగోచరము కావలయును. అథవా, అనంతమై ఉండవలయును. లేక, అనిర్వచనీయము కావలయును. ఈ మూడు కారణములను స్వీకరించుట వలన, సిద్ధాంతభంగము కలుగును. స్వీకరించక పోయినచో, అచింత్యత పొసగదు.

త్రివిధ భేదమును నిషేధించునట్టి 'ఏకమేవాద్వితీయమ్' అను శ్రుతిచేత స్వగతభేదముగూడా నిషేధించబడుచున్నది.

"సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్ ।"

అను శ్రుతివలన, 'ఇద'మర్థము యొక్క సదాత్మకత్వావధారణము (నిశ్చయము)కలుగును.అయినను, సజాతీయ, విజాతీయ,స్వగత భేదమును వారించకపోయినచో 'ఏకమ్', 'ఏవ', 'అద్వితీయమ్' అను మూడు విశేషణములును నిరర్థకములగును. కావున,ఈ మూడు విశేషణములచేత త్రివిధభేదము వారించబడును.

"నేహ నానాఽస్తి కించన"

"నాత్ర కాచన భిదాఽస్తి"

అను శ్రుతులందు గన్పట్టు 'కించన', 'కాచన' అను పదముల ద్వారా'నానా' 'భిదా' మున్నగు పదములచేత బోధ్యమగు సర్వ విధ భేదమే నిషేధించబడినది. 'ఇచట ఘటము లేదు' అని చెప్పి నపుడు, ఘటత్వావచ్ఛిన్న ప్రతియోగితానిరూపకమైన నిషేధము అవగత మగుచున్నది.

మఱొక విషయ మేమనిన, జ్యోతిఃస్థానీయమైన బ్రహ్మ, న్యూనము (అల్పము) అని అంగీకరించినచో, అతడు బ్రహ్మయే కాడు. 'బృహి వృద్ధౌ' అను ధాతువునకు 'మనిన్' ప్రత్యయము చేరినపుడు'బ్రహ్మ'శబ్దము నిష్పన్నమగును. దీని అర్థము బృహత్ (గొప్పది). సంకోచకమైన ప్రమాణము లేకపోవుటచేతను,

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ"

అను శ్రుతియందు 'అనన్త' పదసమభివ్యాహారముచేత నిరతిశయ మైన బృహత్ తత్త్వమే'బ్రహ్మ'అని సిద్ధించుచున్నది.అతిశయత్వ కల్పన చేసి, చేసి వాచస్పతి (చతుర్ముఖబ్రహ్మ) యొక్క బుద్ధి డస్సిపోయిన తరువాత,నిరతిశయమైన బృహత్త్వము సిద్ధించును.

కావున, భగవంతుడైనను కావచ్చు, లేక శ్రీకృష్ణుడైనను కావచ్చు. వారియందు నిరతిశయ బృహత్త్వమును అంగీకరించినపుడు ఆయనయే బ్రహ్మ. ఇచట, మఱొక విశేషము తెలిసికొనవలయును. అది ఏమనిన, పూర్వోక్త సిద్ధాంతమందు ఆదిత్యస్థానీయుడు, జ్యోతిష్మంతుడును అయిన భగవంతునికి కిరణస్వరూపమైన జ్యోతిః ప్రదేశమందు అవిద్యమానత్వము (లేకపోవుట) ఉండును. కావున దేశకృతమైన పరిచ్ఛేదము ఉండుటవలన అనంతత్వము పొసగ జాలదు. మన సిద్ధాంతమందు భగవంతుడు, లేక శ్రీకృష్ణుడు సర్వవిధ పరిచ్ఛేదరహితు డయిన కారణముచేత నిరతిశయమైన బృహత్త్వము సంగతమగును. అనుపచరితమైన అద్వయత్వము, అనంతత్వము, బ్రహ్మత్వము గూడా సుసంపన్నమే అగును.

ఈవిధముగానే 'భగవంతుడు నిర్గుణుడు' అని చెప్పబడును. భగవంతునియందు ప్రాకృత గుణజాతము లేదని పై వచనము యొక్క తాత్పర్యము. 'అకాయ' శబ్దతాత్పర్యము ప్రాకృత శరీరరాహిత్యమే; అప్రాకృత కాయము (శరీరము) ఉన్నది. ఆ రీతిగానే 'నిర్గుణ' శబ్దము అప్రాకృత గుణగణమును నిషేధించునది కాదని చెప్పుట సరి కాదు. ఏలన, మరల, నిష్క్రియత్వ, అవ్రణ త్వాది శబ్దములకు గూడా ఇదియే అర్థము చెప్పబడును. అపుడు, భగవంతునియందు అప్రాకృత క్రియను, అప్రాకృతమైన వ్రణ మును అంగీకరించవలసివచ్చును. 'సగుణ' శబ్దముగూడా 'నిర్గుణ' శబ్దమువలె ప్రయుక్తమగును. కావున, 'నిర్గుణ' శబ్దమునకు అర్థము ప్రాకృతగుణరహితుడని చెప్పెద మన్నచో, ఇదియు, సంగతము కాదు. ఏలన, 'నిష్క్రియత్వ' శబ్దము వలెనే 'సక్రియత్వ' శబ్దము వచ్చును. కావున, పైన పేర్కొనబడిన దోషము తదవస్థమయియే (యథాతథముగానే) ఉండును. కావున, వస్తుతః, నిర్గుణపరమాత్మయే

తన అచింత్య, దివ్య లీలాశక్తి చేత, అప్రాకృతగుణగణములను స్వీకరించును గాన, ఆయన, సగుణుడని వ్యవహరించబడును.

"నిర్గుణం మాం గుణాః సర్వే భజన్తి నిరపేక్షకమ్ ।"

ధనవంతుడైన వ్యక్తి, ధననిరపేక్షుడు కావచ్చుగాక, నిర్ధనునికి ధనాపేక్ష లేకపోవుట అత్యంతము అసంభవము కావచ్చును గదా, అని ఆశంక చేయబడును. ఈరీతిగానే సగుణభగవంతుడు గుణనిరపేక్షుడు కావచ్చుగాక. కాని, నిర్గుణుడైన పరమేశ్వరునికి గుణనిరపేక్షత్వము సుతరాం అసంభవము. అయినను, ఇది కూడా సరి కాదు. ఏలన,భగవంతునియందు గుణములు అతిశయత్వమును ఆపాదించను లేవు, ఏదియో ఒక విశేషమును తెచ్చిపెట్టను లేవు. ఆప్తకాముడు కానట్టి నిర్ధనునికి, ధనము అపేక్షితము కావచ్చుగాక. కాని, ఆప్తకాముడు, పూర్ణకాముడు, పరమ నిష్కాముడు, ఆత్మారాముడు, నిర్గుణుడును అయిన పరమేశ్వరుడు గుణనిరపేక్షుడై ఉండుటలో ఆశ్చర్యమేమి కలదు ? నిత్య, నిరతిశయ, బృహద్ బ్రహ్మయందు, పరమాత్మయందు, లేక భగవంతునియందు గుణగణముల మహత్త్వాతిశయమును ఆధానము, నిత్య నిరస్త సమస్తానర్థములు గల బ్రహ్మ, పరమాత్మ, లేక భగవంతునియందు అనర్థ నిర్వహణమును గూడా జేయజాలవు. ఈ మూడును గాక,గుణములకు మఱొక నాల్గవ ఉపాయము లేదు. కావున, గుణనిరపేక్షుడు, నిర్గుణుడును అయిన భగవంతుడే గుణముల గుణత్వసిద్ధి కొఱకై ఆ గుణములను స్వీకరించును. కౌస్తుభమణిశోభ కొఱకే పరమేశ్వరుడు,ఆ కౌస్తుభమణిని శోభాయుక్తమైన తన కంఠమున ధరించెను–

"కంఠం చ కౌస్తుభమణే రధిభూషణార్థమ్ ।"

నిరాకారునియందు ప్రేమాస్పదత్వ మన్నది ఉండనే ఉండదని కొందఱి అభిప్రాయము. ఇది, అత్యంత అజ్ఞానమూలకమైన

అభిప్రాయము. ఏలన, సగుణప్రాప్తిజన్యమైన సుఖము గూడా నిరాకారమే. అపుడు, దానియందు ప్రేమ ఎట్లు కలుగుచున్నది? శ్రీధరస్వామి మున్నగువారు గూడా,

"తత్త్వం యద్ జ్ఞాన మద్వయమ్ ।"

అను శ్లోకమందు బ్రహ్మ, భగవంతుడు, పరమాత్మ – వీరియందు ఏమియు వైలక్షణ్యము లేదని అంగీకరించిరి.

నారదముని, ఆకాశమునుండి క్రిందికి అవరోహించుట చూచి, దూరముగా ఉన్నపుడు, ద్వారకావాసులు ఒక మహాతేజఃపుంజమని ఊహించిరి. మఱికొంత సమీపమునకు వచ్చినపుడు శరీరము కల ఒక ప్రాణి అనుకొనిరి. ఎక్కువ దగ్గఱకు వచ్చినపుడు అవయవములు స్పష్టముగా భాసించుటచేత, ఒక పురుషుడని తెలిసికొనిరి. మఱింత సమీపమునకు వచ్చినపుడు, నారదుడని స్పష్ట జ్ఞానము కలిగెను–

"చయస్త్విషా మిత్యవధారితం పురా తతః శరీరీతి
విభావితాకృతిమ్ ।
విభు ర్విభక్తావయవం పుమానితి క్రమా దముం
నారద ఇత్యబోధి సః ॥"

ఈవిధముగానే దూరముగా ఉన్నప్పుడు, బ్రహ్మ అనియు, సమీపమైనప్పుడు పరమాత్మ అనియు, అత్యంత సమీపమైనపుడు భగవంతుడనియు జ్ఞానము కలుగునని చెప్పుటయు సంగతము కాదు. ఎందుచేతననిన, సర్వాంతరతముడైన బ్రహ్మయందు, పరమాత్మయందు, లేక, భగవంతునియందు సామీప్య, అసామీప్య నిబంధనమైన తారతమ్యము కలుగజాలదు. కావున, తేలిన సారాంశమేమనిన, ఒకే నిత్య, నిరతిశయ, బృహత్తమ బ్రహ్మ, ఆత్మలకు గూడా ఆత్మ అగుటవలన, పరమాత్మ అనియు, గుణగణసేవ్యుడగుటచేత భగవంతుడనియు చెప్పబడును. సకల సచ్ఛాస్త్రగోచరుడు,

అశేషవిశేషాతీతుడు, నిర్గుణుడు, నిరాకారుడు,సచ్చిదానందఘనుడు తన అచింత్య, మంగళమయ, దివ్య శక్తిచేత అనంత కళ్యాణ గుణగణాకరుడు, అనంతకోటి కందర్ప సుందరుడు, శక్ర (ఇంద్ర) శతకోటి విలాసశాలి, నభఃశతకోటిమహావిస్తారశాలి, వాయుశతకోటి విపుల బలశాలి, రవిశతకోటి ప్రఖర ప్రకాశశాలి, శశిశతకోటి సుశీత లుడు, కాలశతకోటి దుస్తరుడు, కోటితీర్థపావనాభిధానుడు, మేరు శతకోటినిశ్చలుడు, కామధేనుశతకోటి కామపూరకుడు, శారదాశత కోటి, విధిశతకోటి సృష్టినిపుణుడు, విష్ణుశతకోటిపాలకుడు, రుద్ర శతకోటి సంహారకుడు, ధనద (కుబేర) శతకోటి శతైశ్వర్య సంపన్నుడు, మాయాకోటిశత అఘటితఘటనాపటువు, శేషశతకోటి భూభారధారకుడును అయిన భగవంతుని అనంతకోటి ఆదిత్యగణ ముల ప్రకాశ, ప్రఖరత్వాదులతో గూడా అనంతకోటి ఖద్యోతము లతో ఆదిత్యుని, పోల్చజాలనట్లు, పోల్చజాలము. కావుననే అశేష విశేషాతీతుడు,అనంతకళ్యాణగుణగణాకరుడును అయిన భగవంతుని స్తుతి చేయుటయందు బ్రహ్మాదులు సైతము సమర్థులు కాజాలక పోయిరని శ్రూయమాణ మగుచున్నది.

భక్తకల్పతరువైన భగవంతుని గుణము లన్నియు, భక్తులకు ఉపయుక్తము లైనవే. కర్మ, ఉపాసనా, తత్త్వజ్ఞానాదులచే సమా రాధ్యుడైన భగవంతుడే ముక్తోపసృప్యుడు (ముక్తులైనవారిచే ఆశ్రయింపబడదగినవాడు), సర్వశాస్త్రతాత్పర్యమునకు విషయ మైనవాడు అని ఆ యా స్థలములందు చెప్పబడియే ఉన్నది.

"ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే।"

"యమేవైష వృణుతే తేన లభ్యః।"

"తమేవ చాద్యం పురుషం ప్రపద్యే।"

"ఆత్మక్రీడ ఆత్మరతిః।"

ఇత్యాది శ్రుతి, స్మృతులందు ముముక్షువులకు, భక్తులకు భగవ

చ్ఛరణాగతియే చెప్పబడినది. ఉపక్రమ, ఉపసంహారాది తాత్పర్య నిర్ణాయకములైన షడ్విధలింగములచేత,

"ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి ।"

"రసో వై సః"

ఇత్యాది శ్రుతుల తాత్పర్యము రసాత్మకము, ప్రత్యక్ చైతన్యాభిన్నమును అయిన పరబ్రహ్మయందే పర్యవసితమగును.

ఆత్మ, సుఖస్వరూపుడు, భ్రాంతివశమున, వైషయిక సుఖము విషయసంబంధియై ప్రతీతమైనను, పరమార్థమున,పరమ సుఖము ఆత్మరూపమే. వైషయిక సుఖమును దృష్టియందు ఉంచు కొనియే శ్రీ పతంజలిమహర్షి-

"పరిణామ తాప సంస్కార గుణవృత్తివిరోధాత్ సర్వమేవ దుఃఖం వివేకినః ।"

అని చెప్పిరి. విషమిశ్రితమైన మధుర, మనోహర పక్వాన్నమువలె, దుఃఖమిశ్రితమైన సుఖము హేయమని,నైయాయికులుచెప్పుదురు.

"ఏష హ్యేవానన్దయతి ।"

"మాత్రా ముపజీవన్తి ।"

"రసగ్ం హ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి ।"

ఇత్యాది శ్రుతులు లౌకిక, వైషయిక సుఖమును సుఖస్వరూపుడైన ఆత్మయొక్క అంశమే అని చెప్పుచున్నవి. స్వానుకూలమైన విషయము లభించుటవలన అంతఃకరణవృత్తి అంతర్ముఖము, శాంతము అచంచలమును అగును, సత్త్వోద్రేకము కలుగుటవలన ప్రతిబింబముగా అచట స్వాత్మానందమే అభివ్యక్తమగును.విషయ నిబంధనము, వృత్తినిరోధము క్షణిక మగుటచే సుఖము వైషయికము, క్షణికము అని చెప్పబడును.

"ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన ।"

ఇత్యాది శ్రుతులచే ఆనందము తత్త్వసాక్షాత్కారమూలకమైన పరిణామము అగుటవలన దుఃఖమిశ్రితము కాని సుఖమగుట వలన బ్రహ్మాత్మసుఖప్రాప్తి అని చెప్పబడినది. కావుననే ఆత్మయే రస మని సిద్ధాంతము.

ఇచట, 'ఆనంద'శబ్దముచేత ప్రత్యక్చైతన్యాభిన్నమైన పర బ్రహ్మయే లిలక్షయిషితుడు (లక్షణయా పరిలక్షితుడు). ఏలన, ఆ పరబ్రహ్మయందే ఉపక్రమ,ఉపసంహారాది తాత్పర్యనిర్ణాయక మైన షడ్విధలింగముల ద్వారా, రసాత్మతాబోధకములైన వచన ముల తాత్పర్యము నిశ్చిత మగును. అగ్నియొక్క అంశములైన విస్ఫులింగముల వలె, లేక సాగరాంశములైన బిందువులవలె, విశిష్టుడు, సోపాధిక చిదాభాసుడు, చిత్ప్రతిబింబరూపుడు, చిత్కణము,లేక సమవచ్ఛిన్నుడైన జీవుడు నిరతిశయ రసరూపుడు కాడు. ఏలన, అచట పూర్ణానందత్వము తిరోహితమగును. తటస్థు డైన పరబ్రహ్మ, పరమాత్మ గూడా నిరతిశయ సుఖరూపుడు కాడు, ఏలన, ఆ పరబ్రహ్మ, ప్రత్యక్చైతన్యస్వరూపమై ఉండక పోయినచో, సాక్షాదపరోక్షము కూడా కాజాలడు. అపుడు, ఆ పర బ్రహ్మయొక్క స్వప్రకాశానందస్వరూపత్వము మిక్కిలి దూరమైన విషయమగును. కావున, కోరకపోయినను, ప్రత్యక్చైతన్యా భిన్నమైన పరబ్రహ్మకే రసరూపత్వమును అంగీకరించవలసి వచ్చును.

కొందఱు,సచ్చిదానందఘనుడైన భగవంతునికి స్వరూపశక్తి, తటస్థశక్తి, బహిరంగశక్తి అని, శక్తిత్రయమును అంగీకరించిరి. స్వరూపశక్తియందు గూడా వారు సంధినీశక్తి, సంవిత్‌శక్తి,హ్లాదినీ శక్తి అను భేదముతో మూడు శక్తులను అంగీకరింతురు. ఈ పక్ష మందు గూడా ఈ విషయము పొసగును. ఏలన, అచిదాత్మకమైన మాయ యొక్క బహిరంగత, సోపాధిక జీవునియొక్క తటస్థత

సుస్పష్టమే. సంధినీశక్తి మున్నగు మూడు శక్తులును,సచ్చిదానందముయొక్క స్వరూపభూతలైనవారే. స్వప్రకాశమైన సద్రూపమే చిద్రూపము. అత్యంతాబాధ్యమైన చిద్రూపమే సద్రూపము. సర్వోపద్రవ వివర్జితమైన సచ్చిద్రూపమే ఆనందము. అత్యంతాబాధ్యము, స్వప్రకాశమును అయిన ఆనందమే సచ్చిద్రూపము. ఈవిధముగా స్వరూపములో భేద మేమియు లేదు. కావున, ఆ సచ్చిదానంద బ్రహ్మయందు శక్తికల్పన చేయుటకే వలనుపడనప్పుడు, ఆ శక్తిత్రయభేదకల్పనకు సంగతియే లేదు.అయినను, అచింత్య, అనిర్వాచ్య, భగవదీయ, దివ్య లీలాశక్తిసంబంధము చేత,లీలావిశేషవికాసము కొఱకై పూర్వోక్త భేదములను ఉపపాదించవచ్చును. జలరాశికంటె ఫేనము బహిరంగము,తరంగము తటస్థము (ఫేనాపేక్షయా అంతరంగమయ్యు,స్వరూపాపేక్షయాబహిరంగము) అగుట వలన, తరంగమందు తటస్థత్వము కలదు. స్వరూపభూతమగుటచేత మాధుర్యమే ముఖ్యమైన అంతరంగము, అట్లే, పరమానంద సుధాసింధువైన భగవంతునియందు భోగ్య జడ ప్రపంచమునకు మూలభూతయైన మాయ,బహిరంగము,చిల్లక్షణము గల జీవుడు తటస్థుడు, స్వరూపభూతమైన మాధుర్యాది అంతరంగ భావము 'శక్తి' శబ్దముచేత గూడా అభిహిత మగును. సత్త్వము, సంధాయకము గాన, దానియందు సంధినీశక్తికల్పనము, చిత్ప్రకాశకము గాన, దానియందు సంవిచ్ఛక్తికల్పనము, ఆనందము ఆహ్లాదక మగుటంజేసి, దానియందు ఆహ్లాదినీశక్తికల్పనము చేయబడును. ప్రత్యక్ చైతన్యాభిన్నమైన పరబ్రహ్మకు రసరూపత్వమును అంగీకరించినపుడే ఈ కల్పన అంతయు, సంగతమగును. రససింధుబిందువు సైతము రసస్వరూపమే. కాని, పరమానందము ఆవృత మగుటవలన అది, అల్పానందము, సాకాంక్షమును (సాపేక్షము) అగును. ఈవిధముగానే సోపాధిక ఆత్మ కూడా రసస్వరూపుడై రసప్రేప్సువు (రసప్రాప్తియందు ఇచ్ఛకలవాడు)

అగును. కావుననే శాస్త్రములందు ఈ తత్త్వము నిరూపించబడినది. వేదాంతవేద్యము, నిర్విశేషమును అయిన భగవద్రూపమే రసస్థాయికంటె విశిష్టమైనదని వర్ణిత మగును. భగవద్గుణగణశ్రవణము వలన కలిగిన మానసికవృత్తి ద్రవత్వమందు భగవదాకారము ప్రవేశించినపుడు, విభావ, అనుభావ, సంచారీభావ సంయోగముచేత రసరూపత్వము కలుగును. ఇచట, భగవంతుడే ఆలంబనవిభావము, తులసీచందనాదులు ఉద్దీపన విభావము, నేత్రవిక్రియాదులు అనుభావము, నిర్వేదాదులు వ్యభిచారీభావములు. భగవదాకారతారూపమైన రసస్థాయీభావమే పరమానందసాక్షాత్కారముగా ప్రాదుర్భవించును. అదియే భక్తియోగము, దుఃఖస్పర్శలేని సుఖరూపమైన పరమ పురుషార్థము.

స్వభావముచేత కఠినముగా ఉన్న లక్క, తాపకమైన అగ్న్యాది ద్రవ్యసంబంధముచేత జలమువలె ద్రవీభూతమైనపుడు, వందల కొలది చీనాంశుకములతో ఒడపోయబడినపుడు, దానిలో ఇంగిలీకము మున్నగు రంగులు వేసినపుడు, ఆ రంగు ఆ లక్కయొక్క సర్వాంశమందు ప్రవేశించి స్థిరమై ఉండును. మరల, ఆ లక్క గట్టిపడినను, లేక ద్రవీభవించినను, ఎన్నడును లక్కను ఆ రంగు వీడిపోదు. అట్లే, భగవద్భావనచే భావితము, ద్రవావస్థాపన్నము నయిన అంతఃకరణమందు భగవంతుడు ప్రవేశించినపుడు ఇతర పదార్థమును గ్రహించునప్పుడు గూడా భగవద్భానమే కలుగును. ప్రపంచభానముతో గూడిన భగవద్భానమునకు ఉదాహరణము ఇది—

"ఖం వాయు మగ్నిం సలిలం మహీం చ జ్యోతీంషి సత్త్వాని
దిశో ద్రుమాదీన్ ।
సరిత్సముద్రాంశ్చ హరేః శరీరం యత్కించ భూతం
ప్రణమే దనన్యః ॥

ప్రపంచమిథ్యాత్వ భానసహితమైన భగవద్ధ్యానమునకు ఉదాహరణము—

"తస్మాదిదం జగదశేష మసత్స్వరూపమ్ ।"

మొదలైన వాక్యములు.

"ప్రేమాతిభర నిర్భిన్న పులకాంగోఽతినిర్వృతః ।
ఆనందసంప్లవే లీనో నాపశ్య దుభయం మునే ॥"

అను వచనము ప్రపంచ భానరహితమైన భగవద్ధ్యానమునకు ఉదాహరణము. విశేషించి, విప్రలంభ శృంగారమందు ద్రవావస్థను పొందిన ఆలంబనమయమైనదే సమస్త వస్తువుల భానమగును. దీనికి ఉదాహరణమిది—

"ప్రాసాదే సా దిశి దిశి చ సా పృష్ఠతః సా పురః సా
పర్యంకే సా పథి పథి చ సా తద్వియోగాతురస్య ।
హంహో చేతః ప్రకృతి రపరా నాస్తి మే కాఽపి సా సా
సా సా సా సా జగతి సకలే కోఽయ మద్వైతవాదః ॥

ఈవిధముగానే భగవద్విషయకమైన కామ, భయ, స్నేహ, హర్ష, శోక,దయాది తాపకభావములలో దేనిసంబంధముచేతనైనను చిత్తమనెడి లక్క, గంగాజలప్రవాహమువలె ద్రవీభవించినచో, వందల మడతలు గల చీనాంశుకముచేత అది శోశితమైనచో (ఒడపోతపోయబడినచో), అపుడు దానియందు సర్వాంశము ప్రవేశించి పరమానందస్వరూపుడైన భగవంతుడు స్వామిభావము పొందినవాడై రసస్వరూపుడగును. ద్రవావస్థలో ప్రవేశించిన విషయాకారత్వము (భగవదాకారత్వము) ఎన్నడును, వేఱు గాని కారణముచేత అచట, ముఖ్యమైన 'స్థాయీ' శబ్దము ప్రయోగించబడును. ఇట్లు జరిగినపుడే 'కర్తుం అకర్తుం అన్యథాకర్తుం' సమర్థుడైన భగవంతుడు గూడా స్వయముగా అచటినుండి తొలగిపోదలచినను,

తొలగిపోలేడు. ఆయన సర్వశక్తిమత్త్వము గూడా కుంఠితమై పోవును. కావుననే,

"విసృజతి హృదయం న యస్య సాక్షాద్ధరి రవశాభిహితోఽ
ప్యఘౌఘనాశః।
ప్రణయరశనయా ధృతాంఘ్రిపద్మః స భవతి
భాగవతప్రధాన ఉక్తః॥"

అని చెప్పబడెను. ఇచట 'ప్రణయ' శబ్దముచేత ద్రవావస్థయే వివక్షితము. ఇట్టి అంతఃకరణమునుండి వెడలదల్చినను, భగవంతుడు బయటకు వెడలజాలడు. దీనిని, దృష్టియందు ఉంచుకొనియే ఒక భక్తుడు,

"హృదయాద్యది చేద్యాసి పౌరుషం గణయామి తే।"

అనుచు, హృదయమునుండి నీవు బయటకు వెడలినచో నీపురుషార్థము ను తెలిసికొందునని భగవంతునితో అనెను.

వ్రజాంగనలు హృదయమునుండి భగవంతుని, దూరము చేయదలచెడివారు. కాని, వారు అట్లు చేయుటయందు సాఫల్యము నొందజాలకపోయిరి. ఆ శ్రీకృష్ణునితో సఖ్యము చేయము అని నిశ్చయించుకొనెడివారు. కాని, ఆయనచర్చను వదలిపెట్టుట దుస్తర మని అనుకొనెడివారు. ఒక సఖి, భగవంతునిచర్చ ఆరంభించినంతనే మఱొక చెలికత్తె నిరోధించి ఇట్లు అనెను-

"సన్త్యజ సఖి తదుదస్తం యది సుఖలవమపి
సమీహసే సఖ్యాః।
స్మారయ కిమపి తదితర ద్విస్మారయ మోహనం మనసః॥"

అనగా, నన్ను ఒక క్షణమాత్రమైనను, సుఖముగా చూడదలచు చున్నచో, మోహనమూర్తి అయిన శ్రీకృష్ణుని గుఱించి చర్చించక, కథ ఏమైనను చెప్పుము అని భావము.

దీనినిచూచి ఒకానొక మునికి గొప్ప ఆశ్చర్యము కలిగెను. ఆయన ఇట్లు ఆలోచించసాగెను- యోగీంద్రులు, మునీంద్రులు ధారణా, ధ్యానాదుల ద్వారా మనస్సును విషయములనుండి మరలించి, భగవంతునియందు లగ్నముచేయుదలంతురు. మనస్సు మాత్రము మరలి, మరలి తిరిగివిషయముల సమీపమునకే పోవును. కాని, ఈ ముగ్ధురాలు, మనస్సును భగవంతుని నుండి మరల్చి, విషయములందు లగ్నము చేయదలచుచున్నది. ఆ భగవంతుని క్షణకాలమాత్రస్ఫూర్తికై యోగులు సర్వదా ఉత్కంఠితులై ఉందురు-

"ప్రత్యాహృత్య మునిః క్షణం విషయతో యస్మిన్
మనో ధిత్సతి బాలాఽసౌ విషయేషు ధిత్సతి మునః
ప్రత్యాహరన్తి తతః।
యస్య స్ఫూర్తిలవాయ హన్త హృదయే యోగిసముత్కంఠతే
ముగ్ధేయం కిల పశ్య తస్య హృదయాత్ నిష్క్రాన్తి
మాకాంక్షతి ॥"

ఆలంబనము,స్థాయీభావము ఒకటియే అయినవని చెప్పినచో, ఇవి గూడా, సరి కాదు. ఏలన, వ్యవహారసిద్ధమైన జీవ, ఈశ్వర భేదము వలెనే బింబ, ప్రతిబింబభావనకు గూడా ఇచట భేదము కలదు. బింబమే మనస్సుయొక్క ద్రవావస్థలో మునిగి ప్రతిబింబ మని చెప్పబడును.

"ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, ఆనందేన
జాతాని జీవన్తి, ఆనందం ప్రయన్త్యభిసంవిశన్తి।"

ఇత్యాది శ్రుతుల వలన ప్రపంచము యొక్క ఆనందాత్మకమైన బ్రహ్మైకోత్పాదననిమిత్తము సిద్ధించుచున్నది. కాంతాది విషయములు గూడా కారణానంద రూపములే. మాయాకృతములైన ఆవరణ, విక్షేపముల వలన ఆ బ్రహ్మ, అఖండానందరూపముతో

ప్రతీత మగుటలేదు. కార్యాకారరూపముతో అకార్యముల భానము గూడా కలుగును–

"ఋతేఽర్థం యత్ ప్రతీయేత న ప్రతీయేత చాత్మని ।
తద్విద్యా దాత్మనో మాయాం యథాఽఽభాసో తథా తమః॥"

అజ్ఞాతజ్ఞాపకత్వమే ప్రమాణముల ప్రామాణ్యము. స్వప్రకాశ స్వరూపముతో భాసమానమగు చైతన్యమే అజ్ఞాతము; జడము కాదు. జడము, స్వతః, భాసించకపోవుటచేత అచట ఆవరణాపేక్ష ఏమియు లేదు. కాంతాది విషయక భానముల ప్రామాణ్యమునకై అజ్ఞాత కాంతాద్యవచ్ఛిన్న చైతన్యవిషయకమైన ఆవరణము తొలగిపోయి నపుడు, కాంతాద్యవచ్ఛిన్న రూపముతో పరమానందరూపమైన ఉపాదాన చైతన్యరూపము యొక్క భానమే కలుగును. కాని, అనవచ్ఛిన్న స్వరూప భానము కలుగలేదు. కావుననే సద్యోముక్తి భంగమునకు గాని, స్వప్రకాశత్వభంగమునకు గాని, ప్రసక్తి లేదు. దీనివలన విషయావచ్ఛిన్నమైన చైతన్యమే ద్రవీభూత అంతఃకరణ వృత్తియందు ఉపారూఢమై స్థాయీభావము, రసస్వరూపము అగును అని సిద్ధించెను. కాంతాది లౌకిక రసము గూడా పరమానందరూపమే అయినను, జడసంపర్కము చేత దానియందు న్యూనత కలదు. భక్తియందు అనవచ్ఛిన్న చిదానందఘన భగవత్స్ఫురణము ఉండుటవలన, ఆ భక్తియొక్క పరమానంద రూపత్వము విస్పష్టమే అయి ఉన్నది.

"రసగ్ంహ్యేవాయం లబ్ధ్వాఽఽనందీ భవతి ।"

రసస్వరూప పరబ్రహ్మ, పరమాత్మావగతి పొందియే, జీవుడు ఆనందితుడగును అని భావము. ఈ వాక్యమందు 'అయం' పదార్థ కర్తృక లాభమైన కర్మయే 'రస' శబ్దముచే వ్యపదేశ్యమని కొందఱు చెప్పుదురు. భగ్నావరణచైతన్యమే 'అయం' పదార్థము, అదియే కర్మ కూడ. అపుడు కర్తకు, కర్మకు ఏకరూపత్వము వచ్చినదని

వారి భావము. కాని, ఇది సంగతము కాదు. ఏలయనగా, సాధారణ చైతన్యము 'అయమ్' పదార్థము, నిరావరణచైతన్యము కర్మ పదార్థము అని, ఈ ఔపాధికభేదమును అంగీకరించుటవలన, కలిగెడి భేదము ఏమియును లేదు. స్వప్రకాశవాదమందు ఆవరణ భంగముచేతనే ఆనందము లభించును. 'రసమును పొంది,ఆనందితు డగునని చెప్పుట వ్యర్థము అని చెప్పుటయు సంగతము కాదు. ఏలయన, అనవచ్ఛిన్న చైతన్యమునకు ఆవరణభంగమాత్రము చేతనే రసరూపత్వము సిద్ధించినను, తత్తదవచ్ఛిన్న చైతన్యము లందు, తత్తదవచ్ఛేదకగతములైన దోష, గుణముల మిశ్రణము చేత ఆవరణభంగమాత్రమువలననే ఆనందప్రాప్తి కలుగజాలదు. కావున, విభావ, అనుభావ, వ్యభిచారీ (సంచారీ) భావసంయోగము చేత అభివ్యక్తమైన స్థాయీభావమే ప్రేక్షక, అభినేయభేదమును తొలగించి, సభ్యులయందే ఉన్న పరమానంద సాక్షాత్కారము ద్వారా రసస్వరూప మగును. ఇదియే రసజ్ఞుల మర్యాద. దీని తాత్పర్యమేమనిన, సర్వశాస్త్రములకు మహాతాత్పర్యవిషయమైన పరమాత్మయందే సచ్చిదాది, రసానందాది శబ్దములకు సాక్షాత్తుగా ప్రవృత్తి ఉన్నది. అయినను, విషయవిశేషమందు సత్తాశబ్దము, లేక చైతన్యశబ్దము ప్రయుక్తమైనట్లే రసానందాది శబ్దములకు గూడా విషయవిశేషమందు ప్రయోగము ఉండవచ్చును. దీనివలన, స్థాయీ అవచ్ఛిన్న భగ్నావరణ చైతన్యమందే 'రస' శబ్దము ప్రయోగించ బడునని సిద్ధించినది. అంతఃకరణవృత్తికి సాత్త్వికమైన ద్రవత్వము కలుగనంతవఱకు, రస, ఆనందాదుల అనుభూతి గూడా కలుగదు. కావుననే ఉపేక్షింపదగిన, ద్వేష్యమైన విషయములందు భగ్నావరణ చైతన్యము ఉన్నను, ఆనందానుభవము కలుగదు. కావుననే రససింధు బిందుస్థానీయుడు, సోపాధికుడును అయిన ఈ జీవుడు, అనవచ్ఛిన్న రససింధుస్థానీయుడైన పరమాత్మను, లేక స్థాయి, అవచ్ఛిన్న,

భగ్నావరణ తదంశభూతమైన చిత్పదార్థమును పొంది ఆనందించు ననియు చెప్పవచ్చును. అయిన, 'సావరణుడు, అనావరణుడై ఆనందితుడగును' అని గూడా చెప్పవలసి ఉండును. 'రసమును పొంది ఆనందించును' అని చెప్పుట వ్యర్థమే. ఈ పక్షము కూడా సరి కాదు. నిత్యప్రాప్తము, విస్మృతమును అయిన గ్రైవేయకము (కంఠహారము) నందు, ప్రేప్స (పొందవలయుననెడి ఇచ్ఛ) మిథ్యాభూత సర్పాదులందు పరిజిహీర్ష (చంపవలయునను కోరిక) చూడబడుచున్నది. అజ్ఞానము నివృత్తమైనపుడు లాభపరిహార ప్రయోగము గూడా చూడబడుచున్నది. ఈ విధముగానే ఆవరణ భంగము వలన, ప్రేప్సానివృత్తి కలిగినపుడు ప్రాప్తించినదన్న వ్యవహారము కూడా కలుగవచ్చును. ప్రాకృత పంచకోశాతీత స్వరూపుడు, తటస్థలక్షణ లక్షితుడు, ప్రత్యగభిన్నుడు, బ్రహ్మ స్వరూపుడును అయిన పరమాత్మయే 'రస' శబ్దవాచ్యుడు. ఆ పరమాత్మనే పూర్ణముగా గాని, అంశరూపముతో గాని, పొంది సోపాధికుడైన ఈ జీవుడు ఆనందితుడగును.

"ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి ।"
"ఏష హ్యేవానందయతి ।"

ఇత్యాది శ్రుతులు లౌకికానందమును గూడా రసస్వరూపుడైన పరమాత్మయొక్క అంశయే అని చెప్పుచున్నవి. సాధారణులు, బ్రహ్మవేత్తలు కానివారును అయిన వ్యక్తులకు అనవచ్ఛిన్న బ్రహ్మాత్మక రసప్రాప్తి కలుగదు. కావున, యథాయోగ్యముగానే సంబంధమును కలిగించవలయును.

"రసో వై సః" "రసో హ్యేవ"

అను శ్రుతులందు అనవచ్ఛిన్నమైన స్థాయీభావము అవచ్ఛిన్న భగ్నావరణ చిదాత్మక పారిభాషిక తదంశభూతమే 'రస' మని గ్రహించబడును. రసత్వ స్థాయీభావమును అపేక్షించని మహా

వాక్యమువలన కలిగిన అపరోక్ష బ్రహ్మాకారవృత్తియందు, ఆవరణ భంగము వలన, అనవచ్ఛిన్నమైన బ్రహ్మరూపము చేతనే రస లాభము కలుగును. ఈవిధముగానే కాంతాది అవచ్ఛిన్నరూపముతో ఉపాదానభూతమైన బ్రహ్మచైతన్యమునకు గూడా స్థాయీభావాపత్తి కలిగినపుడు, పారిభాషికావచ్ఛిన్నమైన రసము లభించును. కావుననే ఉత్తరమీమాంసాశాస్త్రమందు రసశాస్త్రము గతార్థము కాదు. కాని, స్థాయీభావాది విశిష్టమైన రసప్రతిపాదనకై రసశాస్త్రము వేఱుగ అపేక్షితము.

శ్రీమధుసూదనసరస్వతి ప్రతిపాదించిన రససిద్ధాంతాను సారముగా భక్తిరసామృతాస్వాదనము చేసి,ఆనందసుధాసింధువైన శ్రీకృష్ణచంద్రుని భజనానందమును అనుభవింతుము గాక!

"రసో వై సః"



# 6. నిశ్చల భక్తియోగము

## సు ధా త రం గి ణి

ప్రత్యక్చైతన్యాభిన్నుడైన భగవంతుని, అవ్యభిచార (అవిచ్ఛిన్న) భక్తియోగముతో సేవించువారు సాత్త్విక, రాజస, తామస గుణములను అతిక్రమించి బ్రహ్మభావమును పొందుదురు. గుణమయమైన సంసారమునుండి విముక్తమగుటకు ఏకైకసుందర ఉపాయ మిదియే. వేదాంతముల శ్రవణ, మననము చేసినపుడు, ఏ ప్రత్యక్చైతన్యాభిన్నమైన పరమాత్మతత్త్వము నిశ్చిత మగునో, ఆ పరమాత్మతత్త్వమునే నిరంతరము నిదిధ్యాసనము చేయుట వలన, తత్తత్త్వసాక్షాత్కారము కలుగును. రజ్వాది అధిష్ఠాన సాక్షాత్కారము వలన, దానియందు కల్పితములైన సర్ప, జలధారా, మాలాదులు తొలగిపోయినట్లే నిర్వికారము, సర్వాధిష్ఠానమును అయిన చిదాత్మతత్త్వసాక్షాత్కారము కలుగుటచేత ఆ తత్త్వమందు కల్పితమైన గుణమయ ప్రపంచముయొక్క ఆత్యంతికాభావము కలుగును. (అనగా, ప్రపంచభానము సమూలముగా నశించునని భావము). ఈ కారణము చేతనే—

"మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।"

అను స్థలమున, అవ్యభిచార (నిశ్చల) భక్తియోగము చేత శుద్ధ పరబ్రహ్మయొక్క నిదిధ్యాసనమే లేక జ్ఞానాభ్యాసమే గ్రహించబడును. 'భక్తి' అనగా, జ్ఞానము, లేక నిదిధ్యాసనమని చెప్పినచో, పక్షపాతయుక్తమని అనిపించును. అయినను, రసస్వరూపానుసంధానమును 'భక్తి' అని చెప్పిరి. పర్యాలోచన చేసినచో, ఇది యుక్తమని తోచును. విషయాకారమును భజించునది జ్ఞానము, లేక 'భక్తి' శబ్దముచేత చెప్పవచ్చును.

"విషయాకారం భజతీతి భక్తిః।"

ఇంతియే కాక, "భజ. సేవాయామ్" అను ధాతువునుండి 'భక్తి' శబ్దము నిష్పన్నమగును "భజనం భక్తిః" అనగా, భజనమునే- సేవనే 'భక్తి'అని చెప్పుదురు. సేవ, శరీర, ఇంద్రియ, బుద్ధులచేత చేయబడిన కాయిక, ఐంద్రియక, మానసిక భేదముతో అనేక విధములుగా ఉండును. కాని, ముఖ్యసేవ, మానస సేవయే. మానసిక సేవయే సర్వశ్రేష్ఠము. మహానుభావులు గూడా ఇట్లు చెప్పిరి-

"కృష్ణసేవా సదా కార్యా మానసీ సా పరా మతా।
చేత స్తత్ప్రవణం సేవా తత్సిద్ధ్యై తనువిత్తజా॥"

అనగా, ప్రాణి, సర్వదా శ్రీకృష్ణసేవ చేయునగును. సేవలో గూడా మానసీసేవయే సర్వోత్కృష్టమైనది. చిత్తము కృష్ణునియందు ఉన్ముఖమగుటయే, లేక తన్మయమగుటయే సేవ. మానసీసేవాసిద్ధి కొఱకే తనుజా, విత్తజా సేవ చేయ నగును. అనగా, కాయిక, వాచిక సేవ చేయగా,చేయగా,మానసీసేవకుయోగ్యత ప్రాప్తించును.

"విజాతీయ ప్రత్యయ నిరాసపూర్వక సేవ్యాకారాకారిత
మానసీవృత్తి ప్రవాహ ఏవ మానసీ సేవా భవతి॥"

విజాతీయ ప్రత్యయ (జ్ఞాన) నిరాసపూర్వకముగా సేవ్యుడైన భగవంతుని ఆకారమును పొందిన మానసిక వృత్తిప్రవాహమే సేవ అని భావము. సముద్రోన్ముఖమైన అఖండ గంగాప్రవాహము అవిచ్ఛిన్నముగా ప్రవహించురీతిగానే భగవదున్ముఖమైన మానసిక ప్రవాహము అనవరతముగా సాగుటయే భగవత్సంబంధమైన మానసీ సేవ. సగుణ, సాకార, సచ్చిదానందఘన భగవదాకారాకారిత వృత్తిప్రవాహము ఉన్నట్లే వేదాంతవేద్య, నిర్గుణ, నిరాకార, నిర్వికార, అదృశ్య, అగ్రాహ్య, అచింత్య, అవ్యపదేశ్య పరమాత్మ

యొక్క స్వరూపవిషయకమైన వృత్తుల ప్రవాహము గూడా ఉండును. నిర్వికారము, పరబ్రహ్మాకారమును అయిన మానసప్రవాహమే భక్తి, భజనము, లేక సేవ. అదియే భగవత్ప్రాపక మగుటచేతను, లేక ఏకాగ్రత అగుటచేతను యోగము గూడా అయి ఉన్నది. అది, మధ్య మధ్య, భగవద్విముఖమై బాహ్యప్రపంచముతో కలసి పోయినపుడు, 'వ్యభిచారి'అని చెప్పబడును. కావున, అన్యసంబంధ వివర్జితము, నిర్విశేష భగవదాకారాకారితమును అయిన అవిచ్ఛిన్న మానస వృత్తి ప్రవాహమే. అవ్యభిచార (నిశ్చల) భక్తియోగము. అదియే జ్ఞానాభ్యాసము, అదియే, నిదిధ్యాసనము.

ఈ అవ్యభిచార భక్తియోగముతో భగవత్సేవచేయుటవలన, సాక్షాత్కారము ద్వారా అతిశీఘ్రముగానే గుణమయ ప్రపంచ జ్ఞానము కలుగును. జ్ఞానము చతుర్థీ (నాల్గవ) భక్తి. కావున, ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని- ఈ నలువురును భగవద్భక్తులగుదురు.

"చతుర్విధా భజన్తే మాం జనాః సుకృతినోఽర్జున ।"

జ్ఞాని, జ్ఞానముతోనే భగవద్భజనము, లేక భగవత్సేవ చేయును. జ్ఞాని, భగవంతునికి అత్యంత ప్రియ భక్తుడు. భగవద్భజనము చేయువారందఱును, భగవంతునికి ప్రియులు, ఉదారులును అయినను, జ్ఞానిమాత్రము ఏకమాత్ర భగవంతునే భజించును. ఏల యనగా వానికి భగవంతునికంటె భిన్నమైన మఱొక దృష్టియే ఉండదు. కావుననే జ్ఞానిదృష్టినుండి భగవంతుడు ఒక్క క్షణకాల మైనను, అదృశ్యుడు కాడు. భగవంతునికి జ్ఞాని,అదృశ్యుడు కాడు. జ్ఞాని, సాక్షాత్తుగా భగవంతుని అంతరాత్మయే.

"జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ।"

మొదట, సూక్ష్మతత్త్వమందు మానసిక స్థితి కలుగుట అసంభవము కావున, విరాట్, హిరణ్యగర్భాది తత్త్వములందు మనస్సును నిలిపి

తరువాత, క్రమముగా సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడును అయిన సగుణ భగవంతునియందు స్థితిని సంపాదించుకొనుచు, నిర్గుణ, నిరాకార, నిర్విశేష బ్రహ్మయందు స్థితి, సుసంపన్నమగును. స్థూలములైన ఆలంబనములను అపోహన మొనర్చుచు (తొలగించుచు) సూక్ష్మములైన ఆలంబనములందు చిత్తమును ఏకాగ్ర మొనరించుచు, అంతమున, చిత్తమును అత్యంత నిరాలంబన మొనర్చవచ్చును. శ్రీ కపిలదేవుడు గూడా నిర్గుణ, నిర్వికార బ్రహ్మయందు స్థితికై, భగవంతుని మధుర, మనోహర, మంగళ మయ, సగుణ, సాకార, సచ్చిదానందమయ మూర్తిధ్యానము చెప్పెను. మొదట, అస్త్ర, శస్త్ర, భూషణ వసనాది సుసజ్జితమైన మూర్తియొక్క ధ్యానమును చెప్పెను. అటుపిమ్మట, అస్త్రశస్త్ర రహిత కేవల శోభామూర్తిధ్యానము చేయుట చెప్పెను. ఒక్కొక్క అవయవధ్యానము, తత్సౌందర్య, మాధుర్య, మహత్త్వమును ప్రేమపూర్వకముగా చింతనము చేయుటను చెప్పెను. అనంతరము శ్రీచరణారవిందముల నఖమణిచంద్రికయందు లేక అమృతమయ ముఖచంద్రుని సౌందర్య, మాధుర్యములందు తల్లీనత్వము చెప్పబడినది. పరమ పవిత్రత, అద్భుత మహిమ, లోకోత్తరసౌందర్య, మాధుర్యముల చిన్తనమువలన, భావుకుని మనస్సు, ప్రేమోన్మాదముచేత ఆనందపులకిత మగును. ప్రేమ జనించినపుడు, అవయవములందు,వాగాదీంద్రియములందుశైథిల్యము కలుగునట్లే మనస్సునకు గూడా శైథిల్యము వచ్చును. దీనివలన, అది,ధ్యేయ స్వరూపమును గూడా గ్రహించుటకు అసమర్థ మగును. మనస్సు సమస్త దృశ్యరహితమైనపుడు, చివరకు ధ్యేయస్వరూపశూన్యమైనపుడు గూడా ధ్యేయాభావమందు, ధ్యేయాకారవృత్తిరూప ధ్యానము, ధ్యానమునకు ఆశ్రయుడైన ధ్యాత గూడా లభించడు. ఆ సమయమున, ధ్యాత, ధ్యానము, ధ్యేయము బాధితమగుటకు

అవధిగాను, సాక్షిగాను భగవంతుని అభివ్యక్తి జరుగును. అనగా, భావుకుల (భక్తుల) మనస్సును ఆకర్షించుట కొఱకే భగవంతుడు ధ్యేయరూపముతో వ్యక్తమగును. ఆ భావుకుని ఆకర్షించి, మఱల, ఆ భగవంతుడే ధ్యేయాతీత, అగ్రాహ్య రూపములో అభివ్యక్త మగును. ఈవిధముగా గూడా భగవంతునియందే చిత్తము లగ్నము చేసి, భగవత్పరాయణులై, సర్వభావముతో ఎవరు భగవత్సేవ చేయుదురో, వారిపైన, భగవంతుడు కృపాళువై, వారికి బుద్ధి యోగము నొసంగును. వారి హృదయమందు తేజోమయమైన జ్ఞానదీపమును వెలిగించి, అజ్ఞానాంధకారమును దూరాపాస్తము చేయును (పోగొట్టును)—

"దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే ।
తేషా మేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః ।
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥"

వేదాంతవేద్యమైన పరమ తత్త్వము అత్యంత అదృశ్యము, అగ్రాహ్యము, అచింత్యము అయినను, భగవద్భక్తులు నిశ్చింతగా ఉందురు. నిరంతరము భగవంతుని పాదపంకజములందు ఆత్మ సమర్పణము చేసి, భగవద్భజనమే చేయవలయునని వారు ఎఱుంగుదురు. భగవంతుడు తన నిర్గుణ, నిరాకార, నిర్వికార స్వరూపమును సాక్షాత్కరింపజేయుట ఆవశ్యకమని భావించినచో, ఏదోవిధముగా సాక్షాత్కరింపజేయును. అత్యంత బధిరునికి (చెవిటి వానికి) శబ్దము దుర్గ్రాహ్యమైనట్లు, జన్మాంధునకు(పుట్టుగ్రుడ్డికి) రూపము దుర్గ్రాహ్యమైనట్లే అజ్ఞానికి బ్రహ్మ, దుర్గ్రాహ్యము. కాని, భగవంతుడు శ్రోత్రమును,నేత్రమును సృజించి, దుర్గ్రాహ్య మైన శబ్దమును, రూపమును గ్రాహ్యము,సుజ్ఞేయము చేయును. ఆ భగవంతునికి అత్యంత అచింత్యము, దుర్జ్ఞేయమును అయిన తన నిరాకార రూపమును సాక్షాత్కరింపజేయుటయందు ఏమియు

క్లేశము లేదు. కావున, పూర్ణమైన విశ్వాసముతో, ఆశతో భగవంతుని పాదపంకజములను అవ్యభిచార (చలించని) భక్తియోగముతో సేవించువానికి అతి దుర్గమములైన తత్త్వములన్నియు లభించును. అపుడు, గుణములను అతిక్రమించుట గూడా వానికి సుగమ మగును.

"బ్రహ్మణో హి ప్రతిష్ఠాఽహ మమృతస్య అవ్యయస్య చ ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్య ఐకాన్తికస్య చ ॥"

అని భగవద్వచనము. అనగా, అవ్యయము, శాశ్వత ధర్మము, ఐకాంతిక సుఖస్వరూపమును అయిన బ్రహ్మకు నేనే ప్రతిష్ఠను. నన్ను భజించుటవలన,అనాయాసముగా గుణములను అతిక్రమించ గలుగును అని భావము.

'అహం' పదమునకు అర్థము ప్రత్యగాత్మ. మహాకాశము ఘటాకాశముగా ప్రతిష్ఠితమైనట్లే, ప్రత్యగాత్మ నయిన నేనే పర బ్రహ్మకు ప్రతిష్ఠనై ఉన్నాను అని తాత్పర్యము. అనగా, పరమాత్మయే ప్రత్యగాత్మ రూపములో ప్రతిష్ఠితుడై ఉన్నాడని భావము. కావున, ఘటాకాశము మహాకాశముకంటె అభిన్నమైనరీతిగానే ప్రత్యగాత్మ,పరమాత్మ అభిన్నస్వరూపులే.పరమాత్మ, ప్రత్యగాత్మ (అంతరాత్మ) రూపముతో ప్రతిష్ఠితుడై ఉండును. ప్రత్యగాత్మ, పరమాత్మయొక్క ప్రతిష్ఠ. అథవా, 'అహం' పదమునకు అర్థము ప్రత్యక్ చైతన్యాభిన్నము, మాయాతీతము, అదృశ్యము, అగ్రాహ్యము, అలక్షణము, నిర్వికల్పము, నిర్విశేషమును అయిన పరమాత్మ. ఎట్లనిన,

"మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా ।"

"యేత్వక్షర మనిర్దేశ్యమ్ ।"

"తే ప్రాప్నువన్తి మామేవ ।"

ఇత్యాది స్థలములందు వివక్షితము. 'బ్రహ్మ' పదమునకు అర్థము

మాయావిశిష్ట, సవికల్ప బ్రహ్మ. ఈవిధముగా తేలిన భావమేమనిన, సవికల్ప బ్రహ్మకు నిర్వికల్ప బ్రహ్మనైన నేను ప్రతిష్ఠయై ఉన్నాను. నిర్వికల్ప బ్రహ్మయందు సవికల్ప బ్రహ్మ, ప్రతిష్ఠితుడై కల్పితుడు. నన్ను సేవించుటవలన సవికల్ప ప్రపంచమును తేలికగా అతిక్రమించవచ్చును. అథవా, 'బ్రహ్మ' పదమునకు అర్థము నిర్గుణ, నిరాకార, నిర్వికార బ్రహ్మ. 'అహం' పదమునకు అర్థము సగుణ. సాకార, బ్రహ్మ (శ్రీకృష్ణుడు). దీని అభిప్రాయ మేమనిన, సగుణ బ్రహ్మనైన నేను నిర్గుణ బ్రహ్మకు ప్రతిష్ఠనై ఉన్నాను. ఇచట 'రాహోః శిరః (రాహువుయొక్క శిరస్సు) వలె, సంబంధార్థమైన షష్ఠీవిభక్తి అభేదమందే అయి ఉన్నది. అనగా, వ్యాపకము, అవ్యక్తమును అయిన అగ్ని, దహన, ప్రకాశన. పాచనాది (వంట మొదలగు) కార్యము చేయుటకై ఘృత, వర్తికాది సంబంధము చేత వ్యక్తము, సాకారమును అయిన అగ్నిగా ప్రతిష్ఠితమై ప్రవృత్త మగును. అట్లే నిర్గుణ, నిరాకార, నిర్వికార, అవ్యక్త బ్రహ్మ, భక్తానుగ్రహాది కార్యముల నొనర్చుటకై తన అచింత్య దివ్య లీలాశక్తిచేత సగుణ, సాకార, వ్యక్తరూపములో ప్రతిష్ఠితుడగును. కావుననే సగుణ బ్రహ్మయే నిర్గుణ బ్రహ్మకు ప్రతిష్ఠయై ఉన్నాడు. కావున, నన్ను ఆరాధించుటవలననే గుణోల్లంఘనాది భక్తానుగ్రహము సిద్ధించును.

సగుణ బ్రహ్మ, నిర్గుణ బ్రహ్మకు ప్రతిష్ఠ, అనగా ఆధారము. ఆతపమునకు (ఎండకు) ప్రతిష్ఠ, ఉద్గమస్థానము, లేక ఆధారము సూర్యుడు. సూర్యునినుండియే బయలుదేరి, సూర్యసహాయము తోనే ఆతపము ఉండును. అట్లే సగుణుడు, సాకారుడైన శ్రీకృష్ణ చంద్రుని మధురమూర్తియే నిర్గుణ బ్రహ్మకు ప్రతిష్ఠ, లేక ఆధారము. సూర్యస్థానీయుడు శ్రీకృష్ణుడు, ఆతపస్థానీయుడు నిర్గుణ బ్రహ్మ.

"అనాదిమత్పరం బ్రహ్మ"

అను వచనమున గూడా బ్రహ్మ 'అనాది,' 'మత్పరం' అని చెప్ప బడెను. ఇచట 'మత్పరం' శబ్దమునకు అర్థము ఇది—

"అహం శ్రీకృష్ణః పరః ఉత్కృష్టః యస్మాత్
తత్ మత్పరమ్ ।"

శ్రీకృష్ణుడనైన నేనే పరోత్కృష్ణుడైన నిర్గుణ బ్రహ్మకంటె ఉత్కృష్టు డనైన సగుణ బ్రహ్మను నేను అని భావము.

కావుననే, వారి అభిప్రాయమేమనిన, ఔపనిషద బ్రహ్మత్మ దర్శుల బ్రహ్మ, ఆతపమువంటిది, భక్తుల భగవంతుడు సూర్య స్థానీయుడు. కాని, వారు చెప్పెడి ఈమాట శ్రుతులకు, సూత్రము లకు విరుద్ధను. వేదములు, వేదాంతములు బ్రహ్మసూత్రములు మున్నగు సర్వశాస్త్రములకు తాత్పర్యము బ్రహ్మయందే కలదు.

"బ్రహ్మవిదాప్నోతి పరమ్ ।"

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ"

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా ।"

ఇత్యాది వాక్యములందు సర్వత్ర, బ్రహ్మవిచారమే జరుగును. శ్రీకృష్ణుడు వైదిక, ఔపనిషద పరబ్రహ్మకంటె భిన్నుడైనప్పుడు కదా, ఆయనయందు వేదవేద్యత్వము సిద్ధించకపోవుట.

"వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః ।"

ఇత్యాది వచనములచేత భగవంతుడు తన వేదవేద్యత్వమును అంగీకరించెను. కావుననే "అనాది మత్పరం బ్రహ్మ" ఇచట గూడా 'మత్పరం' అని పదవిభాగము చేయక 'అనాదిమత్ పరం బ్రహ్మ' అని పదచ్ఛేదము చేయుట యుక్తము. దీని సారాంశమేమనిన బ్రహ్మ 'అనాదిమాన్'. 'పరుడు, అనగా, సర్వోత్కృష్టుడు అని అర్థము. బ్రహ్మపర్యవసాయి అయిన ప్రకరణమును విచ్ఛిన్న

మొనర్చి, అన్య వర్ణన ప్రసక్తి తెచ్చుట అప్రాకృత ప్రక్రియ. బ్రహ్మజ్ఞానప్రశంసా ప్రసంగమందు ఆ బ్రహ్మను అపకృష్టుడు (తక్కువవాడు) అని చెప్పుట సర్వథా విచారశూన్యత్వమే అగును.

శ్రీమద్భాగవతమందు గూడా సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహిత, స్వప్రకాశ, నిత్యవిజ్ఞానమే తత్త్వమని చెప్పబడినది.

"వదన్తి తత్తత్త్వవిదః తత్త్వం యద్ జ్ఞాన మద్వయమ్
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే ॥"

తత్త్వవేత్తలు, అద్వయ జ్ఞానమునే తత్త్వమని చెప్పుదురు. ఆ తత్త్వమే బ్రహ్మ, పరమాత్మ, భగవంతుడు అని చెప్పబడును.

ఇచట బ్రహ్మకంటె, పరమాత్మయందు, ఆ పరమాత్మకంటె భగవంతునియందు ఉత్కర్ష (గొప్పదనము) వివక్షితమని కొందఱు చెప్పుదురు. యదుకులభూషణుడైన శ్రీకృష్ణుని సభలో కూర్చుండి ఉన్న యాదవులు, ఆకాశమార్గమునుండి వచ్చుచున్న దేవర్షి అయిన నారదమునీంద్రుని, మొదట కేవలము తేజఃపుంజమనియే తలంచిరి. కొలది సమీపమునకు వచ్చినపుడు ఒకానొక శరీరధారి అని తెలిసికొనిరి. మఱింత సమీపమైనపుడు, ఒక పురుషుడనియు, పూర్తిగా దగ్గఱకు వచ్చినపుడు నారదుడనియు తెలిసికొనిరి.

"చయ స్త్విషా మిత్యవధారితం పురా తతః శరీరీతి
విభావితాకృతిమ్ ।
విభు ర్విభక్తావయవం పుమానితి క్రమా దముం నారద
ఇత్యబోధి సః ॥"

సరిగా, ఆ విధముగానే తత్త్వమునకు అతిదూరస్థుడైన అధికారికి మొదట, కేవలము చిన్మాత్ర బ్రహ్మజ్ఞానము కలుగును. కొలది సమీపమైనపుడు, యోగులకు కతిపయ గుణవిశిష్టునియందు తత్త్వము ఉపలబ్ధమగును. వీరియందే, స్వేచ్ఛాకల్పన చేయువారు కొందఱు శ్రీకృష్ణుని, ఆదిత్యస్థానీయుడని, బ్రహ్మను ప్రకాశస్థానీయు

డని భావింతురు. మఱి కొందఱు శ్రీవృషభాను కిశోరి యొక్క నఖమణి ప్రకాశమును, లేక నూపుర ప్రకాశమునే ఔపనిషద బ్రహ్మ అని చెప్పుదురు. కాని, వైదికుల దృష్టియందైనచో, వేదముల మహాతాత్పర్యము బ్రహ్మయందే కలదు. ఆ బ్రహ్మయే సర్వథా సర్వోత్కృష్టుడు.

సంకోచమునకు కారణము లేకపోవుటవలన వృద్ధ్యర్థకమైన 'బృహి' ధాతువునుండి నిష్పన్నమైన 'బ్రహ్మ' శబ్దమునకు అర్థము నిరతిశయ బృహత్తమ తత్త్వము అగును. దేశ, కాల, వస్తు పరిచ్ఛేదము కలవాడు పరిచ్ఛిన్నుడైన కారణముచేత అల్పుడే. నిరతిశయ 'బృహత్' కాడు. జడమైనను, దృశ్యమగుటచే అల్పము, మర్త్యమును అగును. కావున, అనంత, స్వప్రకాశ, సదానంద తత్త్వమే, 'బ్రహ్మ' శబ్దమునకు అర్థమగును. అదియే భూమాఖ్యమైన అమృతము. దానికంటె భిన్నమైనవన్నియు, అల్పములని, మర్త్యములనియే తెలియవలయును. ఇక, 'అనంత' పదముతో పఠితమైన 'బ్రహ్మ' శబ్దమునకు సుతరాం ఇదియే అర్థము. దాని యందు అతిశయత్వకల్పన చేయుట నిరాధారము.

ఒకానొక మహారాజు, అంతమన్నది లేని ఒక కథను వినదలచెను. ఒక చతురుడు కథ వినిపించ నారంభించెను. ఓ రాజా! ఒక వృక్షము ఉండెను. దానికి అనంత శాఖలు గలవు. ఆ శాఖలకు అనంత ఉపశాఖలు ఉన్నవి. ఉపశాఖలందు గూడా అనంతపల్లవములు కలవు. వాటిపైన అనేక పక్షులు కూర్చుండి ఉన్నవి. కొంత కాలమునకు ఒక పక్షి 'ఫుర్' అని ఎగిరిపోయెను. అపుడు రాజు తరువాతి కథ చెప్పుమని అడిగెను. అంత, అతడు రెండవ పక్షి కూడా 'ఫుర్'మని ఎగిరిపోయెను అని చెప్పెను. అపుడు, రాజు తరువాత జరిగిన కథ చెప్పుము అని అడిగెను. అపుడు, అతడు ఇట్లనెను— ముందు, పక్షులు ఎగిరిపోవుట పూర్తికానిండు, అనంతరము ముందుకు సాగెదను. ఇచట ఒక్కొక్క పక్షి ఎగురుట పూర్తియే

కాజాలదు. ఈవిధముగానే కల్పనలకు అంతమన్నదియే ఉండదు. కావున, ఒక మాటలో చెప్పవలెనినిన, అతిశయత్వకల్పన చేసి చేసి వాచస్పతి బుద్ధి- ప్రజాపతియొక్క- బుద్ధి గూడా కల్పన చేయలేక విరతమయ్యెను. ఇకముందు ఎన్నడును ఏ కల్పనను చేయజాలనంత అనంత, అఖండ స్వప్రకాశ పరమానందఘన స్వరూపుడైన పరమాత్మను వేదాంతులు 'బ్రహ్మ' అని చెప్పుదురు.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా ।"

ఇత్యాది వ్యాస సూత్రములచేత బ్రహ్మవిచారమే చేయబడెను.

ప్రకాశముకంటె ఆదిత్యునియందు ఏ అతిశయత్వకల్పన చేయబడునో, దానికంటెగూడా అనంతకోటిగుణితమైన అతిశయత్వ కల్పన తరువాత, ఏ అంతిమ, నిరతిశయ, సర్వబృహత్ పదార్థము సిద్ధించునో, దానియందు గూడా దేశ, కాల, వస్తుకృత పరిచ్ఛేదములను తొలగించి పరిచ్ఛిన్నత్వ, లేక ఏకదేశిత్వాది దోషముల అత్యంతాభావమును సంపాదించినపుడు అది 'బ్రహ్మ'శబ్దమునకు అర్థమని ఎఱుంగవలయును. దీనినే 'తత్త్వ'మని అందురు.

"తత్త్వం యద్ జ్ఞాన మద్వయమ్ ।"

అని తత్త్వలక్షణము. ఈ తత్త్వము పేరే, బ్రహ్మ, పరమాత్మ, భగవంతుడు. లక్షణభేదముచేత లక్ష్యభేదము ఉండవచ్చును. కాని, నామభేదముచేత లక్షణభేదము ఉండదు. కంబుగ్రీవాదిమత్త్వము ఘటమునకు ఒక లక్షణమై ఉన్నది. కావుననే ఘట, కుంభ,కలశాది నామములచేత దానికి భేదము లేదు. బ్రహ్మ అనేకము-కార్యబ్రహ్మ, కారణబ్రహ్మ, కార్యకారణాతీతబ్రహ్మ. ఇట్టి స్థితిలో కార్యకారణాతీత, వేదాంతవేద్య, శుద్ధ బ్రహ్మరూపుడైన భగవంతుని ప్రకాశస్థానమందు కార్యబ్రహ్మ, లేక కారణబ్రహ్మ ఉండవచ్చును. నిర్గుణ బ్రహ్మ, భగవంతుని ధామమని కూడా, తరచుగా చెప్పబడును. 'ధామ' శబ్దము ఇటువంటి స్థలములందు స్వరూపభూతమైన ఆత్మజ్యోతిబోధక మయియే ఉండును.

"పరం బ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్ ।"

హేనాథ ! నీవు పరమాత్మవు, పరమ ప్రకాశుడవు (పరమ జ్యోతివి), పరమ పవిత్రుడవు అని అర్థము. అయినను, కొందఱు అవివేకుల దృఢమైన నిశ్చయ మేమనిన, 'ధామ' శబ్దమునకు అర్థము నివాస స్థానమనియే. అస్తు, వారు అవ్యక్త రూపమైన కారణ బ్రహ్మనే వేదాంతవేద్యమైనబ్రహ్మ అని భావింతురు. కార్యకారణా తీతమైన తత్త్వము వఱకు వారి దృష్టి పోనే పోదు. ఈకారణము చేత, బ్రహ్మను 'ధామ'మని గూడా అంగీకరించినను, సిద్ధాంత మందు భంగమేమియు వాటిల్లదు. ఈ భేదము వేదాంతులకు ఇష్టమైనదే. స్థూల కార్య బ్రహ్మపైన సూక్ష్మ కార్యరూపమైన బ్రహ్మ, దానిపైన కారణబ్రహ్మ, ఈ అవ్యక్త కారణబ్రహ్మపైన కార్య కారణాతీత శుద్ధబ్రహ్మ కలడు. ఈ అంతిమ తత్త్వమే అద్వితీయ, అనంత, శుద్ధ, బోధరూపము. దీని వివర్తమే సమస్త చరాచర ప్రపంచము. సర్వాధిష్ఠాన మగుటవలన, దీనిని సర్వనివాస స్థానమని చెప్పినను, హాని ఏమియు లేదు. భాగవతమందు ఈ విషయమే స్పష్టీకరించబడినది-

"జ్ఞానమేకం పరాచీనై రింద్రియైః బ్రహ్మ నిర్గుణమ్ ।
అవభాత్యర్థరూపేణ భ్రాంత్యా శబ్దాదిధర్మిణా ॥"

ఏకము, అద్వితీయము, నిత్యమును అయిన బోధయే భ్రాంతులైనవారికి అవిద్యాప్రత్యుపస్థాపితములైన ఇంద్రియ ములు, మనస్సు, బుద్ధి మున్నగువాని ద్వారా శబ్దాదిధర్మము గల ప్రపంచముగా భాసించును. శ్రీమద్భాగవతము గూడా శ్రీకృష్ణపరమాత్మను పరబ్రహ్మయే అని చెప్పెను-

"అహోభాగ్య మహోభాగ్యం నందగోపవ్రజౌకసాం ।
యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనమ్ ॥"

కావున, పూర్వోక్తమైన అర్థమే శ్రేష్ఠము, అదియే అవ్యభిచార (నిశ్చల) భక్తియోగము.



# 7. చతుర్విధా భజన్తే

సుధాతరంగిణి

భగవద్భక్తులు నాలుగు విధములుగా ఉందురు. ఒకడు, ఆప్తకాముడు, ఆత్మారాముడు, పరమ నిష్కాముడు, తత్త్వవేత్త, బ్రహ్మనిష్ఠుడు, పరమాత్మరహస్యవేత్తయు అయిన జ్ఞాని. అట్టి వారికి ఇంద్రపదము, బ్రహ్మపదము వఱకు గల సమస్త వైభవము లందు లేశమాత్రము గూడా కోరిక ఉండదు. ఆ యోగీంద్రులు, మునీంద్రులు, అమలాత్ములు, పరమాత్మస్వరూపులు ఏ ప్రయోజనము లేకయే సర్వైశ్వర్యపూర్ణ, మధురతమ లీలావిహారియైన భగవంతునియొక్క నిష్కపటమైన భజనమందు సంలగ్నులై ఉందురు. వారు పూర్ణకాములు, ఆత్మారాములు, పరబ్రహ్మ పరినిష్ఠితులు, భజించవలసిన ఆవశ్యకత లేనివారు అయినను, బ్రహ్మానందానుభవము పొందునట్టి ఆ మునిజనులు దివ్య, శుద్ధ, నిత్య, చిన్మయమైన భగవత్స్వరూపము కన్పడినంతనే క్షుబ్ధులగుదురు. వారి మృతమనస్సులు గూడా సంజీవములై ఈ భగవత్స్వరూపముయొక్క ఒక్కొక్క అవయవమును చూచి, ముగ్ధులై పోవును. ఇంద్రియముల వికారరూపములైన రూప, రస, గంధ, శబ్ద, స్పర్శలనుండి ముముక్షుదశలోనే చిత్తము ఉపరతమగును. భజించుట వారి స్వభావమే అగును. కమలనయనుడు అయిన ఘనశ్యాముని విధువినిందక (చంద్రుని నిందించు) వదనారవిందమందు అతి మృదులమైన మందహాసమును అతిమనోహరమైన ఆయననేత్రయుగళముయొక్క కమనీయ కృపాకటాక్షమును, భగవంతునియొక్క అన్యాన్య శోభాసంపన్నములైన అవయవములను అవలోకించి దృశ్య, నామరూపాత్మక

ప్రపంచము నుండి అన్యమనస్కులైన యోగీంద్రులు, మునీంద్రులు సైతము ముగ్ధులగుదురు.

ఒకమారు, దివ్యవైకుంఠలోకమునందు నిరంతరము ఆత్మ నిష్ఠులైన సనకాది ఋషులు శ్రీమహావిష్ణుసన్నిధికి ఏతెంచిరి. వారు భగవంతుని సమక్షమునకు చేరినంతనే భగవత్స్వరూపమును చూచి ముగ్ధులైరి. భగవంతుని సౌందర్యమును చూచుచు, వారి నేత్రములు ఈషణ్మాత్రమైనను తృప్తి చెందలేకపోయినవి. భగవంతుని సౌందర్యమే వారిని ఇంత ముగ్ధులను చేసినది అను మాట కాదు. ప్రణామముచేయు సమయమున,కమలనయనుడైన శ్రీహరియొక్క పాదపద్మ పరాగముతో కలిసిపోయిన తులసీదళ సుగంధము వాయు సంచారము ద్వారా నాసికాపుటమార్గమున మునుల హృదయాంతరమును చేరినంతనే వారి మనస్సులు వికలములయ్యెను. ఆ పరిమళము వైపునకు వారి మనస్సులు ఆకృష్టములయ్యెను, దానిచే మోహితము లయ్యెను. ఆనందముతో వారు రోమాంచితులయిరి–

"తస్యారవిందనయనస్య పదారవింద కింజల్కమిశ్ర
తులసీ మకరందవాయుః ।
అంతర్గతః స్వవివరేణ చకార తేషాం సంక్షోభ
మక్షరజుషామపి చిత్తతన్వోః ॥"

ఈ స్థితియే శ్రీమద్రాఘవేంద్రుడైన రామచంద్రుని స్వరూపము చూచి,జనకమహారాజుకు గూడా కలిగెనని శ్రీగోస్వామీ తులసీదాసు వచనములవలన అవగతమగుచున్నది–

ఏదో విధముగా, తనను వివేకముతోను, ధైర్యముతోను సంబాళించుకొనెను. కాని, ప్రశ్నించక ఉండలేకపోయెను. విశ్వామిత్రుని చరణములకు ప్రణామ మొనర్చి, గద్గదవాణితో ఇట్లు ప్రశ్నింపమొదలిడెను– హే మునీంద్ర! సుందరులైన ఈ ఇరువురు బాలకులు మునికులతిలకులా, నృపకులపాలకులా? వేదములు

'నేతి-నేతి' అని సంకీర్తించిన బ్రహ్మ, రెండు వేషములను ధరించి ఇచటకు ఏతెంచెనా ? సహజముగా విరక్తమైన నా మనస్సు వీరిని చూచి,చంద్రునిచూచి చకోరపక్షి విక్షుబ్ధమైనట్లు వ్యాకులమైనది. వీరిని చూచినంతనే మనస్సునందు అతి అనురాగము ఉద్బుద్ధమైనది. నా మనస్సు, బ్రహ్మసుఖమును సైతము త్యజించినది.

సారాంశమేమనిన, భజించుట వారి స్వభావమే అగును. కొంతకాలము భజించరాదని వారనుకొందరు. కాని, వారు నిరోధించినను, వారి మనస్సు ప్రభువుయొక్క నఖమణిచంద్రికాచింతనము చేయసాగును. త్రిభువనపావనము, మంగళమయమును అయిన పరమేశ్వరుని నామమును ఉచ్చరింపసాగును. ఒక గోపాంగన లీలావిహారి, త్రిభువనసుందరుడు, యోగిజనదుర్లభుడు, దేవదేవ ప్రత్యాశితుడు, ఋషుల, మహర్షుల, మహాపురుషుల చిత్తాకర్షకుడు, నిఖిల సౌందర్య, మాధుర్య రసామృత సారభూతుడు, ఆనంద కందము, వ్రజేంద్రనందనుడు, మదనమోహనుడు నయిన కృష్ణ చంద్రుని విరహమువలన కలిగిన తీవ్రతాపముచేత సంతప్తురాలై భూమిపైన మూర్ఛిల్లి పడిపోయెను.మఱొక చెలికత్తె,ఆమె ముఖము పైన పన్నీరు తుంపురులను చల్లి, నెమ్మదినెమ్మదిగా విసెనకఱ్ఱతో వీచుచుండెను. ఇంతలోనే మఱొక మూడవ చెలికత్తె వచ్చెను. జన మనోహరుడు రాధారమణుడు, బాధాహరణుడును అయిన నంద నందనుని గుఱించి చర్చ చేయసాగెను. ఇంతలో మఱొక చెలికత్తె ఇట్లనెను- "ఓ సఖీ ! ఇపుడు ఆయనను గుఱించి చర్చ లేవనెత్తకుము. మన ప్రియసఖికి ఇపుడు విశ్రాంతి ఈయగోరుచున్నచో, ఆయనచర్చను పొరపాటున గూడా చేయకుము. మఱొక చర్చ సాగించి, మాధవుని, ఈ సమయమున, విస్మరింపజేయుము.

ఎటువంటి విచిత్రస్థితి! ఎవరైనను ఆధివ్యాధిపూర్ణము,శోక, తాపసంకులము, జన్మమృత్యుసంకీర్ణము,ఆర్తనాదమునకు ఉద్భవ

స్థానము, మృత్యువుయొక్క లీలాక్షేత్రము, పాపవిద్ధమును అయిన ఈ సంసారమును విస్మరించి భగవద్రసమును ఆస్వాదింప గోరుదురు. అథవా, ప్రభువును స్మరింపదలంతురు. కాని, ఇట్లు జరుగదు. మహాభాగ్యవతులైన ఈ గోపాంగనలు నందనందనుడైన శ్రీకృష్ణుని, ఏవిధముగానైనను విస్మరింప గోరుచున్నారు. కాని, అట్లు జరుగుటలేదు.

ఈవిధముగానే జ్ఞానులు గూడా అనేకవిధములుగా ఉందురు. ఒకరు, జడభరతునివలె అడవులలో ఉన్మత్తుడై భక్తిపులకితుడై ఇటునటు తిరుగుచుండును. లోకసంగ్రహము చేయువారు గూడా ఆత్మారాములు, ఆప్తకాములును అయి ఉందురు. కాని,భగవంతుని ప్రేరణచేత ధర్మసంస్థాపనమందు సర్వదా లగ్నచిత్తులై ఉందురు. వ్యాసుడు, పరమ జ్ఞాని అయ్యు పురాణరచనయందు, శంకరాచార్యుడు పరమజ్ఞాని అయ్యు, బౌద్ధ సిద్ధాంతఖండనమందు నిమగ్నులై ఉండెడివారు. లోకసంగ్రహము చేయువారికి కష్టములు గూడా ఎదురగును. ఏలన, ప్రపంచము కుక్కతోకవంటిది. కుక్కతోకను ఎంతైనను, నెయ్యి,నూనె పూసి,వాసపుగొట్టములో తిన్నగా ఉంచుడు. కాని, వాసపుగొట్టమునుండి బయటకు వచ్చినంతనే మరల ఆ కుక్కతోక వంకర వంకరయే. కావున,ఇటువంటి జ్ఞానులకు అడుగడున, భగవంతుని సహాయము తీసికొనవలసివచ్చును.

రెండవ విధమైన భక్తులు ఉందురు. వారు జిజ్ఞాసువులు, పూర్ణమైన విరాగము కలవారు. ఉత్తమోత్తమములైన పదార్థములను భుజించి, వమనము చేసినచో, అటువైపునకు చూచుటకు గూడా మనస్సు అంగీకరించదు. సరిగా, ఆవిధముగానే జిజ్ఞాసువులకు ఇంద్ర, మహేంద్ర, బ్రాహ్మపదపర్యంతము గల సమస్త వైభవములు విషమువలె, వమనమువలె అనిపించును. వారు వేదాధ్యయనాదులను చేయుదురు. కాని, భగవద్భజనము చేయుచునే

వేదములను అధ్యయనము చేయుదురు. ఈ విధముగా చేయని వారు ఆకాశమునందు ఎగురుచు దృష్టి, భూమివైపునకు గల గ్రద్ద వంటివారు. వీరు గూడా శాస్త్రములమీదనే ఎగురుచుందురు. కాని, వారి దృష్టి క్రింద ఉన్న సంసారముమీద ఉండును. క్షుద్రములైన వైషయిక సుఖములను సంపాదించుట, వారి లక్ష్యమై ఉండును. అస్తు.ఎవరు వివేకజ్ఞానములతో భగవత్ప్రాప్తిని లక్ష్యముగా చేసికొని గ్రంథములను అధ్యయనము చేయరో, వారికి గ్రంథములు గ్రంథి (ముడి) చేయునట్టి పనియే చేయును. ఇటువంటివారు భగవత్సాక్షాత్కారము పొందజాలరు.

మూడవ విధమైన భక్తులు ఉందురు.వారు ఆర్తులు.గజేంద్రుడు, ద్రౌపది వలె పీడితులు, బాధితులు.

నాల్గవ విధమైన భక్తులు అర్థార్థులు. విభీషణునివంటివారు. వీరిలో జ్ఞానసంపాదనముతోపాటు ధన సంపాదనముగూడా కోరునట్టి వారు, ఆపదలను నివారింపదలచుకొనువారు నయిన కొందఱు భక్తులు ఉందురు. వారి జ్ఞానసంపాదనకు, ధనసంపాదనకు, విపత్తి నివారణమునకు వలయు సాధనములు ఉన్నను, వారు భగవద్భజనమును వీడరు. అస్త్రబలము, బాహుబలము, బుద్ధిబలము యొక్క గర్వముతో ఎవరు భగవంతుని, మఱచిపోవుదురో వారి మనోరథములు మరుభూమి (ఎడారి) యందలి నదులవలె మధ్యలోనే ఎండిపోవును. సిద్ధి, సాఫల్యము కలుగుట దూరస్థమైన విషయము. కావున, అర్జునుడు శ్రీకృష్ణుని పట్టమహిషులను వెంట నిండికొని, తిరిగి వచ్చుచున్నపుడు, అభీరులు (గొల్లవారు) వారిని వెదురుకఱ్ఱలతో కొట్టి, పట్టమహిషులను అపహరించుకొనిపోయిరి. పరాక్రమశాలి అయిన ఆ అర్జునుడే, ఆ సేనయే, నందిఘోషమన్న రథము అదియే, ఆ గాండీవధనస్సే, ఒక్క శ్రీకృష్ణుడు దక్క, ఆయన సమస్త సాధనములు వ్యర్థములైపోయినవి. ఎవడు ఎంత

శక్తిసంపన్నుడైనను, భగవచ్ఛరణముల సహాయమును గైకొనియే ముందుకు వెళ్ళవలయును.

మఱికొందఱు భక్తులు సమస్తమును కోరుదురు. కాని,సాధనము ఒక్కటి గూడా ఉండనివారు కలరు. ఇటువంటివారు కూడా నిరాశులు కావలసిన అవసరము లేదు. వారికి గూడా శాస్త్రములు సమాశ్వాసన (ఓదార్పు)వచనములను చెప్పినవి. నిష్కాముడు,అనన్యభక్తుడును అయిన నరసీదాసువలె సాధనవిహీనులైనవారు, దీనప్రపంచము యొక్క విశ్వాసము కొంచెమైనను లేనివారు, కేవల భగవత్సహకారమే కలవారు ఉందురు.అటువంటి భక్తులను భగవంతుడు ప్రసన్నులను జేయును. దానివలన వారు పూర్ణకాము లగుదురు.

మఱికొందఱు భక్తులు ఉందురు.వారు, సమస్తము కోరుదురు. కాని, వారియొద్ద సాధనమేమియు ఉండదు. ఇంతియేగాక, వారికి భగవంతునియందు విశ్వాసము గూడా ఉండదు. ఇటువంటివారికి గూడా శాస్త్రములందు నిరాశాశబ్దము లేదు. వారికి శాస్త్రములు భగవంతుని, పిలువుము అని ఉపదేశించును. హే అశరణశరణ! హే అనాథనాథ! హే అకారణకరుణ! హే కరుణావరుణాలయ! హే ప్రభో! నేను నిన్ను ఎఱుంగను. నన్నుగూడా ఎఱుంగను. నీకు, నాకును గల సంబంధమును గూడా ఎఱుగను. వంచకురాలైన మాయ, నన్ను మిక్కిలి వంచించినది. నేను ఉన్మాదినైతిని. తరంగము, కటకము, ముకుటము, కుండలము,ఘటాకాశము, నేను దక్క జలమన్నపేరు గల మఱొక వస్తువు లేదు,బంగారమన్నపేరు గల మఱొక పదార్థము లేదు, మహాకాశమున్న పేరు గల వస్తువే లేదు అని గర్వించును. సరిగా అదేవిధముగా హే భగవన్! నేను ఎంత ఉన్మాదిని అయితిననిన, ఈశ్వరుడన్న పేరు గలవాడు ఒకడు లేనేలేడని చెప్పసాగితిని. హే నాథ! నేను, భావముతోగాని, కుభావముతోగాని ఏవిధముగనైనను నిన్నుపిలుచునట్లు (స్మరించునట్లు) కృప జూపుము.

# 8. భగవంతుడు - భక్తి

## సుధాతరంగిణి

ఎచట ఎంత సన్నిధానము, ఎంత అంతరంగత్వము, ఎంత ప్రత్యక్షత్వము ఎక్కువగా ఉండునో, ఆచటనే ప్రేమతత్త్వము యొక్క అభివ్యక్తి అత్యధికముగా ఉండును. ఎచట, సన్నిధానాదులు ఎంత లోపించునో, అచట అంతియే ప్రమాణములో ప్రేమ (భక్తి) యందు గూడా లోపము కలుగును. కావుననే అత్యంత సన్నిహితము, అత్యంత అంతరంగము, అత్యంత ప్రత్యక్షమును అగు ప్రత్యగాత్మయందే ప్రేమ చూడబడును.అంతరాత్మయందు, అత్యంతము, అభిన్నమైన స్వాత్మయందే నిరతిశయమైన, నిరుపాధికమైన పరమ ప్రేమ (భక్తి) కలుగును. బ్రహ్మ, శ్రీకృష్ణుని గోవత్సములను, వత్సపాలకులైన గోప బాలకులను అపహరించినపుడు, శ్రీకృష్ణుడు కుతూహలవశమున, తానే సర్వము (గోవత్సములు, గోపబాలకులు)అయ్యెను. గోవులకు, గోపాలకులకు శ్రీకృష్ణదర్శన స్పర్శనాదులు లభించుచున్నను, నందరాణియైన యశోద యొక్క సౌభాగ్యమును చూచి వారికి, వ్రజేంద్రగృహిణీవలె తనకన్నవానిని హృదయమున దాచుకొనవలెనని, మాటిమాటికి మస్తకమును ఆఘ్రాణించి చంద్రునివంటి ఆ ముఖమును ముద్దుపెట్టుకొనవలయునని లాలస (తీవ్రమైన కోరిక) కలుగుచుండెడిది.వారి అభిలాషలనుతీర్చుటకొఱకే శ్రీకృష్ణుడు తనంతటతానే గోవత్సముల, గోపబాలకుల రూపములను ధరించెను. ఇపుడు గోవులన్నిటికి, వాత్సల్యభావము గల గోపికలందరికి కృష్ణుడే, పుత్రుడుగా లభించెను. ఇక ఏమి యున్నది! వారి ప్రేమ (భక్తి) యందు అపారమైన వృద్ధి కలిగెను. అపరాధము జరిగినను, ఆ గోప

బాలకులపైన వారి తల్లిదండ్రులకు కోపము వచ్చెడిది కాదు. వారిని చూచినంతనే వారి క్రోధము ఎచటకు పారిపోయెడిదో తెలియదు. క్రొత్త సంతానము కలిగినపుడు గూడా గోవులకు పూర్వవత్సముల యందు నిరవధికమైన ప్రేమ ఉండెడిది. ఆ గోవులు క్రొత్త లేగదూడలను లక్ష్యపెట్టక, పూర్వవత్సములకే పాలు ద్రావింప దలచుచుండెడివి. ప్రేమోద్విగ్నములై ఆ వత్సములను ఆఘ్రాణించుచుండెడివి, నాలికతో నాకుచుండెడివి. నేత్రములతోను, ఘ్రాణేంద్రియములతోను, జిహ్వేంద్రియములతోను సర్వదా పానమొనర్చి హృదయమందు నింపుకొన దలంచుచున్నవా అన్నట్లు ఉండెడివి. ఇంతకముందు లోకోత్తరమైన, సీమారహితమైన ప్రేమ ఆ గోపాలకులకు ఎన్నడును తమ వత్సములయందు లేదు. అట్టి అద్భుత ప్రేమ, కృష్ణరూపులైన ఆ వత్సములందును, ఆ వత్సపుల యందును ఇపుడు కలిగెను.

విచిత్రము, ఆశ్చర్యమయమును అయిన ఈ చరితము శ్రవణము చేసి, పరీక్షిన్మహారాజు దానికి కారణమును అడిగినపుడు, శ్రీశుకదేవుడు ఇట్లు చెప్పెను– 'హే రాజన్ ! ప్రపంచమందు ప్రతి ప్రాణికి తన ఆత్మయందు సర్వాతిశాయి అయిన ప్రేమ ఉండును. కళత్ర, పుత్ర, క్షేత్ర, విత్త, మిత్రాదులయందు ఇంత ప్రేమ ఉండదు. దేహాత్మవాదులు గూడా తమ దేహమును ఎంత ప్రేమింతురో, అంత తమ దేహమును అనుసరించు వస్తువులను, ప్రాణులను ప్రేమించరు. అపత్య (సంతానము), విత్త, కళత్రాదులందు గల ప్రేమ, కేవలము ఆత్మ ప్రేమయొక్క శేషమే. శ్రుతులుగూడా ఇదియే చెప్పుచున్నవి.

"ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి ।"

ప్రతి ప్రాణికి, ఆత్మనిమిత్తమే, సమస్త వస్తువులందు ప్రేమ కలుగును. దేవతానిమిత్తమై ప్రాణికి, దేవతయందు ప్రేమ

కలుగదు. కాని, ఆత్మకొఱకే దేవతయందు గూడా ప్రేమజనించును. సూర్యభగవానుడు ఇష్టదైవము, అత్యంత ప్రియుడు, విశ్వ ప్రాణము అయి ఉన్నాడు. కాని, ఆ భాస్కరుడే గ్రీష్మఋతువు నందు ప్రతికూలుడుగా తోచినపుడు, ప్రాణి, ఆయన సమక్షము నుండి తప్పుకొనవలయునని తలచును. ఏ దేవతవలన, మన మనో రథములు సిద్ధించునో, ఆ దేవతయందు అత్యంత స్నేహము (ప్రేమ) ఉండును. ఏ దేవతయొక్క ఉపాసనము ఆరంభించుట వలన అనిష్టము కలుగునో, ఆ దేవత అనిన విరక్తి కలుగును. కావుననే, మంత్రములయందు గూడా 'అప', 'అరి', 'మిత్రాది' కల్పన తాంత్రికులు చేయుదురు. కావున, ఆత్మకొఱకే ప్రపంచ మందలి సమస్త వస్తువులు, ప్రియము లగునని లోకమందు, వేదములందు, సర్వత్ర ప్రసిద్ధము. ఈవిధముగా ఆత్మసంబంధ మైన ప్రేమ, ప్రతి ప్రాణియందు ప్రసిద్ధ మగుటచేతనే శ్రీకృష్ణుని యందు ప్రాణులకు అధికమైన ప్రేమ కలిగెను. ఏలన, శ్రీకృష్ణ చంద్రుడు, ప్రతి ప్రాణియొక్క అంతరాత్మయై ఉన్నాడు. ఆయనయే తన అచింత్య, దివ్య లీలాశక్తిచేత సగుణ, సాకార, అచింత్య, అనంత కళ్యాణ గుణగణ సమలంకృత, మనోహర రూపములో ప్రకటమయ్యెను-

"కృష్ణమేన మవేహి త్వ మాత్మాన మఖిలాత్మనామ్ ।
జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవ ఆభాతి మాయయా ॥"

వస్తుతః, స్థావర, జగమాత్మక వస్తువు లన్నియు, శ్రీకృష్ణ మాత్రములే. శ్రీకృష్ణుడే పరమ తత్త్వము. ఆయనయే సర్వాంత రాత్మ. ఆయనయే సమస్త వస్తువుల అంతిమ స్వరూపము. వస్తువుల అంతిమ రూపము తత్కారణమైన అవ్యాకృత తత్త్వము. ఆ అవ్యాకృత తత్త్వమునకు గూడా అంతిమ పర్యవసానభూమి శ్రీకృష్ణుడు. ఏలన, కారణముకంటె, భిన్నమైన కార్యము గాని,

అధిష్ఠానము కంటె భిన్నమైన కల్పిత నామము గల వస్తువు గాని, సుతరాం ఉండదు-

"సర్వేషామపి వస్తూనాం భావార్థో భవతి స్థితః ।
తస్యాపి భగవాన్ కృష్ణః కిమతద్వస్తు రూప్యతామ్ ॥"

ఆయనయే నిరతిశయ, నిరుపాధిక, పరమ ప్రేమాస్పదుడు. ఆయనయే అంతరాత్మ. కావున, వాస్తవికమైన ప్రేమ, ఆయన యందే ఉండవలయును. సహజమైన, స్వాభావికమైన ప్రేమగూడా, తెలియక పోయిన, ఆ ప్రేమ, అసత్ పదార్థసదృశము అగును. ఛాత్రాధ్యయనశబ్దముల మధ్యకలిసిపోయిన స్వపుత్రాధ్యయన శబ్దము వివిక్తముగా (వేఱుగా), స్పష్టముగా అభివ్యక్తము కాదు. ఆ రీతిగానే ఆత్మ ప్రేమ, ప్రతి ప్రాణియందు ఉండుటచేత, ఆత్మ యొక్కపరమానందరూపత్వము ప్రతీతమైనను, అవిద్యవలన, ఆ ఆత్మ పరమానందలక్షణముయొక్క స్పష్ట ప్రతీతి కలుగదు. కాని, ఈ విధముగా ప్రాణి, అజ్ఞాతముగా ఆత్మ ప్రేమయే. కావుననే ప్రతి ప్రాణి, జ్ఞానముచేతగాని, అజ్ఞానముచేతగాని, ఏదియో ఒకవిధముగా తన జీవనధనమైన భగవంతుని, తప్పక ప్రేమిచచువాడే అయి ఉన్నాడు. ఎవనికి ఎంత బోధ (జ్ఞానము) ఉండునో, అంత అభివ్యక్తియే ఉండును. ఎక్కడ ఆ ప్రేమ, స్పష్టముగా ప్రకటమగునో, అచట, పరిపూర్ణమైన ఐశ్వర్యము కూడా నతమస్తక మగును (తల ఒంచును). కావుననే మహాపరిమాణ పరిమితమైన ప్రేమ కల వ్రజాంగనలముందు, ఐశ్వర్యము తన ప్రభావమును చూపలేక పోయెను.

ఒకప్పుడు, శ్రీకృష్ణుని, అన్వేషించుచున్న గోపాంగనలకు హఠాత్తుగా ఒక నికుంజము (పూపొదరిల్లు) నందు శ్రీకృష్ణుడు కన్పడెను. అపుడు, కృష్ణుడు తనను గుప్తము చేసికొనుటకై

అనంత ఐశ్వర్య పరిపూర్ణుడైన శ్రీమన్నారాయణరూపములో ప్రకటమయ్యెను. గోపాంగనలు ఆ శ్రీమన్నారాయణునికి ప్రణమిల్లిరి. కాని, వారు 'దయతో మా మన్మోహనుడైన శ్రీకృష్ణచంద్రుని దర్శనమును అనుగ్రహించు'డని ఆయనను అభ్యర్థించిరి. ఆ గోపాంగనలు ఆ నారాయణరూపమందు ముగ్ధులు కాలేదు. వృషభానునందిని (రాధ) వచ్చినంతనే ఐశ్వర్యసంపన్నమైన ఆ రూపము నిలువజాలకపోయెను. అకస్మాత్తుగా కృష్ణరూపము ప్రకటమయ్యెను.

నిరుపాధికమైన ప్రేమ, సర్వాతిశాయి అయిన ప్రేమ. కాని, ప్రేమాభివ్యక్తియందు లౌకికత ఎక్కువ అపేక్షితమగును. కావుననే ప్రాణులకు తమ పుత్ర, కళత్ర, ధన, ధాన్యాదులందు, ఎంత స్వారసికమైన ప్రేమ ఉండునో, అంత స్వారసిక ప్రేమ› దేవతయందు గాని, భగవంతునియందు గాని ఉండదు. కావుననే పరిపూర్ణుడైన పరమాత్మ, జీవకోటి కళ్యాణార్థమైన, తన అలౌకికతను గుప్తమొనర్చుకొని, లౌకిక రూపమును గ్రహించును.

భక్తులు గూడా భక్తికి రెండు రూపములను అంగీకరించిరి. ఒకటి, 'వైధీ' భక్తి, రెండు, రాగానుగాభక్తి. విధివలన ప్రాప్తించు భక్తి వైధీభక్తి.

"విధి రత్యన్త మప్రాప్తౌ"

అను వచనానుసారము అప్రాప్తియందే విధి ఉండును. స్వారసిక, రాగానుగా భక్తి లేని స్థలముననే విధి అపేక్షిత మగును. అధికముగా చెప్పనేల ? తల్లిదండ్రులయందు, గురుజనుల యందును, లౌకిక విషయములందును విధిసంస్పర్శ ఉన్నది. కావున, అచట గూడా స్వారసిక ప్రేమయందు కొంత లోపము ఉండును. వారందరికంటె, పత్నియందు ప్రీతి, స్వాభావికము. పత్నీప్రేమ యందు గూడా,

"మాతృదేవో భవ", "పితృదేవో భవ", "ఆచార్యదేవో భవ" అను విధి వలెనే,

"స్వదారనిరతో భవ"

అనునట్టి విధిసంస్పర్శ కలదు. కావున, అచట సైతము (పత్నీ విషయమున గూడా) స్వారసిక ప్రేమ లేదు. స్వారసికమైన ప్రేమ ఉన్నచోట, నిషేధము ఉండును. ప్రవహించు జలమునకు ఆనకట్ట వేయుటవలన, వేగము తీవ్రమగును. అట్లే స్వాభావిక ప్రేమను నిషేధించుట, లేక నిరోధించుటవలన, అదియు ఉత్కటరూపమును దాల్చును. కావుననే లోభికి ధనమునందు, కాముకునకు కామిని యందు ఉత్కటమైన ప్రేమ ఉండురీతిగానే భగవంతుని శ్రీచరణా రవిందములందు తమకు ప్రేమ (భక్తి) ఉండవలయునని భక్తులు కోరుకొందురు.

లోకమున, ఉపాధినిబట్టి కలిగెడి ప్రేమస్థితి ఇది. సర్వోపాధి వినిర్ముక్తమైనపుడు, స్వాభావిక స్వాంతరాత్మ, చైతన్యాభిన్న పరమాత్మయు అయిన పరమాత్మయందు గల స్వాభావికమైన ప్రేమయే అనంతము. ఏలయన, భగవంతుడు, ప్రేమ-రెండును ఒకే వస్తువు. కాని, దేహాది ఉపాధులు ఉండుటవలన, ఇంత ప్రేమ అచట వ్యక్తము కాదు. కావుననే నిర్మలాత్ములు, పరమహంసలు నయిన మహామునీంద్రులకు గూడా భక్తియోగమును విహిత మొనర్చుటకయియే అదృశ్య, అగాహ్య, అలక్షణ, అచింత్య పరమాత్మ, సగుణుడగును. పరమహంసలను, శ్రీపరమహంసలను చేయుట, భగవంతుని ఉద్దేశ్యము. ఏలయనగా, ఉచ్చకోటికి చెందిన జ్ఞానము కూడా ప్రేమలేక, చక్కగా శోభించదు,

"నైష్కర్మ్య మచ్యుతభావవర్జితం న శోభతే
జ్ఞానమలం నిరంజనమ్ ।
కుతః పునః శశ్వదభద్ర మీశ్వరే న చార్పితం
కర్మ యదప్యకారణమ్ ॥"

అచ్యుతమైన (శాశ్వతమైన) ప్రేమ(భక్తి)లేక, నైష్కర్మ్య విజ్ఞానము కూడా సుశోభితము కాదు. అట్టి స్థితిలో భగవత్పాదార విందములయందు సమర్పింపబడక, నిష్కామ కర్మ గూడా ఎట్లు శోభించును ?

ఈ దృష్టితోనే జ్ఞానులు గూడా భగవద్భక్తిని అభిలషింతురు. ఎడనెడ, అభిలషించకపోయినను, భగవత్స్వరూప, సౌందర్యాదులవలన, భగవంతునియందు జ్ఞానుల మనస్సు మోహితమగును. ఇదియే, రాగానుగాప్రీతి. దీనిని సంపాదించుటకై ప్రయత్నము అపేక్షితము కాదు. అది, హఠాత్తుగా ఉదయించును. సర్వథా, వ్యావృత్త (మరలిన) బాహ్య ఔత్సుక్యము కల, వీత రాగులైన జ్ఞానులు భగవంతుని వైపునకు ఆకర్షితులై ఆశ్చర్యముతో ఇట్లు అందురు–

"క్లేశే క్రమాత్ పంచవిధే క్షయం గతే యద్
బ్రహ్మసౌఖ్యం స్వయ మస్ఫురత్ పరమ్ ।
తద్వ్యర్థయన్ కః పురతో నరాకృతిః శ్యామోఽ యమామోదభరః ప్రకాశతే ॥"

అనగా, అభ్యాసముచేత క్రమముగా పంచ క్లేశములు క్షయము నొందినపుడు, ప్రత్యక్ చైతన్యాభిన్న, విశుద్ధ బ్రహ్మసుఖస్ఫూర్తి కలిగెను. కాని, నాకు గలిగిన ఆ అద్భుత సుఖమును వ్యర్థము అయినదానినిగా చేయుచున్న, ఆమోదపూర్ణము, నరాకారమును అయినట్టి ఈ శ్యామలతత్త్వము ఎవరు ?

ఈ రాగానుగమైన ప్రీతిని సంపాదించుటకు, భగవంతుడు అలౌకికుడయ్యు, లౌకికునివలెను, అప్రాకృతుడైనను ప్రాకృతుని వలెను, అగ్రాహ్యుడయ్యు, గ్రాహ్యునివలెను, అదృశ్యుడయ్యు, దృశ్యునివలెను, ప్రపంచమునకు తల్లీతండ్రి అయి గూడా పుత్రునివలెను ప్రకటమగును. ఇంత ఏల, పతి,ఉపపతియు

అయిగూడా భగవంతుడు భిన్నభిన్న, ప్రేమల వైపునకు, విషయముల వైపునకు ఉన్ముఖమైన మనస్సును గూడా విషయముల నుండి ప్రత్యావర్తితము చేసి (మరల్చి) తనవైపునకు ఆకర్షించుకొనును. ఆ భగవానుడు పతులకు పతి, సర్వులకు పరమ పతి అయినను నిరతిశయ పరప్రేమాస్పదుడగుటకై బ్రహ్మ, వ్రజాంగనలకు ఉపపతియై గూడా ప్రకటమగును. కావుననే ప్రాణుల చిత్తము, లౌకిక, అవైధ (విధిరహితమైన) వస్తువునందు ఆకర్షింపబడినట్లు అలౌకిక, వైధ వస్తువునందు ఆకర్షింపబడదు. కాని, ఆ పరమేశ్వరుడు అవైధుడయ్యు, పరమ వైధస్వరూపుడు. ఉపపతియైనను, పరమ పతి. లౌకిక జారుడు ఇహలోక, పరలోకములను ధర్మ, కర్మలను దగ్ధము చేయువాడై ఉండును. కాని,భగవంతుడు ఔపపత్యబుద్ధితో గూడా జారరూపముతో గూడా భావుకుల చిత్తమందు అభివ్యక్తుడై వారి పంచకోశములను స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను మూడింటిని కర్మబంధములను,అవిద్యను, తత్కార్యరూపమైన జగత్తును దగ్ధము చేసి,భస్మీభూతము చేయును. కావుననే ఆ భగవంతుడు జారుడు (జరయతీతి జారః) జీర్ణమొనర్చువాడు గాన జారుడు.

> అనిమిత్త భాగవతీ భక్తిః సిద్ధేర్గరీయసీ ।
> జరయత్యాశు కోశం నిగీర్ణ మనలో యథా ॥"

అనగా, నిష్కామమైన రాగానుగా భక్తి, జ్ఞానము పంచకోశములను, కర్మలను దగ్ధమొనర్చును. జీవాత్మ, సంసారమునుండి విముక్తుడై భగవద్భావమును పొందును. వ్రజేంద్రనందనుడైన ఓ శ్రీకృష్ణా! అని ఎవరో భగవంతుని, పరిహసించిరట. నీవు చేసిన నవనీత చౌర్యము, వ్రజాంగనల ఔపపత్యమును ప్రఖ్యాపనము చేయువారికి, అతిశీఘ్రముగా నీ రూపమును ఒసంగెదవు. ఏలన, వారు గూడా నీ రూపులే కావలయునని తలంతువు. అపుడు మా ఈ

కర్తవ్యముఁను వర్ణింపజాలము. కావున, తమ కర్తవ్యములను గుప్తము చేసికొనుటకై నవనీతచౌర్యమును వ్రజయువతీజన జారత్వమును సంకీర్తించువారికి నీవు నీ రూపమును ఒసంగెదవు-

"ప్రథయతి నవనీతచౌరతాం తే వ్రజయువతీజన
జారతాం జనో యః।
వితరసి నిజరూప మీశ తస్మై స్వకృతధియా
పరిగోపనాయ నూనమ్ ॥"

వస్తుతః, ఏదోవిధముగా మనస్సును భగవంతునియందు సంలగ్నము చేసినంతనే, ప్రాణికి భగవద్భావప్రాప్తి కలుగును. చింతామణిని దీపమని తలంచి, దీపమన్న బుద్ధితో గూడా ప్రవర్తించినపుడు చింతామణి లభించును. ఆవిధముగానే ప్రత్యక్చైతన్యాభిన్నుడు, భగవంతుడును అయిన బ్రహ్మయందు ఉపపతి యను బుద్ధితో (ఔపపత్యబుద్ధ్యా) ప్రవృత్తమైనపుడు గూడా భగవత్ప్రాప్తియే కలుగును. కేవలము రాగానుగామియైన ఉత్కట ప్రీతి కొఱకే భావుకులైన భక్తులు లౌకిక రూపములో భగవంతుని భజింతురు. జ్ఞానికి గూడా ప్రారబ్ధవశముచేత ప్రత్యుపస్థితములైన లౌకిక పదార్థములయందు చిత్తము, స్వాభావికముగా ప్రవృత్తమైనట్లు, ప్రత్యగాత్మయందు ప్రవృత్తము కాదు. కావుననే భగవంతుని మధుర లీలాభివ్యక్తి జరుగును. భగవంతుని చాపల్యపూర్ణమైన పౌగండాది (బాల్యాది) దశలయందు చేయు లీలలయందు హఠాత్తుగా చిత్తము ఆకృష్టమగును. ఈదృష్టితో నిర్మలాత్ములు, పరమహంసలును అయిన మహామునీంద్రులకు భక్తియోగమును విహితమొనర్చుటకే భగవంతుడు అచింత్య, సగుణ, సాకార, దివ్య శ్రీరామచంద్ర, శ్రీకృష్ణాది రూపములలో ప్రకటమగును.



# 9. ప్రేమతత్త్వము

## సుధా తరంగిణి

రసికులు, ప్రేమతత్త్వమును మూక రసాస్వాదనము వంటిదని చెప్పుదురు. కొందఱు, అంతరమైన మధుర వేదననే 'ప్రేమ' అని అందురు. మఱికొందఱు స్నేహాత్మకమైన అంతఃకరణవృత్తినే 'ప్రేమ' అందురు. భార్యాదులయందు 'రాగము', యాగాదులందు 'శ్రద్ధ', 'గురువు' మున్నగువారియందు 'భక్తి', సుఖాద్యభిలాష– ఇవన్నియు, ప్రేమరూపములే. అయినను, కేవల సుఖమాత్రమును అనుసరించునట్టి అంతఃకరణమునకు సంబంధించిన సాత్త్విక వృత్తియే ప్రేమ. ఈ ప్రేమ, ప్రాప్తమైనవానియందును, అప్రాప్తమైనవానియందును, నశించినవానియందును ఉండును. 'ఇచ్ఛ' అన్నది, నష్టమైనదానియందు, ప్రాప్తమైనదానియందు కలుగదు. ప్రేమరసజ్ఞులైనవారు రసస్వరూపుడైన పరమాత్మనే 'ప్రేమ' అందురు. కావుననే ద్రవీభూతమైన అంతఃకరణమందు అభివ్యక్తమైన రసస్వరూపుడైన పరమాత్మయే ప్రేమరూపములో ప్రకట మగును. కావుననే ఆచార్యులు ఇట్లు చెప్పిరి–

"భగవాన్ పరమానందస్వరూపః స్వయమేవ హి ।
మనోగత స్తదాకార రసతా మేతి పుష్కలమ్ ॥"

దుఃఖస్పర్శలేనివాడు, నిరుపమ సుఖసంవిత్ స్వరూపుడును అయిన పరమాత్మయే 'ప్రేమ' అని గూడా చెప్పిరి–

"నిరుపమ సుఖసంవిద్రూప మస్పృష్టదుఃఖమ్,
త మహ మఖిలతుష్ట్యై శాస్త్రదృష్ట్యా వ్యనజ్మి ।"

చిత్తము లక్కవలె కఠిన ద్రవ్యమని ప్రేమికుల (భక్తుల) కథనము, ఇది, తాపక ద్రవ్యసంయోగము వలన, కోమలము, లేక

ద్రవీభూత మగును. ద్రవత్వమును పొందిన లక్కయందు వేసిన ఇంగిలీకము, హరిద్రాది (పసుపు మున్నగు) వర్ణములు స్థాయీ భావమును పొందును. ఆ రీతిగానే ద్రవీభూతమైన అంతఃకరణ మందు అభివ్యక్తుడైన భగవంతుడే 'ప్రేమ' (భక్తి) శబ్దవాచ్యుడు. భగవంతుని గుణగణ శ్రవణము చేత చరిత్రనాయకుడు, పూర్ణ తముడును అయిన ప్రభువుయొక్క స్వరూపము ప్రకటమగును. ఆయన పట్ల, స్నేహాదులు ప్రాదుర్భవించును. స్నేహాదులవలన, చిత్తమున ద్రవత్వము కల్గును. స్నేహాస్పదమైన పదార్థమును చూచుటవలన, దానియందు సంస్కారము ఉత్పన్నమగును. కావుననే మాటిమాటికి అది జ్ఞప్తికి వచ్చుచుండును. ఉపేక్షణీయ వస్తువునకు సంస్కారములు ఉండవు. దీనికి కారణమేమనిన, రాగా స్పదమైన, లేక ద్వేషాస్పదమైన పదార్థమును గ్రహించునట్టి మనస్సు, రాగాదులచేత ద్రవీభూతమగును. కావుననే దానికి సంస్కారములు కలుగును. ఉపేక్ష్యమైన తత్త్వమును గ్రహించు సమయమున, చిత్తము ద్రవీభూతము కాదు. ఏలన, అది తాపక భావము కాదు. భగవంతుని ఉత్కట స్నేహము వలన గంగాజలము వలె నిర్మలము, కోమలము, ద్రవీభూతమగునట్లుగా చిత్తమును ద్రవింపజేయవలయును. అపుడు, ఆ చిత్తమందు భగవంతుడు స్థాయీరూపముతో ప్రకట మగునని భక్తులు చెప్పుదురు—

> "మద్గుణశ్రుతిమాత్రేణ మయి సర్వగుహాశయే ।
> మనోగతి రవిచ్ఛిన్నా యథా రంగాంభసోఽంబుధౌ ॥"

అనగా, భగవద్గుణముల శ్రవణము వలన ద్రవీభూతమైన చిత్త వృత్తులు కోమల, నిర్మల, ద్రవీభూత గంగాజలప్రవాహము సముద్రము వైపునకు ప్రవహించురీతిగా, భగవంతునివైపునకు ప్రవహించును. ద్రవీభవించిన చిత్తమందు పూర్ణతముడు, పురుషో త్తముడును అయిన ప్రభువు, అభివ్యక్త మయినపుడే 'స్థిరభక్తి'

అని చెప్పబడును. లక్క, గట్టిగా ఉన్నపుడు, దానిపైన ఏ వర్ణము గూడా స్థిరముగా ఉండదు.లక్కపైన అక్షరములు అంకిత మొనర్చుటకై గూడా అగ్నిసంబంధముచేత ఆ లక్కను కొంత కోమలమగునట్లు చేయుదురు. ఏలన, కఠినమైన లక్క మీద ముద్రాక్షరములు అంకితములు కావు. ఆరీతిగానే కఠోరమైన, ద్రవీభవించని చిత్తమందు భగవంతుని స్వరూపము, చరిత్ర, గుణములు, అన్యాన్య ఉపదేశములు హత్తుకొనవు. కాని, గంగాజలమువలె కోమలము, ద్రవీభూతమును అయిన అంతఃకరణమందు భగవంతుని అభివ్యక్తి కలుగుటవలన, మఱల భగవంతుడు గూడా ఆ చిత్తమునుండి వెడలిపోజాలడు. లక్క, కావలయు ననుకొనినను, దానియందు మఱల రంగునుండి వేఱు కాజాలనట్లె, భగవంతుడు గూడా వెడలిపోవలయునని కోరుకొనినను, భక్తుని ద్రవీభూత చిత్తమునుండి వీడిపోజాలడు. భక్తుడు గూడా భగవంతునినుండి వేఱు కావలయునని అనుకొనినను, అతడు భగవద్వియుక్తుడు కాజాలడు. భగవంతుని, తన అంతఃకరణమునుండి తీసివేయజాలడు.

> "విసృజతి హృదయం న యస్య సాక్షాత్ హరి
> రవశాభిహితోఽప్యఘౌఘనాశః ।
> ప్రణయరశనయా ధృతాంఘ్రిపద్మః స భవతి
> భాగవతప్రధాన ఉక్తః ॥"

అనగా, ఎవరి హృదయముయొక్క ప్రణయమన్న త్రాడుతో బంధించబడిన భగవంతుడు తనను విడిపించుకొనజాలడో, అతడే ప్రధాన భక్తుడు అని భావము. నీవు నాహృదయమునుండి వెడలిపోయినచో, నీ సర్వజ్ఞత్వమును, నీ సర్వశక్తిమత్త్వమును, నీ అనంతకోటి బ్రహ్మాండ నాయకత్వమును చూచెదనని ఒక భక్తుడు భగవంతునితో అనెను.అపుడపుడు భక్తులు గూడాతమ హృదయమునుండి భగవంతుని, తీసివేయదలచుదురు, భగవంతునియందు దోషానుసంధానము చేయుదురు. కాని, అసఫలులు అగుదురు.

"ప్రత్యాహృత్య మునిః క్షణం విషయతో యస్మిన్ ధిత్సతి, మనో
బాలాఽసౌ విషయేషు ధిత్సతి మనః ప్రత్యాహరన్తీ మనః।
యస్య స్ఫూర్తిలవాయ హన్త హృదయే యోగీ సముత్కంఠతే
ముగ్ధేయం కిల పశ్య తస్య హృదయాత్ నిష్క్రాంతి
మాకాంక్షతి ॥"

కావుననే, కొందఱు ద్రవత్వమునే ప్రేమ (భక్తి) అందురు.

ద్రవత్వము అవశ్యము అపేక్షణీయమైనను, ప్రేమయొక్క స్వస్వరూపము ద్రవత్వము కాదు. నిజమైన ప్రేమ (భక్తి) రూపము రసస్వరూపుడైన పరమాత్మయే. కావుననే ఆచార్యులు ఆ ప్రేమను నిరుపమ సుఖ సంవిద్రూపమని చెప్పిరి. సచ్చిదానంద బ్రహ్మ, సమస్త విశ్వమునకు కారణము. కావుననే తద్ బ్రహ్మ, సదంశము, చిదంశము అనువృత్తమై సర్వత్ర, గోచరించును.

'ఘటః సన్,' 'పటః సన్'

ఇత్యాదిరూపముతో సద్విశేషమైన ఘటాది ప్రపంచమందు సద్రూపవ్యాప్తి కలదు. అటులనే,

"ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే।"

అను వచనానుసారము, ఆనందరసముచేత గూడా సమస్త విశ్వము ఉత్పన్నమగును. కావుననే, సర్వత్ర, ఆనందానువృత్తి, లేక వ్యాప్తి ఉండవలయును. కావుననే ప్రతి ప్రాణియందు, ప్రతి పరమాణువునందు ఆనందవ్యాప్తి, రసవ్యాప్తి, లేక రసస్వరూపభూతమైన ప్రేమయొక్క వ్యాప్తి కలదు. ప్రేమ రహితముగా, రసరహితముగా ఒకరు మఱొకరిని కలియుట గూడా సంభవము కాదు. పుత్ర, కళత్ర, మిత్రాదుల సంయోగము కూడా రసము వలననే, లేక స్నేహము వలననే కలుగును. పశుపక్ష్యాదులందు

మాతాపితరులందు పుత్రునియందు, పుత్రునిభార్యయందు ప్రేమ, లేక స్నేహము కలుగును. అధికముగా చెప్పనేల? ఒక పరమాణువు మఱొక పరమాణువును కలియుట గూడా స్నేహము లేక, జరుగ జాలదు. ఈవిధముగా ప్రేమతత్త్వము ఆనందస్వరూపము, రస స్వరూపము అగుటచేత జగత్కారణము. కావున, తత్ప్రేమవ్యాప్తి, సర్వత్ర కలదు. అది, సర్వత్ర,ఉన్నది, సర్వప్రాణులందును ఉన్నది. దానిని, దురుపయోగము చేయుటవలన, అనగా, కేవల ప్రాపంచిక విషయములనే ప్రేమించుటవలన దుఃఖము కలుగును. కావుననే భక్తులు ప్రపంచమందు గల ప్రేమ, తొలగిపోయి, భగ వంతునియందే ప్రేమ ఉండవలయునని కోరుకొనిరి. ఒకరియొద్ద దివ్యశక్తిసంపన్నమైన క్షేత్రము ఉండును. కాని, అతడు ఆ భూమియందు దుర్గంధపూర్ణమైన, విషపూర్ణమైన, కంటకాది సంకీర్ణ మైన విషవృక్షమును నాటి, దుర్గంధముతో, విషముతో, కంటకాదు లతో దుఃఖమును అనుభవించును. సాహసించి జాగ్రతగా ఆ విష వృక్షమును ఛేందిచి, సౌందర్య, మాధుర్య, సౌరస్య, సౌగంధ్య పూర్ణమైన ఆమ్రవృక్షమును, కల్పవృక్షమును నాటినచో, తప్పక సుఖమును అనుభవించును. సరిగా ఆరీతిగానే ప్రేమను సంసార ముతో కలిపి, ప్రేమయందు లౌకిక భావములను సంమిశిత మొనర్చి ప్రాణి, దుఃఖమును అనుభవించుచున్నాడు. ప్రేమతో భగవంతుని సంబంధమును జోడించినంతనే సర్వత్ర, ఆనందమే ఆనందము.

కళ్యాణమయి, కరుణామయి, పుత్రవత్సల అయిన ఒక తల్లి, తన శిశువును ఎచటికైనను పంపుచు వానికి పాథేయమును (దారిబత్తెము) తప్పక ఇచ్చును. దాని సహాయముతో అతడు తిరిగి తన తల్లి యొద్దకు వచ్చును. ఒకవేళ, ఇటువంటి దృష్టి, లేక పోయినచో, అమె 'కరుణామయి' అని చెప్పబడజాలదు. అట్లే అనంతబ్రహ్మాండజనని,కృష్ణాభిధాన అయిన మాత కూడా జీవులకు

ప్రేమతత్త్వమును వారికి తోడుగానే ఇచ్చెను. దానిని మఱచిపోవుట వలన, లేక దానిని దురుపయోగము చేయుటవలన, జీవుడు దుఃఖమును అనుభవించును. కాని, దానిని జ్ఞప్తియందు ఉంచుకొని సదుపయోగము చేసికొనినంతనే గురుజనులయందు, శాస్త్రములందు భగవంతునియందు ప్రేమను ఉపయోగించుటవలన, జీవుడు కృతకృత్యుడై కృష్ణాభిధానయైన తన తల్లి యొడిలోనికి చేరును, శాశ్వతముగా కృతకృత్యుడగును.

రసము, ప్రేమ, భగవత్తత్త్వము ఏకము, నిత్యసిద్ధమైనచో భగవంతునియందలి ప్రేమను ప్రేమ (భక్తి) అని, ఇతర ప్రేమాస్పదుడైన వ్యక్తియందు విషయ,విషయిభావకల్పన ఏల అపేక్షితమని ప్రశ్నించవచ్చును. దీనివలన, తెలియునదేమనిన, ప్రేమకు భేదభావము తప్పక అపేక్షిత మగును. ఇరువురు లేక, ప్రేమ జనించదు. కావున, ప్రేమ (భక్తి), భగవంతుడు గూడా భిన్నముగా ఉండవలయును. కాని, నిశితముగా వివేచన చేసినచో, ప్రారంభమున, ఔపాధిక ప్రేమకు ఇరువురి అపేక్ష తప్పక ఉండును. అథవా, అభివ్యక్తికి సాధనాపేక్ష ఉండును. కాని, ప్రేమ, సహజముగా అభేదమందు, అత్యంత సన్నిహితుడైన ప్రత్యగాత్మయందే కలుగును. అది, స్వతఃసిద్ధమనియు తెలియును. స్వప్రకాశ, పరబ్రహ్మాభివ్యక్తికి గూడా మహావాక్యజన్యమైన పరబ్రహ్మాకారాకారిత వృత్తి, అపేక్షిత మగును. ఆరీతిగానే భగవత్స్వరూపము, స్వతఃసిద్ధమును అయిన ప్రేమాభివ్యక్తికి గూడా భగవదాకారాకారితము, స్నిగ్ధమును అయిన మానసీవృత్తి అపేక్షిత మగును. తదభివ్యక్తి కొఱకే సద్ధర్మ, సత్కర్మాది సాధనములు అపేక్షితము లగును. అభివ్యక్తిభేదము చేతనే దానికి అణు, మధ్యమ, మహత్ పరిమాణభేదముచేత అనేక భేదములు కలవు. సాధనకాలమందే భేదభావము అపేక్షిత మగును. అజ్ఞానము వలననే భగవంతునియందు ప్రేమ

కలుగక, ప్రపంచమందు కలుగును. లేక, ఇట్లు అనుకొనుడు-నీరస, నిస్సార ప్రపంచమందు రసస్వరూపుడైన భగవంతుని సంబంధముచేతనే సరసతా ప్రతీతి కలుగును. కావున సరసత్వేన, ప్రతీయమానమగు విశ్వమందు ప్రేమ జనించును. ప్రకాశమునకు మఱొక స్థానమున, సాతిశయత్వము, వ్యభిచారిత్వము (చంచలత్వము) ఉన్నను, సూర్యునియందు తద్వ్యభిచారిత్వము గాని, సాతిశయత్వము గాని, సంభవము కాదు. పుత్ర, కళత్రాదులందు ఒకప్పుడు ప్రేమ, మఱొకప్పుడు వైరము గూడా కలుగును. ఒకప్పుడు, ప్రేమ అల్పమగును, మఱొకప్పుడు అధిక మగును. కాని, భగవంతునియందు ఆ ప్రేమ, సదా ఉండును. ఎల్లప్పుడు, నిరతిశయముగా ఉండును. ఏలన, సూర్యుడు ప్రకాశమునకు ఉద్గమస్థానము, ప్రకాశస్వరూపమే అయి ఉండును. ఆవిధముగానే భగవంతుడే ప్రేమకు ఉద్గమస్థానము, లేక ప్రేమస్వరూపమే అయి ఉన్నాడు.

భగవంతుడు, ప్రేమస్వరూపుడనియు, ఆయనయందు ప్రత్యక్షము కాదనియు చెప్పబడును. అపుడు, భగవంతుని యందు అవ్యభిచారి, నిరతిశయము అయిన ప్రేమ,కలదనిగాని, లేక ఆయనను ప్రేమస్వరూపుడని గాని, ఎట్లు భావించగలము? కాని, ఇట్లు అనుట యుక్తము కాదు. ఏలన, భగవంతుడు సర్వ ప్రకాశకుడుగా, అఖండ బోధరూపుడుగా, ప్రత్యగాత్మరూపుడుగా ప్రసిద్ధుడు. కావుననే ఆయనయందు గల ప్రేమ గూడా ప్రసిద్ధము. కేవలముఅనిర్వచనీయమైన ఆవరణమును తొలగించుటకొఱకే కొన్ని ప్రయత్నములు అపేక్షితము లగును. విజ్ఞానమువలన, సర్వ పదార్థముల వ్యవహారము జరుగును. సమస్త పదార్థములు, సమస్త వ్యవహారములు బోధవలననే జరుగును. అపుడు బోధ (జ్ఞానము) యందు సందేహ మేల ? ఈ జగత్తు, ప్రకాశ్యము. ఏతత్ ప్రకాశకుడు

భగవంతుడు. దర్పణదర్శనానంతరము తదంతర్గతమైన ప్రతిబింబము కన్పించును. అటులనే బోధ కలిగిన పిమ్మటనే విశ్వము, లేక తదంర్గతములైన వస్తువులు ప్రకాశించును–

"తమేవ భాన్త మనుభాతి సర్వం, తస్య భాసా సర్వమిదం విభాతి ।"

వ్యామోహము చేతనే తరంగము 'జలము ఎచట?' అని ప్రశ్నించవచ్చును. ఏదికలదో, అది అంతయు నేనే అయి ఉన్నాను అని అనవచ్చును. అట్లే, జీవుడు గూడా వ్యామోహముచేతనే భగవంతుడు లేడు, సర్వము తానే అయిఉన్నాను అని అనును తరంగములోపల, బయట, మధ్యన, జలమే కలదు. అధికముగా చెప్పనేల? తరంగము యొక్క అస్తిత్వమే జలముపై ఆధారపడియున్నది. ఆరీతిగానే సమస్త జగత్తునందు, విశేషించి, జీవునియందు, వాని లోపల, బయట, మధ్యభాగమున, భగవంతుడే కలడు. వస్తుతః, సమస్త విశ్వము, లేక జీవులు, భగవంతుని సత్త వలననే సత్త కలిగి ఉన్నారు. వారికి వేఱుగా అస్తిత్వమే లేదు.

ప్రాణికి తన ప్రాణములందు, సుఖమందు, తన ఆత్మయందు స్వాభావికమైన ప్రేమ ఉండును. భగవంతుడనిన, ప్రాణములకు ప్రాణము, సుఖములకు సుఖము, జీవులకు జీవనమై ఉన్నాడు, అట్టి స్థితిలో ఆయనయందు ప్రేమ ఏల స్వాభావికము కాదు? కావుననే వాల్మీకిమహర్షి ఇట్లు అందురు–

"లోకే న హి స విద్యేత యో న రామ మనువ్రతః ।"

అనగా, లోకమందు రామభక్తిలేని ఏ జీవుడు గాని, ఏ తత్త్వము గాని, లేదని భావము.

వసిష్ఠ మహర్షి, రామచంద్రునితో ఇట్లనెను– "హే తాత!

రాఘవేంద్ర ! రామభద్ర ! నీవే ప్రాణములకు ప్రాణమవు, జీవులకు జీవనమవు, ఆనందమునకు గూడా ఆనందస్వరూపుడవు. ప్రాణ, అపానములచేత ప్రాణి జీవించడు. కాని, ప్రాణికి ప్రాణశక్తిని ఒసగువాడు ప్రాణములకు గూడా ప్రాణమైనవాడు నయిన భగవంతుడే అందఱిని జీవింపజేయును. అపుడు, నిన్ను వదలి, ప్రపంచము ఎవరికి ఇష్టమగును ? ఈదృష్టితో రావణాదులు సైతము రామ భక్తులే. తన సత్తకు ఎవరు విరోధి అగును? నాస్తికుడు సైతము, తన సత్తను, తన సిద్ధాంతసత్తను అపలాపము చేయడు, ఏమైనను జరుగుగాక, జరుగకపోవుగాక, ఏదైనను ఉండుగాక, ఉండకపోవుగాక, నేను మాత్రము ఉండనే ఉన్నాను, తప్పక ఉండెదను అని, ప్రతి వ్యక్తియొక్క నిశ్చయ మిదియే. జలరహితముగా తరంగము ఒక్క క్షణమైనను నిలువజాలదు. అట్లే సత్తా రహితముగా సమస్త పదార్థములు అసద్రూపములే అగును. సత్, చిత్, ఆనందస్వరూపుడైన భగవంతుడు లేక, సమస్త పదార్థములు స్ఫూర్తి రహితములు, రసహీనములు, ఆనందరహితములు, ఎక్కువగా వర్ణించనేల ? అసత్తులగును. ఆ భగవత్సంబంధము చేతనే- ఆధ్యాత్మిక సంబంధముచేతనే స్ఫూర్తిమత్త్వము, సరసత్వము, సానందత్వము, అస్తిత్వము సిద్ధించును. కావున, ఆ పరమేశ్వరుని అమంగళ వియోగము ఎవరికి సహ్యమగును ?

గుడసంబంధముచేత రసహీనమైన శనగపిండికి తీపిదనము వచ్చినట్లుగానే 'స్వ' సంబంధముచేత- ఆత్మీయతాసంబంధముచేత వస్తువులందు ప్రీతి జనించును. ఆత్మీయత లేక, కరుడుగట్టిన వైష్ణవులకు, శివునియందును, శైవులకు విష్ణువునందును ప్రేమ కలుగదు. అనంత బ్రహ్మాండనాయకుడైన భగవంతునికి సంబంధించిన ఏ స్వరూపమందు, ఆత్మీయభావము, ఉపాస్యభావము

ఉండునో, దానియందే ప్రేమ జనించును. ఏ దేవతయందు ఉపాస్యబుద్ధి, ఇష్టబుద్ధి ఉండదో, దేనియందు ఆత్మీయత ఉండదో, దానియందు ప్రేమ గూడా ఉండదు. ఆత్మీయత (నాదియను భావము) ఉండుటవలన, మన క్షేత్రమందు, వృక్షములు గల తోటలోని కంటకములందు గూడా ప్రేమ జనించును. అవి,నశించి నపుడు కష్టము కలుగును. ఆత్మీయత లేని బ్రహ్మ, నీరసుడగును. ఆత్మీయతాసంబంధముచేత కంటకాదులందు గూడా ప్రేమ కలుగు చున్నది. సాక్షాత్తుగా ఆ తనయందు-'స్వ'యందు, ప్రాణికి ఎంత ప్రేమ ఉండవచ్చును? కావుననే భగవానుడు, ప్రాణులకు ప్రాణము, జీవులకు జీవనము, ఆనందమునకు ఆనందము, ప్రత్యగాత్మ అయి ఉన్నాడు. ప్రేమస్వరూపుడు, లేక రసస్వరూపుడు అయి ఉన్నాడు. ఏ పదార్థము, ఎంత అప్రత్యక్షముగాను,ఎంతదూరము గాను, ఎంత మనకంటె భిన్నముగాను ఉండునో, దానియందు అంత ప్రమాణములోనే ప్రేమ లోపించును. క్షేత్ర, మిత్ర, కళత్రా దులందు, దూరస్థములు, అపరోక్షములును అయిన తత్త్వముల కంటె, అధికమైన ప్రేమ ఉండును. దేహభిన్నము లగుట వలన, అవి అన్నియు త్యజించబడును. ఏలయనగా, దేహము వాని అన్నిటికంటె సన్నిహితము, ప్రత్యక్షము. దేహముకంటె గూడా ఇంద్రియములు, ప్రాణము అంతరంగములు గాన, వానియందు ప్రేమ అధికముగా ఉండును. మనస్సు, వానికంటె గూడా సమీపస్థ మైనది. కావున, దానికి ప్రతికూలముగా గాని, దుఃఖదాయకముగా గాని, అనిపించినపుడు, దేహాదులు గూడా త్యజించబడును. ఆత్మ హితముకొఱకై బుద్ధి, అహమర్థము నిరోధించబడును.

> "యదా పంచావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ, బుద్ధిశ్చ న విచేష్టతే।"

ఇత్యాది వచనముల వలన, మనోనాశమునకై,వాసనాక్షయమునకై

ప్రయత్నించుట ప్రసిద్ధమే. ఈ దృష్టితో సర్వాంతరంగుడు, సర్వసన్నిహితుడు, పరమ ప్రత్యక్షరూపుడునయిన ప్రత్యగాత్మ స్వరూపుడే భగవంతుడు. ఆయనయందే ముఖ్యమైన ప్రేమ ఉండును. ఆయనయే ప్రేమస్వరూపుడు గూడ. ఆయనకంటె భిన్నమైనవానియందు ప్రేమ, లోపించుట స్పష్టము. ఆత్మ కొఱకే సమస్తము ఉన్నది. దేవతాప్రీతి గూడా ఆత్మకళ్యాణార్థమే అయి ఉన్నది. ఆత్మకు ప్రతికూలమైన దేవత, ఉపేక్షించబడును. భగవంతుడు ప్రత్యగాత్మస్వరూపుడు కానప్పుడు, భగవంతుడు 'శేష' (అంగ) రూపుడగును. భగవంతునికి ఆత్మ లేదు గాని, భగవంతుడు ఆత్మార్థమని తలంచబడును. భగవంతుడు పరోక్షముగా ఉండుటవలన, అస్వప్రకాశుడని భావించబడును. భగవంతుడు అనాత్మయగుటచేత బహిరంగమని, శేషమని, లేక అంగమని తలంచబడును. ఇది అంతయు అనర్థము. ఏలయన, సిద్ధాంతతః, వస్తుగతిచేత (వస్తుగత్యా) భగవంతుడే సర్వాంతరంగుడు, సర్వాంతరాత్మ, ఆయనయే సర్వశేషి. సమస్తము ఆయన కొఱకే గాని, ఆయన, ఎవరికొఱకును కాడు. భగవంతుడే ప్రత్యగాత్మ అగుటవలన, స్వప్రకాశుడు. ఆయనయే శేషి, ఆయనయే నిరతిశయ, నిరుపాధిక పరమ ప్రేమాస్పదుడు. కావుననే సైంధవఖిల్యము (ఉప్పుకల్లు), తన ఉద్గమస్థానమైన సముద్రమందు తనను తాను సమర్పించుకొని, సముద్రరూప మగును. అటులనే ఔపాధిక చైతన్యరూపము గల జీవాత్మ, తన ఉద్గమస్థానము, పరమప్రేమాస్పదుడును అయిన భగవంతునికి, ఆత్మ సమర్పణము చేసికొని, భగవత్స్వరూపుడగును. ఘటాకాశము ఘటమును, ఘటాకాశమును, సమస్తమును మహాకాశమందు సమర్పించి వేయును–

"త్వదీయం వస్తు గోవింద తుభ్యమేవ సమర్పితమ్ ।"

ఆకాశమునుండియే వాయ్వాది క్రమముతో ఘటము ఏర్పడినది.

ఆ ఘటము వలననే ఘటాకాశ ప్రతీతి కలిగినది. ఘటము, మఱల పృథివ్యాదులందు లయక్రమముతో ఆకాశ మయ్యెను. అపుడు, ఘటాకాశము పూర్తిగా ఆకాశమయ్యెను. ఇదియే నిజమైన ఆత్మ సమర్పణము. ఆరీతిగానే జీవాత్మ, భగవంతునివలన ఆవిర్భవించిన తన సర్వస్వమును, తనను భగవంతునికి సమర్పించి, సదా సర్వ శేషి, సర్వాంతరంగుడు, సర్వ ప్రేమాస్పదుడు, సర్వాంతరాత్మ స్వరూపుడును అగును. తన మిథ్యాభావమును,కాల్పనికభావమును శాశ్వతముగా బాధితమొనర్చి, పారమార్థిక రూపమును పొందును.

ఈవిధముగా ఔపాధిక ప్రేమ సాపేక్షము, సాతిశయము నయినను, నిరుపాధిక ప్రేమ, భేదనిరపేక్షుడు, స్వప్రకాశుడు, సర్వాంతరాత్మయు అయిన భగవంతుని స్వరూపమే. అది, స్వతః సిద్ధము. కేవలము తదభివ్యక్తి కయియే ప్రయత్నము అపేక్షిత మగును. బ్రహ్మాకారవృత్తియందలి కోమలత్వము, దృఢత్వము వలన, నిత్యసిద్ధమైన పరమాత్మజ్ఞానమందు గూడా కోమలత్వ, దృఢత్వ వ్యవహారము ఉండును. ఆవిధముగానే ప్రేమయందు గూడా కోమలత్వ, దృఢత్వములవలన, నిత్యసిద్ధమైన పరమాత్మ స్వరూపజ్ఞానమందు గూడా కోమలత్వ, దృఢత్వముల ఉత్పత్తి ఔపచారికమే. పచ్చిమామిడికాయ పండిన మామిడిపండుకు హేతువుగా తలంచబడు రీతిగానే,సాధనావస్థయందు గల ప్రేమ,సాధ్యావస్థ యందు గల ప్రేమకు సాధనముగా భావించబడును. ఆ సాధ్యావస్థకు రక్షణము అధికముగా అపేక్షితమని భావించబడును. దీపము ఆరిపోయినట్లు, ప్రేమ గూడా ప్రశమితమగునను భయము గూడా కలుగునని భావుకులు చెప్పుదురు. ఒకానొక అభియుక్త వచనము ఇట్లు కలదు—

"ప్రేమాప్యహో రసికయోరపి దీప ఏవ హృద్వేశ్మ
భాసయతి నిశ్చలఏవ భాతి।

ద్వారా చయం వదనతస్తు బహిష్కృతశ్చే న్నిర్వాతి
శీఘ్ర మథవా లఘుతా ముపైతి ॥"

అనగా, రసికులిరువురి హృదయమందు గల ప్రేమ, ఒక దీపము. అదియే హృదయభవనమును ప్రకాశింపజేయును. నిశ్చలముగా ఉండి స్వయముగా దేదీప్యమానమై ఉండును. ఆ ప్రేమజ్యోతి, ముఖద్వారమున బయటకు వెడలనిచ్చినచో, అది ఆరిపోవును, లేక దానియందు లఘుత్వము వచ్చును.

సాధారణముగా, ప్రేమతత్త్వము నిష్కారణము (నిర్వ్యాజము) అని చెప్పబడును.

"ఆవిర్భావదినే న యేన గణితో హేతు స్తనీయానపి,
క్షీయేతాపి న చాపరాధవిధినా నత్యా న యో వర్ధతే।
పీయూష ప్రతివేదిన స్త్రిజగతీ దుఃఖద్రుహః సాంప్రతం,
ప్రేమ్ణస్తస్య గురోః కిమద్య కరవై వాఙ్నిష్ఠతా లాఘవమ్॥"

అనగా, ప్రేమదైవము తాను ప్రాదర్భవించిన దినమున,ఏ సూక్ష్మతమమైన హేతువును గూడా అపేక్షించలేదు. ఏదియో ఒక అపరాధము వలన, ఆ ప్రేమదైవమునకు హ్రాసను కలుగదు. అనేక నమస్కారములు చేయుటవలన ఆ ప్రేమదైవము వృద్ధియు పొందదు. పీయూషప్రతిస్పర్థి (అమృతమునకు విరోధి)లోకత్రయ దుఃఖద్రోహి, పరమగురువును అయిన ప్రేమదేవతను వాగ్గోచరము చేసి, అనగా మాటలతో వర్ణించి, ఎట్లు అల్పమైనదిగా చేయనగును? లోకమందు ప్రేమకు దశత్రయము ఉండును_ఒకటి, ఆశ్రయము, రెండు, విషయము, మూడు, ప్రేమ. అయినను, అంతరంగస్థితి యందు ఈ మూడును, ఒకే వస్తువు. ఒకే వస్తువునందు ఔపాధికమైన త్రైవిధ్యము కల్పించబడును. జడ పదార్థమందు, తరంగమందు వాస్తవమైన భేదము లేకపోయినను, కాల్పనికమైన

భేదమును, గ్రహించియే వ్యవహారము జరుగుచున్నట్లు కాల్పనిక మైన ప్రేమత్రైవిధ్య వ్యవహారము జరుగుచున్నది.

భగవంతుని ఆహ్లాదినీశక్తిరూపిణి అయిన జానకీదేవి అమృతమందు మాధుర్యమువలె అంతరంగశక్తి. పరమానందసుధా సింధువైన భగవంతునియందు మాధుర్యసారసర్వస్వమే ఆ భగవంతుని ఆహ్లాదినీశక్తియై ఉన్నది. వారి ప్రేమయే వాస్తవికమైన ప్రేమ.



# 10. భగవత్కథామృతము

సు ధా త రం గి ణి

మనము ఆ ఆనందకందము, నందనందనుడు, గోపికావల్లభుడు, పూర్ణబ్రహ్మ, మంగళమూర్తియు అయిన శ్రీకృష్ణచంద్ర భగవానునికి పరమ ఋణులమై ఉన్నాము. ఆ భగవంతుడే మనను సృజించి, మన పాలన, పోషణములు చేయుచున్నాడు. ఆ కృష్ణ భగవానుని మధుర ముఖారవిందము,మనోహరములైన నేత్రములు, నాసిక, అధరోష్ఠము, మకరాకృత కుండలములు అన్నియు మన హృదయస్థలమును పావనము చేయునట్టివి, ప్రసన్నము చేయునట్టివి. కాని, మనము నేడు అజ్ఞానసాగరమందు మునకలువేయుచు ఒక్కసారిగా నటవరుడైన ఆ గోపాలుని మఱచిపోయితి మనియు, ఆ భగవంతుని మధురమయమైన లీలాసుధారసపానమునుండి మనను దూరముచేసికొంటిమనియు ఖేదముతోచెప్పవలసి వచ్చును. వేలశిరస్సులు ఇచ్చినను, ఆ మహాప్రభువుయొక్క లీలయందు గల వాస్తవిక జ్ఞానము కలిగినను, తద్దర్శనమైనను,ఈ వ్యాపారము అత్యల్ప మూల్యముకలదనియు, దీనిని శీఘ్రాతిశీఘ్రముగా క్రయము చేయుడనియు భావుకులైన భక్తులు చెప్పుదురు. వేల శిరస్సులు అర్పించి క్రయము చేసినను, అల్పమూల్యమునకు లభించునట్టి, విలువకట్టజాలని ఈ వస్తువును మనము ఉపేక్షా దృష్టితో చూచుచున్నాము. ఇట్టి స్థితిలో మనము సుఖమును అభిలషించినచో, ఇది మన ధృష్టత్వము (అనుచిత సాహసము) కాదా ? భగవత్సంబంధమైన లీలాసుధను వాస్తవమునకు ఆస్వాదించినవారు ధన్యులు. ఈ లీలాసుధాస్వాదనమందు ఉత్కృష్టమైన అభిలాష గలవారును, దానిని పొందుటకై ప్రయత్నశీలురైన వారును ధన్యులు. ప్రపంచమందలి అనేకవిధములైన కల్మషములను

పోగొట్టుకొనుటకు ఇంతకంటె గొప్పదైన మఱొక ఉపాయము ఏమి కలదు? దీనికి విశేష పరిశ్రమయొక్క అవశ్యకత లేదు. భగవల్లీల

"శ్రవణేనైవ మంగళమ్"-

కేవల శ్రవణమాత్రముచేతనే మంగళదాయకము, కళ్యాణసాధకము, దైహిక (అధ్యాత్మిక) దైవిక, భౌతికతాప త్రయ ముక్తిదాయకము. కాని, ఈ శ్రవణము శ్రద్ధతో, భక్తితో జరుగవలయును. ఒక చెవితో ఉపదేశము విని, రెండవ చెవితో వదలివేయుట కాదు. అజ్ఞానజన్యమైన మోహమును సర్వథా పరిత్యజించియే ప్రాణి, ఈ లీలాసుధ యొక్కమధురపానము.చేయగలుగును.అజ్ఞానజన్యమైన మోహము వలన మనస్సు, అస్థిర మగును. మానసికమైన అస్థిరతయే భయ కారణము.మానసికమైనఅస్థిరతకుకారణము,సత్త్వగుణములోపించుట అని తెలియవలయును. కావున, ఈ రెండును, లక్ష్యప్రాప్తి యందు బాధకములు. ఏ ప్రయత్నముచేత సత్త్వగుణము వృద్ధి నొందునో, రజస్తమోగుణములు ప్రశమితములగునో, మనుష్యుడు ఆ ప్రయత్నమే చేయవలయును. అపుడు, ఎచటైనను, ఏ స్థితిలోనైనను, ఏ స్థానమందైనను ఉన్నను, మహానుభావులద్వారా ప్రసారితమగు భగవల్లీలా సుఖానుభవము కలుగును. భగవచ్చరణారవిందములు నిర్భయస్థానములు. సత్కథా శ్రవణము, మననము నిదిధ్యాసనము, రాత్రింబవళ్ళు భగవద్భజనము వలన భగవచ్చరణారవిందలాభము కలుగును. భాగవతమందలి ఒక శ్లోకము ఇట్లు చెప్పుచున్నది-

"స వేద ధాతుః పదవీం పరస్య దురన్తవీర్యస్య
రథాంగపాణేః।
యోఽమాయయా సంతతయాఽనువృత్త్యా భజేత తత్పాద
సరోజగంధమ్॥"

అనగా పరమపిత, పరమాత్మ, అమిత విక్రముడు, శ్రీసుదర్శన

చక్రధారియు అయిన భగవంతుని పాదసరోజములు నిష్కపటముగా నిరంతరము భగవంతునియందు తన మనస్సును లగ్నముచేసి, ఆ భగవంతుని చరణకమలముల గంధము సేవించువానికే, అనగా భజించువానికే లభించును. సంసారసాగరమును దాటించు నౌక ఇది ఒక్కటియే. ప్రాణి, ద్వంద్వ ధర్మ వర్జితుడై అనగా, సంసారము లోని రాగ, ద్వేష, శోక, మోహాదిరూపములైన కల్మషములను అన్నింటిని త్యాగమొనర్చి భగవల్లీలా సుధా సమాస్వాదనమునకు అధికారి కాగలడు. బాహ్య విషయసుఖముల వలన మలినమైన బుద్ధి గలవారికి లీలాసుఖము నీరసముగానే అనిపించును. స్త్రీ సముపభోగజన్యమైన సౌఖ్యము గూడా ఈ లీలాసుఖముతో పోల్చి నపుడు నగణ్యమే. వాస్తవమైన సుఖస్వరూపమును ఎవరు తెలిసి కొందురో, ఆ సుఖవిషయమై ఎవరు విచారము, మననము చేయు దురో, వారే భగపల్లీలా మాధుర్యరస సమాస్వాదనమందు ఏమి ఆనందము కలుగునో, చెప్పగలరు. అనభిజ్ఞులైనవారు. చెప్పున దేమనిన, బ్రహ్మసుఖమన్నది లేనేలేదు, మరణించిన తరువాత గార్ధభాది జన్మలనెత్తి ఇహలోక సుఖములను అనుభవించుటకు వారు ఇష్టపడుదురు. కాని, నిర్విషయకమైన మోక్షము వారికి నచ్చదు. బ్రహ్మసుఖము ఎవరియందును లేదనుట ఒక హాస్యాస్పదమైన మాట. అజ్ఞానులైనవారు అవిద్యవలన సౌషుప్త సుఖమును బ్రహ్మ సుఖము కంటె అధికమని భావింతురు. కాని, వారియందు గల ఆ అవిద్య తొలగిపోయినచో, వారి హృదయపటలము బాహ్య, సౌఖ్యవాసనావాసితము కాకపోయినచో, బ్రహ్మసుఖము వలన వాస్తవమునకు ఎంత ఆనందము కలుగునో, వారికి తెలియును. సృగాలము (నక్క) మాటిమాటికి పైకి ఎగిరినను, దానికి ద్రాక్ష పండ్లు అందనిచో, అది వెంటనే 'ద్రాక్షపండ్లు పుల్లనివి' అని చెప్పును. ఈ విధముగానే బ్రహ్మసుఖ సుస్వాదము ఏ అజ్ఞానులకు

తెలియదో వారు, ఈ బ్రహ్మసుఖమందు ఏమియు తత్త్వము లేదని, దీనియందు ఆనంద మేమియు లేదని చెప్పుదురు.

వాస్తవమునకు బ్రహ్మసుఖము బృహత్తమమైన సుఖము. మంచి సౌఖ్యము, పరమానందము, బ్రహ్మసుఖానుభవముచేతనే కలుగును. మర్త్యులైన ప్రాణులు చైతన్యానందాత్మకమైన సౌఖ్యమును పొందుటకై సర్వదా ప్రయత్నము చేయుచుండవలయును. కాని, ముందుగా కలుషిత బుద్ధిని అతివిశుద్ధము చేసికొనవలసి యుండును. ఎందువలననిన, అమృతత్వప్రాప్తి మన బుద్ధిని పరిశుద్ధము చేసికొనక, ఆశించతగదు. భౌతిక ధనమోహమును త్యజించినపుడే పారమార్థిక ధనచింతనము కలుగును. అంతఃకరణమును సమస్త వికారరహితముగా చేయనగును. అటుపిమ్మట, భగవత్సంబంధమైన లీలాకథాశ్రవణమందు మనస్సు లగ్నమగును. ఆ కథాశ్రవణమే సర్వస్వమును సమర్పింపజేయును, బ్రహ్మప్రాప్తిని కలుగజేయును. నిత్య, శుద్ధ,బుద్ధ, పూర్ణ, నిర్విశేష చైతన్యానందఘనుని మాధుర్యమును ఆస్వాదించుటకై మన ముందు ఉపస్థితమొనర్చును.కథాశ్రవణముద్వారా కర్ణరంధ్రముల నుండి భగవంతుడు అంతస్తలమున ప్రవేశించును. పూర్ణబ్రహ్మ, చైతన్యానందస్వరూపుడైన పరమాత్మ, అందఱియందు కలడు. స్థావర జంగమాత్మక సర్వప్రాణులయందు ఆ భగవంతుడు అవస్థితుడై ఉన్నాడు. కాని, జీవులమైన మనమందఱము అజ్ఞానముతో ఆ భగవంతుని ఉనికిని గ్రహించుటలేదు. కావున, ఆ భగవంతుని తెలిసికొనుటకై భగవత్కథాశ్రవణమును మహర్షులు ఆదేశించి యున్నారు. కథాశ్రవణము చేయుటతోపాటు ఇతరులచే గూడా తత్కథాశ్రవణము చేయించనగును. రెండు చేతులలోను మధుర ఖాద్యపదార్థములు ఉన్నవి.దానిఫలము పరోక్షము కాదు,సాక్షాత్తుగా సిద్ధించును. కథా శ్రవణము, తత్ప్రదానము, సాక్షాత్తుగా సుఖ ప్రభావమును కలిగించును.

కాని, ఎవరి మనస్సు రజస్తమో గుణ లేశముచేత వ్యాప్తము కాక, అంతఃకరణము పరిశుద్ధముగా ఉండునో, వారికే హరికథా శ్రవణము చేయుటకు, చేయించుటకు అధికారము కలదు, ఇతరులకు లేదు. విఘ్నకారక తమోలేశముచేత సంపాదించబడిన మూఢత్వము చేతను, రజోలేశము చేత సంపాదితమైన ఘోరత్వము చేతను లీలాసుధను ఆస్వాదించుట సంభవము కాజాలదు. ఏ చీమ నోటియందు లవణ కణము ఉండునో, దానికి పంచదారయందలి తీపిదనము ఎట్లు అనుభవమునకు రాగలదు ? ఆరీతిగానే మనస్సునందు ఘోర మూఢతారూపమైన లవణకణము ఉండుగా, దానిని పరిశుద్ధము చేయజాలము. మనస్సు పరిశుద్ధము కానపుడు భగవత్ప్రాప్తి ఎట్లు కలుగును ? మనుష్యుడు ఐహిక, ఆముష్మిక ప్రపంచమునుండి విరక్తుడు కానంతవఱకు, అనేకవిధములైన బాహ్య సుఖములనుండి మనస్సును దూరము చేయనంతవఱకు, ఆ మనస్సుకు పరమ ధ్యేయు,జ్ఞేయు,పరమారాధ్యుడైన భగవంతుని మాధుర్యపూర్ణమైన లీలా సుస్వాదము అనుభవమునకు రాజాలదు. ఈ సుస్వాదానుభవమునకై పరిపూర్ణమైన శ్రద్ధ అవశ్యకము. 'అముక స్థానమందు భగవత్కథ జరుగుచున్నది. ఏమి జరుగుచున్నదో, నేను గూడా వెళ్ళి చూచెదను'అని తలచినంత మాత్రము చేత లక్ష్యసిద్ధి కలుగదు. పూర్ణమైన శ్రద్ధ అవశ్యకము. పూర్ణశ్రద్ధ కలుగుట వలన క్షణకాలములోనే భగవత్ప్రాప్తి సిద్ధించును. వర్ణాశ్రమధర్మానుసారముగా వైదిక కర్మానుష్ఠానముచేతహృదయమును పరిశుద్ధ మొనర్చుకొని, అంధకారపూర్ణమైన ఆవరణమును హృదయపటలమునుండి దూరముచేసికొని దివ్యాతిదివ్య సౌందర్య, మాధుర్యములను ఆస్వాదించుటకు ప్రయత్నము చేయవలయును.

భగవంతుడు సమస్తమునకు పరమ ప్రకాశకుడు. దేహ, ఇంద్రియ, ప్రాణ,మనస్సులకు జీవునిఅహంకారమునకు, సమస్తము

నకు ప్రకాశకుడు ఆ భగవంతుడే. ఆయనను ప్రత్యక్షము చేసికొనుటకు ఆలోకము (ప్రకాశము) అవశ్యకము కాదు.

సూర్య ప్రకాశమును చూచుటకు దీపముయొక్క ఆవశ్యకత ఏమియు ఉండదు. అట్లే తీవ్రముగా ప్రసరించు భగవత్ప్రకాశమును చూచుటకు ఆలోకము ఆవశ్యకము కాదు. అది ప్రత్యక్షమై ఉండును. ఆ ప్రకాశము నెఱింగినవారు కృతార్థులగుదురు. ఆ ప్రకాశము నెఱుగనివారు అనేక అనర్థములచే పరిప్లుతులగుదురు. దీనులై, దుఃఖము కలవారై ఇటునటు తిరుగాడుచుందురు. ఆ పరమేశ్వరుడు మన అందఱియందు వ్యాపించియున్నాడు. జీవులమైన మనము ఆ పరమేశ్వరదర్శనమునకై ప్రయత్నించక ఎమునుదెబ్బలు తినుచు ఉందుము. ఇదియే దుఃఖకరమైన విషయము. గృహమందు అపారమైన ధనసంపత్తి నిక్షిప్తమై ఉన్నది. కాని, అది ఉన్నదని తెలియకపోవుటచేత మనుష్యుడు దుఃఖములను అనుభవించును, ప్రతిపైస కొఱకు ఎదుటివారి ముఖము చూచుచుండును. నేటి ప్రపంచమందలి జీవులకు ఇట్టి స్థితియే కలుగుచున్నది. మనలోపల ఆభగవత్ప్రకాశము ఉన్నది. కాని, దానిని చూడక అంధకారములో పడి దారి తెలియక తిరుగుచున్నాము, మాయాచక్రమందు చిక్కికొని తిరుగుచున్నాము. జ్ఞానులు, ఇటువంటి పొరపాటు ఎన్నడును చేయరు. ఎవరు ఈ పాశములను త్రెంచివేయ దలంతురో, వారికి పరమతత్త్వమైన చైతన్యానందఘన స్వరూపమును దర్శించుట, తెలిసికొనుట, భవసాగరమందు చిరకాలము పడియుండక తమను దీనినుండి విముక్త మొనర్చుకొనుట పరమ కర్తవ్యమై ఉన్నది.

కర్మ, భక్తి, జ్ఞానము - ఈ మూడింటికి ముఖ్యసాధనము శ్రవణమనియే చెప్పబడెను. వేదమునందు, సమస్త కర్మకాండ ఉపదిష్టమై ఉన్నది. ఆ వేదమును గురుముఖతః అధికారానుసార

ముగా యథావిధిగా శ్రవణము చేసియే పొందవలయును. గురుముఖముద్వారా ఉచ్చారితమైన కారణముచేతనే, శ్రవణముచేతనే వేదమునకు 'అనుశ్రవము', 'శ్రుతి' మున్నగు నామములు వచ్చినవి. భక్తిమార్గమున ప్రయాణించునట్టి పథికులకు గూడా శ్రవణ, కీర్తన, స్మరణాది నవవిధ భక్తిసాధనములు చెప్పబడినవి, లేక భక్తియందు సర్వప్రథమమైన శ్రవణమే చెప్పబడినది. భగవచ్చరిత్ర శ్రవణమాత్రముచేత సర్వాంతరనివాసియైన భగవంతుని దిశగా సముద్రమువైపునకు అభిముఖమగు అఖండ, నిర్మల గంగాప్రవాహమువలె నిర్మలమైన అంతఃకరణముయొక్క అవిచ్ఛిన్న భక్తిప్రవాహము ప్రవహించును

"మద్గుణశ్రుతిమాత్రేణ మయి సర్వగుహాశయే।
మనోగతి రవిచ్ఛిన్నా యథా గంగాంభసోఽంబుధౌ॥"

జ్ఞానవిషయమున గూడా

"శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః।"

ఇత్యాది వచనములచేత శ్రవణముయొక్క ప్రాధాన్యమే వర్ణితమైనది.

"సర్వే వేదా యత్పద మామనన్తి।"

"వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా।
ఆదావన్తే చ మధ్యే చ హరిః సర్వత్ర గీయతే॥"

సమస్త వేదములు సర్వాశ్రయుడైన భగవంతునినే ప్రతిపాదించుచున్నవి. వేదములు, రామాయణము, పురాణములు, మహాభారతము మున్నగు సమస్త శాస్త్రముల ఆదియందు, మధ్యభాగమున, అంతమున, సర్వత్ర ఏకమాత్ర పాపతాపహారియు, భగవంతుడు నయిన హరియొక్క గుణ, లీలాదిసంకీర్తనమే జరుగునని భావము. ఈ వచనముల వలన సర్వశాస్త్రములకును ఏకైక ప్రతిపాద్యుడు భగవంతుడే అని విదిత మగును.

ప్రతి ప్రాణికి సర్వవిధములైన కళ్యాణములను ఒనగూర్చునది అగుటచేత భగవత్కథాశ్రవణమందు అందఱికిని అధికారము కలదు. భగవచ్చరిత్ర శ్రవణము చేయుట, గానము చేయుట ముక్తులకు, ముముక్షువులకు, సంసారులకు అందఱికి కర్తవ్యమై ఉన్నది. నిష్కాములు, నిరీహులును అయిన ముక్తులకు పరమ ప్రేమాస్పదుడు, స్వాత్మభూతుడును అగుటచేత ప్రభువు భజనీయుడగును. కావుననే ముక్తపురుషుల శరీరధారణము గూడా భజనము, భక్తికొఱకే అని చెప్పబడెను.

"ముక్తా అపి లీలయా విగ్రహం కృత్వా భజన్తే।"

భవసాగరమును తరించుటకు ఏకైకసాధనము అగుటవలన ముముక్షువులైనవారికి గూడా ఆ పరమేశ్వరుడు పరమాశ్రయణీయుడు. శ్రోత్రేంద్రియమును, మనస్సును ఆకర్షించువాడగుటవలన సంసారులకు గూడా ఆయన శ్రోతవ్యుడు. సర్వశ్రేయస్కరమైన ఇట్టి భగవచ్చరిత్రను, భగవత్కథను శ్రవణము చేయనివారు ఆత్మఘాతుకులు నయినను అగుదురు, లేక జడమైన కాష్ఠము వంటివారైనను అగుదురు—

"నివృత్తతర్షై రుపగీయమానా ద్భవౌషధాత్ శ్రోత్ర
మనోఽభిరామాత్ ।
ఉత్తమ శ్లోకగుణానువాదాత్ పుమాన్ విరజ్యేత వినా
పశుఘ్నాత్ ॥"

శ్రవణము, సంకీర్తనము చేత శ్రోత్రము ద్వారా శ్రోత యొక్క మానసపంకజమందు ప్రవేశించి భగవంతుడు, వాని సమస్త దోషములను సూర్యుడు అంధకారమును పోగొట్టునట్లు, చండ మారుతము మేఘములను చెల్లాచెదరు చేయునట్లు ప్రశమింప జేయును. ఏ కథయందు భగవంతుడైన అధోక్షజుని గుణానువాదము ఉండదో, అది అసత్కథ అగును. కావున, అది వ్యర్థ

మైన వాగ్వ్యాకార మగును. ఏ కథయందు భగవంతుని గుణవర్ణనము ఉండునో, ఆ కథయే సత్యము, మంగళము, పుణ్యము, రమ్యము, రుచికరము, నిత్యము, నవనవాయమానము, మనస్సునకు మహోత్సవరూపము, శోకార్ణవశోషకము. ఏ వాక్ప్రయోగమైనను, ఎంత విచిత్ర శబ్దావళితోను, అలంకారములతోను ఉన్నను అది, జగత్తును పవిత్రమొనర్చునట్టి భగవంతుని మంగళమయమైన యశస్సుచే నిబద్ధము కానిచో అది, హంసతీర్థము కాక, వాయసతీర్థ మగును. కావున, వ్యక్తిగతముగా ప్రతిదినము నియమపూర్వకముగా నియతమైన సమయమున, పరమపవిత్రమైన భగవత్కథలను ఆదరపూర్వకముగా శ్రద్ధాపురస్సరముగా శ్రవణము చేయుట, అధికారానుసారముగా ఇతరులకు ఆ కథలను వినిపించుట వివేకవంతులైనవారి పరమ కర్తవ్యము. ప్రతి గ్రామమునందు, దేవాలయములందు కనీసము నెలకు రెండు, మూడు దినములు భగవత్కథను ఏర్పాటుచేయుట పరమావశ్యకము. ఈ మర్త్యలోకమందు భగవత్కథ, సాక్షాత్తుగా అమృతమే. అనేక శోకములచేత, దుఃఖములచేత సంతప్తులైన ప్రాణుల తాపమును హరించుటయందు భగవత్కథ సమర్థమైనది. శుక, సనకాది పరమ వివేకవంతులైన సత్పురుషులచే స్తుతించబడినది. ఈ భగవత్కథ సకల పాపపంక శోషకము. శ్రవణమాత్రముచేత మంగళప్రదము. వ్యాసాది మహర్షులచేత జగతీతలమందు విస్తృతమైనది. కావున, సర్వార్థ సాధకము. ఈ భగవత్కథను వినిపించువారికంటె అధికుడైన దాన మొసగువాడు ఈ ప్రపంచమున ఎవడు ఉండును ?

> "తవ కథాఽమృతం తప్తజీవనం కవిభిరీడితం కల్మషాపహమ్।
> శ్రవణమంగళం శ్రీమదాతతం భువి గృణన్తి
> తే భూరిదా జనాః ॥"



# 11. ప్రభుకృప

సుధాతరంగిణి

ప్రభుకృప లేక, అతి దుస్తరమైన ప్రభుమాయను తరిచుట అత్యంత అసంభవము. సమస్త ప్రాణులు సర్వాంతరాత్మ, సర్వాధిష్ఠానమును అయిన భగవంతునిఅంశలే అను విషయము స్పష్టము. జలమునుండి తరంగములు, అగ్నినుండి విస్ఫులింగములు, మహాకాశమునుండి ఘటాకాశ, ఉదంచనాకాశాదులు ఉద్గతములయినట్లే సమస్త చేతనవర్గము భగవంతుని నుండియే ఉదయించును. వస్తుతః, అత్యంత నిరుపాధిక తత్త్వమునందు వాస్తవమైన అంశాంశి భావము గూడా పొసగదు. ఏలయనగా, నిరవయవమునందు, నిరంశమునందు అంశభావన, అవయవభావన, సర్వథా అసంభవము. అయినను, అవికృతుడైన కౌంతేయునందు (కర్ణుని విషయమున) భ్రమచేతనే 'రాధాసుతు'డను భ్రాంతి కలిగెను. ఆ రీతిగానే ప్రత్యక్చైతన్యాభిన్నము, స్వప్రకాశమునయిన చిద్రూపమునందే భ్రమవలన జీవభావము భాసించును. ఐంద్రజాలికుడు చమత్కారపూర్ణమైన తన మాయచేత స్థిరరూపముతో ఉండియు, ఆకాశములోనికి కల్పితమైన దారపు ఉండను విసరి, శస్త్రాస్త్ర సుసజ్జితమైన వీరవేషములో సూత్రసహాయముతోపైకిఎగబ్రాకును, పైకి ఎక్కుచు, ఎక్కుచు అదృశ్యుడగును, దైత్యులతో యుద్ధము చేయును, యుద్ధము చేయుచు, చేయుచు వానిఅంగ ప్రత్యంగములు, శిరస్సు మున్నగు అవయవములు భూమిపైన పడును, వాని భార్య, వానిని తీసికొని,చితిపైకి ఎక్కి,భర్తతో సహగమనము చేయును. ఈ సంఘటన ప్రత్యక్షముగా కన్పడిన తరువాత, అతడు ఆ సూత్రసహాయముననే మరల ఆకాశమునుండి దిగుచు కన్పడును. అయినను, వాస్తవిక ఐంద్రజాలికుడు, తన మాయా

ప్రభావముచేత ప్రజల దృష్టినుండి అదృశ్యుడగును, ఉన్నవాడు ఉన్నచోటనే ఉండును.

ఆ రీతిగానే ప్రత్యక్ చిదాత్మ అయిన భగవంతుడు నిర్వికార, కూటస్థ, ఏకరసరూపముతో సర్వదా స్వరూపస్థుడయినను, సమష్టి-వ్యష్టి, స్థూల-సూక్ష్మ, కారణజగత్తును, జాగ్రత్, స్వప్న, సుషుప్త్యవస్థాది ప్రపంచమును వ్యాపింపజేసి, వానియందు విశ్వ, తైజస, ప్రాజ్ఞ, విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృత రూపములో అనుభూయమానుడగును. అనేక వ్యవహారములలో తల్లీనుడై, తజ్జన్యుడై, శోక, మోహాది ఉపద్రవములందు చిక్కికొని, గోచరించును. కాని, ఇట్లయినను, ఆ భగవత్స్వరూపమునందు, లేశమాత్రమైనను, వికారము గాని, ఆందోళనము గాని ఉండదు, ప్రపంచముకంటె, ప్రపంచరూపమైన స్వరూపముకంటె, భిన్నము, అసంగము, కూటస్థమును అయిన స్వరూపము సర్వదా ఏకరసము గానే ఉండును. ఈ దేహమునందే అంతర్ముఖుడై దేహ,ఇంద్రియ, మనోబుద్ధి, అహమర్థాదు లయిన 'అతత్'ను (అనాత్మను) అపోహనము చేయుచు, అన్వేషించినచో,అది ఉపలబ్ధమగుటకు కష్టము ఏమియును లేదు. కాని, ఎవరైనను, ఇంటిలో పోయిన వస్తువును అడవిలో వెదకినట్లుగానే బహిర్ముఖుడైన ప్రాణి, ఆంతరమైన వస్తువును, ఆంతరమునందే పోయిన వస్తువును బయట వెదకును. ఆలోచించినపుడు, సర్వభాస్యమగు దృశ్యమునకు భాసకుడు, నిర్వికారుడు, దృక్స్వరూపుడు, భానాత్మకుడును అయిన భాసకుని ఉపలబ్ధియందు కార్యపరంపరను, పరమ కారణమునందు, పరమ కారణమును గూడా కార్య, కారణాతీతమైన తత్త్వమునందు విలీనముచేసినపుడు, లేక భాధిత మొనర్చినపుడు, అశేష విశేషాతీత వస్తువును పొందుటలో కష్ట మేమియును లేదు. అయినను, భగవత్కృప లేక, మిథ్యాప్రపంచమందు అభినివేశము వీడిపోదు-

"వదన్తి చైతత్ కవయః స్మ నశ్వరం పశ్యన్తి
చాధ్యాత్మవిదో విపశ్చితః ।
తథాఽపి ముహ్యన్తి తవాజమాయయా సువిస్మితం
కృత్య మజం నతోఽస్మి తమ్ ॥"

అనగా, క్రాంతదర్శులైనవారు విశ్వమును వినశ్వరమని చెప్పుదురు. అధ్యాత్మవిదులైన విద్వాంసులు, విశ్వముయొక్క నశ్వరత్వమును అనుభవింతురు గూడ. అయినను, నీ మాయ వలన, మోహితు లగుదురు. ఇటువంటి విస్మయజనక కార్యములు కలవాడవు, అజుడవు, అవ్యక్త ఆత్మస్వరూపుడవును అయిన నీకు నమస్కారము. ఈ శ్వాన, శృగాల, గృధ్ర, కాకాది పిశితాశులకు (మాంసభక్షకులకు) భక్ష్యము, అస్థి, మాంస, చర్మమయపంజరము, మూత్ర, పురీష భాండాగారము, మాయామయము, క్షణభంగురము, బుద్బుదోపమము అయిన దేహముతోటి మమకారము, నిష్కపటభావముతో సర్వాత్మనా, భగవంతుని శ్రీచరణారవిందముల సహాయము గైకొని, ఆ భగవంతునిదయాదృష్టిని పొందినవారికే వీడిపోవును, వారే దుస్తరమైన, గుణమయమైన మాయను తరించగలుగుదురు.

"యేషాం స ఏవ భగవాన్ దయయే దనన్తః సర్వాత్మనా
శ్రితపదో యది నిర్వ్యలీకమ్ ।
తే దుస్తరామపి తరన్తి చ దేవమాయాం నైషాం
మమాహమితి ధీః శ్వశృగాలభక్ష్యే ॥"

అట్లు కానిచో, అవివేక, అజ్ఞానములచేత ప్రత్యక్షసిద్ధము, కరతలస్థితము నయిన ఆమలకమువంటి అపరోక్ష సర్వాత్మభావము గూడా పరోక్షము, లేక అసత్కల్పము నగును. అపుడు, వ్యక్తులు ఆధ్యాత్మికతను, అధిదైవికతను మఱచిపోయి, కేవల ఆధిభౌతిక, వైషయిక భోగవిలాసములకు కింకరు లగుదురు. విషయాసక్తి, అసంతోష, విద్వేషాది అసురభావగ్రస్తులై పరస్పరము ఒకరిని

మతొకరు సంహరించువారగుదురు. కావుననే సాధుపురుషులు నిరంతరము భగవత్కృపకై ప్రతీక్షించుటయేముఖ్యమని భావించిరి. తమ కళ్యాణమునకై విశ్వకళ్యాణమునకై ప్రభువైన భగవంతుని యందు చిత్తమును-నిష్కామ బుద్ధిని కలిగి ఉండుటయే ముఖ్య పురుషార్థమని భావించిరి. ప్రాప్తవ్యములైన సమస్త తత్త్వముల ప్రాప్తి ఇంతమాత్రముచేతనే సంపన్నమగును. భగవంతుని శ్రీ చరణారవిందములయందు అహైతుకబుద్ధి గల నైష్ఠిక భక్తులు సమస్తవిశ్వమును, సర్వప్రాణులను ఆత్మనువలె, భగవత్స్వరూపులుగానే చూచుదురు. వారు, ఖలులకు సైతము అహితము కోరక, హితమునే వాంఛింతురు. వారి స్వార్థ, పరమార్థములయందు అంతరము ఉండదు. ప్రాణి, ఆత్మసంబంధులైన పుత్ర, పౌత్ర, ప్రపౌత్ర, కళత్ర, మిత్ర, క్షేత్ర, విత్తాది అత్యంత అనాత్మపదార్థములను గూడా ప్రేమాస్పదులనుగా జేసికొని, వారి హితమును కోరును. దేహ, ఇంద్రియ, మనోబుద్ధి, ప్రాణాదులను అతిశయముగా ప్రేమించును. అట్టి పరిస్థితిలో సమస్త జగత్తును, తత్రస్థ ప్రాణులను పరమాత్మస్వరూపమైన స్వీయాత్మగానే తెలిసికొనును. అపుడు, విశ్వము వానికి మిత్రమగుట ఉచితమే. ప్రహ్లాదుడు, హే అధోక్షజ ! విశ్వమునకు కళ్యాణమగుగాక, ఖలుల మనస్సులలో గూడా ప్రసన్నత కలుగుగాక, వాని తీవ్రతగూడా నశించుగాక, ప్రాణులు, పరస్పరము ప్రేమించుకొందురు గాక, మనస్సు అశాస్త్రీయ, అభద్ర పదార్థచింతనము వదలి, భద్రచింతనమందు నిరతమగుగాక, మాఅందరి అహైతుకబుద్ధి నీయందు సుప్రతిష్ఠితమగుగాక- అని కోరెను-

> "స్వస్త్యస్తు విశ్వస్య ఖలః ప్రసీదతాం ధ్యాయన్తు భూతాని
> శివం మిథో ధియా ।
> మనశ్చ భద్రం భజతా దధోక్షజే ఆవేశ్యతాం నో
> మతి రప్యహైతుకీ ॥"

గృహ, పుత్ర, విత్త, బంధువులయందు నాకు సంగము (ఆసక్తి) కలుగకుండుగాక, ఒకవేళ, సంగము ఉండినచో భగవత్ప్రియులయందును, సాధువులయందుమాత్రమే ఉండుగాక. జీవితయాత్రామాత్రముచేత సంతుష్టుడు, అంతర్ముఖుడు నయిన ప్రాణి, అతిశీఘ్రముగా ఏ సిద్ధిని పొందునో, ఇంద్రియప్రియులైన ప్రాణులకు అది, స్వప్నములో గూడా సులభము కాదు. ఏ హేతువులవలన, భగవంతునియందు చిత్తము అనురక్తమగునో వానివలననే విశ్వముయొక్క, నాయొక్క లౌకిక, పారలౌకిక పురుషార్థము సిద్ధించును. శ్రీహరిచరణములయందు ఎవనికి భక్తి కలుగునో, సమస్త దేవతలు సర్వగుణములతో వచ్చి అతనియందే నివసించుదురు. ఎవరు హరియందు అనురాగము కలవారు కారో నానా మనోరథములతో బాహ్యవిషయములయందే తిరుగాడుచుందురో, వారియందు దేవతలు ఏల నివసింతురు ? గుణములు ఎచట ఉండును ?—

"యస్యాస్తి భక్తిః భగవతి అకించనా సర్వైర్గుణైః తత్ర సమాసతే సురాః ।
హరా వభక్తస్య కుతో మహద్గుణాః మనోరథేనాసతి ధావతో బహిః ॥"

శ్రీలక్ష్మీదేవి, ఇట్లనెను— హేదేవ ! మీ శ్రీచరణారవిందములను పూజించువారే సకలాభీష్టములను, కామమును వాంఛింతురు. ఏ వస్తువును పొంది, మరొక స్త్రీ భగ్నయాచన కలదై, అనగా యాచన విఫలమగుటవలన నిరాశురాలై సంతప్తురాలు అగునో, ఏ నారి, మిమ్ములను కోరునో, పూజించునో, ఆ స్త్రీ ఆ అభీష్టవస్తువునే అనాయాసముగా పొందును.

"యా తస్య తే పాదసరోరుహార్హణం నికామయేత్ సాఽఖిల కామలంపటా ।

తదేవ రాసీప్సిత మీప్సితో౽ర్చితో యద్భగ్నయాచ్నా
భగవన్ ప్రతప్యతే ॥"

హే మాయేశ్వర ! హే దేవ ! నా ప్రాప్తికై ఫలము నభి లషించు దేవతలు, అసురులు అందఱును, ఉగ్రతపము చేయుదురు. కాని, మీ చరణపరాయణులుగాక, ఎవరును నన్ను పొందజాలరు. ఏలన, నేను సర్వదా మీ హృదయమే అయి ఉన్నాను. మీయందే నా హృదయము సర్వదా సంసక్తమై ఉండును. కావున, మిమ్ము లను వీడి, నేను క్షణకాలముగూడా ఎచటకును పోజాలను. ఇటువంటి పరిస్థితిలో ఎవరి హృదయములో మీరు ఉందురో, అచట, నేను ఉండుట అనాయాసముగానే సిద్ధించును.

"మత్ప్రాప్తయే అజేశ సురా౽సురాదయః తప్యంత
ఉగ్రం తప ఐంద్రియే ధియః ।
ఋతే భవత్పాదపరాయణాత్ న మాం విందంతి అహం
త్వద్ హృదయా యతో౽జితా ॥"

ఈవిధముగా అనేక ప్రయోజనముల సిద్ధి అభీష్టమైనను, హరిని ఆశ్రయించుట అవశ్యకము. వస్తుతః, భగవంతుడు ప్రతి ప్రాణియొక్క అంతరాత్మ. కావుననే ఆ భగవంతుడు నిరతిశయ, నిరుపాధిక ప్రేమకు ఆస్పదుడు. మీనములకు(చేపలకు)ఉదకము అభీష్టమైనట్లే, ప్రాణిమాత్రునకు నిరుపాధిక ప్రేమాస్పదరూపముతో భగవంతుడు అభీష్టుడు_

"హరిర్హి సాక్షాత్ భగవాన్ శరీరిణా మాత్మా ఝషానా
మివ తోయ మీప్సితమ్ ।"

తేలిన సారాంశమేమనిన, శ్రీహరికృపవలననే ప్రాణులయందు శుభ భావములు దృఢమగును. శుభ భావనలు దృఢమైనపుడే స్థిరమైన వివేకము, విజ్ఞానము, ప్రతి ప్రాణిపట్ల, భగవద్భావము జాగృత

మగును. ఎవరు భగవంతుని శరణు జొచ్చుదురో, వారికే ఈ భగవ ద్భావము కలుగును. ఆ భగవత్ప్రాప్తికి శీల, సంతోష, బుద్ధ్యా దులు హేతువులు కావు. భగవంతుని సంతోషమునకు హేతువులు. ఉన్నత కులములో జన్మించుట, సౌభాగ్యము, మనోహరమైన వాక్కు, దివ్యబుద్ధి, సుందరమైన ఆకృతి మొదలగునవి కావు. ఏలన, ఈసమస్త గుణరహితములైనను,వానరములను భగవంతుడు తన మిత్రులనుగా చేసికొనెను.

"న జన్మ నూనం మహతో న సౌభగం న వాక్ న బుద్ధిః
నాకృతిః తోషహేతుః ।
తైర్యద్విసృష్టానపి నో వనౌకస శ్చకార సఖ్యే
బత లక్ష్మణాగ్రజః ॥"

సర్వగుణవిహీనములైన వానరములు— వాని పేరు వినినను, ఆహారము లభించుట గూడా దుస్తరమగునో— అట్టి సర్వవిధహీనుని గూడా గుణగ్రామమును వినుటవలన సజల నయనములతో ప్రభువు తనవానినిగా చేసికొనెను. అట్టిస్థితిలో ఇతరుల విషయము చెప్ప నేల ? అని హనుమంతుడు పల్కెను.

ఇటువంటి ప్రభువును తెలిసియు మఱచిపోయినవారు ఏల దుఃఖమును అనుభవించరు ?

ఏ ప్రాణులు మనుష్యశరీరము ధరించియు, భగవత్కృపను సంపాదించుటద్వారా భగవత్ప్రాప్తికై భగవంతుని ఆశ్రయించరో, వారు మాయామయములైన ప్రలోభములందు చిక్కికొని, మాటి మాటికి వానరులవలె బంధమును పొందుదురు.

"ప్రాప్తా నృజాతిం త్విహ యే చ జన్తవో జ్ఞానక్రియా
ద్రవ్యకలాపసంభృతామ్ ।
న వై యతేరన్ న పునర్భవాయ తే భూయో వనౌకా
ఇవ యాన్తి బంధనమ్ ॥"

# 12. శ్రీరామజన్మరహస్యము

సు ధా త రం గి ణి

ప్రపంచమంతట, దురాచారము, దుర్విచారము ప్రసరించ సాగినపుడు, సత్యము, అస్తేయము, ధైర్యము, న్యాయము మున్నగు మానవోచితము లయిన సద్గుణములు అవమానింపబడ సాగినపుడు, దంభము యొక్క సామ్రాజ్యమే సాగినపుడు, వేద, శాస్త్రోక్తములైన వర్ణాశ్రమ ధర్మములు లోపించసాగినపుడు, దైత్యులచేత, దానవులచేత,లేక దైత్య ప్రాయులైన కాపురుషులచేత భూమి వ్యాకులమయినపుడు, సత్పురుషులు, దేవగణములు అవినీతి వలన ఉద్విగ్నులయినపుడు సర్వపాలకుడైన భగవంతుడు ఏదో ఒక రూపములో ప్రకటమై శ్రుతిమర్యాదను పాలించును, తన మనోహర, మంగళమయ,పరమ పవిత్రమయము లైన చరిత్రలను విస్తరింపజేసి ప్రాణులకొఱకు మోక్షమార్గమును ప్రశస్త మొనర్చును.

భగవంతుని విశుద్ధ సత్త్వమయ, పరమ మనోహర, మధుర స్వరూపము ప్రకటమై ఉండకపోయినచో అదృశ్య, అగ్రాహ్య, అవ్యపదేశ్య, పరబ్రహ్మసాక్షాత్కారమునకు సంబంధించిన విషయమే ప్రపంచమందు నశించియుండెడిది అని అభియుక్తుల వచనము. భగవంతుని మధురమైన మూర్తియందు, చరిత్రల యందు మనస్సు ఆసక్తమైనపుడు, ఆ మనస్సునకు నిర్మలత, ఏకాగ్రత సహజముగా సిద్ధించును. నిర్మలము, ఏకాగ్రమును అయిన చిత్తమే భగవంతుని అచింత్య రూపముయొక్క చింతనము చేయుటకు సమర్థమగును. అంజనము. (కాటుక) చేత నిర్మలమైన నేత్రములతో సూక్ష్మవస్తుపరిజ్ఞానము సుగమముగా కలుగును. అట్లే, భగవచ్చరిత్రను,తన్మధుర స్వరూపమును పరిశీలించుటవలన,

నిర్మలమైన చిత్తము అతిసూక్ష్మమైన భగవద్రహస్యములను తెలిసికొనును.

ఇంతియేకాక, అమలాత్ములు, పరమహంసలును అయిన మునీంద్రులకు భక్తియోగమును ప్రదానము చేయుటకై గూడా ప్రభువు యొక్క లీలావిగ్రహము ఆవిర్భవించును. ఈ భావములను అన్నింటిని గ్రహించి మధుమాస (చైత్రమాస) శుక్లపక్ష నవమీదినమున, మర్యాదాపురుషోత్తముడు, భగవంతుడును అయిన రామచంద్రుడు జన్మించెను.

అనంతకోటి బ్రహ్మాండనాయకుడు, భగవంతుడు, సర్వాంతరాత్మ, సర్వశక్తిమంతుని భృకుటీసంకేత మాత్రముచేతనే ఆ భగవంతుని మాయాశక్తి, సమస్త ప్రపంచ సర్జన,పాలన,సంహారములను చేయును. అయస్కాంతసాన్నిధ్యముచేత లోహమందు కదలికలు కలుగునట్లే భగవంతుని సాన్నిధ్యమాత్రముచేత మాయాశక్తికి చైతన్యము లభించును. గవాక్షములందు సూర్యకిరణముల సహాయముచేత నిరంతరము పరిభ్రమించుచున్న అసంఖ్యాకములైన త్రసరేణువులు కన్పడును. ఆరీతిగానే ప్రకృతిపారదృశ్వులైన లోకోత్తరపురుషధౌరేయులకు భగవంతుని సన్నిధానమందు అనంత విశ్వము కన్పడును.

"యత్సన్నిధౌ చుంబక లోహవద్ధి జగన్తి నిత్యం
పరితో భ్రమన్తి।"

భగవంతుడు, తన పారమార్థిక రూపముతో నిరాకారుడు, నిర్వికారుడు, నిష్కలుడు, నిరీహుడు, నిర్గుణుడు అయి గూడా మాయాశక్తిసహితమైన రూపముతో అనాదిబద్ధులు, స్వాంశభూతులును అయిన జీవులయందు కృపతో వారి కళ్యాణార్థమై విశ్వసృష్టి, సంహారాది లీలలందు ప్రవృత్తుడగును. మనీషులైనవారు మహా

కుతూహలముతో సకల విరుద్ధ ధర్మములకు ఆశ్రయభూతుడైన భగవంతుని ఈ కౌతుకమును చూచి, ఇట్లు చెప్పుదురు-

"త్వత్తోఽన్యజన్మ స్థితి సంయమాన్ విభో వదన్త్యనీహా
దగుణా దవిక్రియాత్ ।
త్వయీశ్వరే బ్రహ్మణి నో విరుధ్యతే త్వదాశ్రయత్వా
దుపచర్యతే తథా ॥"

అనగా, హే నాథ! విజ్ఞ జనులు నిర్గుణుడు, నిరీహుడు, అవిక్రియుడు నయినవాని వలననే వివిధ వైచిత్ర్యములతో గూడిన ఏతత్ప్రపంచ జన్మ, స్థితి, సంహారములను చెప్పుదురు. నిరీహుడు, సర్వథా నిష్క్రియుడును అయినవాడే నిరంతర చాంచల్యపూర్ణమైన విశ్వమును సృష్టించుననుట ఎట్లు?

కాని, భగవంతుని ఈశ్వరరూపము, బ్రహ్మరూపము- ఈ రెండు రూపములందు ఈ విరుద్ధ ధర్మములు సమన్వయ మగుట యందు ఏమియును విప్రతిపత్తి లేదు. మాయాయుక్తమైన ఈశ్వర రూపమందు విశ్వనిర్మాణమునకు ఉపయుక్తమైన సమస్త క్రియలు కలవు. కాని, మాయారహితమైన బ్రహ్మరూపమందు కేవల నిరీహత్వము, నిష్క్రియత్వమే కలదు. అనగా, మాయాశక్తిసహాయముతో జరుగు సమస్త వ్యవహారములకు మాయాధిష్ఠానము, స్వప్రకాశము, విశుద్ధమును అయిన బ్రహ్మయందు ఉపచారము కలుగును. అస్తు, ఆ వ్యాపక బ్రహ్మయే నిరంజనుడు, నిర్గుణుడు, విగత వినోదుడు, భక్తప్రేమవశుడు, శ్రీమద్ రాఘవేంద్రుడును అయిన రామచంద్రుని రూపములో కౌసల్యామాతయొక్క మంగళ మయమైన అంకమున, వ్యక్తమయ్యెను. సమస్త బ్రహ్మాండ మండలములు ఎవరికి పరతంత్రములై ఉండునో, ఆయన, మాయాపతియైన భగవంతుడు భాస్వతి, భగవతి అయిన శ్రీకృపాదేవికి పరాధీనుడు. ఆ కృపామహారాణియు, దీనతాపరతంత్రురాలు.

భగవంతుని సాన్నిధ్యమందు దీనులు తమ దుఃఖగాథను ఎక్కువగా వినిపింతురు.

"జగద్విభేయం ససురాసురం తే భగవాన్ విధేయో
భగవన్ కృపాయాః।
సా దీనతాయా సమతాం విధేయా మమాస్త్వయత్నోప
నత్తైవ సేతి ॥"

ఏ దైన్యము, మఱొక చోట, అవహేళనాదృష్టితో చూడబడునో, ఆ దైన్యమే భగవంతుని సన్నిధియందు పరమాదరణీయమై ఉండును. శోక, మోహ, జరా, మరణముల చేత, ఆధి, వ్యాధులచేత, దారిద్ర్య, దుఃఖములచేత పీడితులైన ప్రాణుల దగ్గఱ దైన్యమునకు లోపము లేదు. సర్వత్ర, ఆ దారిద్ర్యదుఃఖ గాథయే గానము చేయబడుచుండును. కాని, దుర్భాగ్యవశమున, ఎచట లేశమాత్రమైనను, లభించుట దుర్లభమో, సహానుభూతితో గూడిన ఒక్క మాట గూడా వెలువడదో, అట్టిచోట, దైన్యదుఃఖగాథ గానము చేయబడును. ఆచోట,దీనుడు అవహేళనములకు పాత్రుడు కావలసివచ్చును. కాని, 'దీననాథు'డైన భగవంతుడు దీనతా గ్రాహకుడై ఉండును. ఆ భగవంతునిముందు దైన్యమును ప్రకటించుటకు కృపణత్వము, లోభము కలుగరాదు. సంఘర్షము (ఒరిపిడి) ద్వారా వ్యాపకమైన అగ్నికి సగుణ, సాకారరూపము వ్యక్తమగును. అథవా, శైత్యసంబంధముచేత జలము, మంచుగడ్డ అగును. ఆ విధముగానే భక్తుల భక్తితీవ్రతచేత విశుద్ధ సత్త్వగుణ సంపన్న అయిన కౌసల్యామాతనుండి పూర్ణతమ పురుషోత్తముడైన భగవంతుడు ఆవిర్భూతుడయ్యెను.యజ్ఞపురుషునిద్వారా సమర్పించబడిన 'చరువు'యొక్క విభాగానుసారముగా భగవానుడే శ్రీరామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్న రూపములో ప్రకటమయ్యెను.అర్ధభాగము నుండి రాముడు, మిగిలిన అర్ధభాగమునుండి లక్ష్మణాదులు అవి

ర్భవించిరి. సప్రపంచ బ్రహ్మ, భరతాది రూపత్రయముతోను, నిష్ప్రపంచ బ్రహ్మ, శ్రీరామచంద్రరూపముతోను ఆవిర్భవించె ననియు చెప్పవచ్చును.

ప్రణవమందలి అకార, ఉకార, మకారములన్న మూడు మాత్రలకు వాచ్యమైన విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతములు శత్రుఘ్న, లక్ష్మణ, భరతుల రూపములో ఆవిర్భవించెను. అర్ధ మాత్రయొక్క అర్థమైన తురీయ పాదము, లేక వాచ్య, వాచకా తీతము, సర్వాధిష్ఠానమును అయిన పరమ తత్త్వము శ్రీరామ చంద్రుని రూపములో ఆవిర్భవించెను. నిష్ప్రపంచ అర్ధమాత్ర యొక్క అర్థమైన తురీయ తత్త్వమే 'చరువు' యొక్క అర్ధాంశము నుండి మిగిలిన మూడుమాత్రల అర్థమైన సప్రపంచత్రయము 'చరువు' యొక్క అర్ధభాగమునుండి అభివ్యక్తమయ్యెను. ప్రణవము మూడున్నర (సార్ధత్రయ) మాత్రలు కలిగినదిగా భావించబడినట్లే పదునాఱు మాత్రలు కలదిగా గూడా భావించబడును.

"అకారో వై సర్వా వాక్"

సమస్త వాక్యముల అంతర్భావము అకారమందే జరుగును. సమస్త వాక్యముల ఆవిర్భావము ప్రణవమునుండియే జరుగును. కావున, ప్రణవమందే పదునాఱు మాత్రల కల్పన చేసి, ఆ ప్రణవమునకు పదునాఱు వాచ్యపదార్థములు స్థిరీకరించబడినవి. జాగ్రదవస్థా భిమానియగు వ్యష్టి విశ్వుడు, సమష్టి స్థూలప్రపంచాభిమాని అయిన విరాట్పురుషుడగును, సూక్ష్మ ప్రపంచాభిమాని, స్వప్నావస్థాభిమాని అయిన తైజసుడు, హిరణ్యగర్భుడు అగును. కారణప్రపంచా భిమాని, సుషుప్త్యవస్థాభిమాని అయిన ప్రాజ్ఞుడు, అవ్యాకృతుడు అగును. ఈ కల్పనలన్నిటికి అధిష్ఠానమైన శుద్ధ బ్రహ్మ, తురీయ తత్త్వమగును. ఇక, ఈ ఒక్కొక్కదానియందు గూడా నాలుగు నాలుగు భేదములు చెప్పబడినవి. జాగ్రదవస్థయందు స్పష్టమగు

విషయజ్ఞానము 'జాగ్రత్' అని చెప్పబడును. జాగ్రత్కాలమందు మనోరాజ్యాదులను (మానసికమైన ఊహలను) చేయుచున్న సమయమున, 'జాగ్రత్స్వప్నము' అని చెప్పబడును. శోక, మోహము లందు, హర్షాతిరేకమందు శూన్యత, లేక స్తబ్ధత కలుగు సమయమున 'జాగ్రత్సుషుప్తి' అని చెప్పబడును. జాగ్రత్ కాలమందే నిష్ప్రపంచ బ్రహ్మదర్శన సమయమున 'జాగ్రత్ తురీయ' మని చెప్పబడును. ఈ విధముగానే స్వప్నమున, స్పష్ట వ్యవహారము 'స్వప్నజాగర' మనియు, స్వప్నమందు స్వప్నము 'స్వప్న స్వప్న' మనియు, స్వప్నమందు సుషుప్తి 'స్వప్నసుషుప్తి' అనియు, స్వాప్నిక బ్రహ్మానుభూతి 'స్వప్నతురీయ' మనియు చెప్పబడును. సుషుప్తియందు గూడా సాత్త్విక, రాజస, తామస భేదముతో 'సుషుప్తిజాగరము', 'సుషుప్తిస్వప్నము', 'సుషుప్తి సుషుప్తి' కలుగును. నిద్రాప్రభావము వలన విశ్వవిస్మరణ కాలమున, సాధకులకు కలుగు నిష్ప్రపంచ బ్రహ్మదర్శనమే 'సుషుప్తితురీయము'. స్థూలప్రపంచభాసకము, సర్వానుస్యూతమును అయిన ఆత్మ 'తురీయ విరాట్', సూక్ష్మప్రపంచ భాసకుడయిన 'అనుజ్ఞాతాత్మ' 'తురీయ హిరణ్యగర్భుడు.' ఈవిధముగానే కారణ భాసకము, అనుజ్ఞాత అయిన ఆత్మ 'తురీయ అవ్యాకృతము' సర్వభాస్యాది ప్రపంచవర్జితము, అవికల్పమును అయిన ఆత్మ 'తురీయతురీయము'.

ఈ పక్షమందు తురీయ విరాట్ శత్రుఘ్నుడు, తురీయ హిరణ్యగర్భుడు లక్ష్మణుడు, తురీయ అవ్యాకృతుడు భరతుడు, తురీయ తురీయుడు శ్రీమద్రాఘవేంద్రుడైన రామచంద్ర రూపములో ప్రకటమయిరి. తన్మాధుర్యాధిష్ఠాత్రి అయిన మహాశక్తి జనకనందినీరూపములో ప్రకటమయ్యెను. సర్వథా పూర్ణతమ పురుషోత్తముడు, వేదాంతవేద్యుడును అయిన భగవంతుడే శ్రీరామ

చంద్రరూపములో అభివ్యక్తమయ్యెను. కావుననే తద్దర్శన, స్పర్శన, శ్రవణ, అనుగమనాది మాత్రముచేత ప్రాణులకు పరమ గతి లభించును.

"స యైః స్పృష్టోఽభిదృష్టో వా సంవిష్టోఽనుగతోఽపి వా ।
కోశలాస్తే యయుః స్థానం యత్ర గచ్ఛన్తి యోగినః ॥"

ఏ పరమ తత్త్వము, విషయమునకు, కరణములకు, దేవతలకు జీవునికి గూడా సత్తను, స్ఫూర్తిని ఇచ్చునో, ఆ తత్త్వమే శ్రీరామ చంద్రరూపములో అభివ్యక్తమయ్యెను.

సమష్టి, వ్యష్టి, స్థూల, సూక్ష్మ, కారణ, సమస్తప్రపంచమయ క్షేత్రమునకు కూటస్థుడు, నిర్వికారుడు, భాసకుడైనవాడే శ్రీరామ చంద్రుడు.

ఎవరి అనుగ్రహము వలన, ఎవరియందు సర్వప్రాణులు రమించుచుందురో, ఎవరు సర్వాంతరాత్మ రూపముతో సర్వప్రాణుల యందు రమించునో, అతడే మర్యాదాపురుషోత్తముడైన రామ చంద్రుడు. ఏ ఆనందసింధు సుఖరాశితుషారముచేత అనంత బ్రహ్మండములు ఆనందించునో, అతడే జీవులకు జీవనము, ప్రాణులకు ప్రాణము, ఆనందమునకు గూడా ఆనందమును అయిన శ్రీరామచంద్రభగవానుడు.

మర్యాదాపురుషోత్తమః ప్రీయతామ్ ।



# 13. శ్రీ కృష్ణజన్మ

సుధాతరంగిణి

'శ్రీ గోపాలచంపూ' కావ్యమునందు శ్రీకృష్ణజన్మ యొక్క అత్యంత సుందర వర్ణనము లభించును. శ్రీకృష్ణచంద్ర పరమానందకందము యొక్క బాల్యసుఖమును అనుభవించిన శ్రీమన్నంద రాయుడు ఎవరు? అతడు 'గోప' శబ్దముచే గూడా వ్యవహరింపబడెడివాడు.

"సచ్ఛూద్రౌ గోప నాపితౌ।"

ఇత్యాది వచనములను ఆధారముగా గొని, కొందఱు అతనిని శూద్రుడని భావించవచ్చును. సాధారణముగా భగవంతుడు ఏ కులమున, ఆవిర్భవించునో, ఆ కులమేదియైనను,అది ధన్యమైనది. కాని, 'శ్రీగోపాలచంపూ' రచయిత ఆయనను క్షత్రియుని వలన వైశ్యకన్యయందు జన్మించినవాడు గాన, వైశ్యుడని భావించెను. వృష్ణివంశమునకు భూషణస్వరూపమైన దేవమీఢ్మధురాపురియందు ఆయన, నివసించుచుండెడివాడు. ఆయనకు ఇరువురు భార్యలు కలరు. ఒకరు వైశ్యకన్య, రెండవయామె క్షత్రియకన్య. క్షత్రియ కన్య వలన శూరసేనుడు జన్మించెను. వసుదేవాదులు ఆ శూర సేనుని వలన జన్మించిరి. వైశ్యకన్యవలన పర్జన్యుడు జన్మించెను. అనులోమ సంకర వర్ణము గలవారి వర్ణము (కులము) మాతృకులమే అగును. ఈ కారణముచేతనే పర్జన్యుడు వైశ్యధర్మమునే స్వీకరించెను. అతడు గోపాలనమందే విశేషించి,ప్రవృత్తుడయ్యెను. గోపాలనము వైశ్యజాతియొక్క ప్రధాన వృత్తి. కావుననే వారు 'గోపు'లనియు చెప్పబడిరి.

"వృష్ణివంశావతంసః శ్రీదేవమీఢనామా పరమ గుణధామా

మధురా మధ్యాస్యామాస। తస్య భార్యాద్వయ మాసీత్। ప్రథమా ద్వితీయవర్ణా ద్వితీయా తృతీయవర్ణా। తయోశ్చ క్రమేణ శూరః, పర్జన్య ఇతి పుత్రద్వయం బభూవ। శూరస్యవసుదేవా దయః సముదయన్తిస్మ। శ్రీమాన్ పర్జన్యస్తు 'మాతృవర్ణ వద్వర్ణ సంకరః' ఇతి న్యాయేన వైశ్యతామేవ ఆవిశ్య గవామేవైశ్యం వశ్యంచకార।"

పర్జన్యుడు, గొప్పధర్మాత్ముడు, బ్రహ్మ, హరిపూజన పరాయణుడు. పర్జన్యుని మాతృవంశమైన వైశ్యవంశము సర్వత్ర వ్యాపించి, ప్రశంసనీయముగా ఉండెను. వారిలో గూడా వైశ్య విశేషము ఆభీరవంశము. వైశ్యపుత్రికయందు బ్రాహ్మణునివలన జన్మించిన పుత్రుడు 'అంబష్ఠుడు' అగును. అంబష్ఠ కన్యయందు బ్రాహ్మణుని వలన జన్మించినవాడు 'ఆభీరుడు' అగును. ఈ ఆభీరుడు వైశ్యుడే అగును. ఇదేవిధమైన వైశ్యజాతికన్యయందు దేవమీఢ క్షత్రియుని వలన జన్మించిన పర్జన్యుడు వైశ్యుడు. ఇతడే, గోపవంశరూపముతో కృష్ణలీలలయందు ప్రఖ్యాతుడైనవాడు. కావుననే వీనికంటె శూద్రగోపుడు భిన్నుడు. ఈ వైశ్యులే గోపాలన కర్మచేత 'గోపు'లని చెప్పబడిరి. బ్రహ్మగూడా ఆభీర అపర పర్యాయమైన గోపకన్యను పత్నిగా స్వీకరించి ఆమెతో గూడా యజ్ఞముచేసెను. కావుననే భాగవతమందు గూడా నందమహారాజు గర్గునితో ఈ యిరువురి పుత్రులకు "కురు ద్విజాతిసంస్కారమ్" ద్విజాతిసంస్కారము చేయుమని చెప్పెను. కృష్ణుడు గూడా

"కృషి గోరక్ష వాణిజ్యం కుసీదం తుర్య ముచ్యతే।
వార్తా చతుర్విధా తత్ర వయం గోవృత్తయోఽనిశమ్॥"

ఇత్యాది వచనములచేత తనను గోవృత్తవైశ్యుడని చెప్పికొనెను.

పర్జన్యునకు ఉపనందుడు, అభినందుడు, నందుడు, సన్నద్, నందనుడు అను అయిదుగురు పుత్రులు కలిగిరి. వారిలో గూడా

శ్రమన్నారాయణుడు అందఱికిని ప్రేమాస్పదుడు. సుముఖుడను పేరు గల ఒకానొక ప్రముఖ గోపుడు పరమ ధన్యులు, వినువార లకు, చూచువారలకు, భక్తిగలవారలకు యశస్సు నొసగునట్టి 'యశోద' అను పేరు గల తన కన్య నొసగెను. పర్జన్యుడు మధ్యమ పుత్రుడైన నందునకే సర్వసమ్మతితో రాజ్యము నొసగెను.మిగిలిన సోదరులందఱు మంత్రి మున్నగు అధికారపదములందు ఉండి ఆ యా కార్యములు చేయుచుండెడివారు. అయిదుగురు సోదరులకు సంతానము లేదు. పుత్రేష్టి యజ్ఞాదులు చేయబడినవి. అనేక విధములుగా భగవదారాధనము జరుగుచుండెను.

ఒకనాడు, నందరాయుడు, నందరాణిఅయిన యశోదతో ఇట్లనెను– 'హే మానిని ! ఒడిలో పాలుకారుచున్న నీ పయోధర ములపై క్రీడించువాడు, శ్యామవర్ణము గల చంచల, చారు, దీర్ఘ నేత్రములు గలవాడును అయిన బాలకుని, నేను స్పష్టముగా చూచు చున్నాను. ఇది స్వప్నమా, లేక జాగరమా? హే సహధర్మచారిణి ! సరిగా చెప్పుము. నీకు గూడా ఇట్లే అనిపించుచున్నదా ?

"శ్యామ శ్చంచలచారుదీర్ఘనయనో బాల స్తవాంకస్థతే ।
దుగ్ధోద్గారి పయోధరే స్ఫుట మసౌ క్రీడన్
మయాఽఽలోక్యతే ॥"

నందరాణి అయిన యశోద ఇట్లనెను– 'దేవ ! నా మనస్సు నందు గూడా ఇటువంటి భావమే కలుగుచున్నది.' దీనితరువాత, ఇరువురును, తమ మనోరథము సఫల మగుటకై ద్వాదశీవ్రత మును ఆరంభించిరి. ఒక సంవత్సరకాలము గడచునప్పటికి, ఒకే సమయమున, ఇరువురిముందు, దేవదేవుడు అభివ్యక్తుడయ్యెను. అపుడు ఆ దేవదేవుడు ఇట్లనెను– 'అయ్యో ! మీరు వ్రతానుష్ఠానము చేత ఏల ఖేదము నొందుచున్నారు?అతసీ పుష్ప సంకాశుడు, సుషమా సంపన్నుడును అయిన సుకుమారుడు మీ ఇరువురికి అనుభవ

గమ్యుడగును. అతడు మీసంకల్పమునకు ఫలరూపుడే.' ఈవిధముగా పలికి, దేవదేవుడు అంతర్హితుడయ్యెను.

యథాసమయమున, దివ్యకాలమందు జాతి పుష్పములతో పాటు, మాధవీ పుష్పములు, కేతకీపుష్పములతోపాటు కేతకములు అంబుజములతోపాటు కుముదములు వికసించినపుడు, దశదిశలు ప్రసన్నములుగా ఉన్నసమయముననే సర్వాశ్చర్యనిధియైన శ్రీకృష్ణుడు జన్మించెను.

లలితమైన స్మితముతో నీల కమలములకు చక్రవర్తివలె బాలకుని ముఖము ఉండెను. వస్తుతః, ఆ స్వరూపము, అనంతకోటి బ్రహ్మండ నాయకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడును అయిన భగవంతునినే, ఆశ్చర్యసాగరమునందు, లేక విస్మయమందు నిమగ్నము చేయునంత విచిత్రమైనది. ఇక ఇతరుల విషయము చెప్పనేల ?

"యన్మర్త్యలీలౌపయికం స్వయోగమాయాబలం దర్శయతా గృహీతమ్ ।
విస్మాపనం స్వస్య చ సౌభగర్ధేః పరం పదం భూషణ భూషణాంగమ్ ॥"

మణిమయ ప్రాంగణమునందు భూషణములను సైతము, విభూషితమొనర్చునట్టి అవయవముల ప్రతిబింబమును చూచి కృష్ణుడు, స్వయముగా ముగ్ధుడై, ఆ ప్రతిబింబమును గ్రహించవలయునని ఉత్సుకుడగుచుండెడివాడు-

"రత్నస్థలే జానుచరః కుమారః సంక్రాన్త మాత్మీయ ముఖారవిందమ్ ।
ఆదాతుకామ స్తదలాభఖేదాత్ విలోక్య ధాత్రీవదనం రురోద।"

భగవంతుని సంబంధము కేవలము ప్రేమ (భక్తి) నిబంధనమే అని కొందఱు భావుకుల కథనము. కావుననే-

"భక్త్యాఽహ మేకయా గ్రాహ్యః ।"

అని భగవద్వచనము. భగవంతుడు కేవల భక్తిమాత్రముచేతనే గ్రాహ్యుడు (లభ్యుడు) అగును. ఎవరు ఎటువంటి భావముతో భగవంతుని సేవింతురో వారికి భగవంతుడు గూడా అట్లే లభించును. కావున, నందమహారాజు, నందరాణి యశోదల భావమును అనుసరించియే ప్రభువు, వాత్సల్య ప్రేమానుకూలముగా వారి పుత్రత్వమును పొందెను. శ్రీవసుదేవునకుగూడా వాత్సల్యరసము లభించెను. కాని, సూతికాగృహముననే భగవంతుని ఐశ్వర్య (ఈశ్వరత్వ) పూర్ణమైన రూపమును దర్శించుటవలన, ఆయనయందు వాత్సల్యరస తారళ్యము, అంత ఉండలేదు. కాని, శ్రీమన్నందరాయుని యందు సర్వదా సముద్బుద్ధము గావుననే సర్వదా శుద్ధ వాత్సల్యరసము ఉండె దేవకీవసుదేవులు, మనస్సుతోనే భగవంతుని, పుత్రుడుగా ధరించిరి. ఈ విషయము అగ్రిమవచనములవలన విదితమగును.

"ఆవివేశాంశభాగేన మన ఆనకదుందుభేః ॥"

అనగా భగవంతుడు, అంశభాగముతో ఆనకదుందుభి (వసుదేవుని) మనస్సులో ప్రవేశించెను అని భావము.

"దధార సర్వాత్మక మాత్మభూతం కాష్ఠా
యథాఽఽనందకరం మనస్తః ।"

అనగా, ప్రాచీదిశ, ఆనందకరుడైన చంద్రమసుని ధరించురీతిగానే దేవకీదేవి, మనస్సుచేతనే సర్వాంతరాత్మ అయిన కృష్ణుని ధరించెను అని భావము. దేవకీ, వసుదేవులు మనస్సుతోనే కృష్ణుని ధరించినట్లే వ్రజమహారాజు (నందుడు), వ్రజరాణి (యశోద) గూడా పుత్రుడుగా కృష్ణుని ధరించిరి. కావుననే, మాఘ శుక్ల పాడ్యమినాడు సర్వసుఖసంపన్నమైన రజనియందు వ్రజరాజసేవ చేయుచున్న

యశోద, తంద్రలో (నిదురమత్తులో) స్వప్నమువంటి చమత్కార మును చూచెననియు, పూర్వము చూచిన కుమారుడే సర్వావరక యైన ఒక దివ్యకుమారిచేత తనను అవృతము చేసికొని, వ్రజరాజ హృదయమునుండి బయల్వెడలి, ఆమె హృదయమున ప్రవేశించె ననియు, చెప్పబడును. బాలకుడు, హృదయమందు విరాజిల్లు చుండగా ఉదరమునందు (గర్భమందు) ఒక బాలిక విరాజిల్లు చుండెను. అప్పటినుండియే నందరాణియందు గర్భలక్షణములు కనిపించసాగెను. వ్రజరాణియందు ప్రస్ఫురిత మగుటచేతనే స్ఫటికఘటియందు గల దీపము బాహ్యాభ్యంతరములను అంతట, ప్రకాశింపజేసినట్లుగానే లోకమున, శ్రీకృష్ణుడు బాహ్యాభ్యంతరముల యందు ప్రస్ఫురించెను-

> వ్రజరాజ్ఞాం స్ఫురితాత్మా కృష్ణః స్ఫురతి స్మ లోకేఽపి ।
> దీపః స్ఫటికఘటీభాగ స్తద్బహిరపి విభాతి తత్తుల్యః ॥"

నందరాణి రసనారసమును (జిహ్వా చాపల్యమును) జయించు నట్టి ధైర్యశాలిని, గాంభీర్యాది గుణములందు అత్యంత ప్రవీణు రాలు. అయినను, కృష్ణావేశము వలన, తులసీ సంస్కృతమైన ఘృతమందు, సితాయుక్త స్వచ్ఛ పరమాన్నరూపమైన దోహద మందు ఆమెకు అభిలాష కలుగసాగెను.

అచట, యోగమాయ, దేవకియొక్క సాప్తమాసికమైన(ఏడు నెలలు గల) గర్భమును ఆకర్షించి, రోహిణీగర్భమందు ఉంచెను. అంత, రోహిణి, శ్రావణమాసమందు శ్రవణానక్షత్రమున, గౌర వర్ణము కల అందమైన కుమారుని ప్రసవించెను. పూర్ణిమ, పూర్ణ చంద్రుని వ్యక్తముచేసినట్లుగా, సింహవధువు విక్రమశాలియైన శాబకమును ప్రసవించినట్లుగా రోహిణి. బలరామునికి జన్మ నొసంగెను.ఆ బాలకుని శరీరకాంతి,సూర్యకాంతిని లజ్జితము చేయు చుండెను, ముఖసుషమ, చంద్రుని లజ్జితుని చేయునట్టిదిగా

ఉండెను. మహాప్రభావశాలియైన ఆ కుమారుడు, అన్యసమయము లందు అత్యంత జడునివలె కన్పడెడివాడు. కాని, కృష్ణుని, గర్భమున ధరించునట్టి నందరాణి, వానిని (బలరాముని), తన ఒడిలోనికి తీసికొనినపుడు, ఆ బాలకునికి విశ్రాంతి, ప్రసన్నత కలుగుచుండెడిది.

తదనంతరము, శుభసమయమున, కృష్ణుడు ప్రాదుర్భవించెను. లలితస్మితము, నీలకమలమువంటి ముఖము, సూక్ష్మ భ్రమరచిత్రిత కైరవ (కలువ) కోశసదృశములైన నేత్రములు, మధుర, శ్యామల తిలప్రసూనసమానమైన నాసిక, సిందూరగిరి సముద్భూత జపాకుసుమసదృశము, బింబఫలసమానము నయిన ఓష్ఠము, అధరము, అంజనభూమియందు ఉత్పన్నమైన శ్యామ లతాపత్రసదృశములైన కర్ణములు, నవపల్లవయుక్త నవ తమాల శాఖాసదృశములైన రెండు హస్తములు, మృణాళతంతు సదృశ మైన దక్షిణావర్తరోమరాజిలాంఛిత దక్షిణవక్షఃస్థలము, సువర్ణవర్ణ వామావర్తరోమరాజిచేత లాంఛితమైన వామవక్షఃస్థలము, విద్యుదాశ్లిష్టశ్యామల మేఘఖండమువలె సుశోభితమై ఉండెను. ఆ బాల కృష్ణుడు, తన ముఖముచేత మహాపద్మమును, నాసికచేత మకరమును, స్మితముచేత కుందపుష్పమును, కంఠముచేత శంఖమును, చరణపృష్ఠములచేత కచ్ఛపమును, దీప్తిచేత ఇంద్రనీలమును జయించునట్లు ఉండెను.

ఈ భగవదావిర్భావము స్నేహమయమైన స్ఫూర్తిపరంపర యొక్క వశీకరణముచేతనే జరుగును, మఱొకరీతిగా జరుగదు. పుత్రుడుగా ఆవిర్భవించుటయందు, పితృభావమయమైన స్నేహమే (ప్రేమయే) బీజము. ఎచట అయినను, పుత్రభావముతో భగవంతుడు ఆవిర్భవించినచోట, తత్సంబంధమయమైన స్నేహ స్ఫూర్తియే ముఖ్య కారణము. ప్రజరాజాదులందు శుద్ధ సముద్భూత వాత్సల్యభావము ఉండెను. దేవకీవసుదేవులహృదయమందు

వాత్సల్యభావము ఉండెను. దేవకీవసుదేవుల హృదయమందు ఆ భగవంతుడే చతుర్భుజుడుగా ఉండెను. కావుననే బాహ్యముగా గూడా అట్లే అభివ్యక్తమయ్యెను. వ్రజరాజ, వ్రజరాణుల హృదయమందు ద్విభుజస్వరూపమే ఉండెను. కావుననే బాహ్యముగా గూడా వారికి ద్విభుజస్వరూపమే లభించెను. కంసుని భయము వలన, దేవకికి ఆవిర్భూతమైన చతుర్భుజరూపమును ఆచ్ఛాదితము చేసి, ద్విభుజరూపమును చూడవలయునను కోరిక జనించినపుడు, యశోదాగృహమున, ప్రకటమైన ద్విభుజస్వరూపమే అచట ప్రకటమై చతుర్భుజస్వరూపమును తనలో లీనము చేసికొని, ఆవిర్భవించెను.

సాకార రూపము మాతృగర్భమున ఉండియు, నిరాకారతయా, యోగమాయ, ఊర్ధ్వగతితో ద్విభుజుడైన కృష్ణుని, దేవకీ సన్నిధికి తీసికొనివచ్చెను. గంధవాహుడు (వాయువు) నీలకమల దళమును తెచ్చినట్లుగా అందఱికి దృష్టిగోచరము కాక, తల్లిని గూడా మోహితురాలిని జేసి, కొనివచ్చెను. గర్భస్థమైన ఆకృతితో జననికి ప్రసూతిభ్రమను కల్పించియే తనను తాను ప్రకటము చేసికొని, శయ్యపైన ఉండెను. ఆ యోగమాయయే సంకర్షణుని తొలగించి రోహిణియందు ప్రవేశపెట్టెను.

"అథాహ మంశభాగేన"

అను వచనమునకు, ఆకారభేదమైన చతుర్భుజస్వరూపముతోబాటు ద్విభుజుడైన కృష్ణుని అవతారము కూడా జరుగును, తదాకారభేదమైన ద్విభుజాకారము,నందనందనునియందు లభించునని భావము. అనంతరము, వసుదేవుడు, యోగమాయాప్రభావముచేత, అందఱును, గాఢసుషుప్తిలో ఉన్నపుడు, ఆ బాలకుని. గైకొని, నందుని గృహమునకు జేరెను, నందరాణిశయ్యపైన ఆ బాలకుని, పరుండబెట్టి, అచటినుండి కన్యను బుజముపైన ఎత్తుకొని, వచ్చెను.

ఈశ్వరతా ప్రత్యాయకమైన చతుర్భుజరూపముతోను, ఉపదేశము తోను భగవంతుడు వసుదేవుని గృహమున ఉత్పన్నమగుట వ్యక్తము చేసెను. కాని, పుత్రత్వసందేహమును కలిగించెను. కావుననే వసుదేవునికి అనేక పర్యాయములు శ్రీకృష్ణుని పుత్రత్వమందు సందేహము కలుగుచుండెడిది. యశోదా,నందుల గృహమున ద్విభుజరూపముతో వచనాదిశక్తిని వ్యక్తముచేయుటవలన నిస్సందిగ్ధమైన పుత్రత్వమును వ్యక్తము చేసెను. ఆనకదుందుభికి (వసుదేవునికి) ఈ విషయములు ఏమియు తెలియుటలేదు. అయినను, నందుని కన్యను తీసికొనిపోయి, అతనిని (శ్రీకృష్ణుని) పోగొట్టుకొనెను. వానికి బదులుగా ఏమియు, తిరిగి ఇవ్వలేదు. ఇటువంటి స్థితిలో ఆయన,వదలివేసిన కృష్ణునియందు ఆత్మీయతను ఎట్లు భావించగలుగును? ఆగమాదులందు గూడా-

"తస్మాత్ నందాత్మజోఽయం తే।"

ఇత్యాది వచనములందు నందనందన, నందాత్మజాది శబ్దములు వచ్చును.

అనంతరము, మాయ ఉపరతమైనపుడు నందరాణి మేల్కొని ప్రత్యక్షముగా నీలోత్పలదళశ్యాముడైన పుత్రుని చూచెను-

"దదృశే చ ప్రబుద్ధా సా యశోదా జాత మాత్మజమ్।
నీలోత్పలదళశ్యామం తతోఽత్యర్థం ముదం యయా॥"

బాలకుని శరీరము దివ్యాతిదివ్యమైన ఇంద్రనీలమణిసమానము ముఖము, చంద్రుని జయించునట్టి పరమ మనోహరము. నేత్రములు లోకాతీత కమలదళ సదృశములు. హస్తములు కల్పవృక్షముయొక్క నూతన పల్లవదళసదృశములు. హస్తపాదాదులను కొద్దిగా కదల్చుచు అతడు తన మృదు మధుర క్రందనముచేత విశ్వమును మోహింపజేయుచుండెడివాడు. ఇతడు శ్యామల ప్రకాశ

పుంజ సామ్రాజ్యమా, లేక రూపరత్నాకరనిధియా, లావణ్యభాగుల భాగ్యమా, అథవా, ఆ యా అవయవముల సమూహముల వికసిత సిద్ధాంతమా ! అని నందరాణిఅయిన యశోద, ఆలోచించుచుండెను. ఇంతలో 'ఓమోమ్' అని రోదనవ్యాజముతో బాలకుడు ఆమె వికల్ప పరంపరను స్వీకరించెను. జన్మించిన పుత్రుని చూచి, నందరాణి తన చెలికత్తెలను గూడా పిలువజాలకపోయెను అనిన, తాను కదలుట అన్నమాట దూరమైన విషయము. ప్రేమాశ్రువులతో నేత్రములు ఆర్ద్రములైనవి, కంఠము గద్గదమయ్యెను, శరీరము నిశ్చేష్టమయ్యెను, పిల్లవానిని బుజ్జగించవలయునన్న లాలసతో ఆత్మ, వ్యగ్రమయ్యెను. మాయ తొలగిపోయినపుడు, జనమునకు మోహము పోయెను.పురుషోత్తముని ఆవిర్భావమందు నరనారుల మనస్సులు గూడా చంద్రోదయమైనంతనే వ్యవహితములైన కుముదినులు (కలువలు) గూడా పుష్పములు వికసించురీతిగా వికసితములయ్యెను. ఆ బాలుడు కేవలము నందరాణి శయ్యపైననే గాక, స్నిగ్ధహృదయము గల స్త్రీల స్వచ్ఛమైన చిత్తములందు గూడా ప్రతిబింబము వలె ప్రస్ఫురించెను. కావున, స్వచ్ఛ హృదయము గల ఆ స్త్రీలు, వెంటనే రోహిణి మున్నగువారితో గూడావచ్చి ఉదయించుచున్న చంద్రుని, చకోరీగణము చూచునట్లు బాలకుడైన కృష్ణుని చూడసాగిరి. యశోద, ప్రేమతో స్తబ్ధురాలైనను, స్మేర (చిరునవ్వు)నేత్రములతో పిల్లవానిని చూచుచుండెను. వ్రజపుర పురంధ్రీగణము (స్త్రీసమూహము) ఇట్లు ఊహ చేయ సాగెను– ఈ నూతన ఇందీవరము మహేంద్ర నీలమణియా, లేక వైడూర్యమణియా ! అహో ! ఈ బాలస్వరూపము, మృగమద సౌరభముతో (కస్తూరి గుబాళింపుతో), తమాలదళముతో (తమల పాకుతో) సృజించబడినది. అద్భుత లావణ్యముచే అభ్యక్తమై (సంయుక్తమై) ఉన్నది. స్వీయ శరీరతేజస్సుచేత ఉద్వర్తితమై

(నేలుగుపెట్టబడి) ఉన్నది. స్వముఖనిర్గతమైన కాంతిసుధచేత స్నాతమై ఉన్నది. ఆ శరీరము సౌందర్యానులిప్తము, త్రైలోక్య లక్ష్మీసమలంకృతము. చూర్ణీభూతమైన తమస్సువలె ఆబాలకృష్ణుని కేశములు ఉన్నవి. వాని ముఖము చంద్రబింబసదృశమై ఉన్నది. అందఱి మనస్సులను ఆకర్షించుటకొఱకే అతడు పిడికిలి బిగించి ఉన్నాడా అన్నట్లు, అనిపించుచున్నది. యమునా తరంగములవలె చరణకమలములను కదల్చుచున్న ఆ బాలకుని జూచి, స్త్రీలందఱును అత్యంతము ప్రసన్నలై ఇట్లు అనుకొనసాగిరి— "అహో! వీనిని శిరస్సుపైన ఉంచుకొందము, నేత్రములందు ఉంచుకొందము, లేక, హృదయమధ్యభాగమున, ధరింతము." మాటిమాటికి ఆ బాలకుని చూచియు, వారు సంతృప్తలు అగుటలేదు. తరువాత, ధైర్యముతో ఏదోఒక విధముగా ఆ స్త్రీలు స్నానాదికృత్యములను నిర్వర్తించిరి. నందాది గోపులకు కృష్ణజన్మసమాచారము తెలిసినపుడు, పరమానందముతో అందఱును పారవశ్యమును పొందిరి. మన భారతదేశమునకు అట్టి శుభదినమును చూచు సౌభాగ్యము మఱల ఎపుడు కలుగునో!

శ్రీనన్దనన్దనః ప్రీయతామ్ ।



# 14. వేదాన్తరససారము

సుధాతరంగిణి

"జయతి రఘువంశతిలకః కౌశల్యాహృదయానన్దనో రామః ।
దశవదన నిధనకారీ దాశరథిః పుండరీకాక్షః ॥"

ప్రాణులకు ధర్మ, అర్థ, కామ, మోక్షరూపములైన చతుర్విధ పురుషార్థములను అవికలముగా లభింపజేయునట్టి అతి సుందరమైన మార్గమును వేదములు ప్రదర్శించినవన్న విషయము వేద శాస్త్రార్థ పరిశీలనముచేత సుసంస్కృతచిత్తులైన మహానుభావులకు తెలియని విషయము కాదు. విశేషతః ధర్మ, బ్రహ్మజ్ఞానవిషయమున, వేదమే ప్రమాణభూతము. కావుననే,

"చోదనాలక్షణోఽర్థో ధర్మః"

అని జైమినిసూత్రము ధర్మనిర్వచనము చేసినది. ప్రవర్తకములు, నివర్తకములు నయిన వైదిక వాక్యములచే లక్షితము, అనర్థశ్యేనాదులచే వ్యావర్తితము నయిన అగ్నిహోత్ర, దర్శ, పౌర్ణమాస్యాది అర్థమే 'ధర్మ' మని భావము.

"యః శాస్త్రవిధి ముత్సృజ్య"

"తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే ।"

"తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి ।"

"వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః ।"

ఇత్యాది ఆర్షవచనముల వలన, ధర్మము వేదాది శాస్త్రైకసమధిగమ్యమని అంగీకరించిరి.

వేదములు అనాద్యవిచ్ఛిన్నసంప్రదాయపరంపరతో ప్రాప్తములైనవి. ఏ పురుషుడును, స్వతంత్రముగా ఆ వేదములను రచించ

లేదు. పరమాత్మ సైతము, పూర్వకల్పమందలి వేదానుపూర్వీ సాపేక్షముగానే ఉత్తర కల్పీయమైన అనుపూర్విని రచించును.

కావున, ప్రమాణాంతరముచేత అర్థోపలబ్ధిపురఃసరముగా నిర్మాతృత్వరూప కర్తృత్వము ఆ పరమాత్మయందు గూడా లేదు. కావున, అపౌరుషేయ వేదములు పురుషదోష శంకాకళంకము చేత అసంస్పృష్టము లగుటవలన, ఆ వేదములకు సర్వాపేక్షా రహితమైన ప్రామాణ్యము కలదు.

కావుననే పరమేశ్వరనిర్మితత్వము వేదముల ప్రామాణ్యమునకు ప్రయోజకము కాదు. కాని, పరమేశ్వర స్వరూపాదిసిద్ధియే వేదాధీనము. అట్లు కానిచో, వైదికులు, ఏ యే యుక్తులతో వేదకర్త పరమేశ్వరుడని గాని, తదవతారమనిగాని భావించి, తన్నిమిత్తత్వేన వేదముల ప్రామాణ్యమును వ్యవస్థాపనము చేయుదురో, ఆ యుక్తులతోనే భిన్న భిన్న మతావలంబులు గూడా తమ మత గ్రంథ రచయితను పరమేశ్వరుడని ప్రమాణీకరించి, తన్నిర్మితములైన తమ మత గ్రంథముల ప్రామాణ్యమును వ్యవస్థాపింతురు.

ఈ సమస్త విషయములను చెప్పుటయందలి ఆశయమేమనిన, ధర్మ, బ్రహ్మ స్వరూప నిర్ణయమందు వేదములకు నిరపేక్షమైన ప్రామాణ్యము కలదనియే. కల్పసూత్రముల, స్మృత్యాదుల, అన్యాన్య ఆర్ష గ్రంథముల ప్రామాణ్యము వేదసాపేక్షమే అయి ఉన్నది. కావుననే వేదములతో ఏ వచనములకు విరోధము ఉండునో, వాని ప్రామాణ్యము ఎన్నడును అంగీకరించబడదు. ఆ వచనములు ఏ ఆర్ష గ్రంథములోనివైనను, వేదవిరోధము వానియందు ఉండుట వలన అవి, ప్రమాణములుగా స్వీకరించబడవు.

వేదములందు అవాంతర భేదములు అనేకములున్నను, ప్రధానముగా మంత్రములు, బ్రాహ్మణములని రెండు భాగములు కలవు. వానికి శాఖాభేదములు ఉన్నను, విషయము మాత్రము

తఱచుగా సమానముగానే ఉండును. ప్రాయికముగా మంత్ర, బ్రాహ్మణములు, కల్పసూత్రములు ఒకదానివెంట మఱొకటి ఉండును. వాని అన్నిటికి మహాతాత్పర్యము సర్వప్రాణి పరమ ప్రేమాస్పదుడు, పరిపూర్ణుడు, పరమానందఘనుడు నయిన భగవంతునియందే కలదు.

"సర్వే వేదా యత్పద మామనన్తి"

అను శ్రుతివచనము వలన, ఈ విషయము అవగతమగును. అయినను, అదృశ్య, అగ్రాహ్య, అచిన్త్య, అవ్యపదేశ్య, పరమసూక్ష్మ భగవత్తత్త్వోపలబ్ధి, భగవంతునియందు స్థితి, బహిర్ముఖులైన ప్రాణులకు కష్టమే కాక, అసంభవము కూడ. కావున, యోగ్యతను సంపాదించుకొనుటకై అనేకవిధములైన కర్మోపాసనములు అత్యంత ఆవశ్యకములు. కావున, వేదములకు అవాంతర తాత్పర్యము వానియందు (కర్మోపాసనములందు) గూడా కలదు.

వేదముల మహాతాత్పర్యవిషయభూతుడు, పరమానందఘనుడు నయిన భగవంతునియందే సకల ప్రపంచోత్పత్తి, స్థితి, ప్రళయములు, సకల ప్రపంచప్రతీతి కలుగుచున్నవి. కావున, తరంగములోపల, బయట, మధ్యభాగమున జలమే నిండి ఉండును. ఆరీతిగానే భోక్తృ, భోగ్యరూపమైన సకల ప్రపంచముయొక్క బాహ్యాభ్యంతరములందు, మధ్యభాగమున, పరమానంద రసాత్మకుడయిన భగవంతుడే నిండియున్నాడు. అధికముగా చెప్పనేల, ఏకము, ఆనందసుధాసింధువు నయిన భగవంతుడే, అఘటితఘటనా పటీయసియైన స్వీయ మాయాశక్తి ప్రభావము చేత నానా దృశ్య రూపములలో ప్రతీతుడగును.

"ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే।"

"ఆనంద మభిప్రయన్త్యభిసంవిశన్తి।"

"ఆనన్దం బ్రహ్మేతి వ్యజానాత్ ।"

"ఏకోఽహం బహుస్యామ్ ।"

ఇత్యాది శ్రుతివచనములు ఇందుకు ప్రమాణభూతములు.

ఆనందస్వరూపమునుండి దుఃఖాత్మకమైన ప్రపంచము ఉద్భూతమగురీతిగానే చైతన్యమునుండి జడప్రపంచము ప్రాదుర్భవించుచున్నది. ఈ విషయమును అభిన్న నిమిత్తోపాదాన కారణవాదులు అంగీకరించవలసియుండును. ఆవిధముగానే త్రికాలాబాధ్య పరమార్థసత్యమయిన భగవంతునినుండి అనృతాత్మకమైన ప్రపంచము ఆవిర్భవించుననియు అంగీకరించవలసియుండును. ప్రపంచము ఆనందమునుండి ఉత్పన్నమగుచున్నది, ఆనందమందు విలీనమగుచున్నదన్న విషయము పైన పేర్కొనబడిన శ్రుతులవలన స్పష్టమగుచున్నది. సముద్రమునుండి ఉత్పన్నము, విలీనమునగు తరంగము సముద్రమే అగురీతిగా ఆనందమునుండి ఉత్పన్నము, ఆ ఆనందమందే విలీనమును అగు ప్రపంచము కూడా ఆనందాత్మకమే కావలయును. సర్వప్రకాశకుడయిన చైతన్యఘనునుండి ఉత్పన్నమగునట్టి ప్రపంచము చేతనాత్మకమే కావలయును. కాని, ప్రపంచమందు దుఃఖరూపత్వము, జడత్వము సర్వానుభవసిద్ధము, సర్వమాన్యము. కావున, కారణగతమైన అనిర్వచనీయశక్తి వలన, కార్యమందు అనిర్వచనీయ వైలక్షణ్యము కలుగును. కావుననే జలముకంటె భిన్నమైన హిమము, తంతువుకంటె భిన్నమైన పటము పృథక్ పదార్థములు కాకపోయినను, జలముకంటె, తంతువుకంటె, వానియందు (హిమము, వస్త్రములందు) విలక్షణత్వము అవశ్యము కలదని స్పష్టముగా జూతుము. కావుననే ఆనందస్వరూపుడు, స్వప్రకాశ చైతన్యస్వరూపుడు నయిన పరమాత్మకంటె భిన్నమైన జడ, దుఃఖరూప సంసారము ఉత్పన్నమగును.

దుఃఖ, జడరూపమైన ప్రపంచము సత్యమా, మిథ్యయా ? అనెడి విషయమును ఇపుడు చూడవలసి ఉన్నది. పూర్వోక్త న్యాయముతో విచారించినచో కార్య, కారణములందు అనిర్వచనీయమైన విలక్షణత్వము కలదని స్పష్టముగా విదితమగును. కావున, ఆనందాత్మక, చైతన్యాత్మక బ్రహ్మనుండి జడము, దుఃఖాత్మకము నయిన ప్రపంచము ఉత్పన్నమగుట సమ్మతమైన రీతిగానే పరమార్థ సత్యస్వరూపుడైన పరమాత్మనుండి మిథ్యా ప్రపంచము యొక్క ఆవిర్భావమును అంగీకరించుట యుక్తము. ఈ వివేచనల వలన, పరమానందస్వరూపుడు, స్వప్రకాశుడు, పరమార్థసత్య స్వరూపుడు నయిన భగవంతునినుండి దుఃఖాత్మకము, జడాత్మకము, మిథ్యాభూతము, అనగా అపారమార్థికము, వ్యవహారోపయోగియు నయిన వ్యావహారిక ప్రపంచము ప్రాదుర్భవించునని స్పష్టమైనది.

అగ్నియందలి దాహకత్వశక్తి, అగ్నికంటె విలక్షణమై ఉండురీతిగానే త్రికాలాబాధ్యము, సద్రూపము నయిన బ్రహ్మ సంబంధిని అయిన ప్రపంచోత్పాదినీశక్తి గూడా ఆ బ్రహ్మకంటె విలక్షణమై ఉండును. కావున, త్రికాలాబాధ్యరూపమైన 'సత్'కంటె విలక్షణమైన తచ్ఛక్తి, శుద్ధ సద్రూపాధిష్ఠాన జ్ఞానము వలన బాధితమగును. దానితోపాటే ఎన్నడును, ఏవిధముగాను, ప్రతీతము కాని అత్యంత అసద్రూప గగన కుసుమాదులకంటె గూడా 'సత్' శక్తి విలక్షణమైనది. ఏలయన, ఆ సచ్ఛక్తియే సకల ప్రపంచజనని. ఈవిధముగా ఏ శక్తివలన, పరమాత్మ, తనను తాను సకల ప్రపంచ రూపముగా అభివ్యక్తము చేసికొనుచున్నాడో, పరమాత్మ నిష్ఠయైన ఆ శక్తి, సదసద్విలక్షణమైనది. కావుననే ఆ శక్తి, అనిర్వచనీయ అని చెప్పుదురు.

ఈశక్తియే 'మాయా', 'ప్రకృతి', 'అవిద్యా', అజ్ఞానాది శబ్దములచే వ్యపదేశింపబడును.

"యోగమాయాసమావృతః।"

ఇత్యాది వచనముల వలన, మాయ చేత జ్ఞానానందస్వరూపమైన బ్రహ్మ, ఆవృతమై ఉండునని చెప్పబడినది. ఆరీతిగానే

"అజ్ఞానేనావృతం జ్ఞానమ్।"

అను వాక్యముచేత అజ్ఞానము జ్ఞానావరకమని చెప్పబడినది.

"మాయామేతాం తరన్తి తే।"

అను వాక్యముచేత మాయాతరణము చెప్పబడుచున్నది. ఆ రీతిగానే-

"జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః।"

అను వాక్యముచేత జ్ఞానము అజ్ఞాన నాశకమని చెప్పబడినది.

జ్ఞానాభావరూపమైన అజ్ఞానమునకు ఆవరణకర్తృత్వము పొసగనేరదు. భావాభావములు సమకాలికములు కానందున, జ్ఞానము వలన, జ్ఞానాభావరూపమైన అజ్ఞాననాశము గూడా సంగతము కాజాలదు. కావున, అజ్ఞానము సదసద్విలక్షణమైన మాయాశక్తి రూపమే అయి ఉన్నది. 'చిత్', 'అచిత్'- ఈ రెండు శబ్దములచేత చేతనము, జడము రెండును, భావరూపములుగానే గృహీతము లగును. ఆవిధముగానే జ్ఞానము, అజ్ఞానము- ఈ రెండు శబ్దముల చేతను, పరమాత్మ, తచ్ఛక్తియైన మాయ గ్రహించబడుదురు. ఆ శక్తి, సద్విలక్షణమైనట్లు చిద్విలక్షణము గూడ. కావున, 'అచిత్' జడమని భావించబడును, ఆ 'అచిత్' ద్వారముననే జడప్రపంచ రూపముగా సచ్చిదాత్మక తత్త్వముయొక్క వివర్తము కలుగును.

శక్తియొక్క స్థితి, ప్రవృత్తి, ప్రకాశములు తనకు ఆధార భూతుడైన శక్తిమంతుని వలననే కలుగును. ఆవిధముగానే 'అచిత్'కు ఆధారభూతమైన చిత్పదార్థమునకు పరతంత్రములే అయి ఉన్నవి. 'అచిత్'యొక్క ప్రవృత్తి, ప్రకాశములు 'చిత్'పదార్థము వలననే

కలుగుచున్నవన్న విషయము సుస్పష్టమే. 'అచిత్'స్వయంప్రకాశమైనచో, దానిని 'అచిత్' అనియే చెప్పము. ఈవిధముగానే అజ్ఞాన స్థితి, ప్రవృత్తి, ప్రకాశము లన్నియు జ్ఞానస్వరూపుడైన పరమాత్మ వలననే కలుగుచున్నవి. కావుననే 'నేను అజ్ఞానిని' అను విధముగా అజ్ఞానప్రకాశము నిత్య, అఖండ, జ్ఞానస్వరూపుడైన సాక్షి వలననే కలుగును.

ఇచట, జ్ఞానము ద్వివిధమని తెలియవలయును. ఒకటి, అంతఃకరణ చైతన్యప్రతిబింబోపేతమయిన వృత్తిరూపము. అది, ఉత్పన్న, నశ్వర రూపముతో లోకమందు శబ్దజ్ఞాన, స్పర్శజ్ఞానాది రూపముతో ప్రసిద్ధము. రెండవది,స్వప్రకాశ చైతన్యానందరూపము. అది, లౌకిక జ్ఞానమునకు, నిద్రా, అజ్ఞానాదులకు భాసకము,కూటస్థ రూపము,

"సత్యం జ్ఞాన మనన్తమ్", "విజ్ఞాన మానందం బ్రహ్మ ।" ఇత్యాది శ్రుతి ప్రసిద్ధము.

బ్రహ్మరూప జ్ఞానమే అచిచ్ఛక్తిరూపమైన అజ్ఞానమునకును, తత్కార్యరూపమైన సకల ప్రపంచమునకును సత్త్వ, ప్రకాశముల నొసగి, కార్యకరణసమర్థ మొనర్చును. ఈవిధముగా పరమానంద రసాత్మకుడైన భగవంతుని వలననే సత్తా, స్థితి, స్ఫూర్తులను పొంది, నీరసము, అసత్కల్పము, స్ఫూర్తిరహితము నయిన ప్రపంచము సరసముగా, సత్యముగా,స్ఫూర్తిమంతముగా ప్రతీయ మాన మగుచున్నది. కావుననే దహనసామర్థ్యశూన్యమైన అయోగోళమునకు అనిత్యము, సాతిశయము నయిన దహనసామర్థ్యము నొసగునట్టిదియు,నిత్య,నిరతిశయ దహనసామర్థ్య సంపన్నమైనదియును అయిన అగ్ని, దగ్ధమునకు సైతము దగ్ధ మని చెప్పబడును. అనేక ప్రాంతములకు అధిపతులను ప్రభువులనుగా జేయువాడు సర్వాధిపతియైన రాజరాజు అని వ్యపదేశింపబడును.

అవిధముగానే, అనిత్య వస్తువులను నిత్యపదార్థములుగాను,అసత్యములను, సత్యములుగాను చేయువాడు, వేదాంతవేద్యుడు,పరమానందరసాత్మకుడు నయిన భగవంతుడు నిత్యులకు నిత్యుడు, చేతనులను చేతనుడు సత్యములకు సత్యరూపుడని చెప్పబడును. సర్వాధిపతియైన రాజరాజువలన చేయబడిన రాజగణము, ప్రాంతీయుల దృష్టిలో ప్రభువైనను, చక్రవర్తిదృష్ట్యా, ప్రజలలో ఒకడే అగును. ఆరీతిగానే నిత్యులకు నిత్యుడు, చేతనులకు చేతనుడు, సత్యములకు సత్యము నయిన భగవంతునిచే సృష్టమైన నిత్య, చేతన, సత్యపదార్థములందు (చిదాభాస, సాభాస అంతఃకరణరూప జీవులందు ఆకాశ, ఘటాదులందు), అసత్య రజ్జు సర్పాపేక్షయా చేతనను, నిత్యము లయ్యు, పరమనిత్య,సత్య,చైతన్యాపేక్షయా, అనిత్యములు, అసత్యములు, అచేతనములే. ఆకాశముయొక్క ఉత్పత్తి, శ్రుతిసిద్ధమైనను, క్షణికపదార్థాపేక్షయా, తదాకాశము స్థిరమైనది. కావున, న్యాయసిద్ధాంతానుసారులు, ఆ ఆకాశమును నిత్యమని చెప్పెదురు. ఉత్పత్తి, వినాశములు గల సాభాసవృత్తి రూప జ్ఞానములు జడములయ్యు, ఘటాపేక్షయా చేతనములని చెప్పబడును. అటులనే లోకసిద్ధములైన మిథ్యారజ్జు సర్పాద్యపేక్షయా, అబాధ్యమైన కారణముచేత ఘటాదులు గూడా సత్యపదార్థములని చెప్పబడును. ఆపేక్షికములైన ఈ నిత్య, చేతన, సత్య, సరస పదార్థములనే వేదాన్తులు సకల సచ్ఛాస్త్రముల మహాతాత్పర్యమునకు విషయభూతుడు, నిఖిల రస సముద్రము స్థానీయుడు నయిన భగవదపేక్షయా, అనిత్య, జడ, నీరస, దుఃఖ రూపములు, లేక వ్యవహారోపయుక్తములు,వ్యావహారిక నిత్యములు, వ్యావహారిక సత్యములు, వ్యావహారిక చేతనములు, అథవా, వ్యావహారిక సుఖము లని అందురు.

భగవంతుడుమాత్రమే పారమార్థిక సత్య, చైతన్య, నిత్య, ఆనందరసస్వరూపుడయినవాడు. ఈ అభిప్రాయముతోనే

"నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనామ్ ।"

"సత్యస్య సత్యమ్ ।"

ఇత్యాది శ్రుతివచనములు భగవంతుడు నిత్యులకు నిత్యుడనియు, చేతనులకు చేతనుడనియు, సత్యమునకు సత్యస్వరూపుడనియు చెప్పుచున్నవి. గోస్వామీ తులసీదాసు తన రామచంద్రుడు, ప్రాణములకు ప్రాణమనియు, జీవులకు జీవుడనియు, సుఖమునకు సుఖస్వరూపుడనియు చెప్పిరి.

ఘటాకాశజీవనము మహాకాశ మైనట్లే తరంగజీవనము సముద్ర మైన విధముగానే జీవుని జీవనము భగవంతుడు అయిఉన్నాడు.

ఈ విషయమును అటుండనిండు. ఈవిధముగా పరమార్థతః, సమస్తము, భగవంతుడే. భగవదతిరిక్తముగా ప్రతీయమాన మగునది మిథ్యయే. రజ్జువునందు సర్పభ్రమ కలుగురీతిగానే పరమాత్మయందు ప్రపంచభ్రమ కలుగును. ఇదియే సత్యము నుండి మిథ్యాపదార్థముయొక్క ఉత్పత్తిప్రకారము. ఈవిషయ మునే, గోస్వామీ తులసీదాసు గూడా ఇట్లు చెప్పెను– రజ్జుజ్ఞానము లేకపోవుటవలన మిథ్యాభూతమైన సర్పభ్రాంతి రజ్జువునందు కలుగుచందముగా, అజ్ఞానముచేత సర్వవ్యాపక సద్రూప బ్రహ్మ జ్ఞానములేనందున, సద్రూప బ్రహ్మయందు మిథ్యాభూతమైన ప్రపంచము ప్రతీత మగును.

కావున, పరమానందఘనుడైన భగవంతునికంటె భిన్నమై, పరమార్థసత్య మన్నది, ఏదియును, లేదు. వాయ్వాది క్రమ ముతో ఆకాశమునుండియే,సముద్భూతమైన ఘటరూపమైన ఉపాధి వలన ఆకాశమందు మహాకాశము, ఘటాకాశము అను రెండు భేదములు కలుగును. ఆవిధముగానే పరమాత్మనుండి సముద్భ వించిన ఉపాధుల ద్వారా చైతన్యఘనానందస్వరూపుడైన

భగవంతునియందే జీవుడు, పరమేశ్వరుడు అను రెండు భేదములు కలుగుచున్నవి. వస్తుతః, ఘటము, ఆకాశకార్య మగుటచేత, తత్కారణమైన ఆకాశముకంటె భిన్నము కాదు.

కావుననే విద్వాంసులు, కార్యమును విజ్ఞానదృష్టితో కారణమందు ప్రలీనమొనర్చి, ఘటరూప ఉపాధిని ఆకాశమందు బాధితమొనర్చి, ఘటాకాశము, మహాకాశము అను భేదమును బాధితమొనర్తురు. అట్లే, అధిష్ఠానరూపమైన శుద్ధ సత్యబోధ (జ్ఞానము) వలన, సదసద్విలక్షణము, అనిర్వచనీయము నయిన శక్తిని, తత్కార్యరూపములైన ఉపాధులను సద్రూప బ్రహ్మయందు బాధితమొనర్చి, జీవ, పరమేశ్వరభేదమును గూడా నిరాకరింతురు. అనగా, ఘటమును పృథివియందును, పృథివిని జలమునందును, జలమును అగ్నియందును, అగ్నిని వాయువునందును, వాయువును ఆకాశమందును లయము చేసినపుడు, మహాకాశము కంటె భిన్నమైన ఘటరూపమైన ఉపాధియు ఉండదు, ఘటోపహితమైన ఘటాకాశముసైతము ఉండదు. అటులనే ఆకాశమును అహంతత్త్వమందును, అహంతత్త్వమును మహత్తత్త్వమందును, ఆ మహత్తత్త్వమును అవ్యక్తమందును, ఆ అవ్యక్తమును సత్తత్త్వమందును విలీనము చేసినపుడు, దేహ, ఇంద్రియ, మనస్సు, బుద్ధి, అజ్ఞానరూపములైన ఉపాధులును, ఈ ఉపాధులచే ఉపహితులయిన జీవులు—ఈ సమస్తము అఖండానంద రసస్వరూపుడైన భగవంతుడే అగును. వానికి, భగవదతిరిక్తమైన స్వరూపమేదియు ఉండదు.

ఇందువలననే భగవతీ శ్రుతి ఇట్లు ఉపదేశించెను—

"సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితి శాన్త ఉపాసీత।"

"ఐతదాత్మ్యమిదగ్ం సర్వం, స ఆత్మా, తత్త్వమసి।"

"అయమాత్మా బ్రహ్మ।"

"అహం బ్రహ్మాస్మి ।"

అనగా, 'ఈ సమస్తము బ్రహ్మయే. ఏలయన,ఈ విశ్వము తజ్జము, తల్లము, తదనము.ఆ బ్రహ్మనుండియే,సమస్త ప్రపంచము ఉత్పన్నమగుచున్నది,స్థితికలిగియున్నది,బ్రహ్మయందువిలయము చెందుచున్నది అని భావము. ఈ సమస్త దృశ్య ప్రపంచము ఈ ఆత్మస్వరూపమే, బ్రహ్మయే సమస్త ప్రపంచమునకు ఆత్మ, నీవే ఆ బ్రహ్మవు' అని పూర్వోదాహృత శ్రుతివచనతాత్పర్యము. ఈ ఆత్మ, బ్రహ్మ, "అహం" పద లక్ష్యార్థము ప్రత్యగాత్మ అయిన బ్రహ్మయే. అధికముగా చెప్పనేల ?

"స బాహ్యాభ్యన్తరో హ్యజః ।"

"బహిరన్తశ్చ భూతానా మచరం చరమేవ చ ।"

అనగా, సకల చరాచర ప్రపంచ బాహ్యాభ్యన్తరములందు బ్రహ్మయే ఉన్నాడు. ఏ చరాచర ప్రపంచ బాహ్యాభ్యన్తరములందు బ్రహ్మ ఉన్నాడో,ఆ చరాచర ప్రపంచముగూడా బ్రహ్మయే అయి ఉన్నది. సమస్త దృశ్యరూపమైన క్షేత్రము, ద్రష్టృరూపుడైన క్షేత్రజ్ఞుడు- ఈ సమస్తము భగవద్రూపమే.

"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।"

అని భగవద్గీతావచనము. బాహ్యాభ్యన్తరములైన కార్యకారణములన్నియు అజ, అవ్యక్త బ్రహ్మయే అయి ఉన్నవి.

"అజాయమానో బహుధా వ్యజాయత ।"

"ఏకోఽహం బహు స్యామ్ ।"

"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే ।"

అజాయమానము, ఏకతత్త్వమే అయిన పరతత్త్వము మాయచేత బహురూపముగా జాయమానమయినట్లు ప్రతీయమానమగుచున్నది. అజాయమానము, అఖండైకరసము, అద్వితీయమును అయిన ఈ

పరతత్త్వమందు వస్తుతః, జాయమానత్వము, నానాత్వము చూచు వాడు పరమేశ్వరుడైన భగవంతుని నిర్వికార కూటస్థత్వమును, అఖండైకరసత్వమున వ్యాపాదనము చేయగోరువాడు, కళంకితము చేయదలచువాడు నయిన ప్రాణి, ఆ అపరాధము వలననే పునః పునః మృత్యువును పొందుచుండును. కావున, ఈ పర వస్తువును పరమార్థతః, ఏకరూపముగానే,అద్వితీయముగానే చూడవలయును.

"మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి।"

భగవంతునియందు ఈషద్భేదమును జూచువానికి భయముకలుగును.

"య ఉదర మన్తరం కరుతే అథ తస్య భయం భవతి,

ద్వితీయాద్వై భయం భవతి।"

ఇంతియే కాదు, ప్రపంచమందు బ్రహ్మ-ధర్మములను, లోక-వేదములను, ఎక్కువగా చెప్పనేల, ఏ పదార్థము నయినను, ప్రభువుకంటె భిన్నముగా జూచునట్టివానిని, పృథక్ దృష్టితో జూచు వానిని, ఆ పదార్థమే, తనకు అపరాధముగా భావించి, ఆ భిన్న దర్శిని పరమార్థమునుండి ప్రచ్యుతిని జేయును.

"సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మనః సర్వం వేద।"

ప్రియతముని విప్రయోగము ఎవరికిని సహ్యమైన విషయము కాదు. ప్రియతమునినుండి వియోగము చెందిన ప్రియుడు క్షణకాల మైనను, తాను జీవింపజాలకపోవుటయే ప్రేమయొక్క పరాకాష్ఠ. వ్రజాంగనలకు తమ ప్రియతముడైన శ్రీకృష్ణుని వియోగమునందు ఒక్క క్షణముసైతము, అనంతకోటి కల్పములవలె ప్రతీతమగు చుండెడిది. పరమార్థదృష్టితో ప్రియతముని వియోగము కలిగి నంతనే, ప్రియతముని స్వరూపమే ఉండజాలదు. బింబవియుక్తమై ప్రతిబింబస్వరూపము, మహాకాశవియుక్తమై ఘటాకాశస్వరూపము,

మహాసాగరమునుండి వియుక్తమై తరంగస్వరూపము ఉండజాలునా? వీనియందు కేవలము పేరుకుమాత్రమే భేదముగాని, వస్తుతః, భేదము లేదు. కావుననే శ్రీగోస్వామీ తులసీదాసు జానకీరామ చంద్రులయందు, వీచీతరంగ దృష్టాన్తము నొసగి అభేదమును స్పష్టీకరించెను.

కావున, ఏ తత్త్వమైనను, భాగవత సత్తను, స్ఫూర్తిని వీడి (వియుక్తమై) తన స్వరూపమును ఎట్లు దాల్చును? ఏలయనగా, సత్తాస్ఫూర్తుల సంబంధము లేనియపుడు, సర్వతత్త్వములు నిఃసత్త్వములు (సత్తాశూన్యములు), నిఃస్ఫూర్తులు (స్ఫూర్తిరహితములు) నగును. స్ఫూర్తిరహితమైన, సత్తారహితమైన పదార్థ స్వరూపమే ఉండజాలదు. కావున, ఏ పదార్థములను పరమార్థ సద్రూపుడు, స్వయంప్రకాశుడు, స్ఫూర్తిరూపుడు నయిన భగవంతునికంటె భిన్నముగా తలచుదురో, వానిని, వాని ప్రియతముని నుండి పృథక్కృతము చేసినట్లే అగును. ఆ పదార్థములు స్ఫూర్తి విహీనములు, నిఃసత్త్వములు, నిఃస్ఫూర్తులుగా చేయబడి అవమానింపబడుచున్నవని తెలియవలయును.

కావున, ఆ పదార్థములు, భేదదర్శనము చేయువానిని స్వార్థము (ఆత్మార్థము) నుండి ప్రచ్యుతుని చేసివేయును. శ్రుతిస్మృతిసిద్ధమే అయిన ఈ పారమార్థిక, కాల్పనిక వ్యవహారమందు కలుగునట్టి వ్యావహారిక భేదమును సిద్ధింపజేయుటకై వేదాన్తములందు బింబ-ప్రతిబింబ, ఘటాకాశ-మహాకాశ, సముద్ర-తరంగాది అనేక దృష్టాంతములు జీవ, భగవత్స్వరూపవిషయమున ఈయబడినవి. దృష్టాంతములు ఏకదేశములై ఉండును. దృష్టాంతమందు దాని సర్వాంశము సంగతమగుట జరుగదు. కావుననే ఘటనాశమందు ఏ ఆకాశముతో ఘటసంబంధము విచ్ఛిన్నమగునో, అది, మహాకాశము, ఏ మహాకాశము కలదో, అదియే ఘటసంసర్గము వలన ఘటాకాశమయ్యెను.

ఈవిధముగానే అంతఃకరణ గమనమందు (నాశనమందు) పూర్వదేశస్థమైనఅంతఃకరణావచ్ఛిన్న చైతన్యము ముక్తమయ్యెను. అపూర్వమైన (అంతఃకరణమందు పూర్వములేని) చేతనము బద్ధమయ్యెను. ఈరీతిగా నీరూప, నిరవయవపదార్థము ప్రతిబింబించనులేదు, ప్రతిబింబమునకు ఆధారమును కాదు.

ఆత్మ, అంతఃకరణము_ఈరెండును నీరూపములు (రూపరహితములు), నిరవయవములు. దీనికి ప్రతిబింబత్వము, లేక ప్రతిబింబాధారత్వము ఎట్లు పొసగును ? ఇత్యాది శంకలు నిర్మూలములు కారణ మేమన, అలౌకికార్థమందు లౌకిక పదార్థములు సంపూర్ణముగా దృష్టాంతములు కాజాలవు. కేవల వివక్షితాంశమందు మాత్రమే దృష్టాన్త–దార్ష్టాంతికములకు సమత్వము ఉండును. ఇచట, కేవలము ఉపాధి ద్వారా ఉపహితమునందు కాల్పనిక భేదము,ఉపాధిగతములైన దూషణ-భూషణముల భానముకలుగుట, పరమార్థతః, అభేదము సిద్ధించుట, సర్వోపాధిదోషవర్జిత మగుట_ కేవలము ఇంతమాత్రమే అయిన అంశము వివక్షితము. ఘటాకాశమునకు మహాకాశముకంటె భేదము, దానియందు గమనాగమనాదులు, నానావిధమయిన కార్యకరణసామర్థ్యము_ఇవి అన్నియు ఘటోపాధికృతములు. మహాసముద్రముకంటె తరంగముయొక్క భేదము, దానియందలి చాంచల్యాదులు వాయురూపమైన ఉపాధి వలన జన్యములు. ప్రతిబింబమందు బింబ భేదము, మాలిన్య, చాంచల్యాదులు జల, దర్పణ ఉపాధిజన్యములు. ఆరీతిగానే జీవుని యందు నిర్వికార, పరమ చైతన్యానంద రసాత్మకుడయిన భగవంతుని కంటె భిన్నత్వము, కర్తృత్వ, భోక్తృత్వ, సుఖిత్వ దుఃఖిత్వాది నానా అనర్థముల యోగము, అవిద్య, అంతఃకరణ రూప ఉపాధికృతములు. ఉపాధివిలయమైన సమయమున, అద్వితీయ(ఏక)పరమానందస్వరూపుడైన భగవంతుడు మాత్రమే అవశిష్టుడై ఉండును.

ఈవిధముగా తత్త్వముయొక్క అద్వితీయత్వమునకు,అనంతత్వమునకు, లోకసిద్ధ వ్యవహారమునకు ఉపపత్తిని ప్రదర్శించుటకై అనేక దృష్టాన్తముల ఉపపాదనము చేయబడినది. ఎవరి బుద్ధియందు, ఏ దృష్టాంతమువలన పారమార్థికమైన అభేదము, భేద వ్యవహారము ఆరూఢ మగునో, వానికి ఆ దృష్టాంతమే ప్రధానముగా ఉపాదేయము. ఏలయనగా, శాస్త్రములకు ఏ దృష్టాన్తమునందును తాత్పర్యము లేదు. కేవలము వ్యావహారిక భేదోపపాదన పూర్వకముగా పారమార్థిక అద్వైతబోధనమందే శాస్త్రములకు తాత్పర్యము కలదు. ఈరీతిగా పరమానంద రసాత్మకుడైన భగవంతుడే చిదానందమయమైన జీవశక్తిలోపల, బయట, మధ్యభాగమున, సంపూర్ణముగా నిండియున్నాడు. ఎక్కువగా చెప్పనేల, జీవశక్తి, విశుద్ధ రసరూపుడైన పరమాత్మయే. ఆనందసుధాసింధువైన భగవంతుని తరంగరూప జీవశక్తి గూడా చేతన, అమల, సహజ, సుఖరాశియే. హిమపుత్తలిక (మంచుబొమ్మ) సాగరమధ్యమున ఉండియు, దప్పిక అని అరచుగాక,అథవా, నిఖిలరసామృత సింధుసార సర్వస్వమైన శ్రీకృష్ణసుధయందు అహర్నిశలు సర్వాంగీణ సంశ్లేషణరూపమైన అవగాహనము (నిమజ్జనము) చేయుచు గూడా శ్రీకృష్ణప్రేయసియైనవృషభానునందినిచే అధిరూఢమైన మహాభావముయొక్క విలక్షణ అవస్థావిశేషముచేత పరవశయై 'హా, ప్రాణవల్లభ ! ఎచట ఉన్నావు?' అనుచు,సమాగమము కొఱకై వ్యగ్రురాలగును.

"అంకస్థితేఽపి దయితే కిమపి ప్రలాపం హా మోహనేతి
మధురం విదధత్యకస్మాత్ ।"

ఆవిధముగానే ప్రియతముని మోహినీ మాయాశక్తి వలన పరమానన్దరసార్ణవమైన భగవంతునియందు హిమపుత్తలిక వలె నిమగ్నమైన జీవశక్తి, ప్రియతముని విస్మరించి, అనంత సంతాపములకు లోనై సంతప్త మగుచుండును.

శాస్త్రముల, ఆగమముల ప్రబోధము వలననే అజ్ఞాన, విస్మరణ, విభ్రమముల నివృత్తి కలుగును. 'ఆనందసింధుమధ్యమున నీ నివాసస్థానమని తెలియకపోయినచో, నీ పిపాస ఎట్లు నశించును.' "నీకును, ఆయనకును భేదము లేదు. జలమునకును, తరంగములకును భేదమును ఎట్లు తెలియగలము ? లోకమున జీవుడు, పరమేశ్వరుడు భిన్నులని చెప్పబడుచున్నను, వారికి భేదము లేదు. శ్రీమద్భాగవతమందలి పురంజనీ,పురంజనోపాఖ్యానమందు జీవరూపుడైన పురంజనుడు మాయావశుడై తన పరమ అంతరంగికుడు, ప్రియతముడు నయిన సఖుని విస్మరించి బుద్ధియను పురంజనియందు అత్యంత అనురాగము కలవాడై అనవరతము పురంజనీచింతనమందు తన్మయుడయ్యెను. అపుడు,పుణ్యపరిపాకమువలన పతిరూపమున ఉన్న గురువును ఆరాధించుట వలన సంతుష్టుడై హంసరూపమును ధరించిన భగవంతుడు ప్రత్యక్షమై నీవు నన్ను ఎఱుంగుదువా ? అని ప్రశ్నించెను.

అంత, పురంజని ఇట్లనెను– ప్రభో ! నేను మిమ్ము ఎఱుగను.

ఆ మాట వినిన భగవంతుడు ఇట్లనెను– సరియే, నన్ను విస్మరించుట వలన కలిగిన ఫలమిది. నన్ను విస్మరించుట వలననే అనేక అనర్థములకు మూలమైన సృష్టిచక్రమందు ప్రాణులు దారి, తెన్ను తెలియక తిరగవలసివచ్చును. చూడు.

"అహం భవాన్ న చాన్య స్త్వం త్వమేవాహం విచక్ష్వ భోః।
న నౌ పశ్యన్తి కవయ శ్ఛిద్రం జాతు మనాగపి ॥"

నేనే నీ పారమార్థిక స్వరూపుడను, నీవు నాకంటె భిన్నురాలవు కావు. నేనే నీవు, నీవే నేను.ఈ భావమును గంభీరముగా చూడుము. కవులు, నీయందు, నాయందును ఎన్నడును, కించిన్మాత్రముగా నయినను భేదమును చూడరు.

"అహం బ్రహ్మ పరంధామ బ్రహ్మాహం పరమం పదమ్ ।"

అని పరీక్షిన్మహారాజునకు గూడా చిట్టచివఱకు ఇటువంటి దృఢమైన విశ్వాసమే కలిగెను. అన్యాన్య మంత్రద్రష్టలైన ఋషులకు గూడా ఇటువంటి నిశ్చయమే కలదు.

"అహం వై భగవో దేవతే త్వమసి త్వం వై భగవో
దేవతే అహమస్మి ।"

హే భగవన్! నేనే నీవు, నీవే నేనై ఉన్నావు. ఏల యనగా' ఎవరు ప్రేమింతురో, వారు నాకు ఏమియును వలదు, కేవలము ప్రభుప్రేమయందు, లేక ప్రభుస్వరూప సౌందర్య-మాధుర్య-సుధా సమాస్వాదనమందు నాకు లోకోత్తరమైన రసము లభించు ననియే చెప్పవలసివచ్చును. ఇటువంటి స్థితిలో వివేకము కల జనులకు ఆ ప్రేమికుడు తన ఆనందము కొఱకే భగవంతుని ప్రేమించును. భగవత్స్వరూప సౌందర్య-మాధుర్య రసామృతమును ఆస్వాదించుటవలననే వాని ఆత్మకు ఆనందము కలుగునని విస్పష్టమగును.

కావుననే ప్రియతముడు నాకు అనుకూలుడు కానిండు, లేక ప్రతికూలుడు కానిండు, సర్వగుణసంపన్నుడు కానిండు, లేక సర్వగుణరహితుడు కానిండు, సౌందర్య-మాధుర్య-సుధా జలనిధి కానిండు, లేక సౌందర్యమాధుర్య విహీనుడు కానిండు అని ఎవరికి ఇటువంటి భావములు ఉండునో, వారికి అన్నివిధములుగా మా ధ్యేయస్వరూపుడు, జ్ఞేయతత్త్వము, ప్రియతముడు ప్రభువే అయి ఉన్నాడు.

"అసుందరః సుందరశేఖరో వా గుణైర్విహీనో
గుణినాంవరో వా ।
ద్వేషీ మయి స్యాత్ కరుణాంబుధిర్వా కృష్ణః స ఏవాద్య
గతి ర్మమాయమ్ ॥"

ఈవిధముగా ప్రేమించువారి ఆత్మకు సుఖము, శాంతి సర్వథా

ప్రభువును సమాశ్రయించుటయందే కలుగును.కావున, ఈ భావము లన్నియు, ఆత్మకొఱకే అయి ఉన్నవి. భగవంతునికొఱకై లోక, పరలోకములను, సర్వవిధ సుఖశాంతులను, ఎక్కువగా చెప్పనేల, ప్రియతమములైన ప్రాణాది సమస్త పదార్థములను త్యాగము చేయుదురు. ఇచట గూడా సూక్ష్మముగా పరిశీలించినపుడు ఆ ప్రేమికుని ఆత్మకు ఈ విధముగా చేయుటవలననే సుఖము కలుగు ననియే విదితమగును. కావున, ఇది అంతయు, ఆత్మకొఱకే అయి ఉన్నది.

లోకమందు ఒకానొక ధార్మికపురుషుడు ధర్మరక్షణముకొఱకై ఆత్మాహుతి చేసికొనును. వేదములందు గూడా ఒక యజ్ఞము కలదు. ఆ యజ్ఞమందు యజమానుడు తన సర్వస్వమును బ్రాహ్మణులకు అర్పించి, స్వయముగా తననుసైతము, అగ్నికుండమందు సమర్పించుకొనును. కాని, ఈ స్థలములన్నిటియందును, ఏవం విధములైన ఉత్కట త్యాగముల, తపస్సుల లక్ష్యము అంతరాత్మ యొక్క అనంత శాంతియందే కలదు. ఈవిధమైన భావములను దృష్టిలో ఉంచుకొని, ఆత్మయొక్క ఔపాధికమైన చిదాభాసస్వరూప బాధ కొఱకే సాధిష్ఠానమైన చిదాభాసునిచేతనే ప్రయత్నము చేయ బడును. కావుననే శ్రుతిమాత, స్పష్టముగా నిర్ణయము చేసి ఇచట గూడా సర్వోపప్లవ వివర్జితము, పరమానందరూపము నయిన చిదాత్మ అవశిష్టమై ఉండుట లక్ష్యముగా ఉంచుకొనెను.

"ఆత్మానం ప్రియ ముపాసీత ।"

అనగా, ప్రియరూపముతో ఆత్మనే ఉపాసించవలయును. ఆత్మ కంటె భిన్నమైనదానిని ఎవడు ప్రియమని చెప్పునో, అతడు ప్రియ మైన వస్తువుకొఱకు రోదించవలసి వచ్చును.

బ్రహ్మ, శ్రీకృష్ణుని గోవత్సములను, గోవత్సపాలకులను, అపహరించినపుడు, ఒక సంవత్సరకాలపర్యంతము శ్రీకృష్ణుడే

గోవత్సముల రూపములోను, గోవత్సపాలకుల రూపములోను, అభివ్యక్తమయ్యెను. అపుడు సమస్త గోవులకు తమ తమ లేగ దూడలందును, వ్రజస్త్రీలకు తమ తమ శిశువులందును అంతకుపూర్వము ఎన్నడును, తమ ముఖ్య సంతానములయందు కలుగనంతటి అభూతపూర్వమైన, లోకోత్తరమైన ప్రేమ జనించెను. ఈ విషయమును శ్రీశుకదేవుని ముఖారవిందము వలన శ్రవణము చేసి, పరీక్షిన్మహారాజు ఆశ్చర్యమును ప్రకటించుచు దానికి కారణ మడిగెను.

అపుడు, శుకదేవుడు ఇదియే చెప్పెను- హే రాజన్ ! ప్రపంచములో సమస్త వస్తువులకంటె ఆత్మయే ప్రియతమమైనది. ఆత్మ కంటె ఇతరులైన పుత్ర, విత్త, కళత్రాదులు ఆత్మకొఱకే ప్రియు లగుదురు.

"ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి ।"

దేహమునే ఆత్మయని భావించునట్టి దేహాత్మవాదులకు గూడా దేహము ప్రియమైనంతగా, దేహసంబంధులైన పుత్రాదులు ప్రియులు కారు. శ్రీకృష్ణుడు సమస్త జీవుల అంతరాత్మ. కావున, సమస్త ప్రాణులకు నిరతిశయ, నిరుపాధిక ప్రేమాస్పదుడు. ఆ కారణముచేత వారియందు (గోవత్సములందు, గోవత్సపాలకుల యందు)తమ ఆత్మలకంటె అధికమైన ప్రేమ ఉండుట యుక్తమే.

"సర్వేషామపి భూతానాం నృప స్వాత్మైవ వల్లభః ।
ఇతరేఽపత్య కళత్రాద్యాః తద్వల్లభతయైవ హి ॥

"దేహాత్మవాదినాం రాజన్"
"కృష్ణ మేన మవేహి త్వమాత్మానం సకలాత్మనామ్ ।"

ఎవరియందు మఱొకరికొఱకు ప్రేమ ఉండునో, వానియందు ఒకప్పుడు ప్రేమాభావముగూడా ఉండును. ఏలయనగా, అది

ఔపాధికమైన ప్రేమయై ఉండును. కావుననే ఆ ఔపాధిక ప్రేమ అనిత్యము, సాతిశయమై ఉండును. ఎట్లనగా అనుష్ణజలమందు ఉష్ణత్వము అగ్నిసంపర్కముచేత కలుగును, స్వతః కలుగదు. అట్లే,జలమందు ఔపాధికమైన ఉష్ణత్వము అనిత్యము,సాతిశయము నయి ఉండును. కాని, ఏ అగ్నిసంసర్గము వలన జలమందు ఉష్ణత్వము వ్యక్తమయ్యెనో, ఆ అగ్నియందైనచో, ఉష్ణత్వము నిత్యము, నిరతిశయము. ఈవిధముగానే ప్రపంచమందలి సమస్త వస్తువులలో ప్రేమ, ఆత్మసంసర్గము వలననే కలుగును. విత్త, క్షేత్ర, సామ్రాజ్యమాత్రములందు ప్రాణులకు ప్రేమ కలుగదు. ఏలన, ఎచటనో ఒకచోటున,ఏదియో ఒక రూపములో సామ్రాజ్యాది అభ్యుదయసంబంధులైన అనేకవిధములైన సాధనములు ఉండనే ఉన్నవి. మనము, మన దేశము ఒకానొక దేశమునకు పూర్తిగా పర తంత్రములైతిమి అనుకొనుడు, మన సర్వస్వమును ఒకడు అప హరించెనని అనుకొనుడు, అయినను, సంపద,దేశము లేక, సామ్రా జ్యము ఆక్రామణకారులైన అపహరించినవారి దగ్గఱ ఉండనే ఉన్నవి కదా, దానియందు మనకు సంతోషమేల కలుగుటలేదు? ఎచటనో ఒకచోటున, సమస్తము ఉన్నమాట నిజమే. అయినను, అది మనది కాదు అను విషయము విజ్ఞసమ్మతమైన హేతువై ఉండవచ్చును. విత్తము, క్షేత్రము, దేశము, సామ్రాజ్యమాత్రమందే మనకు ప్రేమ కలుగుటలేదు. కాని, మన 'స్వీయ'విత్త, క్షేత్ర, రాష్ట్రాదు లందు ప్రేమ కలుగును. ఈవిధముగా స్వసంబంధము వలననే స్వదేశమునందు, స్వరాజ్యమునందు, స్వవిత్తమునందు, స్వ క్షేత్రమునందు ప్రాణులకు అధికమైన ప్రేమ ఉండును. సుందరు లైన పుత్ర, కళత్రములందు సైతము స్వసంబంధము ఉండుట వలననే ప్రేమ కలుగుచున్నది. సౌందర్యవతియైన కామినీస్త్రీయందు గూడా 'ఈమె, నాకు లభించవలెయును, ఈమె నాదియే కావల యును' అను విధముగా స్వసంబంధిత్వాపాదనము యొక్క

ఆసక్తి కలుగును. ఈరీతిగానే 'అత్యుచ్చమైన ఐశ్వర్యము నాకును, నా దేశమునకును, నాతోటి సంబంధము కలవారికిని ఉండవలయును'- ఈవిధముగా తనతోటి సంబంధము కలవారియందే తనతో అనుకూల్యము కలవారియందే ప్రేమ, దృష్టిగోచరమగుచున్నది.

అధికముగా చెప్పనవసరము లేదు, అనంతకోటి బ్రహ్మాండనాయకుడైన భగవంతుడే తన అచిన్త్య, దివ్యలీలాశక్తివలన శ్రీమద్రాఘవేంద్రుడైన రామచంద్రుని స్వరూపముతోను, శ్రీకృష్ణచంద్రస్వరూపముతోను ఆవిర్భవించును. కాని, వారిలో గూడా స్వసంబంధము చేత ప్రేమయందలి తారతమ్యము చూడబడును. మన ఇష్టదైవముయొక్క సౌందర్య, మాధుర్య, ఐశ్వర్య,చరితాదులందు ఉన్నంత ప్రేమ, ఉన్నంత ఆకర్షణము అన్యదేవతలందు ఉండదు. అన్యదైవతముల విషయమేల? కృష్ణస్వరూపమందే మహానుభావులు పంచ భేదములను కల్పించిరి. వారు ద్వారకావాసి, మధురావాసియైన కృష్ణునినే కాక,

"వ్రజే వనే నికుంజే చ శ్రైష్ఠ్య మత్రోత్తరమ్।"

అను వచనానుసారము పూర్ణ, పూర్ణతర, పూర్ణతమ భేదముతో వ్రజమందున్న, బృందావనమందున్న, లీలానికుంజమునగల శ్రీకృష్ణునియందు భేదమును అంగీకరించి, పూర్ణతముడు, లీలానికుంజనాయకుడు నయిన శ్రీకృష్ణునియందే తమ హృదయమును సంసక్తము చేయుదురు. అన్య స్వరూపముల సౌందర్యాదులందు వారి చిత్తములు ఆకర్షితములు కావు. కావుననే ఒకమారు లీలయా, ఒక నికుంజమున దాగియున్న శ్రీకృష్ణుని అన్వేషించుచున్న వ్రజాంగనలు మన్మోహనుని చెంతకు జేరినంతనే శ్రీకృష్ణుడు శీఘ్రముగా విష్ణుస్వరూపములో ప్రత్యక్షమై, తన ఆ వ్రజరాజకుమారస్వరూపమును గుప్తమొనర్చెను. తనను తాను, సర్వగుణ

సమలంకృతుడైన శ్రీమన్నారాయణరూపములో ప్రకటము చేసికొనెను. కాని, వ్రజాంగనల మనస్సు, ఆ రూపమందు ఏ మాత్రము ఆకృష్టము కాలేదు. కాని, ఆ శ్రీమన్నారాయణునికి ప్రణామ మొనర్చి, ఆ వ్రజాంగనలు 'హే దేవ! మాకు మా ప్రియతమునితో సమాగమమును అనుగ్రహించుము' అని పలికి, తమ ప్రియతముని అన్వేషించుచు ముందుకు సాగిపోయిరి.

ఒకానొక వస్తువుయొక్క ఉత్కర్ష వలన ఆ వస్తువునందు ప్రేమ జనించదు. కాని, స్వసంబంధముచేతనే వస్తువుయొక్క ఉత్కృష్టత గూడా వ్యక్తమగును. కావుననే—

"గుణైర్విహీనో గుణినాం వరో వా।"

అను వచనముల ద్వారా 'అనంతగుణ సమలంకృతుడైనను, లేక సర్వగుణవివర్జితుడైనను, స్వకీయుడైనవాడే, సర్వస్వమగును' అని పూర్వమే చెప్పియున్నాము. పూర్ణతముడైన కారణముచేతనే ఆయన వైపునకు అందఱి చిత్తములు ఆకర్షితములు కావు.

ఎవరియందు స్వసంబంధము ఘనిష్ఠముగా ఉండునో, అతడే సర్వస్వము. ఎవరియందు స్వానుకూలత్వము ఎంత అధికముగా ఉండునో, వానియందు ప్రేమ అంత అధికముగా ఉండును. ఎవరియందు స్వప్రతికూలత్వము ఎంత ఎక్కువగా ఉండునో, వానియందు ద్వేషము కూడా అంత ఎక్కువగా ఉండును.

ఒక వ్యాపారి అనేక దినముల తరువాత తన గృహమునకు తిరిగివచ్చుచుండెను. మార్గమధ్యమున, ఒక సత్రములో అతడు నివాసము చేసెను. దైవవశమున, ఆ సత్రములో రాత్రిసమయమున, అతని భార్య అత్యంత రోగగ్రస్తుడైన తన పుత్రుని, వెంటగొని వచ్చెను. రోగగ్రస్తుడైన బాలకుడు బాధను సహింపజాలక, సంత్రస్తుడై పెద్దగా ఏడ్చుచుండెను, ఆ వ్యాపారి తన

నిద్రకు ఆటంకము కలిగించుచున్నాడని భావించి, ఆ పిల్లవానిని, వాని తల్లిని రోషముతో అతిక్రతిసముగా నిందించెను. కాని, ప్రాతః కాలమైనంతనే వారు తన భార్యాపుత్రులని తెలిసినపుడు, వారితో బాటు అతడు గూడా తనలోతాను రోదించసాగెను. ఈవిధముగా ఆలోచించినపుడు, నికృష్టమైన వస్తువునందు గూడా ఆత్మయొక్క స్వసంబంధమందలి ఘనిష్ఠత వలన, ప్రేమాతిశయత్వము,అత్యంత ఉత్కృష్టవస్తువునందు గూడా, స్వసంబంధము ఘనిష్ఠముగా లేక పోవుటవలన ప్రేమయొక్క న్యూనత్వము కలుగును అనియే స్పష్టమగును. ఇంతియే కాదు, ఇతరుల వస్తువునందు ద్వేషము, లేక ఈర్ష్య గూడా కలుగును. కావుననే పాషండులైన ఈ నవీన శైవులు, వైష్ణవులు పరస్పరము ఒకరు మఱొకరి ఇష్టదైవోత్కర్షను సహించలేకపోవుచున్నారు.

ఇపుడు, ఆలోచనీయాంశమేమనిన, దేని సంబంధము వలన నికృష్టవస్తువునందు గూడా లోకోత్తరమైన ప్రేమ, దేని సంబంధము లేక, పరమోత్కృష్టమైన వస్తువునందు గూడా ద్వేషము, ఈర్ష్యే కలుగునో, అది నిరతిశయ, నిరుపాధిక ప్రేమకు ఆస్పదమా, కాదా ? శర్కరాసంబంధమువలన మాధుర్యము లేని పదార్థము లందు గూడా మాధుర్యానుభవము కలుగును. అపుడు, శర్కర యందు మాధుర్యము లేదని చెప్పగలమా ? స్వస్వరూపమైన ఆత్మయొక్క సంబంధముచేత ప్రేమకు అయోగ్యమైన పదార్థము లందు గూడా ప్రేమ కలుగుచున్నప్పుడు, ఆత్మయందు అన్య శేషిత్వముగాని, లేక ప్రేమయొక్క అపకర్షత్వముగాని చెప్పగలుగు దుమా ? విశేషించి, ఆత్మయొక్క సన్నిహితత్వమునందు ప్రేమాధి క్యము, ఆత్మయొక్క విప్రయోగమందు ప్రేమయొక్క న్యూన త్వము కలుగుననియే విస్పష్టముగా చెప్పవచ్చును. కావుననే ప్రియతములైన కళత్ర, పుత్రాదుల రక్షణమునకై అనేకానేక

ప్రయత్నములచేత సముపార్జించిన రత్నాదిసంపదలను త్యజించుటలో విలంబ మేమియు ఉండదని చూచుదు. కాని, కళత్రము పుత్రాదులు మనశరీరమునకు ప్రతికూలురుగా తోచినపుడు అప్రియులనియే కాదు, శత్రువులనియు తలంచబడుదురు.

ఒక ఇంటికి నిప్పు అంటుకొనినది. అత్యంత ప్రియుడైన పుత్రుడు ఇంటిలోపల ఉండిపోయెనని తెలియును. గృహయజమాని అత్యంత వ్యాకులుడగును, రోదించును, రోదించుచు. అక్కడ గల జనముతో ఇట్లు వేడుకొనును. "సోదరా! నా సమస్త ధన ధాన్య రత్నాదులను తీసికొనుడు. కాని, నా ప్రియ పుత్రుని మండుచున్న గృహమునుండి బయటకు తీసికొనిరండు." ఇంత జరుగుచున్నను తన శరీరము ఎంత ప్రియమైనదనిన, అత్యంత ప్రియమైన ధనలోభముచేత గూడా ఎవడును తననాశమును సహించడు. తన ప్రియపుత్రుడు ఏ గృహమందు దగ్ధమగుచుండునో మండుచున్న ఆ ఇంటిలోనికి అతడు ప్రవేశించడు. బయట, దూరముగా ఉండిమాత్రమే విలవిల తన్నుకొనును. ఇది యుక్తమే. ఏలన, ప్రపంచమందలి సమస్త సంబంధములు ఈ శరీరముతోనే కలవు. ఆ శరీరము నశించినపుడు సంబంధములన్నియు నశించును. లేనిచో, అపారమైన ఈ ప్రపంచమందు అనంత జన్మల దేహసంబంధము గలవారి స్మరణము ఉన్నపుడు, ఎందరు తల్లులు, ఎందరు తండ్రులు, ఎందరు పుత్ర, కళత్రాది కుటుంబీకులు ఎచటెచట గలరో, వారందఱి సుఖదుఃఖములందు ఎంత సుఖదుఃఖములను చూడవలసివచ్చును! ఒకే జన్మకు సంబంధించిన కుటుంబసభ్యుల సంబంధమందు ఎట్టి దశ కలుగుచున్నది? దేహము నశించినంతనే స్త్రీ, పుత్ర, ధన, ధాన్యాదులతోను, అఖండ సామ్రాజ్యముతోను సంబంధము వీడిపోవును. బహుశః, మఱొక జన్మయందు ఈ సామ్రాజ్యము ఈ విశాల సౌధము అన్నియు

తనవే అను స్మృతి ఉండవచ్చుగాక. కాని, ఇపుడు ప్రస్తుతపు అధికారియొక్క ఆజ్ఞ లేక, తనకు తానే నిర్మించిన ఆ సౌధమందు ప్రవేశించుటకు అధికారము లేదు. గత జన్మయందు అతడు నియోగించిన భృత్యులే అతనిని ఆ సౌధములోనికి ప్రవేశించనివ్వరు. సమస్త సాంసారిక సంబంధములు దేహపర్యంతములే అయి ఉన్నవి. కావున,పుత్ర,కళత్రాది సమస్త బహిరంగ పదార్థములకంటె శరీరము ప్రియమై ఉండును. ఇటువంటి దేహముకంటె ఇంద్రియములు, తదపేక్షయా, మనస్సు, ఆ మనస్సుకంటె, బుద్ధికంటె గూడా అహమర్థము, దానికంటె గూడా అంతరంగము, విశుద్ధమైన చిదాత్మ, ప్రియమైనది.

ఇంద్రియశక్తి లేక, శరీరము మృతప్రాయమగును. ఆ కారణముచేత అది, భారరూప మగును.మనస్సు,కామినీ కాంచనాది విషయముల వైపునకు, ఆకృష్టమైనపుడు, ప్రాణులు మానసిక సంతోషము నిమిత్తమై దేహేంద్రియములను సైతము లక్ష్యపెట్టరు. ఒకానొక విధమైన అపకీర్తి మున్నగువానిచేత మనస్సునకు ఉద్వేగము కలిగినచో, దేహాదిత్యాగమునకై విషము,లేక శస్త్రమును ఉపయోగింతురు. ప్రాణి, మానసిక చాంచల్యము వలన సంతప్తుడైనపుడు, ఆ మనస్సును గూడా నిగ్రహించునట్టి ఉపాయమును అన్వేషించును. నిశ్చయాత్మకమైన బుద్ధిద్వారా సంకల్ప,వికల్పాత్మకమైన మనస్సును గూడా నిగ్రహించును. ప్రాణికి, మనస్సు మున్నగు కరణగ్రామము (సాధనసంపద)యొక్క నిరోధమందలి, లేక నిర్వ్యాపారత్వమందలి ఆనందము అనుభవము కాసాగినపుడు, అతడు దుఃఖాత్మకమైన దృశ్యప్రతీతినిరోధము కొఱకు బుద్ధిని గూడా నిరోధించి నిగ్రహించుటకు ప్రయత్నము చేయసాగును.

"యదా పంచావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ ।
బుద్ధిశ్చ న విచేష్టతే తా మాహుః పరమాం గతిమ్ ॥"

ఈవిధముగా క్రమశః, ఆత్మకు సన్నిహితమైన, కావుననే అంతరంగములైన బుద్ధ్యాదుల ఉద్వేగనిరాకరణము కొఱకు, ఆనుకూల్యసంపాదనము కొఱకు బాహ్యేంద్రియములు నిగ్రహింపబడును. అధ్యాత్మశాస్త్రములందు మనోనాశము, వాసనాక్షయము ప్రసిద్ధమై ఉన్నది. తుట్టతుదకు, ఈ 'అహం' పదము లక్ష్యార్థరూపమైన, నిరుపాధిక శుద్ధస్వరూపమే మనస్సు, బుద్ధి, అహమర్థము. తత్సుఖిత్వ, దుఃఖిత్వములకు, కర్తృత్వ, భోక్తృత్వాది సమస్త దృశ్య ప్రపంచమునకు భాసకుడు, మిథ్యాభూతమైన సమస్త భాస్య బాధకు సాక్షి, వస్తుతః, భాస్యభాసకాతీతుడు, సర్వోపప్లవ వివర్జితుడు, త్రికాలాబాధ్యుడు, స్వప్రకాశ పరమానందస్వరూపుడు చిదాత్మ. ఆ చిదాత్మకు స్వాభావికమైన అఖండానందాభివ్యక్తియందు 'అహమర్థము' గూడా ప్రతిబంధకమే.

పైన వివరించినదాని అభిప్రాయ మేమనిన, కొందఱు దార్శనికుల మతము ననుసరించి 'అహం' యొక్క వాచ్యార్థమే ఆత్మ అయి ఉన్నది. ఆ ఆత్మ 'అహం కర్తా' (నేనుకర్తను), 'అహం భోక్తా' (నేను భోక్తను), 'అహం సుఖీ' (నేను సుఖిని), 'అహం దుఃఖీ' (నేను దుఃఖిని)- ఈ విధముగా అనుభవము పొందుచున్నాడు. కావున, తన్నాశము ఆత్మనాశమే అయి ఉన్నది. నా శరీరము, నా ఇంద్రియములు, నా మనస్సు, నా బుద్ధి, నా అహంకారము-ఈవిధముగామమకారమునకు ఆస్పదము లైనవిఅనాత్మలు. నా బుద్ధి స్థిరముగా ఉన్నది, నేను నా బుద్ధిచేత నా మనస్సును నిగ్రహించెదను- ఈవిధముగా 'అహంత'కు ఆస్పదమైన 'అహమర్థమే' శుద్ధమైన ఆత్మ. తదతీతముగా జీవునికి తనదైన స్వరూపమేదియును లేదు. కావున, 'అహమర్థమును' నాశము చేయుట ఆత్మనాశమే అయి ఉన్నది.

అయినను, అభిజ్ఞులైన వేదాంతుల సిద్ధాంతము ఈవిధముగా

భావనీయము-'అహం'యొక్క వాచ్యార్థము ఆత్మ కాదు, లక్ష్యార్థమే ఆత్మ. అనగా, అగ్నిసంబంధముచేత అగ్నియందలి దాహకత్వ, ప్రకాశకత్వాది శక్తులచే సహితమై ఉండుటవలన, అయఃపిండమందు అగ్నిభ్రమ కలుగుచున్నది. శుద్ధ నిరుపాధికమైన అగ్ని, అయోగోళముకంటె భిన్నము. అటులనే ఘననిష్ఠమైన ఆత్మసంసర్గము చేత అహమర్థమందు ప్రేమాస్పదత్వము, చేతనత్వము అధికముగా ప్రతీయమానమగును. కావుననే దానియందు ఆత్మభ్రాంతి కలుగుచున్నది. వస్తుతః, నా మనస్సు, నా బుద్ధి, నా సుఖము, నా దుఃఖము, నేను కర్తను, భోక్తను, సుఖిని, దుఃఖిని, లేక కేవలము నేను- ఇవన్నియు భాస్యములు. ఇవి ప్రతీయమానము లగును, వీనికి స్పష్టమైన భానము కలదు.

భాస్యముకంటె భాసకము, లేక భానము భిన్నమే. చార్వాకాములకు దేహమందే ఆత్మబుద్ధి కలుగును. ఏలన, పారంపరీణ ఆత్మ సంబంధము చేతనే దేహమందు గూడా కించిత్ చేతనత్వము, ఇష్టత్వము, లేక ప్రేమాస్పదత్వము భాసించును. ఆ కారణము చేతనే అజ్ఞులకు, లౌకికులుకు, పామరులకు, చార్వాకులకు దేహనాశమందే ఆత్మ నశించినదన్న బుద్ధి కలుగును. ఆవిధముగానే 'అహమర్థనాశ' మందు, 'ఆత్మ నశించిన' దన్న బుద్ధి ఇతర దార్శనికులకు గూడా కలదు 'అహం శ్యామః' (నేను నల్లనివాడను), 'అహం గౌరః' (నేను తెల్లనివాడను), 'అహం స్థూలః' (నేను బలిసియున్నాను), 'అహం కృశః' (నేను కృశించి యున్నాను) ఈ విధముగా స్థౌల్యాది ధర్మములు గల దేహమందు 'అహమర్థము' యొక్క అభేదాధ్యాస కలుగును. ఆ రీతిగానే చిజ్జడగ్రంథియైన అహమర్థమందు చైతన్యానంద ఘనుడైన భగవంతుని అభేదాధ్యాస కలుగును.

ఈకారణముచేతనే,

"స్పృశ్యన్త ఇతి స్పర్శాః విషయాః ।"

అను వ్యుత్పత్తిననుసరించి, సర్వ దృశ్యవస్తువులే స్పర్శలు. సర్వ స్పర్శవిహీనుడు, అనగా సర్వదృశ్యవిహీనుడు, పరమ సూక్ష్మ రూపుడు, సర్వావభాసకుడు, స్వప్రకాశుడు, చైతన్యానందఘనుడు, పరమ అభయ స్వరూపుడు నయిన భగవంతుడనిన, అజ్ఞులకు భయము కలుగును. ప్రాణులకు స్థూల పదార్థములే అధికముగా భాసించుట చూచుదుము. కావుననే నీల, పీత, హరిత రూపములు ప్రస్ఫుటముగా గోచరించునట్లు, అనేక రూపములను ప్రకాశింప జేయునట్టి ప్రభకు (కాంతికి) ప్రస్ఫుటత్వము ఉండదు. ప్రభా ప్రకాశకమైన నేత్రాలోకవిజ్ఞానము, అంతకంటె గూడా ఎక్కువ దుర్లభము. ప్రభ లేనపుడు రూపప్రకాశము కలుగలేదనియు, ప్రభ ఉన్నపుడు, రూప ప్రకాశము కలిగెననియు, కావున, ప్రభ, రూపముకంటె భిన్నమనియు ఒకడు తలంచును. అట్లే నేత్రనిమీలనకాలమందు ప్రభాభానము లేదు, నేత్రోన్మీలనకాలమందు ప్రభ యొక్క ప్రతీతి కలుగును. కావున, నేత్రోన్మీలనకాలమందు అత్యంతసూక్ష్మమైన నేత్రాలోకమే ప్రభమీద వ్యాపించి ప్రభను ప్రకాశింపజేయునని భావించును. దీనితరువాత గూడా నేత్రాలోకమందలి మందత్వ, పటుత్వములను భాసింపజేయునట్టి మానసాలోకము(మానసప్రకాశము) నేత్రాలోకముకంటె భిన్నమై ఉన్నది. దానివలన, నేత్రజ్యోతి మందమైనదా, లేక తీవ్రమైనదా ? అను విషయము తెలిసికొనబడును. మనుష్యుడు, మానసిక కామ, సంకల్ప, సంశయాది అనేక వికారములను తెలిసికొని, నిశ్చయాత్మకయైన బుద్ధితో 'నేను స్థిరమైన బుద్ధితో మనస్సును, తద్వికారములను నిరోధించెదనని నిశ్చయించును. ఇచట, స్పష్టముగా మూడు అంశములు ప్రతీతమగును– దేనిని నిరోధింతుమో, నాశమొందింతుమో, అది మనస్సు. మానసికసంశయాదివికారములను దేనిచేత నిరోధింతుమో, అది బుద్ధి. దేని విషయములలో మందమైనదని, లేక అత్యంత

సూక్ష్మమైనదని అనుభవములు కలుగునో, ఏది బుద్ధిద్వారా మనో నిరోధము చేయునో, అది 'అహం', అనగా 'నేను.' ఈవిధముగానే,

"అహంబుద్ధ్యా మనః సంయచ్ఛామి।"

నేను బుద్ధితో మనోనియంత్రణము చేయుదును అనెడి అనుభవమందు 'నేను', 'బుద్ధి', 'మనస్సు' ఈ మూటియొక్క ప్రతీతి కలుగును. కావున, ఇవి అన్నియు, ప్రతీతికి విషయములైనవి. వీని ప్రతీతి, లేక భానము, వీనికంటె అవశ్యము భిన్నము. ఏలయన, ఒకే వస్తువునందు ప్రకాశ్య, ప్రకాశకభావము పొసగదు. కావుననే ప్రకాశ్యముకంటె ప్రకాశకము భిన్నమై ఉండును అను విషయము లోకప్రసిద్ధము.

ప్రకాశాంతర నిరపేక్ష ప్రకాశమానము 'స్వప్రకాశ' మని చెప్పబడును. మనోబుద్ధులకు, 'అహం' పదార్థమునకు భాసకము, స్వయంశుద్ధ భానము, భాస్యము కాకపోవుటచేత, అది, స్వయం ప్రకాశము. కావున, ఈ భానమే సర్వదా ప్రకాశాంతర నిరపేక్షముగా భాసమానమై స్థిరమైనది. తదతిరిక్తములైన భాస్యములన్నియు అస్థిరములు, కావున, జాగరమందును, స్వప్నమందును 'అహం', 'బుద్ధి', 'మనస్సు' ఈ మూడును ఉపలబ్ధములైనను, 'సుషుప్తి'యందు ఇవి అన్నియు అభావరూపములగును. ఆసమయమున గూడా జాగర, స్వప్నములందు సకల దృశ్యవస్తువుల భావమును, సుషుప్తియందు సమస్త వ్యక్త దృశ్యవస్తువుల అభావమును ప్రకాశింపజేయువాడు, సమస్త దృశ్య జగద్విలయమునకు ఆధారభూతుడు, సుషుప్తిని- గాఢనిద్రను, అజ్ఞానమును భాసింపజేయువాడు, కూటస్థుడు, భానరూపుడు నయిన ఆత్మయే విరాజమానుడై ఉండును. భాగవతమందు ఈ విషయమే ఈ విధముగా సూచింపబడినది-

"సన్నే యదింద్రియగణే౽హమి చ ప్రసుప్తే కూటస్థ
ఆశయ మృతే తదనుస్మృతి ర్నః ।"

ఈవిధముగా అఖండ, అనంత, పరమ సూక్ష్మ, పరమ వస్తు జ్ఞానము దుర్లభము. ప్రాణులకు ఏ స్థూల పదార్థముల జ్ఞానము కలదో, ఆ పదార్థములు నాశమొందినపుడు, సర్వనాశము యొక్క, లేక ఆత్మనాశముయొక్క ప్రతీతి కలుగుట యుక్తమే. కావుననే శ్రీగౌడపాదాచార్యమహానుభావుడు ఇట్లు అందురు–

"అస్పర్శయోగో నామైష దుర్దర్శః సర్వయోగినామ్ ।
యోగినో బిభ్యతి హ్యస్మా దభయే భయదర్శినః ॥"

సర్వస్పర్శగలవాడు, సర్వదృశ్యసంబంధరహితుడు, భాస్యవివర్జితుడు, పరమ సూక్ష్మస్వరూపుడు, అఖండానందరూపుడు, కాల్పనిక సర్వభావాభావభాసకుడు, కూటస్థుడు, భాసరూపుడు నయిన ఆత్మ, తత్త్వజ్ఞులకంటె భిన్నులైన యోగులకు దుర్దర్శుడు. ఏలయనగా, దృశ్యమే ఎవరి సర్వస్వమో, దృశ్యముకంటె భిన్నుడు, స్వప్రకాశుడు, అఖండ అనంత ద్రష్టయందు ఎవరి దృష్టి ఎన్నడును లగ్నము కాలేదో, వారికి దృశ్యనాశము వలన, పరమానందసుధాసింధువు సర్వతోభావేన సంపూర్ణముగా నిండియున్నను, సర్వస్వము నశించినట్లుగానే ప్రతీతమగును. ఒకానొక బిచ్చగత్తె అందమునకు ముగ్ధుడై ఒక చక్రవర్తి ఆమెను తన రాణివి కమ్ము అని కోరెను. కాని, ఆ యాచకురాలు తన భిక్షాసామగ్రి, భిక్షాటనము వలన కలుగు ఆనందము పోవునేమో అను భయముచే సమ్రాజ్ఞి అగుటకు భీతిల్లెను. కారణ మేమనిన, సమ్రాజ్ఞి యొక్క సుఖకల్పన, ఆమె దృష్టికి ఎన్నడును కలుగలేదు. ఆమెకు, భిక్షాగత సంస్కారము, తదానందమునకు సంబంధించిన సంస్కారమే సర్వదా ఉండెను. సరిగా, ఆరీతిగానే ఎవరికి అఖండానందమయ, నిర్వికార దృక్స్వరూపమునకు సంబంధించిన అనంత సౌఖ్యానుభూతి ఎన్నడును

కలుగలేదో, కేవల కటు దృశ్యజగత్తునకు సంబంధించిన అక్షుణ్ణమైన సంస్కారములు లభించుచున్నవో, వారికి దృశ్యప్రపంచమే సరసముగా అనిపించును.

పరమాత్మస్వరూపము వారికి ఉద్వేగజనకముగా అనిపించును. సైంధవలవణఖండము, నీటిలో కలియుటవలన, అది నశించినదని అందురు. వాస్తవమునకు, ఉపాధితోటి సంసర్గము నష్టమగుటవలన, తద్గతమైన ఔపాధిక రూపమే నశించును. ఆ రీతిగానే, పంచకోశాద్యుపాధి నశించుటవలన, చైతన్యమందు తత్కృతమైన అవచ్ఛేదమే నశించును. ఆత్మతత్త్వము శుద్ధ, నిర్వికార, ఘనరూపముతో యథాతథముగా ఉండును. వేపచెట్టుకు పట్టిన కీటకమునకు వేమునందే స్వాదము లభించును, దానికి శర్కరఅనిన, ఉద్వేగము కలుగును. ఆ చందముగానే, దృశ్య పదార్థమందు అనురాగము కలవానికి, అత్యంత కటు దృశ్యవస్తువునందే ప్రీతి కలుగును. సర్వదృశ్యరూప ఉపద్రవరహితుడు, పరమానందఘనుడు నయిన భగవంతుడనిన, వానికి భయము కలుగును. పుత్ర, కళత్రాది కుటుంబమందు అనురక్తులైన విషయాసక్తి కల ప్రాణులకు స్వర్గము, లేక వైకుంఠము గూడా రుచికరముగా ప్రతీతము కాదు. అరీతిగానే సప్రపంచ సుఖరోగులకు నిరావరణమైన అద్వైతానందమందు అభిరుచి కలుగదు. కావుననే వారు అద్వైత, అఖండ అనంత బ్రహ్మానందరూపమైన ముక్తి అనిన, భయము చెందుదురు. సృగాలము (నక్క) లయినను, అగుదుము గాని, అద్వైతుల నిర్విశేషమోక్షము మాకు వలదనియు కొందఱు చెప్పుదురు. నిజమే, విషయాసక్తునికి సమస్తము విషయమే. కావున, అత్యంతము విషయాభావముకల బ్రహ్మతో, లేక మోక్షముతో వారికి సంబంధమేమి ఉండును? ఏ మోక్షమందు నృత్య, వాదిత్ర, గీతముల, సరసరూపముల, మధుర రసానుభూతి ఉండదో, అట్టి

నీరస, నిర్విషయ మోక్షమందు వారికి శుష్కపాషాణబుద్ధి ఏల కలుగదు ? వస్తుతః, ఇది వారి సంస్కారముల దోషమే. సప్రపంచ, సాతిశయ, క్షుద్ర సాధనపరతంత్రమైన సుఖానుభవమే వారికి కలదు. వానియందే వారికి సంస్కారము, లేక రాగము ఉన్నప్పుడు, తద్విలక్షణము, నిష్ప్రపంచము, నిరతిశయము, అనంతము, స్వతంత్రము నయిన ఆనందాంబుధికల్పనయైనను, వారి మనస్సునందు ఎట్లు కలుగును ?

అతిస్వల్పముగా అయినను, వివేచన చేసినపుడు, వివేకవంతులకు నిరాయాస, నిష్ప్రపంచ, అపరిచ్ఛిన్న ఆనంద మహత్త్వముయొక్క జ్ఞానము కలుగును. ఒకానొక రసికునకు, అత్యంతము అభిలషణీయమైన రసమయ పదార్థము, రససిద్ధయగు కాంత లభించినపుడు, కొలదికాలము వానికి అత్యంత హర్షము జనించును. కాని, అంతమున, ఆ రసమయ పదార్థమును వదలి, ఆ పురుషుడే నిద్రించుటకు ప్రవృత్తుడగును. ఏల ? ఇదియేమి ? ప్రియతమురాలైన ఏకాంతయొక్క సంగమము కొఱకు మొదట ఇంత వ్యగ్రత, ఇంత వ్యాకులత ఉండుట ఏమి ? నేడు తత్ప్రేయసీసమాగమమందు కేవలము ఆమెయందే తల్లీనుడై ఉండుటకు మారుగా ఇపుడు, నిద్రను ఆహ్వానించుట ఏమి? మనుష్యుని విషయము చెప్పనదేమి? బ్రహ్మ, విష్ణువుల సన్నిధానమందు దివ్యాతిదివ్యములైన రమణ సామగ్రులు ఉండునో, ద్వైతప్రపంచమందు అత్యుచ్చకోటికి చెందిన సౌఖ్యసామగ్రులుండునో, అవన్నియును అచట విద్యమానములై ఉన్నవి. అయినను, ఆ అద్భుత సప్రపంచ సౌఖ్యములను వదలి, వారికి సుషుప్తియందు ప్రవృత్తి ఏల కలుగుచున్నది ? ఏల ప్రవృత్తి కలుగుచున్నదనిన, బహుశః, ఆ సుషుప్తియందు నిష్ప్రపంచ అద్వైతసుఖానుభూతి కలుగును. ఆ సుఖానుభూతిచ్ఛాయమాత్రమే సాతిశయమైన ప్రపంచసుఖమందు కలుగును.

అధికముగా చెప్పనేల, భగవద్భావాపన్నులైన వారికిని, అత్యుచ్ఛకోటికి చెందిన అనురాగము కలవారికిని, తమ ప్రియతముడు, ప్రాణధనుడు నయినవాని వియోగస్థితియందు,మరణముకంటె గూడా అనంతకోటిగుణితమైన సంతాపము కలుగును. క్షణమాత్రకాలము ప్రియతమ వియోగజన్యమైనవారి తీవ్ర తాపమును జూచి, అనంతకోటి బ్రహ్మాండాంతర్గతములైన అనంత పాపములు, మనమందఱమును అనంతకోటి బ్రహ్మాండాంతర్గతులైన అనంత ప్రాణుల అనంతపాపములు ఏకత్రితములై కూడా అనంతకల్పములందు గూడా రౌరవాదిమహానరకముల ద్వారా వీరికి ఒక్క క్షణమాత్రకాల ప్రియతమ వియోగజన్యమైన తీవ్రతాపమువలన కలిగిన కష్టము సంపాదింపజాలమని ఆలోచించి దుర్బలములగును. ఏ ప్రేమికులకు, కేవల ధ్యానమందు ప్రాప్తమైన ప్రియతముని మానసాలింగనమందు అద్భుతమైన ఆనందము కలుగునో, ఆ ఆనందమును జూచి అనంత బ్రహ్మాండాంతర్గతములైన పుణ్యపుంజములు 'మనమందఱము కలసి గూడా అనంత కల్పములందు వీరికి తమ ప్రియతముని మానసపరిష్వంగమువలన లభించినంత ఆనందము నొసంగ గలమా ? అని ఆలోచించి బలహీనములగును. ఆ ప్రేమికులే సౌభాగ్యవశమున,తమ ప్రియతముని చిరకాలాభిలషితమైన మంగళమయ ధామమునకు చేరుదురు. అచట, ఒకచోటున, మరకతమయమైన భూమిపైన సౌవర్ణలతావల్లులు, అద్భుత అనంత జ్యోతిర్మయ వృక్షములు ఉండును. మఱొకచోటున, కనకమయ భూమిపైన మరకతమయములైన లతాప్రతానములు, మనోహర శ్యామల దూర్వలు ఉండును.తమ దివ్యదీప్తులతో సూర్యచంద్రుల దీప్తులను సైతము తిరస్కరించునట్టి మణులు, రత్నములు ప్రకాశము గొల్పుచుండును. హంస,సారస, కారండవ,పికాదులు కలరవములు చేయుచుండును. మఱొక ప్రదేశమున, నానావిధములైన

అద్భుత ఖగ,మృగములు సంచరించుచుండును.మఱొక స్థలమున, మణిసదృశములైన వృక్షములందు కనకమయ వల్లులు, శోభాయమానములై ఉండును. మఱొక స్థలమున, కనకమయములైన మంజుల కుంజముల మీద లతలు విరాజిల్లుచుండును. ఇంకొక ప్రదేశమున,పద్మరాగమణిసదృశములైన వృక్షములు స్ఫటికముల వంటి కాంతి గల లతలతో పరివేష్టితములై ఉండును. అనేకవిధములైన విచిత్ర మణిమయ శాఖలతో ఆ వృక్షములు శోభించుచుండును. ప్రతి ఒకశాఖ,అద్భుత, అనంత వర్ణములు గల విచిత్ర మణిమయ పల్లవములతో ఆభూషితములై ఉండును. ప్రతి పల్లవము నానా వర్ణాంచితములైన పుష్ప స్తబకములతో శోభాయమానముగా ఉండును. ప్రతి పుష్పోపరిభాగమందు నానావిధ సౌగంధ్యమధులుబ్ధములైన భ్రమరములు ఝుంకారములు చేయుచుండును.అనేక విధములైన దీప్తులతో దీప్యమానములు, వికసితములు నయిన పుష్పములతో శోభించుచున్న మధుమయ, మనోరమ లతలు విలక్షణశోభను వ్యాపింపజేయుచుండును. సమస్త వృక్షములు, లతలు ఏకకాలమందే ముకుళితములు, ప్రఫుల్లితములు ఫలితములు, పక్వ ఫలయుక్తములు గూడా అగుచుండును. అచట గల అద్భుత సౌందర్య, మాధుర్యాదిగుణములను వర్ణించుట శ్రీశారదా దేవికి సైతము అశక్యముతాదృశ విలక్షణమైన మంగళమయ ధామమందు ప్రేమికులు, తమ సర్వస్వము, చిరాభిలషితుడు నయిన ప్రియతముని పరిష్వంగము చేసికొని సంతోషమును పట్టజాలరు.

కాని, ప్రియతముడు, మంగళమయమైన తల్లీలకు సంబంధించిన సుందరసామగ్రి అఖండ, అనంత ఆనందరూపమే.అపుడు అపరిమితమైన ఆ రసాస్వాదనమునుండి వారికి విరతి కలుగజాలదు. ఏలయన, అది అద్వైత ఆనందైకరసమే గాని,అన్యవస్తువు కాదు. వస్తుతః, పారమార్థికమైన అఖండైకరసము అద్వయానందము

కంటె భిన్నమయినచో, లోకమున, ఒకానొకనికి దుష్ప్రాప్యమైన సౌధమును, మనోహరమైన ఉద్యానవనమును జూచి తత్ప్రాప్తికై తీవ్రమైన ఉత్కంఠ కలుగును. అది, లభించినపుడు, కొలది క్షణములు గొప్ప హర్షము కలుగును. కాని, కొలది సమయములోనే చిత్తము అన్యవిషయచింతనమందు వ్యగ్రమగును. ఆ సమస్త సుఖసామగ్రులు, ఎదుట ఉన్నను, అవి తమ ప్రభావమును చిత్తమందు కలిగింపజాలవు. మరల, ఆ చిత్తము అన్యచింతాగ్రస్తమే అగును. ఇతరుల దృష్టిలో అతడు అత్యంత సుఖియైనను, స్వీయ దృష్టిలో దుఃఖియే అగును. సరిగా ఆరీతిగానే కొద్దికాలములో నానావిధ రసాస్వాదనము చేసిన తరువాత, మనస్సు, మఱికొంత అభిలషింపసాగును. అచట గూడా నిద్రకు భంగము కలిగినచో, మెలకువ, దోషముగా తలంచబడసాగును. ప్రియతముని కలిసి గూడా ప్రేమికునకు నిద్రింపవలయునన్న ప్రవృత్తి కలుగునని చెప్పుటయే దీని తాత్పర్యము. వస్తుతః,ఎవరియొద్ద ఎంత ఎక్కువ భోగసామగ్రి ఉండునో, వారు అంత ఎక్కువగా నిద్రించుటకు ప్రవృత్తులగుదురు.ఇది అంతయు ఎందువలన కలుగుచున్నదనిన, ఎంత ఎక్కువ సుఖము కలిగినను, అది దుఃఖరూపమే. దృశ్య దర్శనమందు శ్రమ ఉన్నది. కావున, దానివలన, పరిశ్రాంతుడైన ప్రాణి, నిరాయాస అఖండ, ఆనంద బ్రహ్మయందు విశ్రాంతిని కోరును. వాస్తవమునకు సర్వతత్త్వములును తమకు అధిష్ఠానభూతుడైన పరమాత్మనుండి విముక్తములై సంతప్తములగును. ఒక త్రాడుచే బంధింపబడిన పక్షి, నలు దిశలు తిరుగుటవలన అలసట చెంది, విశ్రాంతికై బంధనమైన త్రాడుకు ఆశ్రయమైన కట్టుకొయ్యనే సమాశ్రయించును. అట్లే నానావిధ కర్మలచే పరతంత్రుడై జీవుడు, జాగ్రత్, స్వప్నావస్థలందు స్వాశ్రయభూతుడైన ప్రభువునుండి విముక్తుడై భిన్న భిన్న విషయములందు

దారి, తెన్ను లేక తిరుగుచుండును. జాగ్రత్ స్వప్నములకు హేతుభూతములైన అవిద్యాకామకర్మలు క్షీణించినపుడు అతడు మరల విశ్రాంతి కొఱకు భగవంతునినే ఆశ్రయించును. శ్రుతులందు జీవుడు భగవదంశ అని చెప్పబడెను. అగ్నినుండి విస్ఫులింగములు (నిప్పురవ్వలు) నిర్గమించునట్లే, పరమాత్మనుండి జీవులు ఉద్గమింతురు.

"తద్యథా అగ్నేః విస్ఫులింగాః వ్యుచ్చరన్తి, ఏవమేవ
ఏతస్మాదాత్మనః సర్వే జీవాః సర్వే లోకాః।"

అనుచు శ్రుతి ఉక్తవిషయమునే చెప్పుచున్నది,

నిష్కల, నిరవయవ, అఖండ, అనంత, పరమాత్మ ఛేదన, భేదనాదులద్వారా ఏవిధముగా నయినను ఖండింపబడుట, అసంభవము. అందువలన, ముఖ్యమైన అంశాంశిభావము సంపన్నము కాదు. కావున, ప్రజలు కాల్పనికమైన అంశాంశిభావమును అంగీకరింతురు. చంద్రుని నూరవభాగము శుక్రుడైనట్లుగా పరమాత్మ యొక్క అంశము జీవుడని ఇతరులు కొందఱు చెప్పుదురు. వీరి మతమున–

"తత్సదృశత్వే సతి తతో న్యూనత్వమ్ ।"

దానితో సమానమైఉండి, దానికంటె న్యూనత్వము కలిగియుండుటయే అంశాంశిభావ కథనముయొక్క తాత్పర్యము.కాని,చంద్రునికి శుక్రునికి గల అంశాంశిభావము అత్యంత బాహ్యము, ఔపచారికము అని అద్వైతవాదులు చెప్పుదురు. కావుననే శుక్రుడు చంద్రుని నుండి ఉద్గమించకపోవుట వలన ఆ చంద్రునితో శుక్రునికి ఏ విశేష సంబంధమైనను ఉండుట సిద్ధించదు. కాని, పరమాత్మనుండి ఉద్గమము,ఆయనతో విశేష సంబంధము కల జీవుని అంశాంశిభావము అంతరంగమైనదే కావలయును. ఘటోపాధివలన ఘటాకాశము

మహాకాశముయొక్క అంశమని చెప్పబడును. వాయు ఉపాధివలన తరంగము మహాసముద్రముయొక్క అంశము. ఆవిధముగానే అవిద్యోపాధి, లేక అంతఃకరణోపాధి వలన జీవుడు పరమాత్మ యొక్క అంశమని చెప్పబడును. ఉపాధుల విక్షోభమందు ఉపహిత మైనదానికి అనుపహితమైనదానితో పార్థక్యము, తదుపశమనమందు ఉపహిత వస్తువునకు అనుపహితమైనదానితో ఐక్యము కలుగును. ఆకాశమునుండి వాయు, జలాది క్రమముతో ఘటము ఉత్పన్న మైనపుడు, ఘటాకాశముయొక్క ఉత్పత్తి, మహాకాశముకంటె దాని పృథక్త్వము ప్రతీతమగును. వాయువుయొక్క స్పందనకాలమందు మహాసముద్రమునుండి తరంగముయొక్క ఉత్పత్తి, సముద్రము కంటె ఆ తరంగముయొక్క భిన్నత్వము ప్రతీయమానమగును. వాయువుయొక్క నిఃస్పందనకాలమందు(చలనము లేని కాలమున) తరంగము విలయమగుట ప్రతీతమగును. నిరావరణము, ద్రవీ భూతము నయిన జలము యొక్క అభివ్యక్తియందు బింబము వలన ప్రతిబింబము యొక్క ఉత్పత్తి, బింబముకంటె భిన్నత్వము ప్రతీతమగును. జలము సావరణమైనపుడు, లేక శైత్యసంయోగము వలన ఘనీభవించినపుడు ప్రతిబింబమునకు బింబభావాపత్తి కలుగును. ఈ ఉదాహరణము లన్నింటివలన స్వభావముచేత ఘటా కాశము, తరంగము, ప్రతిబింబము, మహాకాశము, మహాసముద్రము బింబములకంటె భిన్నము కాదనియు, వానివలన భిన్నత్వము, విలక్షణత్వము ఉపాధివలన ప్రతీతమగుననియు, అటులనే జీవుడు, స్వభావముచేత బ్రహ్మకంటె భిన్నుడుకాడను విషయమే ప్రదర్శింప బడినది. ఆ జీవునియందు భిన్నత్వము, పరమాత్మకంటె విలక్ష ణత్వము ఉపాధులచేతనే కలుగును. మహాప్రళయమందు సమస్త ప్రపంచము సమష్టి, సబీజ బ్రహ్మయందు విలీనమగును. ఆరీతి గానే సుషుప్తియందు సమస్త ప్రపంచలయము శ్రుతి చెప్పినది.

కావున, సుషుప్తియందు ఉపాధులు విలీనమైనపుడు జీవుడు పరమాత్మతో కలియును,అనగా,ఐక్యమగును.జలము నిరావరణము ద్రుతముగా ఉన్నంత వఱకు, దాని చాంచల్య, మాలిన్యముల వలన ప్రతిబింబము గూడా చంచలముగాను, మలినముగాను గోచరించును. ఈ రీతిగానే అంతఃకరణము నిరావణస్వరూపముతో వ్యక్తమై ఉండనంతవఱకు దానియందు ప్రతిబింబించిన చిదానందతత్త్వము గూడా ఆ అంతఃకరణముయొక్క వ్యాకులత వలన, మలినత్వము వలన వ్యాకులమైనట్లుగాను, మలినమైనదానివలెను ఉండును.

"ధ్యాయతీవ లేలాయతీవ।"

అను శ్రుతియందు ఈ విషయమే చెప్పబడినది. కాని, అవిద్యా పరిణామమైన అంతఃకరణము అవిద్యయందు విలీనమైనపుడు, లేక నిద్రారూపమైన దట్టమైన ఆవరణముచేత ఆవృతమైనపుడు జలము యొక్క సావరణ ఘనీభావమందు ప్రతిబింబము బింబమే అగును; బింబముకంటె వేఱుగా ఉండనే ఉండదు. కావున, దానివలన ఏవిధమైన అనర్థసంబంధము కలుగదు.సరిగా ఆరీతిగానే సుషుప్తియందు జీవుడు పరమాత్మయందు విలీనుడగును. ఆ జీవునికి వేఱుగా స్వరూపమే ఉండదు. కావుననే ఏవిధమైన అనర్థసంయోగమైనను, అపుడు ఆ జీవునికి కలుగదు. కావుననే,

"సతా సోమ్య తదా సంపన్నో భవతి, స్వమపీతో భవతి"

ఇత్యాది వచనములచేత శ్రుతి, ఆ స్థితిని స్పష్టముగా ధ్రువీకరించు చున్నది. జాగ్రత్, స్వప్నములందు జీవుడు కర్మవశుడగుటవలన అద్వైత, నిష్ప్రపంచ పరమాత్మసుఖమునుండి వంచితుడై ద్వైత రూపమైన దుఃఖసాగరమందు దారి తప్పి, తిరుగుచు తిరుగుచు అలసిపోవును. విశ్రాంతి కొఱకై కర్మలు ఉపరతములైనపుడు అతడు మరల 'సత్'పదవాచ్య సబీజ పరమాత్మయందు ఐక్య మగును. కావున, దృశ్యప్రపంచమందు, ద్వైతమందును సుఖ

లేశమందుగూడా లేదు. కేవల అజ్ఞానులు భ్రాంతిచేత ఆ దృశ్య ప్రపంచమందు సుఖకల్పన చేయుదురు.

లౌకిక విషయానందమందు గూడా ఎచట ఎంత భేదభావము నశించునో, అచట అంత ఎక్కువగా ఆనందము వ్యక్తమగును. చంచలమైన చిత్తమందు అధిక పరిమాణములో ద్వైతభావము కలుగును. కావున, ఆ స్థితిలో అధిక దుఃఖము కలుగును. అభిలషిత విషయ ప్రాప్తియందు తృష్ణ అను కంటకము లేకపోవుటవలన, చిత్తమందు స్వాస్థ్యము, ఏకాగ్రత, కొంత అంతర్ముఖత్వము కలుగును, కొంత పరిమాణములో ద్వైతము నశించును. కావుననే కొంత పరిమాణములో ఆనందప్రాప్తియు కలుగును. సమాధియందు ద్వైత ప్రతీతి ఎక్కువగా నశించును. కావుననే సమాధియందు అధికానందము లభించును. ద్వైతప్రతీతి లేకపోవుటయే సౌషుప్త సుఖోత్కర్షకు హేతువు. కావుననే అచట దృష్టాన్తము గూడా తదనుగుణముగానే ఉన్నది-

"తద్యథా ప్రియయా భార్యయా సంపరిష్వక్తో నాన్తరం
కించన వేద న బాహ్యమ్।"

అనగా, ప్రేయసీవియుక్తుడైన ఒక నాయకుడు చిరకాలాభిలషితమైనతన ప్రియురాలు లభించినపుడు, ఆమెయొక్క పరిరంభణము వలన కలిగిన ఆనందోద్రేకములో బాహ్యాభ్యంతరమైన సర్వవిధ దృశ్యజాతమును మఱచిపోవును. జగత్తు ఏమిటి, నే నెవరు, నేను ఎచట ఉన్నాను ? అనునట్టి జ్ఞానమే వానికి ఉండదు. అట్లే జాగర, స్వప్నగత ద్వైతప్రపంచమువలన ఉద్వేగము చెందిన జీవుడు సైతము, నిష్ప్రపంచ పరమాత్మయొక్క పరిరంభణము వలన దృశ్యము ఏది, ఎచట ఉన్నది, నేనెవరిని ? మొదలగు సర్వవిధమైన బాహ్యాభ్యంతర ప్రపంచమును మఱచిపోవును.

దుఃఖరూపమైన ద్వైతమందు కేవల అపేక్షాకృత సుఖకల్పన

ఉండును. రజస్తమోద్రేకమందు మోహ, విషాదములు అధికముగా కలుగును. తదపేక్షయా, సత్త్వగుణోద్రేకము వలన జనించునట్టి అంతర్ముఖత్వమందు, అనగా, ద్వైతప్రతీతి తక్కువ యగుట యందు సుఖమున్న వ్యవహారము కలుగును. ఇంకను, అధికముగా ఏమి చెప్పుదుము,అనంతకోటిబ్రహ్మాండనాయకుడైన భగవంతునికి సైతము దృశ్యప్రతీతియందు సంతాపమే కలుగును. కావుననే,

"యస్య జ్ఞానమయం తపః ।"

అనుచు, శ్రుతి 'ద్వైతజ్ఞానము కలుగుటయే పరమాత్మ యొక్క తపస్సు' అని చెప్పుచున్నది. మన అందఱికి కృచ్ఛ్ర, చాంద్రాయణాదిరూపమైన తపస్సు ఉన్నరీతిగానే పరమాత్మకు ద్వైతజ్ఞానమే తపస్సు అగుట యుక్తమే. ఏలన, బహిర్ముఖులైనవారికి నగణ్యమైన విషయమే, అంతర్ముఖులైనవారికి మఱొకరీతిగా అనుభూయమానమగును. సాలెపురుగు దారమును కంటిలో ఉంచుటవలన, కంటికి కలుగునంతటి కష్టము,ఇతరావయవములందుదండాఘాతము వలన గూడా కలుగకపోవుట మనము చూచుచునే ఉన్నాము. ఏ దోషముల వలన, ఏ దృశ్యప్రతీతుల వలన బహిర్ముఖులైన ప్రాణులకు లేశమాత్రమైనను కష్టము కలుగదో, వానివలననే అంతర్ముఖులైన యోగులకు అధిక విక్షేపము కలుగును. అయినప్పుడు, యోగేశ్వరుడైన శ్రీకృష్ణునికి దృశ్యదర్శనము కృచ్ఛ్రాదికముల వలె ఘోరతపస్సైనచో, ఇందులో ఆశ్చర్య మేమి కలదు?

కఠోరచిత్తులకు ఏమియునుకాని విషయము సుకుమారులకు అతిమహావిషయ మగును. కావుననే ఆర్యులు ఇట్లుచెప్పిరి-

"నిఃశ్వసిత మస్య వేదా వీక్షిత మేతస్య పంచభూతాని ।
స్మిత మేతస్య చరాచరస్య చ సుప్తం మహాప్రలయః ॥"

అనగా, భగవంతుని నిఃశ్వాసమునుండియే వేదములు ప్రాదు

ర్భవించును, భగవంతుని వీక్షణమువలననే పంచభూతముల సృష్టి జరుగును. మందహాసము వలననే సకల చరాచరాత్మక ప్రపంచ సృష్టి జరుగును, భగవంతుని సుషుప్తియందే సమస్త ప్రపంచము విలీనమగును. భగవంతుని వీక్షణ, మందహాసముల వలన, ఎన్ని అద్భుత, అనంతకోటి బ్రహ్మాండములు అభివ్యక్తము లగుచున్నవి! భగవంతుని వీక్షణాదికమందు అద్భుతమైన ప్రభావమున్నట్లే భగవంతుని సౌకుమార్యము గూడా అద్భుతమైనది. కావున, వీక్షణము నందే ఎంత శ్రమ, ఎంత కష్టము కలుగుననిన, అదియే,భగవంతుని 'తప' మగును. వీక్షణ, మందహాసములందే పరిశ్రాంతుడై, ఆ భగవంతుడు విశ్రాంతి కొఱకై సుషుప్తిని చేరును. వీక్షించి, ఈషన్మందహాసము చేయుట, నిద్రించుట—ఇంతియే ఆ భగవంతుని కార్యము.

ఇపుడు, అనంతకోటి బ్రహ్మాండనాయకుడైన భగవంతునికి గూడా వీక్షణ,మందహాసముల సమనంతరమే విశ్రాంతికై సుషుప్తి ఆవశ్యక మగుచున్నప్పుడు, ద్వైతమందు సుఖము కలదా, లేక అద్వైతమందు కలదా ? అను విషయమును సహృదయులైన మహానుభావులు ఊహింతురుగాక. ద్వైతమున, ఎచటయినను, ఎంతయైనను, ఏ సుఖము లభించునో, ఆ సుఖము నిష్ప్రపంచ,అద్వైత బ్రహ్మసుఖముకంటె అల్పమైనదే కాక, విశేషించి, దుఃఖరూపమైనది. సర్వదుఃఖసంపన్నమైన ద్వైతదర్శనము వలన ఉద్విగ్నుడై, అనంతకోటి బ్రహ్మాండనాయకుడయిన భగవంతుడు, విశ్రాంతికొఱకు, అద్భుతమైన అద్వైత సుఖమును ఆశ్రయించు నపుడు,ఆయన భక్తులకు దుఃఖరూపమైనద్వైతములో ఆనందము కలుగుట ఎట్లు సంభవము ? కావున, సమస్త జీవులకు, వారందఱికి నియామకుడైన భగవంతునికి ద్వైతదర్శనమందు సుఖలేశము గూడా లేదని స్పష్టమగును. సుఖకల్పన అంతయు, కేవల రాజస,

తామస భావముల ఉద్రేకము వలన, చాంచల్య, ద్వైతదర్శనముల ఆధిక్యరూపమైన దుఃఖాపేక్ష వలననే అయి ఉన్నది. ప్రపంచ నివృత్తి, అంతర్ముఖత్వము ఎంత ఎంత ప్రమాణములో ఉండునో, అంత ప్రమాణములోనే సుఖకల్పన ఉండును. సుషుప్తియందు ద్వైతము చాలినంతగా నివృత్తమగును గాన, సుషుప్తియందు చాలినంత సుఖము గూడా కలుగును. కావుననే జీవులు, వారి భగవంతుడు-ఇరువురును స్వరూపభూతమైన నిష్ప్రపంచ సుఖము కొఱకే ప్రవృత్తులగుదురు.

ఒక్క దినము నిద్రపట్టని జీవుడు భయపడును. వానికి ప్రజాగర దోషమని భావించి నిద్రించుటకై వానికి అనేక ఉపచారములు చేయుదురు. ఆ సమయమున, ఎన్ని దివ్యాతిదివ్యములైన సౌఖ్యసాధనములు లభించినను, అవి అన్నియు వ్యర్థములనిపించును, వాని ప్రతీతి గూడా కష్టప్రదముగా ఉండును. సమస్తమును వీడి, కేవలము నిద్రించుటకు మాత్రమే జీవుడు వ్యగ్రుడగును. ఇది, నిష్ప్రపంచ అద్వైత సుఖమహత్త్వము కాదా? సావరణ, నిష్ప్రపంచ అద్వైతసుఖమందు అందఱికి ఇంత ఆకర్షణము ఉన్నపుడు, నిరావరణ, నిరతిశయ, నిష్ప్రపంచ అద్వైత సుఖమందు అందఱికిని ఎంత ప్రేమ ఉండునో, ఇపుడు కృతప్రజ్ఞులైనవారు ఆలోచించగలరు. ఇచట, సౌషుప్త, నిష్ప్రపంచ బ్రాహ్మ సుఖము సావరణము, సబీజము. కావుననే దీనిని పొందియు, జీవులకు పునరుత్థానము కలుగుచున్నది. జీవులకు కర్మఫలము నొసగుటకొఱకే లీలయా, భగవంతుని ఉత్థానము గూడా జరుగుచున్నదని తెలియవలయును. అధిష్ఠాన సాక్షాత్కారము వలన, ఎవరికి అజ్ఞానరూపమైన బీజము నివృత్తమగునో, ఆ నిర్బీజ బ్రహ్మ భావాపన్నులకు పునరుత్థానము ఉండదు.

సబీజ తత్త్వమునుండియే సమస్త ప్రపంచసృష్టి జరుగును.

అఖండము, అనంతము నయిన నభోమండలమున అత్యల్పమైన మేఘము అంకురించినట్లే అనన్త, అఖణ్డ, పరిపూర్ణ, పరమానన్ద, స్వప్రకాశరూపుడైన భగవంతుని అతిస్వల్ప ప్రదేశమందు అనన్త, అచిన్త్య, దివ్య మహామాయాశక్తి ఉండును. ఆ మహామాయాశక్తి యొక్క స్వల్ప ప్రదేశమందు గూడా అనన్తకోటి బ్రహ్మాండ జననులైన అనంత అవాంతర శక్తులు ఉండును. ఒక్కొక్క శక్తి యందు సత్త్వ, రజస్తమోగుణముల ప్రాధాన్య-అప్రాధాన్యముల వలన, విద్యా, అవిద్యా, తామసీ ప్రకృత్యాది అనేక భేదములు కలుగును.

రజస్తమోలేశము వలన గూడా అనాక్రాన్త అయిన, కావుననే, విశుద్ధ సత్త్వ ప్రధాన అయిన శక్తిని మాయ, లేక విద్య అందురు. రజస్తమోగుణస్పృష్ట, అవిశుద్ధ సత్త్వ ప్రధాన అయిన శక్తిని అవిద్య అందురు. తమోగుణప్రధానమైన శక్తి తామసీ ప్రకృతి అని చెప్పబడును. ఎడనెడ, మూలప్రకృతి గూడా మాయా, అవిద్యా శబ్దములచే చెప్పబడుచుండును.

"మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు
మహేశ్వరమ్ ।"

ఇత్యాది వాక్యములను ఉదాహరణగా గైకొనవచ్చును. అటులయినను, అట్లు చెప్పుట కార్యకారణముల అభేదము వలన ఔపచారిక మని తెలియవలయును.

"గోభిః శ్రీణీత మత్సరమ్ ।"

అను వాక్యమందు, మీమాంసకులు గో వికారమైన పయస్సు (క్షీరము) నందు 'గో'పద ప్రయోగము ఔపచారిక మని అంగీకరించుదురు. అట్లే ఎచటైనను, కార్యమును కారణమందు ప్రయోగించుట కలదు. కావున, మూల మహాశక్తియొక్క అవాంతర శక్తులవిభాగమందు విద్యా, అవిద్యాది పదముల ప్రయోగము శాస్త్రసమ్మతము.

విద్యారూపమైన, లేక మాయారూపమైన ఉపాధిచేత ఉపహిత చైతన్యము ఈశ్వరచైతన్యము, అవిద్యోపాధిచేత ఉపహిత చైతన్యము జీవచైతన్యము. తామసీ ప్రకృతివలన భోగ్యవర్గము ప్రాదుర్భవించును. ఈ తామసీ ప్రకృతిసహితుడైన పరమాత్మ వలన, మహత్తత్త్వము, మహత్తత్త్వమునుండి అహంతత్త్వము జనించును. శ్రుతులలో

"తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః ।"

ఇత్యాది వచనముల ద్వారా సాక్షాత్తుగా పరమాత్మనుండియే ఆకాశము ఉత్పన్నమైనట్లు అనిపించును. అయినను,

"బుద్ధే రాత్మా మహాన్ పరః, మహతః పర మవ్యక్తం
అవ్యక్తాత్ పురుషః పరః ।"

ఇత్యాది శ్రుతుల వలన పరమాత్మ, ఆయనశక్తి అయిన అవ్యక్తమునకు తరువాత, ఆకాశమునకు ముందు మహత్తత్త్వము, అహంతత్త్వము అను పేరు గల పదార్థములు గూడా ఉన్నవని విదితమగును. గీత కూడా

"మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్తమేవ చ ।"

అను శ్లోకముద్వారా అపంచీకృతములైన (పరస్పరము సమ్మిలితము కాని) ఆకాశాది పృథివీ పర్యంతము గల పంచమహాభూతములు, అహంకారము (అహంతత్త్వము), బుద్ధి(మహత్తత్త్వము), 'అవ్యక్తతత్త్వము'- వీనినే అష్ట ప్రకృతులుగా వర్ణించినది.

"భూమి రాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥"

అను శ్లోకమునందు గూడా భగవద్గీత, వానినే వర్ణించినది. ఈ శ్లోకమందు గల మనస్సు(మనః)అను శబ్దముచేత ఆకాశతత్త్వమునకు కారణమైన అహంతత్త్వమని తెలిసికొనవలయును, 'బుద్ధి' పదముచేత అహంతత్త్వమునకు కారణమైన మహత్తత్త్వమని

తెలియవలయును. 'అహంకార' శబ్దముచేత మహత్తత్త్వమునకు కారణమైన అవ్యక్తము అని తెలియవలయును ఏలన, ఈవిధము గానే ప్రకృతి, వికృతిభావము సర్వత్ర ప్రసిద్ధము. యథాశ్రుత మైన మనోబుద్ధి, అహంకారములకు కార్యకారణభావము ఎచటను ప్రసిద్ధము కాదు. ఇచట "భిన్నా ప్రకృతి రష్టధా" అను వాక్యము వలన భిన్న భిన్నములైన ఎనిమిది ప్రకృతులు వివక్షితములు. ఇది, భూమి జలమునుండి, జలము తేజస్సునుండి, అనలము (తేజస్సు) వాయువునుండి, వాయువు ఆకాశమునుండి, ఆకాశము అహంతత్త్వమునుండి, అహంతత్త్వము మహత్తత్త్వము అవ్యక్త తత్త్వమునుండి, ఆవిర్భవించినవని అంగీకరించినపుడే సంభవము. కావుననే

"మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్త మేవ చ ।"

అను గీతావచనమందు అహంతత్త్వ, మహత్తత్త్వ, అవ్యక్తతత్త్వ ముల వర్ణనము విస్పష్టముగా ఉన్నది. ఈవిధముగా శ్రుతి, స్మృతుల తాత్పర్యవివేచనమువలన సాక్షాత్తుగా పరమాత్మనుండి ఆకాశము ఉత్పన్నము కాలేదనియు, విశేషించి, మహత్తత్త్వాది క్రమముతోనే జరిగినదనియు స్పష్టముగా విదితమగును. కావుననే ఎచటైనను, పరతత్త్వమైన పరమాత్మనుండి తిన్నగా తేజస్సుయొక్క ఉత్పత్తి శ్రూయమాణమగునో, అచట గూడా ఆకాశ, వాయువులు సృష్టమైన తరువాతనే ఆకాశవాయురూపములో ఆవిర్భవించిన పరమాత్మనుండి తేజస్సు సృష్టమైనదని తెలియవలయును.

"తదైక్షత ఏకోఽహం బహు స్యామ్ ।"

పరమాత్మ, ఒక్కడనే అయిన నేను అనేకముగా అగుదునని ఆలోచించెను అనుచు, శ్రుతులయందు ఈక్షణము (పర్యాలోచనము), అహంయొక్క ఉల్లేఖనము లభించునో దానివలన గూడా అహం తత్త్వ, మహత్తత్త్వముల ద్యోతనమే అగును. ఏ కార్యనిర్మాణ

ఱుంద్దైనను, జ్ఞానము, అహంకారము అవశ్యకమగును. వ్యష్టిద్వారము ననే సమష్టిభావములు తెలియును. సమష్టితత్త్వమును బుద్ధ్యారూఢము చేయుటకొఱకు మొదట, వ్యష్టినే ఆశ్రయించవలసి ఉండును. కావున శ్రుతియే-

"స ఏకాకీ న రేమే।"

ఏకాకి యగుటవలన ఆ పురుషునికి అరతి కలిగెననియు,

"తస్మాదేకాకీ న రమతే।"

ఆ కారణముచేత ఇపుడు గూడా ప్రాణులకు ఏకాకియై ఉన్నపుడు రమణము, ఆనందము కలుగదనియు చెప్పెను. ఉపాసనములందు ఎదుటగా ఉన్న సాలిగ్రామమందు అప్రత్యక్షమైన విష్ణుభావన చేయబడుటకు కారణ మిదియే. ఆ విధముగానే ప్రత్యక్ష వ్యష్టి జాగ్రదవస్థయందును, స్థూల శరీరాభిమానము గల విశ్వమందును సమష్టి స్థూలప్రపంచాభిమాని అయిన వైశ్వానరదృష్టియు, వ్యష్టి స్వప్నావస్థాభిమాని, సూక్ష్మశరీరాభిమానియునయిన తైజసునందు సమష్టి సూక్ష్మప్రపంచాభిమానియైన హిరణ్యగర్భదృష్టియు, వ్యష్టి సుషుప్తిఅవస్థాభిమాని, అజ్ఞానరూపకారణశరీరాభిమానియు నయిన ప్రాజ్ఞుని యందు సమష్టి అజ్ఞానరూప కారణశరీరాభిమాని యగు కారణబ్రహ్మరూపమైన అవ్యక్తదృష్టి చెప్పబడినది. దీనికి భిన్నముగా విరాట్‌నందు, సమష్టిదృష్టి చెప్పబడలేదు. ఏలన, సమష్టి అప్రత్యక్షము కదా ! ఆకాశముయొక్క ఏకదేశమున ఒక చిన్న మబ్బుతునకను చూచి ఆకాశవ్యాపియైన మహామేఘమండలము ఊహించబడును. స్వల్ప పరిమాణము గల, దీప్తిమంతమైన అగ్నిని చూచి, అఖండము, బ్రహ్మాండవ్యాపకము, దీప్తిమంతము నయిన అగ్ని ఊహించబడినట్లే అనుభూతమైన వ్యష్టి అజ్ఞాన, జ్ఞాన, అహంకారములచేత సమష్టి అజ్ఞానము, మహత్తత్త్వము, అహంతత్త్వము గూడా బుద్ధియందు ఆరూఢము కావచ్చును. సమస్త తత్త్వములు

క్రమముగా ఉత్పన్నములై ఆ పరమాత్మయందే లీనమగును. సుషుప్తియందు గూడా ప్రపంచ లయము ప్రతీత మగును. గాఢ నిద్రయందు లీనమైన పురుషుడు ఏమియును ఎఱుంగడు. వానికి అహంకారము ఉండదు. అతడు, ఏ పనియు చేయజాలడు అని మనము స్పష్టముగా చూచుదుము. ఏలన,సమస్త ఇంద్రియములు. అహంకారము ఆ సమయమున, అజ్ఞానమందు లీనమగును.

"సన్నే యదింద్రియగణేఽహామి చ ప్రసుప్తే।"

కావుననే సుషుప్తిదశయందు ఉన్న ఆత్మయే బ్రహ్మ అని ప్రజాపతి ఉపదేశించినపుడు ఇంద్రునికి "సుషుప్తియందు తనకు సంబంధించిన జ్ఞానము గాని, ఇతరులకు సంబంధించిన జ్ఞానము గాని ఉండదు కదా ! అపుడు దీనియందు పురుషార్థమేమి కలదు ?" అని అనుపపత్తి గోచరించెను.కాని, ఇచట గూడా అహంకారాదులకు ఆత్యంతిక లయము లేదు. ఏలయనగా జాగరమందు ఆ అహంకారాదులు మరల ప్రతీతము లగును. సుషుప్తిదశలో జీవునికి ఏమియును జ్ఞానము ఉండదన్న విషయము అత్యంత ప్రసిద్ధము. కాని, "సుఖమహ మస్వాప్సమ్" (నేను సుఖముగా నిద్రించితిని), "న కించి దవేదిషమ్" (నేను ఏమియు నెఱుంగను) అనునట్టి స్మృతి, సుషుప్తినుండి మేల్కొనిన పురుషునికి కలుగును. ఈ స్మృతియు, అనుభవము లేక, అసంభవము. ఎందువలననిన, అనుభవము లేక, ఏ స్మృతియు కలుగదన్న విషయమును గూడా విజ్ఞులైన పురుషులే తెలిసికొనగలుగుదురు. కావున, సుషుప్తినుండి మేల్కొనిన పురుషుని స్మృతి చేత నిశ్చయమగునది ఏమనిన, సుషుప్తియందు గాఢనిద్రా ప్రకాశకము,సౌషుప్త సుఖ ప్రకాశకము నయిన ఒకానొక స్వాభావిక అఖండ, నిత్య, విజ్ఞానము అవశ్యము ఉండును. సుషుప్తియందు భావరూపమైన సుఖము గాని,అజ్ఞానము గాని ఉండదు. కాని, దుఃఖాభావమందే, జ్ఞానాభావమందే సుఖ

వ్యవహారము, అజ్ఞానవ్యవహారము కలుగుచున్నదని కొందఱు అందురు. వారు, జ్ఞానాభావము యొక్క జ్ఞానము ఎట్లు కలుగుచున్నదన్న ప్రశ్నకు సమాధానము చెప్పవలయును. అభావముయొక్క జ్ఞానమందు అనుయోగి (అధికరణము), ప్రతియోగి (అభావముగల పదార్థము) యొక్క జ్ఞానము ఆవశ్యకమై ఉండును. ఘటాభావమును తెలిసికొనుటకై అనుయోగి (ఘటాభావమునకు అధికరణములైన భూతలాదులు), ప్రతియోగి (ఘటము)- ఈ రెంటి జ్ఞానము ఆవశ్యకమగును. లేకపోయినచో, దేని అభావము ఎచట ఉన్నది అను జిజ్ఞాస ఉపశమించదు.

సుషుప్తియందు జ్ఞానాభావముయొక్క **అధికరణభావము**, తత్ప్రతియోగిభావము ఉండియున్నచో, ఆ జ్ఞానము ఉండగా అచట జ్ఞానాభావమని ఎట్లు చెప్పనగును ? ఒకానొక ఘటము కల భూతలమందు ఘటాభావ వ్యవహారము ఎట్లు జరుగజాలును ? సుషుప్తియందు జ్ఞానాభావము యొక్క అనుయోగి, ప్రతియోగి జ్ఞానము లేనిచో, తద్జ్ఞానాభావముయొక్క అనుపలబ్ధిద్వారా గాని, లేక ప్రత్యక్షము ద్వారా గాని ఏవిధముగాను, జ్ఞానము కలుగజాలదు.

కావున, ఆత్మస్వరూపావరకమైన అజ్ఞానము, పూర్వకథనానుసారము, భావరూపమే. సూర్యునికి ఆవరకమైన మేఘము యొక్క ప్రకాశము సూర్యునివలననే కలుగురీతిగా నిత్యము, విజ్ఞానానందఘనము నయిన ఆత్మకు ఆవరకమైన అజ్ఞానముయొక్క ప్రకాశము సాక్షిరూపమైన ఆత్మ వలననే కలుగును. ఈ విషయము మఱొక స్థలమున స్పష్టీకరించబడును. సుషుప్తిదశయందు నిద్రవలన, లేక అజ్ఞానమువలన, సమావృతుడైన సాక్షి ద్వారా అజ్ఞానము ప్రకాశించుననియే, ప్రస్తుత విషయము. అహంకారాదులు అచట ఉండవు. సుషుప్త్యనంతరము, నిద్రానివృత్తియందు, ఏవిధమైన విశేష

వికల్ప స్ఫురణము లేని జ్ఞానము కలుగును. ఇచట, రెండు స్థితులు కలవు- విషయవిశేషస్ఫురణము లేకయే బౌద్ధ (బుద్ధిప్రయుక్తమైన) జ్ఞానము కలుగును. దానిని వ్యష్టి మహత్తత్త్వమని చెప్పవచ్చును. తదనంతరము, అహంకారము ఉల్లేఖింపబడును. కావుననే అజ్ఞానమునుండి జ్ఞానోత్పత్తి అని తలంచబడును. సుషుప్తియందు అజ్ఞానమే ఉండును. దానికి అవ్యవహితోత్తర జాగరణమందే, లేక స్వప్నమందే కొంత జ్ఞానము కలుగును. సమష్టి అజ్ఞానరూపమైన మాయ వలన, మహత్తత్త్వము జనించును. అవ్యక్తమునుండి వ్యక్తము ప్రాదుర్భవించు విధముగానే అజ్ఞానమునుండి జ్ఞానము ప్రాదుర్భవించుట యుక్తమే. ఉత్పన్నమైన వ్యక్త జ్ఞానము దక్క, నిద్రాణము, బ్రహ్మరూపము నయిన అఖండ బోధయు అభివ్యక్తమగును.తత్పరతాపూర్వకముగా తత్సాక్షాత్కారముచేతనే జీవుడు శాశ్వతముగా బంధవిముక్తుడగును. ఆత్మావరకములు రెండని వివేకవంతుల కథనము. ఒకటి, దృశ్యస్ఫురణము, రెండు, అజ్ఞానము. జాగ్రత్, స్వప్నదశలందు ఆత్మ, విక్షేపరూప దృశ్యముచేత సమావృతుడై ఉండును, సుషుప్తియందు అజ్ఞానావృతుడై ఉండును. సమాధియందు ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్రా, స్మృతులనెడు పంచవృత్తుల నిరోధము జరుగును. అనగా జాగ్రత్, స్వప్న, సుషుప్తులనెడి అవస్థాత్రయముకంటె అతీతమైన తురీయావస్థ ఉదయించును. అపుడు, నిరావరణ, విశుద్ధ ఆత్మ తత్త్వదర్శనము సిద్ధించును. అజ్ఞానాది సమస్త దృశ్యముల ప్రతీతి, లేక భానము, కింవా, ప్రకాశమే అఖండ, అనంత ఆత్మ. ప్రతీతి లేక, భానము లేక, ప్రకాశము లేక, ఏ పదార్థమునకైనను, అస్తిత్వమే సిద్ధించదు. ప్రతి పదార్థము,ఏ కారణము చేతనయినను, ఎచటైనను, ఏవిధముగా నయినను విజ్ఞాతమై ఉండును.ఆకారణము చేతనే ప్రతీతియందే సమస్త దేశ, సమస్తకాల, సమస్తవస్తువులు

ఉండును. సర్వభాసకము, నిర్మలము, అఖండము నయిన ఈ ప్రతీతియే పరమాత్మస్వరూపము.

ఈ అఖండ ప్రతీతి, ఆకాశమువలె శూన్యమైనది కాదు, ఘనీభూతమైనది. దర్పణమందు ప్రతిబింబస్ఫురణము కలుగునట్లే ఈ ప్రతీతియందు దృశ్యస్ఫురణము కలుగును. దర్పణప్రతీతి లేక, ప్రతిబింబప్రకాశము కలుగదు.ఆ విధముగానే స్వయంప్రకాశ ప్రతీతి లేక, స్ఫురించిన దృశ్యము యొక్కస్ఫురణము కలుగదు. కావుననే,

> "తమేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి ।"

అని శ్రుతి. దర్పణస్ఫురణానంతరము ప్రతిబింబము స్ఫురించినట్లే స్వయంప్రకాశ ప్రతీతి స్ఫురించిన తరువాత,దృశ్యస్ఫురణము కలుగును. అసంగ, అనంత, స్వప్రకాశ, సద్ఘన, చిద్ఘన, ఆనందఘన, నిరవయవ, పరమాత్మయందు, ప్రపంచ సంసర్గ ప్రకారము ఇదియే. అందఱును, పరమాత్మను అఖండ, అసంగ, నిష్కల, అనంత స్వరూపమని అంగీకరింతురు.

ఇటువంటి పరిస్థితిలో ప్రపంచము యొక్క స్థితి ఎట్లు సంభవము, ఎచట సంభవము ? పరమాత్మ లేని దేశకాలములందైనను చేర్చవలయును, లేక పరమాత్మను ఆకాశమువలె సావకాశమైన (అవకాశము కల) శూన్యమని అయినను భావించవలయును. కాని, ఈ రెండు పక్షములును శాస్త్రవిరుద్ధములు. ఏలయనగా, శాస్త్రములు పరమాత్మను 'బ్రహ్మ'శబ్దముచే బోధించినవి. 'బ్రహ్మ'శబ్దము "బృహి వృద్ధౌ" అను ధాతువునుండి నిష్పన్నమయ్యెను. కావున, 'బ్రహ్మ'శబ్దమునకు 'బృహత్', లేక 'మహాన్' అని అర్థము. ఒకానొక 'బృహత్' లేక 'మహాన్' అయిన వస్తువును 'బ్రహ్మ'

యందురని దీనివలన స్పష్టమయ్యెను. ఇపుడు, వివేచన చేయ వలసిన విషయము ఇది- బ్రహ్మయొక్క ఆ బృహత్త్వము సాపేక్షమా,లేకనిరపేక్షమా? సాతిశయమా,లేక నిరతిశయమా?అనగా, ఘట, పట, మఠాదులందు బృహత్త్వము ఉన్నది. కాని, ఆ కాశమునందు నిరపేక్షమైన బృహత్త్వమున్నది. ఆరీతిగానే, బ్రహ్మ యందు, ఎట్టి బృహత్త్వము ఉండవలయును ? ఈ విషయమును గురించి విజ్ఞజనుల అభిప్రాయ మేమనిన, ఏదైన, ఒక సంకోచక పదము ఉన్నచో, బ్రహ్మయందు సాపేక్ష బృహత్త్వమును కల్పించ వచ్చును. ఎట్లనిన,

"సర్వే బ్రాహ్మణా భోజనీయాః ।"

అను వచనమునందు 'సర్వ' పదసంకోచము చేయబడును. ఎచట, సార్వత్రిక, సార్వదేశిక సర్వ బ్రాహ్మణులు ఏకత్రితభావము లేక భోజనము అసంభవమో, అచట,

"నిమంత్రితాః సర్వే బ్రాహ్మణాః భోజనీయాః ।"

ఈవిధముగా 'సర్వ' పదసంకోచము చేసి, నిమంత్రితులైన సర్వ బ్రాహ్మణులు గ్రహించబడుదురు. అట్లే, ఇచట గూడా సంకోచక మైన ప్రమాణ మేదియైనను ఉండియున్నచో, లేక నిరతిశయ బృహత్త్వమునందు అనుపపత్తి ఏదియైనను ఉండియున్నచో "ఈవిధమైన ఇంతటి మహత్త్వము కలవానిని బ్రహ్మయని చెప్పెద" మని చెప్పవచ్చును. ఏవిధమైన సంకోచక ప్రమాణము లేనపుడు, నిరతిశయ మహత్త్వమందు అనుపపత్తి ఏదియు లేనపుడు, సర్వథా, సర్వాధికము, నిరతిశయము నయిన మహత్త్వము కలదానినే 'బ్రహ్మ' అని చెప్పవలయును. ఎచట, మహత్త్వాతి శయమునకు సంబంధించిన కల్పనాపరంపర విరతమగునో (ఆగి పోవునో), దేనికంటె అధిక బృహత్త్వకల్పన చేయుట అసంభ వమో, ఆ వస్తువే 'బ్రహ్మ' శబ్దవాచ్యము. అయినను,భగవతీ శ్రుతి

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ ।"

అను వచనమునందు లక్షణయా, విశేషణరూపములో 'అనన్త' పదమును ప్రయోగించినది. దీనివలన, నిరతిశయ మహత్త్వము అధికముగా పరిపుష్టమగును. ఈవిధముగా సర్వథా నిరతిశయ మహత్త్వసంపన్నమైన తత్త్వమునే 'బ్రహ్మ' అందురని సిద్ధించినది.

ఏ పదార్థము ఒక దేశమున ఉండి, మఱొక దేశమున, ఉండదో, ఆ పదార్థము దేశపరిచ్ఛిన్నమైనదే. దానియందు నిరతిశయ మహత్త్వము ఎట్లు సంభవము? ఎపుడైనను నశించు పదార్థము, కాలపరిచ్ఛిన్నము, అనిత్యము నయినది. అది గూడా అనంత మహత్త్వసంపన్నము కాజాలదు. మఱొక వస్తువు యొక్క అస్తిత్వము ఉన్నచో, అన్యోన్యాభావము యొక్క ప్రతియోగి అగుటవలన, బ్రహ్మ, వస్తుపరిచ్ఛిన్నమగును. కావున, నిరతిశయ మహత్త్వము దానియందు ఉండనేరదు. కావున, నిరతిశయ, అనంత మహత్త్వమునకై 'బ్రహ్మ', సర్వదేశ, కాల, వస్తువుల కంటె అతీతము, అపరిచ్ఛిన్నము అని అంగీకరించవలయును. బ్రహ్మ లేని దేశము గాని, కాలము గాని, వస్తువు గాని లేకపోవుటయే కాక, సమస్త దేశ, కాల, వస్తువులందు బ్రహ్మాస్తిత్వము కలదు అని చెప్పుటయు ఔపచారికమే. తంతునిర్మితమైన పటమునందు తంతువుయొక్క అస్తిత్వము, కనకనిర్మితములైన కంకణ, కుండల, ముకుటాదులందు సువర్ణముయొక్క అస్తిత్వము తరంగమునందు జలముయొక్క ఉనికి,కల్పితమైన సర్పమునందు అధిష్ఠానరూపమైన రజ్జువుయొక్క అస్తిత్వము ఉన్నట్లే, 'దేశ, కాల, వస్తువులందు బ్రహ్మాస్తిత్వము కలదు' అను వ్యవహారము ప్రాకృత, వివేకి పురుషులయందు జరుగుచుండును. వస్తుతః, తంతువులకంటె భిన్నమైన 'పట' మన్న పేరు గల తాత్త్వికమైన వస్తువన్నదియే లేదు. సువర్ణముకంటె భిన్నముగా కుండలాదులు

పృథక్ వస్తువులు కావు. జలముకంటె భిన్నముగా 'తరంగ'మన్న పేరు గల పదార్థాంతరము లేదు. కాని, తంత్వాదులందే, పటాది కల్పన చేయబడును. సరిగా ఆరీతిగానే, బ్రహ్మభిన్నములైన దేశ, కాల, వస్తువులు లేనే లేవు. దేశకాలవస్తువులందు బ్రహ్మ పదార్థము లేదు. కాని, దేశ, కాల, వస్తువులే బ్రహ్మయందు కల్పితములు. ఇందుచేతనే,

"యథా మహాన్తి భూతాని భూతేషు ఉచ్చావచేష్వను।
ప్రవిష్టా న్యప్రవిష్టాని తథా తేషు న తేష్వహమ్॥"

అను గీతయందు భగవద్వచనము ఆకాశాది పంచమహాభూతములు, ఉచ్చావచములైన నానావిధ భౌతికప్రపంచములయందు ప్రవేశించియు, ప్రవేశించక ఉన్నచందముగానే, నేను మహాభూతముల యందు ప్రవిష్టుడనై ఉన్నాను, అప్రవిష్టుడనై ఉన్నాననియు చెప్పుచున్నవి.

కార్యవర్గమునందు మహాభూతాది కారణోపలబ్ధి కలుగును గాన, ప్రవేశకల్పన చేయబడును. వస్తుతః,

"ప్రాగేవ విద్యమానత్వాత్ న తేషా మిహ సంభవః।"

మొదటినుండియు, ఏవి వ్యాపకములో, వానికి ప్రవేశము చెప్పుట ఎట్లు ? ఈ అభిప్రాయముతోనే,

"న త్వహం తేషు, తే మయి।"

అను వచనము ద్వారా భగవానుడే, 'సమస్త విశ్వము నాయందు ఉన్నదిగాని, నేను ప్రపంచమునందు లేను' అని విస్పష్టమొనర్చెను. దీనివలన, భగవంతునికంటె భిన్నమైన వస్తువుయొక్క స్థితి గల బ్రహ్మరహితమైన దేశము గాని,కాలము గాని లేనేలేదని సిద్ధించినది. కాని, సర్వ దేశ,కాలములే బ్రహ్మయందు ఉన్నపుడు,దేశనిష్ఠమైన వస్తువు, సుతరాం బ్రహ్మయందే పర్యవసిత మగును.

ఇపుడు, చూడవలసిన దేమనిన, దేశ, కాల, వస్తువులు అసంగ బ్రహ్మయందు ఎట్లు ఉండును? శ్రుతులు, బ్రహ్మనే సమస్త ప్రపంచమునకు ఉపాదానకారణము, నిమిత్తకారణమనియు చెప్పినవి. కొంత సమయముపాటు, ప్రకృతినే ఉపాదానకారణమని అంగీకరించినను, ప్రకృతి ఎచట ఉన్నది? బ్రహ్మయందు ఉన్నదా, తద్భిన్నముగా ఉన్నదా? అను ప్రశ్నయే ఉత్పన్నమగును. బ్రహ్మకంటె, పృథక్ దేశ, కాలములు లేనపుడు, పృథక్ దేశమునందు ప్రకృతికల్పన ఎట్లు ఉద్భవించును? ఒకవేళ, బ్రహ్మయందే ప్రకృతి ఉన్నదని చెప్పెదమనిన, అపుడు గూడా ఏ సంబంధముతో ప్రకృతి బ్రహ్మయందు ఉన్నది? అను ప్రశ్న బయలుదేరును. ప్రకృతికి గాని, బ్రహ్మకుగాని, బ్రహ్మతో ఏదేని సంబంధమును అంగీకరించినచో, బ్రహ్మయందు అసంగత్వము పొసగదు. ఇంతియే కాక, ఉపాదానమును వీడి, అన్యత్ర, కార్య సత్తను చెప్పవలనుపడదు. జలమును వీడి, వీచి (తరంగము), సువర్ణమును వీడి, కటక,కుండలాదులు వేఱుగా ఎట్లు ఉండజాలును? ఇంతియే కాక, ప్రపంచస్వభావము, భగవత్స్వభావము పరస్పరము అత్యంత విరుద్ధములు. బ్రహ్మ అపరిచ్ఛిన్నము, ప్రపంచము పరిచ్ఛిన్నము, బ్రహ్మ అమృతస్వరూపము, ప్రపంచము మర్త్యము, బ్రహ్మ సుఖదుఃఖ మోహాతీతము, ప్రపంచము సుఖదుఃఖమోహాత్మకము, బ్రహ్మ, పరమ సత్యము, స్వప్రకాశము, పరమానంద రూపము, ప్రపంచము అనృతము, జడము,దుఃఖరూపము. బ్రహ్మ, నిరవయవము, నిష్కలము, ప్రపంచము సావయవము, సకలము. కావున, బ్రహ్మకు, ప్రపంచమునకు గల సంబంధము ఏది యగును, ఎట్లగును? నిర్గుణము, నిష్క్రియము నగుట వలన, బ్రహ్మను 'ద్రవ్య' మని చెప్పుటకు వలనుపడదు. కావుననే, బ్రహ్మయందు, సంయోగ, సమవాయసంబంధములనెడి నియామక సంబంధములు

రెండును, కుదరజాలవు. నిష్కలము, నిరవయవమునందు గూడా, ఈ సంబంధము పొసగనేరదు. కావున, ఆధ్యాత్మిక సంబంధమును అంగీకరించుట యుక్తము. ఈ ఆశయముతోనే,

"మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా ।
మత్స్థాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః ॥"
"న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్ ।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥"

అని భగవద్గీతావచనములు ప్రవృత్తములైనవి. నా అవ్యక్త మూర్తినుండి సమస్త సాకాశ (ఆకాశసహిత) ప్రపంచము వ్యాప్తమై ఉన్నది. సమస్త భూతములు నాయందు ఉన్నవిగాని,వానియందు నేను అవస్థితుడనై లేను. వాస్తవమునకు సమస్త ప్రపంచము నాయందు స్థితి గలిగియు లేదు అని పై గీతావచనముల తాత్పర్యము.

అభిప్రాయ మేమనిన, బహిర్ముఖులైన ప్రాణుల దృష్టిలో ప్రపంచమే స్పష్టముగా విద్యమానమై ఉన్నది. ప్రపంచాతీతుడైన భగవంతుని అస్తిత్వమే దుర్గమము. కావున, ప్రపంచమునకు కారణ రూపముతోను, లేక ఆధారభూతము, భాసకము నయిన సత్తా స్ఫూర్తిప్రదరూపముతోను, భగవదస్తిత్వము పైన విశ్వాసము ఉండుట అన్నిటికంటె గొప్ప విషయము. అభిజ్ఞులైనవారు కొందఱు ప్రపంచమును గాంచి, తదాధారమును, తత్కారణమును అన్వేషింతురు. ఒకవేళ, భగవంతుడు మొట్టమొదటనే "నేను ప్రపంచము నందు లేను, ప్రపంచము నాయందు లేదు" అని చెప్పినచో,స్వీయ దృష్టిసిద్ధమైన ప్రపంచమునకు కారణమును అన్వేషించు సాధకుడు, భగవంతునినుండి నిరాశుడై,పరమాణువును,ప్రకృతిని, లేక మఱొక దానిని దేనినైనను, ప్రపంచకారణమని నిశ్చయించును. కావున, భగవంతుడు ప్రాణికోటికళ్యాణార్థమై మొదట, "నేను, ప్రపంచ

కారణము. తత్త్వతః, వివేచనచేయబడినచో, జగత్తు అను పదార్థమే లేదు. కాని, అజ్ఞబుద్ధిసిద్ధమైన వ్యావహారిక ప్రపంచ మున్నచో, నాయందే ఉన్నది. నేనే దీనిలోపల, బయట, మధ్యభాగమున ఉండి, నేనే తద్భాసకుడనై ఉన్నానని చెప్పను. ఈవిధముగా భగవంతుని ఉపదేశము వలన, ప్రాణికి, ప్రపంచముకంటె భిన్నుడైన ఒక భగవంతునియందు విశ్వాసము కలుగును. అపుడు, మరల సరియైన తత్త్వము 'నాకంటె భిన్నమైన ప్రపంచమే లేదనియు, ఉన్నదంతయు నేనొక్కడనే అనియు ఉపదేశము చేయబడును.

భ్రాంతివలన, ఎవరికైనను క్షీరసాగరమందు క్షారసాగర భావము కలిగినట్లుగానే ఏకము, అఖండము నయిన ఆనందసాగరమందే భవసాగరమన్న కల్పన ఉదయించును. ఆనందసాగరమే భ్రాంతిచేత భవసాగరముగా భాసించును. ఆనందసాగరముకంటె భిన్నమైన భవసాగరమన్న వస్తువే లేదు. బాహ్యాభ్యంతరముల యందు, సర్వత్ర, అచింత్య, అనంత, అఖండ సంవిత్సుఖసాగర భానమే కలుగుచుండును. కావుననే, గోస్వామీ తులసీదాసు "హే భగవన్! ఆనందసింధుమధ్యభాగము నీ నివాసస్థానము, కాని, జీవులు అజ్ఞానముతో ఆనందసుధాస్వాదనము చేయక, పిపాసువులై మృత్యుగహ్వరమున పడుచున్నారు" అని వేదనను వ్యక్తము చేసెను. కావున, భగవంతుడు కారణము, సర్వాధారము, సర్వభూతుడయ్యు, అసంగుడు, సర్వరహితుడు. ఆనందసాగరమునకు, భవసాగరమునకు సంయోగ, సమవాయాది సంబంధములు పొసగ నేరవు. కావున, కేవలము ఆధ్యాత్మిక సంబంధము మాత్రమే కలదు. అనగా, ఆధ్యాత్మిక సంబంధమువలన ప్రపంచము బ్రహ్మయందు ఉండవచ్చును. ఈ విషయమును ఇట్లు చెప్పవచ్చును—"దర్పణము నందు ఆకాశమండలము, సూర్యమండలము, చంద్రమండలము, నక్షత్రమండలము, భూధర, సాగరాది నానావిధ దృశ్యములు

ప్రతిబింబములుగా కన్పించవచ్చునుగాని, వస్తుతః, అవి అచట లేనే లేవు, కేవలము ప్రతీయమానము లగును. సరిగా ఆరీతిగానే మహా ప్రతీతిరూప దర్పణమునందు ఈ సమస్త చరాచర ప్రపంచము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి,అహంకారము,అజ్ఞానము- ఇవి అన్నియు ప్రతిబింబము వలె, లేనివయ్యు, ప్రతీతములగును. సమస్త దేశ, క్షణ, ప్రహర, దివస, పక్ష, మాస, అబ్ద, యుగ, కల్ప, గతాగత నానావిధ కాలములు- ఇవి అన్నియు అఖండ, అనంత, నిర్మల, అసంగ, ప్రతీతిరూప దర్పణమునందు, సరిగా ప్రతిబింబమువలె ప్రతీయమానము లగును.

రూపాదులను గ్రహించుటకు ప్రవృత్తమయ్యు, నేత్రేంద్రియము సౌరాది ఆలోకమును గ్రహించును, అనంతరము ఆలోకము చేత అవభాసితమైన రూపమును గ్రహించును. ఆ విధముగానే సర్వభాసకమైన ప్రతీతి యొక్క స్ఫురణము మొదట, కలుగును. అటుపిమ్మట, ప్రతీతి ప్రకాశితమైన అహంకారాది దృశ్య స్ఫురణము కలుగును. అథవా, మొదట దర్పణము గ్రహింపబడును, అనంతరము దర్పణాంతర్గతమైన ప్రతిబింబ ప్రతీతి కలుగును. అట్లే, మొదట, ప్రతీతిరూపమైన దర్పణ ప్రతీతి కలుగును.

"తమేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి ।"

అను శ్రుతియొక్క ఆశయ మిదియే. పరమాత్మ ప్రకాశము వెనుక, సమస్త దృశ్యప్రపంచప్రకాశము కలుగును. పరమాత్మ ప్రకాశము వలననే సకల దృశ్యము ప్రకాశితమగును. చక్షురాది ఇంద్రియములు, మనో, బుద్ధి, అహంకారములు- ఇవన్నియు, తమ తమ ప్రకాశ్య విషయములను ప్రకాశింపజేయునట్టివి గాన, జ్యోతీరూపములు. కాని, ఈ జ్యోతులను గూడా ప్రకాశింపజేయువాడు, విశుద్ధ భానరూపుడు నయిన పరమాత్మ, జ్యోతులకు సైతము జ్యోతియై ఉన్నాడు.

"జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే।"

తమోరూపమైన అజ్ఞానమునకు ప్రకాశకుడు గూడా ఆ పరమాత్మయే. కావున,

"దేశః స్ఫురతి దేశోఽస్తి కాలో భాతి కాలోఽస్తి వస్తూని
స్ఫురన్తి వస్తూని సన్తి।"

ఇత్యాది రూపముతో దేశ, కాల, వస్తు ప్రతీతి కలుగుచున్నది. అటులనే, దేశము ఉన్నది, కాలము ఉన్నది, వస్తువు ఉన్నది- ఈ విధముగా దేశ, కాల, వస్తుగత సత్త స్పష్టముగా భాసించుచున్నది. దర్పణము వలన ప్రతిబింబము కబలితమగును. దర్పణము లేక, ప్రతిబింబప్రతీతియే కలుగజాలదు.ఆ విధముగానే దేశము,కాలము, సమస్త వస్తువులు అబాధిత సత్తచేతను, అఖండ, అనంత ప్రతీతి చేతను కబలితములు (గ్రస్తములు) అగును. కావున, ప్రతీతి,సత్త లేక, దేశకాలాదులు సిద్ధింపనేరవు.సత్తాస్ఫూర్తివిహీనమైన దేశాదులు అసద్రూపములు, స్ఫూర్తిరహితములు నగును.

ప్రతిబింబముకంటె భిన్నమైన బింబము దర్పణముకంటె భిన్నముగా ఉండును. అయినను, అచట, బింబమువలె ఒకానొక పృథక్ వస్తుస్థితి గల సత్తాప్రతీతిరూపమైన దర్పణముకంటె చిన్నమైన దేశమన్నదియే లేదు. ఆ కారణముచేత మనము గూడా జగత్తును ప్రతిబింబమని చెప్పక, ప్రతిబింబసమానమని చెప్పుదుము. వస్తుతత్త్వము బుద్ధియందు ఆరూఢమగుటకు దృష్టాంతము ఉపపాదింపబడును. దృష్టాంతము ఎంత వఱకనిన, దర్పణమునందు లేనిదయ్యు, ప్రతిబింబము స్పష్టముగా దర్పణమునందు గోచరమగురీతిగానే, ప్రపంచము లేనిదయ్యు అత్యంత స్పష్టముగా ప్రతీతమగును. ప్రతిబింబమునకు ఆధారమైన దర్పణముకంటె భిన్నమై గూడా దేశము ఉండును. అచట, ప్రతిబింబమునకు నిమిత్తము బింబము గూడా అగునన్నది వేఱు విషయము. కాని,

బింబసమానమైన ఒకానొక సత్యము వస్తునిమిత్తము గూడా కాదు. కాని, ఏకమాత్ర అనిర్వచనీయశక్తియొక్కఅద్భుత మాహాత్మ్యము వలన, ప్రతిబింబమువలె వస్తుతః, అత్యంత అసత్కల్పమైన దృశ్య ప్రపంచము ప్రతీతమగును. ఆ శక్తియే సమస్త దృశ్యకల్పనకు మూలము. అట్లే తన కల్పనకు గూడా మూలము ఆ శక్తి, తానే అయి ఉన్నది. భేదమే ఘట, పటములను వేఱు చేయును. ఆ భేదమే ఘట, పటములకంటె తన భేదమును గూడా సిద్ధింపజేసి కొనును. అథవా, అనుభవమే తన విషయములకును,తన వ్యవహార మునకును జనకమై ఉన్నది. నైయాయికుల ఆత్మయే, సర్వజ్ఞేయ మునకు, తనకు గూడా జ్ఞాతయై ఉండును. ఆవిధముగానే ఆ శక్తి, బ్రహ్మనే సర్వదృశ్యరూపముగాను, తన రూపముగాను, ప్రతి భాసింపజేయును. ప్రతిబింబరహితమైన దర్పణమునందు మాత్రమే దృష్టి సారించినచో, ప్రతిబింబము గోచరించనట్లే దృశ్యరహితము చిత్రరూపము నయిన నిత్య దృక్స్వరూపమునందు దృష్టి ఉంచుట వలన దృశ్యము, దర్శనము, సాభాస అహమర్థరూపమైన అనిత్య ద్రష్ట- ఈ సమస్తముయొక్క అత్యంతాభావము కలుగును.

ప్రతిబింబమునందు దృష్టి, ఆసక్తమైనపుడు గూడా దర్ప ణముయొక్క దర్శనము తప్పక కలుగును. ఏలయన,దర్పణము లేక, దర్శనము ప్రతిబింబదర్శనము కానేకాజాలదు. అయినను, శుద్ధ నిష్ప్రతిబింబదర్పణముయొక్క దర్శనము కలుగదు. ఆ సమయమునసనే దృశ్యాది దృష్టికాలమునందుగూడా, దృశ్యమునకు అధిష్ఠానభూతము, అఖండము,స్ఫురణరూపము నయిన భగవ ద్భానమే ఉండును. ఏలయనగా స్ఫురణములేక, ఏ దృశ్యపదార్థ మైనను సిద్ధింపజాలదు. అయినను, స్పష్ట, శుద్ధ, అనంతభానము వ్యక్తము కాదు. దానికొఱకే వైరాగ్యపూర్వకముగా దృశ్య ప్రపంచము వైపునుండి దృష్టిని వ్యావర్తిత మొనర్చి (మరలించి)

కేవలము నిర్దృశ్యము, విశుద్ధము, అఖండము నయిన భానము నందు దృష్టిని స్థిరీకరించవలయును. అధిష్ఠాన సాక్షాత్కారము కలిగినపుడు, మరల ప్రారబ్ధము అవశిష్టమై ఉన్నంతవఱకే వ్యుత్థాన కాలమున దృశ్యప్రపంచ స్ఫురణము కలుగును. ప్రారబ్ధము క్షయించినపుడు, శాశ్వతముగా దృశ్యప్రపంచము నశించును, అఖండ, ఆనందపరిపూర్ణుడైన భగవంతుడే అవశిష్టుడై ఉండును.

ఈ స్థితి కలుగనంతవఱకు, సుషుప్తియందు సావరణమేయైన బ్రహ్మానంద ప్రాప్తి కలుగును. మేఘసమావృతుడైన సూర్యుడు మేఘావభాసకుడయినట్లుగానే అజ్ఞానముచే సమావృతుడు, అజ్ఞాన ప్రకాశకుడు, నిష్ప్రపంచ, అద్వైత, స్వప్రకాశానందరూపుడు నయిన ఆత్మ, సుషుప్తియందు జీవునికి లభించును. గాఢనిద్ర నుండి ఏదియో, ఒక విధముగా హఠాత్తుగా మేల్కాంచినపుడు, విశేష, వికల్ప, విస్ఫురణరహితముగా కొంతజ్ఞానము కలుగుననియే వివేకవంతులైనవారు బ్రహ్మానందానుభవవిధానమును చెప్పుదురు. గాఢనిద్రనుండి మేల్కాంచిన పిమ్మట ద్వైతప్రతీతికి మొదట, నిష్ప్రతిబింబమైన దర్పణమువలె శుద్ధ, నిర్దృశ్య, నిరావరణ, చిదాత్మక ప్రకాశస్వరూపుడైన బ్రహ్మయొక్క దర్శనమగును. అట్లే, జాగరణమునకు అంతమున, సుషుప్తికి పూర్వమున గూడా నిరావరణ తత్త్వము ఉపలబ్ధమగును. జాగ్రత్‌కాలమందు అంతఃకరణమన్న పద్మమునకు సంబంధించిన వృత్తిరూప దళములు వికసించును. ఆ కారణముచేతనే ద్వైత దృశ్యప్రపంచము చక్కగా స్ఫురించుచుండును. అంతఃకరణవికాసమందే, లేక చాంచల్యమందే ద్వైతదర్శనము కలుగును. కావుననే,

"చిత్తం తు చిద్విజానీయాత్ తకారరహితం యదా ।"

అని కొందఱు మహానుభావులు చెప్పిరి. చిత్తమునందు రెండవ 'తకారము' యొక్క సంబంధము ఉన్నంతవఱకు అదృశ్యము

ఉండును. 'తకారము' సంసర్గరహితమైనంతనే అది 'చిత్'రూప పరమాత్మయే అగును. 'చిత్'యే, కించిన్మననశీలమైన శక్తిని ధరించి 'మనస్సు' అగును. మృత్తిక ఉన్నపుడే ఘటోపలబ్ధి కలుగును. ఆ మృత్తిక లేనపుడు ఘటోపలబ్ధి కలుగదు. సరిగా ఆ విధముగానే చిత్త చాంచల్యమునందే అనగా, జాగ్రత్, స్వప్న దశలయందే, దృశ్యపదార్థములు కన్పడును. మూర్ఛ, సమాధి, లేక సుషుప్తియందు 'చిత్' పదార్థమునకు చాంచల్యము ఉండదు. కావుననే అచట, ద్వైతదర్శనము గూడా కలుగదు.కావున,ఘటము మృత్తికారూపమైనట్లే, ద్వైత దృశ్య ప్రపంచముగూడా చిత్తరూపమే అయి ఉన్నది. విషయచింతనరూపమైన చిత్త చాంచల్యము నశించి నపుడు దృశ్యము గూడా సమాప్తమగును.

ఈవిధముగా క్రమశః, సుషుప్తి వైపునకు జీవుని ప్రవృత్తి కలుగసాగినపుడు, చిత్తవృత్తులు సంకుచితములు కాసాగును. ఆ చిత్తవృత్తులు సంకుచితములైనకొలది, దృశ్యప్రపంచదర్శనము న్యూనము కాసాగును. అంతఃకరణకమలము అత్యధికముగా ముకుళితమైనపుడు దృశ్యప్రపంచదర్శనము పూర్తిగా ఆగిపోవును. కొన్ని క్షణములు గడచిన పిమ్మట,తామస నిద్రవలన ఆ దృశ్యము సమావృత మగును. అపుడు, ఘోరమైన తమస్సు వ్యాపించును.

ఈవిధముగా నిద్రాభంగమైనపుడు, మొదట, తామసీ నిద్ర దూరమగును. అపుడు, కొన్ని క్షణముల పిమ్మట, నిద్రారూప ఆవరణరహితము,ముకుళితము నయిన అంతఃకరణము మెల్లమెల్లగా మరల వికసించి, చక్కగా ద్వైతదర్శనము కలిగించసాగును. ఈ విధముగా మనోవ్యాపారస్వరూపమైన ప్రయత్నము వలన, ద్వైతము వ్యక్తమగును. నిర్వ్యాపారరూపమైన విశ్రాంతియందు స్వాభావికమైన అద్వైతము వ్యక్తమగును. ప్రయత్నముచేత, పరిశ్రమచేత సిద్ధించిన వస్తువు కృత్రిమము,అనిత్యము,అసత్యము

నయి ఉండును. ఏ వ్యాపారము, ఏ పరిశ్రమ లేక, నిత్యసిద్ధమై ఉన్న వస్తువే స్వాభావికమైనది, సత్యమైనది. శ్రుతి గూడా పరిశ్రమ రహిత, నిర్వ్యాపారదశను అద్వైతరూపముగానే వర్ణించెను.

"సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్ ।"

"ఏక మేవాద్వితీయమ్ ।"

ఈక్షణము, కామన, తపస్సు, సంకల్ప రూపమైన పరిశ్రమ వలన బహుభవన (అనేకరూపముల దాల్చుట) వర్ణనము శ్రుతి ఇట్లు చేయును-

"తదైక్షత ఏకోఽహం బహు స్యామ్ ।"

"సోఽకామయత స తప స్తప్త్వా ఇద మసృజత్ ।"

జాగ్రద్దశయొక్క అంతమునందు, సుషుప్తికి పూర్వము నందును, అట్లే సుషుప్తికి అంతమునందును, జాగరమునకు పూర్వమునందును కొన్ని క్షణముల కాలము నిష్ప్రతిబింబమైన దర్పణమువలె శుద్ధ, నిర్దృశ్య, చిద్రూప, అఖండ భానము యొక్క దర్శనము కలుగును. కాని, అతి సూక్ష్మమగుట వలన, సర్వసాధారణముగా తెలియదు. మనము ఎల్లప్పుడును ఉత్తరాభిముఖులమై నక్షత్రసముదాయమునందు దృష్టి ఉంచినపుడు, ధ్రువుని దర్శింతుము. అయినను, "అయం ధ్రువః"- ఇతడు ధ్రువుడు అని, స్పష్టముగా వివేకపూర్వకముగా ధ్రువుని గుర్తింపజాలము. కొందఱు గుర్తించలేకపోవుటకు కారణము లక్షణము తెలియకపోవుటయే. కొందఱికి ఈ యీ నక్షత్రముల సమీపమునందు, ఉత్తరదిశయందు సదా నిశ్చలముగా స్థిరముగా ఉండునట్టి నక్షత్రనామము ధ్రువుడు అని లక్షణజ్ఞానము ఉండును. అయినను, వారు లక్షణమును లక్ష్యమునందు సమన్వయించి, ధ్రువుని గుర్తించుటకై తత్పరులు కారు. కావుననే ప్రతి దినము, ధ్రువుని చూచుచున్నను,

వారికి ఆ ధ్రువుని గుర్తు తెలియదు. కావున, లక్షణజ్ఞాన, పరిచయము కొఱకు అన్య దృశ్యవస్తువులనుండి దృష్టివ్యావర్తనపూర్వకమైన తత్పరత్వముతో ప్రయత్నించినపుడు, పరిచయపూర్వకముగా ధ్రువదర్శనము కలుగును. సరిగా ఈవిధముగానే నిరంతరము సుషుప్తి, జాగరముల అంతమున, అందఱికిని దృశ్యరహితము, శుద్ధము, దృక్‌రూపము, స్వయంప్రకాశము, అఖండము నయిన భానము కలిగినను, పరిచయపూర్వకముగా స్పష్టమైన సాక్షాత్కారము కలుగదు.

సర్వదా స్వప్రకాశరూపముతో భాసించువానియందుఁగూడా 'నాస్తి'- లేదు, 'న భాతి'- ప్రతీతమగుటలేదు అనునట్టి వ్యవహార యోగ్యతయే ఆవరణశక్తియొక్క విలక్షణమైన చమత్కారము. స్వప్రకాశ, అనంత, అద్వైతమునందు జడము, పరిచ్ఛిన్నము నయిన ద్వైత ప్రపంచమును భాసింపజేయుటయే విక్షేపశక్తి యొక్క విలక్షణమైన చమత్కారము. ఏతన్నివృత్తికొఱకే ఆచార్య పరంపరయా, వేదాంతవాక్య శ్రవణ, మననములను చేసి అద్వితీయ పరమాత్మలక్షణముల సంస్కారమును అంతఃకరణమునందు స్థిరమగునట్లు చేయవలెను. ఏ వస్తువునైనను తెలిసికొనుటకు అన్య విషయములనుండి చిత్తమును వ్యావర్తితము చేయుట, తత్పరతా పూర్వకముగా పరిచయము నొందుట, అవశ్యకమగును. కాని, ఇచట, శ్రవణ, మననాదిజన్యమైన స్వరూపసంస్కారమే పరిచయ, ప్రయత్నములకు మారుగా అపేక్షితము. ఏలన, ఛాయవెంట నడచుటవలన, ఛాయ గ్రహింపబడజాలదు. ఆ విధముగానే ప్రయత్నముచేత శుద్ధమైన వస్తువు ఉపలబ్ధము కాజాలదు.

"కారకవ్యవహారే హి శుద్ధం వస్తు న వీక్ష్యతే ।"

నిష్క్రియమైనను వస్తుబోధ కలుగును. కాని, కేవల నిర్వ్యాపార త్వము యోగులకు గూడా కలుగును. వారికి అద్వైత బ్రహ్మ

పరోక్ష్యము కలుగదు. దీనికి కారణమేమనిన, స్వరూప పరిచయాను కూలములైన శ్రవణాదుల ద్వారా సంపాదించబడలేదు.

ఆత్మయందు మొదటి ఆవరణము అనిర్వచనీయమైన అజ్ఞానము, రెండవ ఆవరణము నిక్షేపరూపమైన ద్వైతము, మూడవ ఆవరణము, అర్ధనిద్రాపూర్వకమైన స్వప్నము. నాల్గవ ఆవరణము పూర్ణనిద్ర, లేక సుషుప్తి. మేఘాచ్ఛన్నమైన భాద్రపద అమావాస్య నాటి రాత్రియందువలె సుషుప్తి యందు ఆత్మయొక్క అత్యంత అప్రకాశము ఉండును. మేఘరహితమైన రాత్రియందువలె స్వప్నమునందు కించిత్ ప్రకాశముండును. చాంద్రమసరాత్రి యందువలె (పూర్ణిమనాటిరాత్రియందువలె) జాగ్రద్దశయందు పర్యాప్తమైన ప్రకాశము ఉండును. మేఘాచ్ఛిన్నమైన పగటి యందువలె సమాధియందు ఆత్మ ప్రకాశము ఉండును. ఆవరణ రహితుడైన సూర్యునియందువలె తత్త్వసాక్షాత్కారమునందు ఆత్మ ప్రకాశము కలుగును.

నిరావరణమైన బ్రహ్మస్వరూప సాక్షాత్కారముకొఱకు దేహ, ఇంద్రియ, మనోబుద్ధి, అహంకారాదుల అత్యంత నిరోధము, వేదాంతాభ్యాసజన్యమైన సంస్కారము– ఈ రెండును ఆవశ్యక ముగును. "గోసదృశో గవయః" ఇత్యాకారక వాక్యజన్యము, దృఢ తరము నయిన సంస్కారము గల పురుషునికి 'నేత్రము', 'గవయము' యొక్క సన్నికర్ష కలిగినంతనే "అయం గవయః" అను బోధ కలుగును. అచట, ఆలోచన ఆవశ్యకము కాదు. నేత్ర ములతో గవయమునకు సంబంధము ఉన్నను, 'ఇది గవయము' అను జ్ఞానము 'గోసదృశమైన గవయము ఉండును' అను జ్ఞానము కలుగనంతవఱకు గవయబోధ కలుగదు. కావున, సన్నికర్ష ఉన్నను 'గోసదృశో గవయః' అను వాక్యము లేక, 'అయం గవయః' ఇత్యాకారక సాక్షాత్కారమునందు విలంబమైన స్థలమున, 'ఇది

గవయము' అను జ్ఞానమునందు వాక్యమే హేతువు, ఇంద్రియ సన్నికర్ష, సహకారి మాత్రమే 'గోసదృశో గవయః' అను వాక్యము యొక్క సంస్కారము కలిగినను, నేత్రసన్నికర్షలేక, సాక్షాత్కారము నందు విలంబమైన స్థలమున, సన్నికర్షయే ముఖ్య హేతువు, వాక్యము సహకారిమాత్రమే. సరిగా ఈవిధముగానే యోగులకు నిరోధరూప సమాధి కలిగినను, వేదాంతాభ్యాసజన్యమైన సంస్కారములేనందున, సాక్షాత్కారమునందు విలంబము ఉండును. కావున, అచట బ్రహ్మ సాక్షాత్కారమునందు వేదాంతవాక్యమే ముఖ్యకారణము, నిరోధము సహకారికారణము. వేదాంతాభ్యాసమున్నను నిరోధము లేక, సాక్షాత్కారమునందు విలంబము కలిగినస్థలమున, నిరోధమే ముఖ్య హేతువు, వాక్యము సహకారి హేతువు. ఈ అభిప్రాయముతోనే ఆచార్యులు ఒక స్థలమున వేదాంతములను, మఱొక స్థలమున, సంస్కారనిరుద్ధమైన మనస్సును బ్రహ్మసాక్షాత్కారమునకు హేతువుగా భావించిరి. మఱొకచోట, మహావాక్యమునే ముఖ్య హేతువని చెప్పిరి. దీనివలన, వేదాంతాభ్యాసజన్య సంస్కార యుక్తము, నిరుద్ధము నయిన అంతఃకరణయ వలన నిరావరణ బ్రహ్మసాక్షాత్కారము కలుగునని సిద్ధించును.

పూర్ణిమనాటి ఒకానొక అవస్థావిశేషవిశిష్టుడైన చంద్రునియందు రాహువు ప్రకటమైనట్లే, నిర్వృత్తికము, నిరుద్ధము నయిన మనస్సునందే బ్రహ్మరూపము ప్రకటమగును.

"అసత్యే వర్త్మని స్థిత్వా తతః సత్యం సమీహతే।"

అసత్యము, కాల్పనికము నయిన మార్గమునందు నిలబడి, సత్యవస్తు ప్రాప్తికై ప్రయత్నము చేయబడును. అప్రాకృతుడైన భగ వంతుని మంగళమయమూర్తి ప్రాకృతములైన కమల, మహేంద్ర నీలమణి ప్రభృతి ఉపమానములతో పోల్చబడును. ఏ ఆస్తికు

డైనను సర్వాంశమునందు భగవంతుని విషయములో ఈ ఉపమాన ములను అంగీకరింపజాలునా ?

ఏకవిజ్ఞానమునందు సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞను సమర్థించుటకొఱకై శ్రుతి, ఏక మృద్విజ్ఞానమునందు సమస్త మృణ్మయ పదార్థముల విజ్ఞానము- 'ఇవి అన్నియు మృణ్మయములే'- అను విజ్ఞానము కలుగునని దృష్టాంతము నిచ్చినది. ఆవిధముగానే ఏక పరమాత్మ విజ్ఞానమువలన సమస్త పరమాత్మకార్యవిజ్ఞానము కలుగును. కాని, ఇచట గూడా మృత్తిక సావయవము, పరిణామశీలము. అట్టిస్థితిలో నిరవయవుడు, కూటస్థుడు,పరిణామరహితుడు నయిన భగవంతుడు ప్రపంచరూపమున పరిణామము చెందుట ఎట్లు సంభవము? పర మాత్మవిజ్ఞానమునందు, సమస్త ప్రపంచవిజ్ఞానము గూడా కలుగుట ఎట్లు సంభవమగును? ఇట్లు ప్రశ్నించరాదు. ఇచట, కేవలము కారణముకంటె భిన్నమైన కార్యసత్త లేదు. కారణసత్త వలననే కార్యమునందు సత్త, స్ఫూర్తిమత్త్వము ప్రతీతమగును. అటులనే పరమాత్మకంటె భిన్నమైన ప్రపంచమునకు సత్త లేదు. ఒక్క పరమాత్మయొక్క సత్తాస్ఫూర్తుల చేతనే ప్రపంచము నందు సత్తా స్ఫురణలు ప్రతీయమానము లగుచున్నవి. ఇంతమాత్రమే దృష్టాం తము. ఈరీతిగానే ఘటమువలననే మహాకాశమునందు దేశకల్పన, దానివలననే మహాకాశమునందు ఘటాకాశవ్యవహారము, ఘటగమ నమునందు ఘటాకాశగమనము ప్రతీతమగుచున్నది.

వస్తుతః, మహాకాశముకంటె భిన్నమైన ఘటాకాశమునులేదు, ఆ ఘటాకాశగమనమును లేదు. అట్లే అనంత, అఖండ, శుద్ధ భగ వంతునియందు ఉపాధిసంబంధము చేతనే భేదము గతి,ఉత్క్రాంతి మున్నగునవి ప్రతీతములగును, వాస్తవమున, ఏమియును లేవు. ఉపాధిరహితమైన దేశమునందు ఉపాధి వెళ్ళుటవలన, అచట నవీన

మైన జీవభావకల్పన జరుగును. ఇదియును యుక్తము కాదు. ఏలన, దేశకల్పన గూడా ఉపాధికి అధీనమయియే ఉన్నది. ఇంతియేగాక, ఇటువంటి కల్పనవలన అధిష్ఠానమునకు ఏ హానియు లేదు. సాధారణముగా సమస్త ప్రపంచము ఆ అధిష్ఠానమునందే కల్పితమై ఉన్నది. కాని, దీనివలన ఆ అధిష్ఠానము బద్ధమై ఉన్నదని తలంచబడునా ? కల్పిత జలము వలన మరుభూమి (ఎడారి) తడియునా ? నిరవయవ, నిష్ప్రదేశ, నిష్కల బ్రహ్మ యందు కాల్పనికమైన ఉపాధిద్వారముననే కాల్పనిక దేశవ్యవహారము కలుగుచున్నపుడు, తాత్త్వికముగా ప్రదేశకల్పన, దాని వలన బంధకల్పనగాని, మోక్షకల్పనగాని, ఎట్లు తాత్త్వికమగును ?

అయిన, ఎవరికి బంధ, మోక్షములు తాత్త్వికములు ? అని ప్రశ్నించినచో, ఎవరికిని బంధమోక్షములు తాత్త్వికములు కావనియే సమాధానము. కావుననే—

"న నిరోధో న చోత్పత్తిః న బద్ధో న చ సాధకః ।
న ముముక్షుః న వై ముక్తః ఇత్యేషా పరమార్థతా ॥"

"అజ్ఞానసంజ్ఞౌ భవబంధమోక్షౌ ద్వౌ నామ నాన్యౌ స్త
ఋతజ్ఞభావాత్ ।"

సత్యజ్ఞానానందాత్మకుడైన భగవంతునికంటె భిన్నములై బంధ మోక్షములను పేరు గల పదార్థములే లేవు. కేవల అజ్ఞానముచేతనే బంధమోక్షములన్న నామములు ఏర్పడుచున్నవి. కావున, కేవల కల్పిత ఉపాధివలన కల్పిత ప్రదేశమునందు గమనాగమనములు కల్పితములే అగును, బంధమోక్షములు కల్పితములే అగును. కల్పితోపాధిని అనుసరించునట్టి కల్పితమైన ప్రదేశమే కల్పిత బంధముచేత పీడింపబడును, కల్పితమైన మోక్షముచేత ముక్తమగును. బంధము సత్యమైనపుడే మోక్షము కూడా సత్యము కావలెను. అధిష్ఠానావశేషముయొక్క అభిప్రాయముతో భగవ

ప్రాప్తి, మోక్షము, లేక నిరావరణుడైన భగవంతుడు సత్యములే అగును ఈవిధగానే-

"యథా హ్యయం జ్యోతిరాత్మా వివస్వా నపోభిన్నా
బహుధైకోఽనుగచ్ఛన్ ।"

ఇత్యాది శ్రుతి స్మృతులలో పరమాత్మ జీవరూపముతో ప్రవేశించుటయందు దృష్టాంతముగా ఒకే సూర్యుడు భిన్నభిన్న జలపులందు ప్రవేశించి అనేకధా భాసమైనట్లుగానే పరమాత్మ, భిన్న భిన్న ఉపాధులందు ప్రవేశించి, నానావిధములుగా భాసపుగుచున్నాడని చెప్పబడినది. ఈవిధముగానే

"ఘటే భిన్నే ఘటాకాశ ఆకాశః స్యాత్ యథా పురా ।"

ఇత్యాది వచనములందు ఘటము నశించినపుడు, ఘటాకాశము మహాకాశమునందు కలియుట జరుగును. ఆవిధముగానే ఉపాధిభంగము జరిగినపుడు ఉపహితుడైన జీవుడు నిరుపాధిక, బ్రహ్మయందే విలీనుడగును. ఈ వచనములను ఆధారముగా గొని పారమార్థిక అభేదము, వ్యావహారిక భేదము సిద్ధించుటకొఱకు ఈ దృష్టాంతములన్నియు గ్రహించబడును.

ఇచట, ఆత్మయొక్క ప్రతిబింబమును సమర్థించవలసిన ఆవశ్యకత ఏదియును లేదు. ఆత్మ, స్వతః స్థౌల్య, కార్శ్య, శ్యామత్వ, గౌరత్వాది ధర్మములచే వివర్జితుడయ్యు, దేహముతో గల విలక్షణమైన సంబంధకారణమున, దేహగతములే, అయిన, స్థౌల్యాది ధర్మములు భాసించుచున్నవన్న విషయమును దార్శనికులందఱును అంగీకరింతురు. సరిగా ఈ రీతిగానే ఆత్మ, స్వతః అకర్త, అభోక్త, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావ సర్వభాసక భావరూపమైనను, దేహేంద్రియమనోబుద్ధ్యాది ఉపాధుల సంసర్గము చేత ఆత్మయందు కర్తృత్వ, భోక్తృత్వాది అనర్థములు, అచంచల స్వచ్ఛ సూర్యుడు చంచల మలిన జలమునందు ప్రతిబింబించి

నపుడు జలమునందలి చాంచల్య, మాలిన్యములే భాసించినట్లు భాసమానములు కాసాగుసనియే ప్రతిబింబవాదుల ఆశయము.

జీవుడు తనను నిత్యుడు, శుద్ధుడు, బుద్ధుడు, అభోక్త, నిరుపమ సుఖ సంవిద్రూపుడు అని భావించక, కర్త, భోక్త అని భావించ సాగినపుడు వానిని ఉపాధిసంసర్గముచేత, తద్ధర్మారోపమువలన ప్రతిబింబమని చెప్పుదురు. ఉపాధిసంసర్గాతీతుడైనపుడు శుద్ధ బింబరూపుడే అగును. ప్రతిబింబాపేక్షయాగగనస్థుడైన సూర్యుని యందు బింబవ్యవహారము కలిగినట్లు, జీవునికి బింబవ్యవహారము కలుగును. ప్రతిబింబాపేక్ష కలిగి ఉండకపోవుటవలన బింబత్వ, ప్రతిబింబత్వరూపమైన ధర్మరహిత, శుద్ధ సూర్యవ్యవహారమే జరుగును. అటులనే ప్రతిబింబాత్మక జీవాపేక్షయా, శుద్ధచిదాత్మక పరతత్త్వమునందే పరమేశ్వరత్వవ్యవహారము కలుగును. జీవ భావమును అపేక్షింపకపోవుటవలన జీవత్వ, పరమేశ్వరత్వ రూప ధర్మరహితమైన నిర్వికార, శుద్ధపరమాత్మవ్యవహారమే జరుగును.

భగవతీ శ్రుతి, పరమాత్మయే సమస్త ప్రపంచమునకు నిమిత్తకారణము, ఉపాదానకారణమని చెప్పినది. ఈకారణముచేతనే ఏకవిజ్ఞానము చేత, సర్వవిజ్ఞానప్రతిజ్ఞ సిద్ధించినది. కాని, పరమ తత్త్వము అసంగము, నిరవయవము, నిష్కలము, సుఖదుఃఖ మోహాతీతము అయినపుడు, ఆ పరమ తత్త్వమునందు సుఖ, దుఃఖ, మోహాత్మకమైన ప్రపంచము యొక్క స్థితి ఎట్లు ఉండజాలును? ప్రపంచాతీతమైన పరమ తత్త్వము నిరవయవము, అసంగము నగుటచేతనే కార్య, కారణభావసంగతి కూడా లేదు. నిరవయవము, నిర్గుణము, నిష్క్రియము నయిన కారణముచేత ప్రపంచముతో, సంయోగసంబంధము, సమవాయుసంబంధము గూడా పొసగ జాలదు. కావున, కేవలము దర్పణమునందు ప్రతిబింబమువలె, రజ్జువునందు సర్పమువలె, బ్రహ్మయందు ప్రపంచముయొక్క అధ్యాత్మికసంబధమునే చెప్పవలయును.

బ్రహ్మయందు ఆధ్యాత్మికసంబంధమును అంగీకరించుట వలన, ప్రపంచమిథ్యాత్వము సిద్ధించును. ఇట్టి స్థితిలో ఏకవిజ్ఞానము నందు సర్వవిజ్ఞానసమర్థనము ఎట్లు చేయనగును? రజ్జుజ్ఞానము నందు సర్పమునకు 'బాధ' చెప్పబడును గాని, 'విజ్ఞానము' అని చెప్పబడదు. అట్లే బ్రహ్మవిజ్ఞానమునందు. 'సర్వ' పదముచేత వివక్షిత ప్రపంచము బాధితమగును, లేక మిథ్య అగును. కావున, ఏ బ్రహ్మవిజ్ఞానము కలుగుటయందు ప్రపంచమునకు 'బాధ' కలుగుట నిశ్చితమగునో, ఆ బ్రహ్మజ్ఞానమునందు సర్వ ప్రపంచ విజ్ఞానమును ఎట్లు చెప్పవచ్చును? అయినను, ఇచట శ్రుతియొక్క ఆశయము అతి గంభీరము. శత్రుగృహమునందు భోజనము చేయనా? చేయవలదా? అని బాలకుడు ప్రశ్నించినపుడు 'విషం భుంక్ష్వ' అని తల్లి చెప్పును. ఈ వాక్యముయొక్క అర్థము 'విషము తినుము' అనియే. కాని, పుత్రవాత్సల్యము కల తల్లి, తన శిశువు నకు విషభక్షణము చేయుమని ఆదేశించునా? అట్లు ఆదేశించనిచో, ఈ వాక్యముయొక్క అభిప్రాయము శత్రుగృహమునందు భోజన నివృత్తియే అని చెప్పవలయును.

"శత్రుగృహభోజనాత్ వరం విషభోజనమ్, అతో మా భుంక్ష్వేతి।"

సరిగా ఆ విధముగానే భగవతీశ్రుతి తాత్పర్యము పరమాత్మ విజ్ఞానముకంటె జడ, దుఃఖమయ ప్రపంచముయొక్క నిరర్థకమైన విజ్ఞానప్రతిపాదనమునందు కాజాలదు. కాని, మధురతమ భగవద్ జ్ఞానమునకు ముందు 'సర్వ'పదవాచ్యమైన ప్రపంచబోధయందు కొంత పురుషార్థబుద్ధి కలిగినను, పరమానంద స్వరూపుడైన భగవద్ జ్ఞానము కలిగినపుడు, రసహీనమైన ప్రపంచజ్ఞానము అత్యంత నిరర్థకమగును. కావున, పురుషార్థరహితమగుటచేత పరమాత్మ విజ్ఞానమునందు 'సర్వ'విజ్ఞానము వివక్షితము కాదు. విశేషించి,

ప్రపంచముయొక్క 'బాధయే' అనర్థనివృత్తిరూప మగుటచేత వివక్షిత మగును. పుత్రవాత్సల్యము గల తల్లివలె పరమ హితైషిణి అయిన భగవతీశ్రుతి, ప్రపంచవిజ్ఞానము కొఱకై వ్యగ్రుడైన జీవుడు ప్రపంచాతీతమైన బ్రహ్మజ్ఞానమునకై ఎట్లు ప్రయత్నశీలుడగునని భావించి, బ్రహ్మవిజ్ఞానమునందు సర్వవిజ్ఞానప్రలోభమును కలిగించి, అధికారము గలవారి హృదయమునందు బ్రహ్మజిజ్ఞాసను జనింపజేయ నభిలషించును.

సాధారణముగా ప్రాణుల ఉత్సుకత అనేకవిధములైన భూత, భౌతిక పదార్థముల విజ్ఞానమునందే కలుగును. ఒక్కొక్క భౌతిక భావమును తెలిసికొనుటకు అధిక ధనము వ్యయము చేయబడును. శక్తిక్షయ మగును. నానావిధములైన పార్థివ, ఆప్య, తైజస విశిష్ట తత్త్వముల జ్ఞానము కలిగినను, ఇంతవఱకును (ఇయత్త-ఇంతియే అని), నిశ్చితము కాలేదు. నగణ్యమైన (అత్యల్పమైన) ఒక్క తృణముయొక్క సమస్త విశేషములు గూడా వేలజన్మలయందైనను తెలిసికొనబడజాలునా? అపుడు గూడా పదార్థవిజ్ఞానమునందలి ఉత్సుకత ప్రాణుల హృదయమునుండి తొలగిపోదు. ఈవిధముగా నిరర్థకమైన పదార్థవిజ్ఞానమునందు ఉత్సుకతను, ఆసక్తిని, పరమ సార్థకమైన భగవత్తత్త్వవిజ్ఞానమునుండి బహిర్ముఖులైన జీవుల హృదయమునందు భగవత్తత్త్వవివిదిషను (తెలిసికొనవలయునను కోరికను) ఉత్పాదనము చేయుటకై శ్రుతిమాత, ఇట్లు చెప్పును- 'ఓ బాలకులారా! ఏ భౌతిక తత్త్వ విశేషములను తెలిసికొనుటకు మీరు వ్యగ్రులై ఉన్నారని తలచుచున్నారో వాని సమగ్రజ్ఞానము లక్షకల్పములందు గూడా కలుగుట కఠినము. సరియే, మీకు సమస్త ప్రపంచతత్త్వమును తెలిసికొనవలయునన్న కోరికయే ఉన్నచో, మీరు బ్రహ్మవిజ్ఞానమును సంపాదించుడు. ఒక్క బ్రహ్మవిజ్ఞానమునందే సమస్త విజ్ఞానము కలుగును.' ఈవిధముగా సర్వ

విజ్ఞానప్రలోభముచేత ప్రాణి, బ్రహ్మవిజ్ఞానమునకై ఉత్సుకుడైనచో, అతడు సాధనానుష్ఠానపూర్వకముగా బ్రహ్మవిజ్ఞానమును సంపాదించినపుడు ఏ ప్రపంచవిజ్ఞానమునకై మొదట అతడు అత్యంతము వ్యగ్రుడు, ఉత్సుకుడు నయి ఉండునో, ఆప్రపంచము రజ్జుసర్పమువలె, స్వప్నమువలె బాధితమైనపుడు, దానిని తత్త్వరహితమని భావించి, ఆ ప్రపంచజిజ్ఞాసయే ప్రశమిత మగును. జిజ్ఞాసానివృత్తినే, జ్ఞానమని చెప్పుదురు. ఈ విధముగా బ్రహ్మవిజ్ఞానమునందు ప్రపంచజిజ్ఞాస నశించుటయే ప్రపంచవిజ్ఞానము.

పరమాత్మతత్త్వముకంటె భిన్నమైన ఏదియో ఒకతత్త్వము యొక్క అస్తిత్వము ఉన్నచో, దానికి సంబంధించిన జిజ్ఞాసగూడా అనివార్యమగును. కావున, అజ్ఞలోక బుద్ధిసిద్ధమైన ప్రపంచమునకు ప్రసక్తమగు నిమిత్తకారణ, ఉపాదానకారణ రూపమైన ద్వివిధ కారణత్వము గూడా పరమ తత్త్వమునందే సమర్థింపబడును. ఏలన, కేవల నిమిత్త విజ్ఞానమునందు గాని, ఉపాదాన విజ్ఞానమునందుగాని, సర్వవిజ్ఞానము కలుగజాలదు. మృత్తికావిజ్ఞానమునందు ఘటాది మృణ్మయపదార్థముల విజ్ఞానము కలిగినను, నిమిత్తకారణరూప దండ, కులాలాదుల జ్ఞానము కలుగదు. దండ, కులాలాదుల జ్ఞానమునందు మృత్తికాజ్ఞానముగాని, తద్ఘటాదిజ్ఞానము గాని కలుగజాలదు. ఇట్టి స్థితిలో ఏకవిజ్ఞానమునందు సర్వవిజ్ఞానము ఒకే పరమతత్త్వము సమస్త ప్రపంచమునకు ఉపాదాన, నిమిత్త కారణములు రెండును అయినప్పుడే కలుగజాలును. కావుననే ప్రపంచమునకు నిమిత్త, ఉపాదాన ఉభయకారణత్వము పరమాత్మయందే సమర్థింపబడును.

అధిష్ఠానస్వరూప పరమాత్మవిజ్ఞానమునందు, ప్రపంచబుద్ధి బాధితమైనపుడు, ఉపాదానత్వ, నిమిత్తత్వములు గూడా పరమాత్మయందు బాధితములగును. ఇటువంటి స్థితిలో, కార్య

కారణాతీతమైన శుద్ధరూపస్థితి కలుగును. ప్రపంచ ప్రతీతికాలమునందే తమః ప్రధాన ప్రకృతిసహితమైన సచ్చిదానందమునందు ఉపాదానత్వము, సత్త్వ ప్రధాన ప్రకృతిసహితమైనసచ్చిదానందము నందు నిమిత్తత్వము ఉపపన్నమగును. తమస్సు, ఆవరకము గాన, దానివలన, సావరణ సచ్చిదానందమునందు జడప్రపంచానురూపముగా జడత్వము భాసించును. ప్రకాశాత్మకమైన సత్త్వసంయోగము వలన, నిరావరణము, స్వప్రకాశాత్మకము నయిన నచ్చిదానందమునందు కులాలాదినిమిత్తకారణానురూపముగా సమస్తవిజ్ఞానము కలుగును. రెండు విధములైన ప్రకృతి, మూల ప్రకృతియందు అంతర్గతమైనదే. మూలప్రకృతి గూడా బ్రహ్మయందు పరికల్పితము.

అధిష్ఠానజ్ఞానమువలన, ప్రకృతిబాధ, తత్కార్యాత్మకమైన ప్రపంచబాధ కలుగును. భోగ్యవర్గము స్వరూపముచేతనే బాధితమగును. కాని, భోక్తృవర్గముయొక్క బాధ, ఉపాధి, తత్సంసర్గ బాధాభిప్రాయముతోనే కలుగును. ఈ అభిప్రాయముతోనే-

"సర్వం ఖల్విదం బ్రహ్మ"

ఇత్యాది స్థలములందు,

"యోఽయం స్థాణుః పుమా న్నేషః"

అను వచనమువలె బాధసామానాధికరణ్యముచేత బ్రహ్మతో సర్వ పదార్థాభేదము బోధింపబడును.

"తత్త్వమసి"

ఇత్యాది స్థలములందు 'సోఽయం దేవదత్తః'- ఇతడు ఆ దేవదత్తుడు అను రీతిగా భాగత్యాగలక్షణద్వారా ముఖ్యసామానాధికరణ్యముచేత 'తత్' పదార్థమైన బ్రహ్మతో 'త్వం' పదార్థమైన జీవుని అభేదము బోధింపబడును. 'త్వం'పదార్థమైన జీవునితోటి అభేదము లేక, 'తత్' పదార్థమైన పరమాత్మయందు నిరతిశయ,

నిరుపాధిక పరప్రేమాస్పదత్వము, పరమానందరూపత్వము, స్వప్రకాశత్వము మున్నగునవి సిద్ధింపజాలవు. ఏలన, అత్యంత సన్నిహితమైన పదార్థమే స్వతః అపరోక్షము, అనగా అన్యనిరపేక్ష స్వప్రకాశము కలదై ఉండును. అదియే అత్యంత అంతరంగము, అత్యంత పరిచితము, స్వప్రకాశము నయిన కారణముచేత నిరతిశయ ప్రేమాస్పద మగును. నిరతిశయ ప్రేమాస్పదమే పరమానందరూప మగుచుండును.

'తత్'పదార్థమైన పరమాత్మ, జీవునికంటె భిన్నుడైనవాడు, తటస్థుడైనచో,ఆయనయందు ఉపర్యుక్తములయిన సమస్త విషయములు సంగతములు కావు. పృథివీ. ఆకాశాది బాహ్య పదార్థములు, దేహేంద్రియ, మనోబుద్ధి, అహంకారాది అంతర సమస్త దృశ్య పదార్థద్రష్ట, సర్వప్రకాశకుడు 'త్వం' పదలక్ష్యార్థమైన సాక్షియే అగును. అహంకార, బుద్ధ్యాదులు అన్నియు, తదపేక్షయా అసన్నిహితము, బహిరంగము, పరతఃప్రకాశము, సాతిశయము, సోపాధికమునయిన ప్రేమకు ఆస్పదములయియే ఉన్నవి. 'త్వం' పదలక్ష్యార్థమైన సర్వద్రష్ట,సాక్షియే సర్వాంతరంగ సన్నిహితుడు. అన్యాన్యపదార్థములు సూర్యాదుల ప్రకాశసంబంధము వలన, ప్రకాశమానము లగును. కాని, సూర్యాదులు స్వతః ప్రకాశమాన ములై ఉండును. అట్లే బుద్ధి, అహంకారాది అన్యాన్య దృశ్య పదార్థములు ఈ సాక్షిసంబంధము వలన, ప్రకాశమానములగును. ఈ సాక్షి, స్వతఃప్రకాశుడై ఉండును. 'త్వం' పదార్థ లక్ష్యార్థమైన స్వాత్మయే సర్వాంతరంగుడు. ఇచటనే పరమ సాన్నిధ్యపర్యవసానము గూడా కలుగును. ఏలన, తనకంటె పరమ సన్నిహితుడు స్వీయాత్మయే అగును. అన్య పదార్థములందు, ఏదియో కొలది దేశ, వస్త్వాది వ్యవధానము ఉండుటవలన, పూర్ణసాన్నిధ్యము కలుగజాలదు. దేహేంద్రియాద్యపేక్షయా, కొలది సన్నిహితముగా

ఉండునట్టి మనస్సు, బుద్ధి, అహంకారము, జ్ఞానము, అజ్ఞానము, సుఖము మున్నగునవి గూడా అప్రకాశమానములై ఉండవు. కాని, ఇవి ఎప్పుడైనను, ఉన్నప్పుడు, స్వప్రకాశ సాక్షిసంసర్గముచేత ప్రకాశమానము లయియే ఉండును. సుఖ, దుఃఖాదులు భాసమానములు కాకుండుట ఎన్నడును జరుగదు. అట్టి స్థితిలో అత్యంత సన్నిహితమైన స్వాంతరాత్మ, అప్రకాశమానమై ఉండుట ఎట్లు సంభవము? "సర్వద్రష్ట, సర్వభాసకుడైనవాడు సదా, అన్యప్రకాశనిరపేక్షమైన స్వప్రకాశము కలవాడై ఉండు'నన్న అభిప్రాయముతోనే శ్రుతి-

"విజ్ఞాతార మరే! కేన విజానీయాత్ ?"

ఎవరు సర్వజ్ఞుడో, ఆయనను ఏ సాధనముతో తెలిసికొందుము? అని చెప్పినది.

భగవంతుడే ప్రత్యగాత్మ రూపముతో విరాజమానుడైనపుడు, ఆయనయందు ఉక్త శ్రుతి ననుసరించి, స్వప్రకాశత్వము సంగతమగును. ఏది వ్యవధానరహితమో, అన్యప్రకాశనిరపేక్షమో, స్వతః, సాక్షాత్ అపరోక్షమో, అదియే బ్రహ్మ.

"యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ ।"

అన్యథా, ఎవరును, లక్షలాదిజన్మల అనంత తపస్సుల వలన గూడా దుర్గమ, పరమ పరోక్ష భగవంతునియందు సర్వవిజ్ఞాతృత్వమును, అన్యనిరపేక్షమైన పరమ ప్రకాశమానత్వమును ఎట్లు సిద్ధింపజేయగలుగుదురు? ఎవరైనను, అత్యంత పరోక్ష, తటస్థ పరమేశ్వరుని, సాక్షాదపరోక్ష స్వరూపుడని చెప్పుటకు సాహసింపగలుగుదురా? ఆ పరమేశ్వరుడుసర్వవిజ్ఞాతృరూపుడు, సాక్షాదపరోక్షరూపుడునయినచో ఆ పరమేశ్వర విషయమునందు అనేక విధములైన అనుపపత్తులు, విప్రతిపత్తులు ఎట్లు సంభవింపజాలును? ఇంద్రియములు, మనసు

మున్నగువాని ద్వారా పారంపర్యముగా అపరోక్ష ఘటాములందు గూడా సంశయ, విపర్యయాదులు కలుగనప్పుడు, సాక్షాదపరోక్ష మైన పరమాత్మయందు సంశయాదులు ఎట్లు కలుగజాలును? అపుడు, ఆ పరమాత్మ, సాక్షాదపరోక్షమైనచో, తద్జ్ఞానమునకై శ్రవణ, మననాది ఉపాయముల ఉపదేశము సైతము. వ్యర్థము. ఏలన, అనుభవవిరోధము స్పష్టమే, కావున, భగవంతునియందు పూర్వోదాహృత శ్రుతుల ననుసరించి సాక్షాదపరోక్షత్వరూపములైన స్వప్రకాశత్వాదులను సమర్థించ వలయునని, భగవంతుడే సర్వ ప్రకాశకుడు, సర్వాంతరాత్మ, సర్వసాక్షి, ప్రత్యగాత్మరూపముతో గూడా విరాజమానుడై ఉన్నాడని, ఇష్టము లేకపోయినను, చెప్ప వలసివచ్చును.ఆ రూపముతోనేఆయనయందు సాక్షాదపరోక్షత్వము, స్వప్రకాశరూపత్వము ఉపపన్నమగును.

పరమ సన్నిహితము, స్వప్రకాశము నయిన ఈ ఆత్మయందే అధ్యారోపితమైన అపూర్ణత్వ, అపరిచ్ఛిన్నత్వాదుల నివృత్తికి శ్రవణాదులు గూడా సార్థకము లగును. పరోక్షమైన 'తత్' పదార్థము అసన్నిహితము, పరోక్షము నయిన కారణముచేత, ప్రేమాస్పదము గూడా కాదు. ఏలన, సన్నిహితము, అపరోక్షము నయినదాని యందే నిరతిశయమైన ప్రేమ కలుగును. కావున. నిరతిశయము నిరుపాధికము, పరప్రేమాస్పదము ఆ ఆత్మయే అయి ఉన్నది. ఆకారణముచేత, ఆ ఆత్మయే పరమానందరూపము కూడ. పరోక్షమైన పరమాత్మయందు స్వాభావికము, నిరుపాధికము, నిరతిశయము నయిన ప్రేమ, అత్యంత అప్రసిద్ధము, అనుభవవిరుద్ధము. పరమాత్మయందు ప్రేమ, భక్తి అభ్యర్థింపబడును.

"యా ప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ ।
త్వా మనుస్మరతః సా మే హృదయా న్మా௨పసర్పతు ॥"

హేనాథ! వివేకము లేనివారికి విషయములయందు సహజముగా

ప్రీతి ఉన్నట్లే, నిన్ను స్మరించుచున్న నా హృదయమున నీపై స్థిరమైన ప్రీతి కలుగు గాక అని భావము. కావుననే భగవతీ శ్రుతి గూడా ప్రత్యగాత్మయే సర్వాధికమయిన ప్రేమకు విషయమని చెప్పెను. ఆత్మకళ్యాణముకొఱకే దేవతలుగూడా ప్రేమింపబడుదురు అని ఇంతకు పూర్వము చెప్పబడినది. పరోక్షతత్త్వము ప్రేమాస్పదము కాదు. అట్టి పరోక్షతత్త్వము ఆనందరూపము, లేక పరమానందరూపము ఎట్లు కాజాలును? కావున, స్వప్రకాశత్వము పరోక్షమైన పరమాత్మయందు అసంగతమైనట్లే పరప్రేమాస్పదత్వము, పరమానందరూపత్వము గూడా అసంగతము. పైన చెప్పిన ఈ హేతువులవలన వేదాంతవేద్యుడు, పరాత్పరుడు, పూర్ణతముడు నయిన భగవంతుడు సర్వాంతరతముడు, సర్వప్రత్యగాత్మయై ఉన్నాడు. కావుననే నిరతిశయము, నిరుపాధికము నయినది పరప్రేమాస్పదము, పరమానందరూపము. ఆనందము, చైతన్యము పరమ సత్యము నయిన భగవంతుడే సర్వప్రత్యగాత్మరూపముతో ఉన్నాడు. అచింత్య, అనంత, కళ్యాణగుణగణాకరుడైన భగవంతుడే సచ్చిదానందరూపుడు.

సమస్త గుణగణములు ఆనందమునందే పర్యవసితము లగును. ఏలన, సర్వగుణముల ఉపయోగము అనర్ఘనిబర్హణము, సౌఖ్యాతిశయము, మహత్త్వాతిశయము యొక్క ఆధానమునందే కలిగియుండును. నిరతిశయ సుఖస్వరూపుడు, నిరతిశయ మహనీయుడు నయిన భగవంతునియందే సర్వగుణములు సమాప్తి చెందును.

సౌందర్య, మాధుర్యాది గుణసంపన్నుడు, సగుణుడు, సాకారుడు నయిన భగవంతునియందే ఆనందము కలదు. అదృశ్య, అగ్రాహ్య, అచింత్య, నిరాకార, నిర్వికార పరమాత్మ, పాషాణ రూపము. అట్టి పరమాత్మయందు సుఖలేశము గూడా ఉండదు.

కాని, ఇచట, వివేచన చేసినచో, ఎచటైనను, ఏవిధమైన సుఖస్వరూపములు ఉండునో, ఆ సుఖములన్నియు నిరాకారములే అని విదితమగును. ఎచటైనను, సుఖస్వరూపమును నీల, పీత, హరిత, రూపముతోనులేక, మూర్తముగానుచూడజాలము. చిరకాలవియోగము వలన సంతప్తుడైన కాముకుడు, తన ప్రియ కాంతాపరిష్వంగము వలన ఆనందానుభవమును పొందును. ఉత్కటమైన పిపాస (దప్పిక) వలన బుభుక్ష (భోజనము చేయవలయుననెడి కోరిక) వలన పరిపీడితుడైన పురుషునికి శీతల, మధుర, సుగంధిత జలము, సౌగంధ్య, సౌరస్య, మాధుర్య సంపన్నమైన పక్వాన్నము లభించినపుడు, ఆనందము కలుగును. ఇచట గల ఆనందరూపము ఏమి? అను విషయము వివేచన చేయవలసియున్నది. ఆ ఆనందము నీలవర్ణము, పీతవర్ణముకలదా, లేకలఘువు, గురువైనదా, బృహత్పరిమాణము కలదా, లేక మధ్యమ పరిమాణముచే పరిమితమైనదా? ఇచట, శీతల, సుమధుర జలము, పక్వాన్నము, లేక కామిని స్వయముగా ఆనందరూపములు కావని చెప్పరాదు. ఏలన, బుభుక్ష, పిపాస, కామవ్యథ లేక, కామిన్యాదులయందు ఆనంద గంధము గూడా ఉపలబ్ధము కాదు. ఆ ఆనందము అన్ని స్థలములందును అశబ్దము, అస్పర్శము, అరూపము. అగంధము, అదృశ్యము, నిరాకారమును అయియే ఉండును.

ప్రేమాస్పదునియందు, ప్రేమోద్రేకము వలన, ఆనందోద్రేకము కలుగును. అనందోద్రేకమందు బాహ్యాభ్యంతర సమస్త ప్రపంచము విస్మృత మగును. అపుడే చిరకాల వాంఛితమైన, కామినీపరిరంభణజన్యమైనఆనందోద్రేకమునందు బాహ్య అభ్యంతర దృశ్య ప్రపంచము విస్మృతమగును. ఈవిధముగానే సుషుప్తి కాలమునందు ప్రాజ్ఞుడైన పరమాత్మ సంయోగజన్యమైన ఆనందము వలన ప్రపంచవిస్మరణము కలుగును. సప్రపంచ బ్రహ్మయందు

సాతిశయమైన ప్రేమ కలుగును. కావుననే సాతిశయమైన ఆనందము, ప్రపంచవిస్మరణము గూడా కొలదిమాత్రముగానే కలుగును. సర్వోపాధివినిర్ముక్తుడైన భగవంతుడే నిరావరణుడయిన కారణము చేత నిరతిశయ ప్రేమాస్పదుడు. ఆ భగవత్సమాగమునందు నిరతిశయమైన, ఆనందము కలుగును. అపుడే సంపూర్ణముగా సర్వదృశ్య ప్రపంచము యొక్క అత్యంతాభావము కలుగును. అధిష్ఠాన సాక్షాత్కారము ద్వారా ఆవరణము నివృత్తము కానంత వఱకు జీవునికి సంపూర్ణముగా బ్రహ్మపరిష్వంగము కలుగదు. వ్యవధానశూన్యమైన ప్రియతమ పరిష్వంగము ఎంత ఉండునో, అంత అధికముగా ఆనందము అభివ్యక్తమగును. సృష్టికాలము నందు, లేక ప్రబోధ (జాగరణ) కాలమునందు భోగ్యము భోక్త- అన్నియు తన మహాకారణమునుండి దూరమైపోవును. ప్రళయమునందును, సుషుప్తియందును అవి అన్నియు, తమ కారణసాన్నిధ్యమునకు చేరును.

తరంగములు ఏ దశలోనైనను సాగరమునుండి విముక్తములు కావు. సర్వదా సాగరముయొక్క అంకమునందే ఆ తరంగములు ఉండును. మహాసాగరమునుండి ఫేన, బుద్బుద, తరంగములవలె పరమానంద సుధాసాగరమునుండి ఉత్పన్నమగునట్టి సమస్త తత్త్వముల ఉనికి భగవంతుని మంగళమయ శరీరమునందే ఉండును. అయినను, భ్రమమూలకమైన భేదము, వియోగము ఎంత స్పష్టముగా వ్యక్తమగుచున్నదనిన, స్వాభావికమైనఅభేదము, సహజ సంబంధము తిరోహితమైపోవును. విస్మృతమైన కంఠమణిని అన్వేషించుట, మహాసాగరమునందు అంతర్గతములగు హిమశిలలకు సంబంధించిన పిపాస- ఈ విషయమునకు పోషకములైన సుందర ఉదాహరణములు. మహాప్రళయకాలమునందు సమస్త ప్రపంచము

క్రమముగా సబీజ బ్రహ్మయందు లీనమగును. సమస్తవనములు, పర్వతములు, నగరములు, గ్రామాదులు మున్నగు పార్థివ ప్రపంచము పృథ్వియందు విలీనమగును. పృథ్వి, జలమునందును, జలము తేజస్సునందును, తేజస్సు వాయువునందును, వాయువు ఆకాశమునందును విలీనమగును. సృష్టికాలమునందు మహాకారణము కార్యోన్ముఖమై, వికసితమై సవిశేషభావమును పొందును. అరీతిగానే ప్రళయకాలమునందు సమస్త కార్యములు కారణోన్ముఖములై నిర్విశేషభావమును పొందును.

తంతువునందు శరీరమును కప్పుట, చలిని పోగొట్టుట మున్నగు కార్యకరణసామర్థ్యము ఉండదుగాని, పటమునందు ఉండును. ఆ పటము తంతుభిన్నమైన ఒకానొక స్వతంత్ర పదార్థము కాక, కేవలము ఆతాన వితానాత్మకమైన (పడుగు పేకలు గల) తంతు రూపమే అయి ఉన్నది. అయినను, దానియందు శరీరమును ఆచ్ఛాదించునట్టి, శీతాపనయనము చేయునట్టి సామర్థ్యము ఉండును. తంతువునందు ఆ సామర్థ్యము లేదు. అట్లే ఘటమునందు జలానయన (జలమును తీసికొనివచ్చు) సామర్థ్యము ఉన్నదిగాని, మృత్తికయందు లేదు. మృత్తిక జలానయన కర్తృత్వ విశేషరహిత మగుటవలన నిర్విశేషము, ఘటము జలానయన కర్తృత్వయుక్త మయినదగుట వలన, సవిశేషమై ఉండును. పటమునందు శీతాపనయనకార్యకారితారూపమయినవిశేషముకలదు గాన, అదిసవిశేషము. తంతువు ఆ విశేషము లేనిదగుటవలన నిర్విశేషము. ఉపాదాన కారణముకంటె భిన్నమైన కార్యము ఏదియును ఉండదనియు, అయినను, కారణముకంటె కార్యమునందు కొంత వైలక్షణ్యము తప్పక ఉండుననియు వివేచన చేసినపుడు విదితమగును. మృత్తిక ఘటరూపమున వ్యక్తమై సవిశేషమగును. ఘటము మృత్తికయందు లీనమైనపుడు, ఘటాపేక్షయా, ఆ మృత్తిక, నిర్విశేషమగును,

మృత్తికాపేక్షయా, ఆ ఘటము సవిశేషమగును. జలము గంధ రహితము. కాని, జలకార్యమైన ఆ పృథ్వి, గంధవతి. రసహీనమైన తేజస్సునుండి రసవంతమైన జలము, రూపరహితమైన వాయువు నుండి రూపయుక్తమైన తేజస్సు ఉత్పన్నమగును. కారణాపేక్షయా కార్యము సవిశేషము, కార్యాపేక్షయా కారణము నిర్విశేషమై ఉండును. ఆకాశమునందు శబ్దము ఉత్పన్నమగును. ఆకాశమును గూడా అహంతత్త్వమునందు, అహంకారమును మహత్తత్త్వము నందును(సమష్టి జ్ఞానమునందును),మహత్తత్త్వమును అవ్యక్తము నందును లయచింతనము చేయుటవలన అత్యంత నిర్విశేషత్వము కలుగును. మహానిద్రయందు, తమస్సునందు, సుషుప్తియందును సర్వదృశ్య ప్రపంచము పరమాత్మయందు లీనమగును. సుషుప్తి యందు, లేక ప్రళయమందు ఏ భగవత్స్వరూపమునందు సర్వ భోగ్య, భోక్తృజాతము లీనమగునో, ఆ భగవత్స్వరూపము గూడా విశ్వశక్తినిశిష్టమైనదే. ఇచట సబీజమైన బ్రహ్మయందే సబీజమైన ప్రపంచము విలీనమగును.కావుననే పార్థక్యము గూడా సూక్ష్మముగా విద్యమాన మయియే ఉండును.

క్షీర,నీర సమ్మిశ్రవణమునందు ఏకత్వమువంటిదే కలుగును. కాని, వస్తుతః, క్షీరనీరావయవములు భిన్నభిన్నములే. కావుననే హంస వానిని వేఱుచేయును. మహాసాగరమునందు నానావిధము లైన నిర్ఝర, నిర్ఝరిణుల, మహానదుల సంగమము కలుగును. స్థూల దర్శుల దృష్టియందు సముద్రముతో అన్నింటికి ఐక్య మున్నను, అభిజ్ఞులైనవారి దృష్టిలో మహాసముద్రమునందు సమస్త నిర్ఝర ముల, నదుల జలములు వేఱు వేఱుగానే ఉండును. సర్వజ్ఞకల్పు లైన యోగిజనులు, సర్వజ్ఞశిరోమణియైన భగవంతుడు, వాని నన్నింటిని వివేచనము,పృథక్కరణముచేయగలరు.సరిగా, ఆవిధము గానే అనంత బ్రహ్మాండజననీసహితుడు, మహాశక్తివిశిష్టుడు నయిన

భగవంతునియందు అనంతకోటి బ్రహ్మాండములు, తదంతర్గతులైన జీవులు, వారి అనంతకర్మలు, సమస్త భోగ్యప్రపంచము విలీనమగును. అత్యంత సూక్ష్మదశను చేరుటవలన, జీవులకు వానిని వివేచనము చేయుట, పృథక్కరించుట అశక్యమయినను, సర్వాంతరాత్మ, సర్వేశ్వరుడు నయిన భగవానుడు, వానిని వివిక్తము చేయగలుగును, పృథక్కృతము చేయగలుగును. అనంతబ్రహ్మాండములను, అనంత జీవులను, వారి కర్మలను, తత్ఫలమును ఎఱింగి, యథాయోగ్యమైన వివేచనమే, నియోజనమే పరమేశ్వరుని కార్యము. ఏ యే బ్రహ్మాండముల, ఏ యే జీవుల, ఏ యే జన్మల, ఏ యే కర్మల ఫలము ఏ యే దేశ, కాలములందు, ఏ విధముగా ఒసగవలయును ? అను జ్ఞానము కర్మలకు, జీవులకు అసంభవము. కర్మలే తమ అనంత స్వరూపములను, ఫలములను ఎఱుంగనైన ఎఱుంగజాలవు. కేవల జీవులకే అనంత కర్మల, తత్ఫలముల జ్ఞానము ఉండదు. ఒకవేళ, ఉన్నను, ఫలసంపాదనశక్తి లేదు. ఏలన, పరమేశ్వరునికిదక్క, అందఱి శక్తులు అత్యల్పములే. జీవునికి కర్మ, తత్ఫలజ్ఞానము, తత్ఫలసంపాదనశక్తియు ఉన్నను, జీవుడు, తాను చేసిన శుభకర్మల, శుభఫలముల సంపాదనమునందే ఆసక్తి కలిగియుండును. కావున, అశుభ కర్మలందు, తత్ఫల సంపాదనమునందు వానికి, ఏవిధమైన ఆసక్తిగాని, ప్రవృత్తిగాని, కలుగజాలదు. ఆ కారణముచేత సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు నయిన భగవంతుడు కాక, మఱొకరియందు సమస్త బ్రహ్మాండాంతర్గతులైన సర్వజీవుల, తత్కర్మల, తత్ఫలముల జ్ఞానము, కర్మఫలము నొసగు శక్తి ఉండుట అసంభవము.

ఈవిధముగా అవిద్యా కామ కర్మవిశిష్టుడైన జీవునికే సుషుప్తి దశయందు సబీజ బ్రహ్మతో సాయుజ్యము (ఏకత్వము) కలుగును. బ్రహ్మసాయుజ్యమునందు జీవునికి అద్భుతానంద

ప్రాప్తి కలుగును. కాని, సుషుప్తియందు ఆవరణసహితుడైన జీవునికి సావరణ బ్రహ్మతో సాయుజ్యము కలుగును గాన, వ్యవధానావశేషము ఉండును. వ్యవధానరహితమైన బ్రహ్మసాయుజ్యము మాత్రము, జీవుడు స్వతః, నిరావరణుడై నిరావరణబ్రహ్మతో సాయుజ్యము పొందినప్పుడే కలుగును. ఏతదావరణ నివృత్తికై స్వధర్మానుష్ఠానము, భగవదారాధనము, శ్రవణ, మనన, నిదిధ్యాసనములు చేయబడును, అధిష్ఠానభూతుడైన భగవంతుని సాక్షాత్కారము సంపాదించబడును. అజ్ఞానరూపమైన ఆవరణనివృత్తి వలననే జీవునికి వ్యవధానరహితమైన బ్రహ్మైకత్వము లభించును. శ్రీకృష్ణచంద్రపరమానందకందము హస్తినాపురము నుండి ద్వారకకేగినపుడు ప్రోషితభర్తృకలు, ద్వారకానగరస్థితలు నయిన శ్రీకృష్ణపట్టమహిషులు ప్రియతముని ఆగమనవార్త విని, ప్రియసంయోగమునకై ఆసనమునుండి, ఆశయమునుండి (అంతఃకరణము నుండి) సముత్థితలైరి.

"ఉత్తస్థు రారాత్ సహసాఽఽసనాఽఽశయాత్ ।"

ఇచట దేశకృతమైన వ్యవధాననిరాకరణమునకై శ్రీకృష్ణ ప్రేయసీగణము ఆసనమునుండి ఉత్థితమయ్యెను. వస్తువ్యవధాన నిరాకరణమునకై ఆశయము నుండి అభ్యుత్థానము జరిగెను.

"ఆశేరతే కర్మవాసనా యత్ర అసౌ ఆశయః ।"

'ఆశయ' శబ్దముచేత అంతఃకరణము వివక్షితము. ఆ అంతఃకరణము సమస్త కర్మవాసనలకు నిలయము. ఆశయము గూడా పంచకోశములకు (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశములకు) ఉపలక్షణము. అనగా, శ్రీకృష్ణప్రేయసులు, ఆశయోపలక్షితములైన పంచకోశకంచుకములచేత సమావృతమైన స్వరూపముతో ప్రియసాయుజ్యము త్రుటిపూర్ణ

మని భావించి, పంచకోశాత్మకకంచుక వినిర్ముక్తలై, నిరావరణ రూపముతో ప్రియతమసంమిలనమునకై అభ్యుత్థానము చేసిరి.

ఇచట, పంచకోశాతీతమైన 'త్వం' పదలక్ష్యార్థమే జీవగతమైన స్వీయ శుద్ధ స్వరూపము. 'తత్' పదలక్ష్యార్థము, వ్యాపకమునయిన మహాచైతన్యమే తదంశి అని తెలియవలయును. అంశాంశులకు ముఖ్య సంబంధము ఉండును. పృథివియొక్క అంశలైన లోష్ఠ, పాషాణాదులు పృథివివైపునకు ఆకర్షించబడునట్లే, పరమాత్మయొక్క అంశభూతులైన జీవులు గూడా పరమాత్మవైపునకు ఆకర్షితులగుదురు. ఎవరి అభిప్రాయములో చంద్రునిశతాంశము బృహస్పతినక్షత్రమై ఉన్నదో, ఈవిధమైన అంశాంశిభావము కేవలము ఔపచారికమో, వాని ఆకర్షణము కలుగకపోవచ్చునుగాక, కాని, ఇచట, శ్రీకృష్ణప్రేయసీగణము పంచకోశాత్మకమైన కంచుకముచేత నిరావృతమై వ్యవధానరహితమైన ప్రియతమసంయోగము కొఱకే ఆశయము (అంతఃకరణము) నుండి అభ్యుత్థానము చేసెను. ఆ శ్రీకృష్ణప్రేయసులు, ప్రియతమ వ్యవధాయకమైన ఆనందోద్రేకజన్యమైన రోమాంచోద్గతి గూడా సహించరానిదైనపుడు, పంచకోశకంచుక వ్యవధానము ఎట్లు సహ్యము కాగలుగును? అని తలంచిరి. ఈవిధముగా ప్రత్యక్చైతన్యాభిన్నమైన పరబ్రహ్మయొక్క సాక్షాత్కారము కలిగినపుడే అజ్ఞాన, తత్కార్యరూపవ్యవధాయక ఆవరణముయొక్క ఆత్యంతిక నివృత్తి కలుగును. నిరతిశయ, పరప్రేమాస్పద ప్రత్యగాత్మతో ఏకత్వము కలుగుటవలన, 'తత్' పదార్థమైన పరమాత్మయందు గూడా నిరతిశయ, నిరుపాధిక పరప్రేమాస్పదత్వము వ్యక్తమగును, సాక్షాత్తుగా అపరోక్షత్వము, పరమానందరూపత్వము గూడా స్పష్టమగును. ఏతద్భిన్నముగా పరమాత్మను ప్రత్యక్భిన్నమని, పరాక్ అని, బహిరంగమని భావించుటవలన, స్వయంప్రకాశత్వ, పరప్రేమాస్పదత్వ, పరమా

నందాస్పదత్వములు, ఏవిధముగాను సిద్ధింపజాలవు. కావున, సాధకుడైన వ్యక్తి, తన భగవంతుని పూర్ణత్వ, పరమానందత్వాది సిద్ధికై స్వాత్మసమర్పణము అవశ్యము చేయవలసియుండును.

ఆత్మవేత్త కానివాడు, ప్రత్యగాత్మకంటె భిన్నమైన అన్యాన్య సమస్త ప్రపంచమును భగవంతునికి సమర్పించును. కాని, ప్రత్యగాత్మయొక్క అస్తిత్వమును వేఱుగా ఉంచును. ఆత్మవేత్తయైనవాడు, ప్రియతముని సర్వవిధపరిచ్ఛేదశూన్యమైన పూర్ణత్వ సిద్ధికై, ప్రత్యగాత్మను గూడా భగవంతునికి సమర్పించివేయును. ఘటాకాశము, తనను తాను మహాకాశమందును, కింవా, తరంగము తనను తాను మహాసముద్రమునందును సమర్పించురీతిగానే జీవాత్మ, తనను భగవంతునికి సమర్పించివేసికొనును. ఇదియే "మా మేకం శరణం వ్రజ" ఇత్యాది భగవదాదేశపాలనము.

> "మామేకం శరణం ఆశ్రయం వ్రజ నిశ్చిను యథా
> ఘటాకాశస్యాశ్రయో మహాకాశః, తరంగస్యాశ్రయో
> మహాసముద్రః ।"

ఈ నిర్వికార, అద్వైత చిదాత్మయే పరమ తాత్త్వికము. ఏతద్భిన్నమైన సమస్త నామరూప క్రియాత్మక ప్రపంచము అతాత్త్వికము, అసద్రూపము. కావుననే భగవద్గీత, దేహాత్మజ్ఞాన, భేదజ్ఞాన, ఐకాత్మ్యజ్ఞానాది భేదముతో తామస, రాజస, సాత్త్వికరూపములైన వివిధ జ్ఞానములను వర్ణించినది.

> "సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే ।
> అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం సాత్త్వికం స్మృతమ్ ।"

శాస్త్ర, ఆచార్యోపదేశము ద్వారా పొందిన జ్ఞానముచేత పరస్పరము విభక్తమైన సమస్త భూతములయందు ఏకము, త్రికాలాబాధ్యము, అవ్యయము, అధిష్ఠానస్వరూపము నయిన పరమాత్మయొక్క దర్శన మగును. ఆ పరమాత్మదర్శనమే సాత్త్విక జ్ఞానము. కటక,

ముకుటి, కుండలాది నానారూపములు గల ఆభరణములందు సువర్ణము, అథవా, సర్ప, జలధారా, మాలాది వికల్పనలయందు అధిష్ఠానమైన రజ్జుఖండమే, కలదు. అట్లే అత్యంత విషమ ప్రపంచ మందు అధిష్ఠానరూపముతో ఏకము, స్వప్రకాశము, సదానంద రూపము నయిన పరమాత్మ, విరాజమానుడై ఉన్నాడు. ఈ అద్వైత బ్రహ్మవాదమే గీతోక్తమైన సాత్త్విక జ్ఞానము, ఇదియే-

"బ్రహ్మైవేదం సర్వం, ఆత్మైవేదం సర్వమ్ ।"

ఇత్యాది శ్రుతులచేత ప్రతిపాతించబడినది.

"పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్ ।
వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం రాజసం స్మృతమ్ ॥"

భిన్న భిన్న పదార్థవిషయకమైన ఏ విజ్ఞానముచేత భిన్నవిధములైన నానాభావములు తెలిసికొనబడునో, అది రాజస జ్ఞానము. ఈ భేద బ్రహ్మజ్ఞానము గీతయందు చెప్పబడిన రాజస జ్ఞానము.

"సర్వం పరస్పరం భిన్నమ్ ।"

అను జ్ఞానము శ్రుతులలో ఎచటను ప్రతిపాదించబడలేదు.

"యత్తు కృత్స్నవ దేకస్మిన్ కార్యే సక్త మహైతుకమ్ ।
అతత్త్వార్థవ దల్పం చ తద్జ్ఞానం తామసం స్మృతమ్ ॥"

దేహాది కార్యమందే ఆసక్తము, అతత్త్వార్థవిషయకము నయిన జ్ఞానము తామస జ్ఞాన మని చెప్పబడును. శ్రీమద్భాగవతమందు గూడా సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితము,స్వప్రకాశము నయిన నిత్యవిజ్ఞానమే తత్త్వ మని చెప్పబడెను.

"వదన్తి తత్తత్త్వవిదః తత్త్వం యద్జ్ఞాన మద్వయమ్ ।
బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే ॥"

తత్త్వవేత్తలు, అద్వయ జ్ఞానమునే తత్త్వమని చెప్పెదురు. ఆ

అద్వయ జ్ఞానమే బ్రహ్మ, పరమాత్మ, భగవంతుడని చెప్పబడును. ఇచట, బ్రహ్మకంటె పరమాత్మయందును, పరమాత్మకంటె భగవంతునియందును ఉత్కర్ష వివక్షితమని కొందఱు చెప్పుదురు. యదుకులభూషణుడైన శ్రీకృష్ణుని సభలో కూర్చుండియున్న యాదవులు, ఆకాశమార్గము ద్వారా ఏతెంచుచున్న దేవర్షియైన నారదుని, తేజఃపుంజమని మొదట భావించిరి, కొంత సామీప్యమున కేతెంచినపుడు, ఒకానొక దేహధారి అని తలంచిరి. అధిక సమీపమునకు వచ్చినపుడు, ఒకానొక పురుషుడనియు, సర్వథా సన్నిహితమైనపుడు నారదమహర్షి అనియు తెలిసికొనిరి.

"చయస్త్విషా మిత్యవధారితం పురా తతః శరీరీతి
విభావితాకృతిమ్ ।
విభుర్విభక్తావయవం పుమానితి క్రమాదముం నారద
ఇత్యబోధి సః ॥"

ఆ రీతిగానే తత్త్వమునకు అతిదూరముగా ఉన్న అధికారికి మొదట, కేవలము చిన్మాత్ర బ్రహ్మజ్ఞానము కలుగును. కొంత సాన్నిధ్యమున కేగినపుడు, యోగులకు కతిపయ గుణవిశిష్టుడైన పరమాత్మ, సర్వథా సాన్నిధ్యము కలిగినపుడు అనంత కళ్యాణ గుణవిశిష్టుడైన భగవంతునిరూపమునందు తత్త్వోపలబ్ధి కలుగును. వీరిలోనే స్వేచ్ఛాకల్పన చేయువారు కొందఱు శ్రీకృష్ణుని, ఆదిత్య స్థానీయుడు గాను, బ్రహ్మను ప్రకాశస్థానీయుడుగాను భావింతురు. మఱి కొందఱు వృషభానునందిని నఖమణిప్రకాశమును, లేక నూపుర ప్రకాశమునే ఔపనిషద పరబ్రహ్మ అని చెప్పుదురు. కాని, వైదికుల దృష్టియందైనచో, వేదములకు మహాతాత్పర్యము బ్రహ్మయందే కలదు. అదియే సర్వథా సర్వోత్కృష్టమైనది.

సంకోచమునకు కారణము లేకపోవుటచేత, వృద్ధ్యర్థకమైన 'బృహి' ధాతువునుండి నిష్పన్నమైన 'బ్రహ్మ'శబ్దమునకు అర్థము

నిరతిశయ, బృహత్తమ తత్త్వమగును. దేశ, కాల, వస్తుపరిచ్ఛేదము కలది పరిచ్ఛిన్నమగుటవలన, క్షుద్రమే గాని, నిరతిశయమైన 'బృహత్'కాదు. జడమైనను, దృశ్యమగుటవలన అల్పము, మర్త్యము నగును. కావున, అనన్త, స్వప్రకాశ, సదానంద తత్త్వమే 'బ్రహ్మ' శబ్దవాచ్యము. అదియే భూమ, అదియే అమృతము. తద్భిన్నములైనవానిని అన్నింటిని, అల్పములు, మర్త్యములు అనియే తెలియపలయును. ఇక, 'అనన్త' పదముతో పఠితమైన 'బ్రహ్మ'శబ్దమునకు సుతరాం అర్థ మిదియే. దానియందు అతిశయత్వకల్పన నిర్మూలము.

ఒకానొక మహారాజు అంతమన్నది లేని కథను వినగోరెను. ఒక చతుర వ్యక్తి, కథ చెప్పనారంభించెను— హే రాజన్! ఒక వృక్షముండెను. దానికి అనంత శాఖలు కలవు, ఆ శాఖలకు అనంత ఉపశాఖలు కలవు. ఆ ఉపశాఖలందు గూడా అనన్త పల్లవములు ఉండెను, వానిపైన పెక్కు పక్షులు కూర్చుండియుండెను. కొంత కాలము పిమ్మట, ఒక పక్షి 'ఫుర్'అని ఎరిగిపోయెను. అంత, రాజు, తరువాతి కథ చెప్పు మనెను. అపుడతడు రెండవ పక్షి గూడా ఎగిరి పోయెనని చెప్పెను. తరువాతి కథ చెప్పుమని మరల రాజు అడిగెను. అంత, ఆ చతురుడు, పక్షులన్నియును ఎగిరిపోయినప్పుడు కదా, నేను ముందుకు సాగునది అని పలికెను. ఇచట ఒక్కొక్క పక్షి ఎగిరిపోవుట సమాప్తము కానే కాజాలదు. ఈ విధముగానే కల్పనలకు అంతమన్నది లేదు. కావున, ఒక మాటలో చెప్పవలయుననిన, అతిశయత్వకల్పన చేయుచు, చేయుచు బృహస్పతి, ప్రజాపతి యొక్క బుద్ధి గూడా విరమించునపుడు, దానికంటె తరువాత ఎన్నడును, ఏ కల్పనయు, చేయలేనపుడు, అనంత, అఖండ, స్వప్రకాశ, పరమానందఘనస్వరూపుడైన ఆ భగవంతునినే వేదాంతులు 'బ్రహ్మ' శబ్దముచే చెప్పుదురు.

"అథాతో బ్రహ్మజిజ్ఞాసా।"

ఇత్యాది వ్యాస సూత్రముల ద్వారా ఆ బ్రహ్మవిచారమే చేయ బడినది.

ప్రకాశముకంటె ఆదిత్యునియందు ఏ అతిశయత్వకల్పన చేయబడుచున్నదో, దానికంటె గూడా అనంతకోటిగణితముగా కల్పన చేసినతరువాత, ఏ అంతిమ, నిరతిశయ, సర్వబృహత్ పదార్థము సిద్ధించునో, దానియందు గూడా దేశ, కాల, వస్తుగతపరిచ్ఛేదములను తొలగించి, పరిచ్ఛిన్నత్వ, ఏకదేశిత్వాది దోషాదుల అత్యంతాభావమును సంపాదించినపిమ్మట, అతడు, 'బ్రహ్మ' శబ్దమునకు అర్థమును తెలిసికొనవలయును. ఇదియే 'తత్త్వ' మని చెప్పబడును.

"తత్త్వం యద్జ్ఞాన మద్వయమ్।"

అని తత్త్వలక్షణము. దీని పేరే, బ్రహ్మ, పరమాత్మ, భగవంతుడు. లక్షణభేదమువలన లక్ష్యభేదము ఉండవచ్చును గాని, నామభేదము చేత ఉండదు. కంబుగ్రీవాదిమత్త్వము ఘటముయొక్క లక్షణము. కావుననే ఘట, కుంభ,కలశాదినామములచేత ఘటమునందు భేదము ఉండదు. కార్యబ్రహ్మ, కార్యకారణాతీతబ్రహ్మ అను భేదముతో బ్రహ్మ అనేకముగా ఉండును. ఇటువంటి స్థితిలో కార్యకారణా తీతము, వేదాంతవేద్యము, శుద్ధబ్రహ్మరూపము నయిన భగవంతుని ప్రకాశస్థానములో కార్యబ్రహ్మ, కారణబ్రహ్మ ఉండుట సంభవము కావచ్చును. నిర్గుణ బ్రహ్మ, భగవంతుని ధామమని గూడా చెప్పబడును. 'ధామ'శబ్దార్థము, ఇటువంటి స్థలములందు స్వరూప భూతమైన మహాజ్యోతిబోధక మయియే ఉండును.

"పరం బ్రహ్మ పరంధామ పవిత్రం పరమం భవాన్।"

హేనాథ ! నీవు పరమాత్మవు, పరమ ప్రకాశమవు (పరంజ్యోతివి),

పరమ పవిత్రుడవు అని భావము. అయినను, 'ధామ' మనగా, నివాసస్థాన మనియే అవివేకులైన కొందఱికిస్థిరమైనఅభిప్రాయము. వారు, అవ్యక్తరూప కారణబ్రహ్మనే వేదాంతవేద్యమైన బ్రహ్మ అని భావింతురు. కార్యకారణాతీతమైన తత్త్వమువఱకు వారి దృష్టి పోనే పోదు. ఈ కారణముచేత, బ్రహ్మను 'ధామ' మని అంగీకరించినను, సిద్ధాంతమునకు ఏమియును భంగము వాటిల్లదు. స్థూల కార్య బ్రహ్మపైన, సూక్ష్మకార్యరూప బ్రహ్మ, ఆ బ్రహ్మమైన కారణ బ్రహ్మ, ఈ అవ్యక్తకారణ బ్రహ్మపైన కార్యకారణాతీతుడైన శుద్ధ బ్రహ్మ అవస్థితుడై ఉన్నాడను భేదము వేదాంతులకు సమ్మతమైన విషయమే. ఈ అంతిమ తత్త్వమే అద్వితీయ, అనంత, శుద్ధ బోధరూపమై ఉన్నది. ఈ శుద్ధ బ్రహ్మవివర్తమే సమస్త చరాచర ప్రపంచము. సర్వాధిష్ఠాన మయిన కారణముచేత,ఈ శుద్ధ బ్రహ్మను సర్వధామము, సర్వనివాసస్థాన మనియు చెప్పినను, ఏమియు, హాని లేదు. ఈవిషయమే నిమ్నోదాహృత భాగవతశ్లోకమునందు స్పష్టీకరింపబడినది-

> "జ్ఞాన మేకం పరాచీనై రింద్రియై ర్బ్రహ్మ నిర్గుణమ్ ।
> అవభాత్యర్థరూపేణ భ్రాన్త్యా శబ్దాదిధర్మిణా ॥"

ఏకము, అద్వితీయము, నిత్యము నయిన బోధయే (జ్ఞానమే) భ్రాంతజనులకు అవిద్యాప్రత్యుపస్థాపితములు, బహిర్ముఖములు నయిన ఇంద్రియములు, మనోబుద్ధ్యాదులద్వారా శబ్దాదిధర్మము గల ప్రపంచముగా భాసించుచున్నది.

ఓమ్ తత్ సత్ ।



# 15. సాక్షాన్మన్మథ మన్మథః

సుధాతరంగిణి

బ్రహ్మేంద్రాది శిరోమణులపైన విజయమును సాధించుట వలన కామదేవునికి అఖర్వ(తీవ్రమైన)గర్వము కలిగెను. దానిచేత అనంతకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీకృష్ణచంద్రునిపైనను విజయము సాధించవలయునన్న ఆలోచన ఆ మన్మథునికి కలిగెను. ఇట్లు ఆలోచించి, శ్రీకృష్ణభగవానుని సమీపమునకు పోయి, తన మనోగత భావమును వ్యక్తము చేసెను.

అపుడు, భగవంతుడు 'నీవు నాతో ఎట్లు పోరాడదలచు చున్నావు? దుర్గమును ఆశ్రయించి పోరాడదలచుచున్నావా, లేక యుద్ధరంగమందు పోరాడదలచుచున్నావా ?' అని అడిగెను. అంత, మన్మథుడు, ఇట్లు అడిగెను_ 'భగవన్ !' ఈ రెండు యుద్ధముల స్వరూపమేమి ?" అంత, భగవంతుడు ఇట్లనెను_ 'దుర్గయుద్ధ మనగా, నేను విరక్తుడనై, ఏకాంత నిర్జనవనమందు సమాధిస్థితుడ నయ్యెదను, అపుడు, నీవు నీ మాయచేత' కళల చేత నన్ను మోహితుని, క్షుబ్ధుని చేసినచో నీకు విజయము కలుగును. అట్లు నన్ను క్షుబ్ధుని గావించలేకపోయినచో నాకు విజయము సిద్ధించును.'

రణరంగమున యుద్ధము మఱొక తీరున ఉండును. బృందావన ధామమందు స్వచ్ఛమైన, సుకోమలమైన యమునానదీ పులినము (తీరము) ఉండవలయును. అమృతమయుడైన పూర్ణచంద్రుని దివ్యజ్యోత్స్న వ్యాపించి ఉండవలయును. శీతల, సుగంధ, మంద, పవనము సంచరించుచుండవలయును. వివిధములయిన విహంగముల కలరవములతో, భ్రమరసమూహముల గుంజారవములతో నినాదితము, పుష్పితము నయిన లోకోత్తరమైన సుందరవనరాజిచ్ఛట

వ్యక్తమగుచుండవలయును. హంస, సారసశోభితమైన సరోవర మందలి అద్భుత సౌందర్య, మాధుర్య, సౌగంధ్య, సౌరస్య సంపన్నమైన రతీదేవి గర్వమును దూరమొనర్చునట్టి అగణిత వ్రజకన్యలమధ్య, వారి ముఖచంద్ర చుంబనము చేయుచున్నను, వారి అవయవములను ఆలింగనము చేసికొనుచున్నను, నా మనస్సు నందు వికారము కలుగనిచో, నేను విజేత నయ్యెదను. మలయా నిలము, కాంతల హావభావములు, విలాసములచేత నా మనస్సు నందు వ్యాకులత కలిగినచో, జయము నీది అగును.

కామదేవుడు, మనసులోనే ఇట్లు ఆలోచించసాగెను– 'ఈయన, దుర్గమును ఆశ్రయించినచో, నేను జయించుట అసంభవము. ఏలయనగా, ఈయన, నరనారాయణరూపముతో యోగాసనాసీనుడై బదరికాశ్రమమందు తపస్సు చేయుచున్న సమయమున, ఇంద్రునికి ఇతడు నా ఐంద్రపదవి కొఱకై తపస్సు చేయుచున్నాడన్న భ్రాంతి కలిగెను. అపుడు, నేను, ఇంద్రుడు పంపిన వసంత ఋతువుతోను, అప్సరసలతోను నరనారాయణుని ఆశ్రమమునకు పోయితిని. అప్సరసల సమస్త హావభావములు, వసంతుని సహాయము, నా బాణములు అన్నియు వ్యర్థములయ్యెను. అయినను, ఈయనయందు క్రోధసంచారము కలుగలేదు. విశేషించి, ఈయన, మాయందఱికి ఆతిథ్య మొసగెను. అపుడు, అప్సరసలు ఇట్లనిరి– 'హే నాథ! సద్యోజాతయైన (అపుడే పుట్టిన) బాలిక హావభావములతోను, క్రీగంటిచూపులతోను తన ప్రపితామహుని (తాతయైన బ్రహ్మదేవుని) మోహింపజేయవలయునని తలచిన చందముగా, నీ మాయచేత మోహితులమై మేమందఱము నిన్ను మోహింపజేయుటకై వచ్చితిమి.'

అపుడు భగవంతుడు, వారిని ఓదార్చి పంపివేసెను. కావున, దుర్గయుద్ధమున ఈయనను ఎవరు జయింపగలుగుదురు? కావున,

మన్మథుడు 'హే భగవన్! నీవు రణభూమియందే యుద్ధము చేయుము అని అడిగెను. అంత, భగవంతుడు 'తథాఽస్తు, నేను, యుద్ధభూమియందే నీతో యుద్ధము చేసెదను' అని పలికెను.

కామదేవుడు గూడా మంచిది, అని పలికి, వెడలిపోయెను. కాని, అతడు పోయి, వ్రజాంగనల శరీరమన్న కాంచనదుర్గమును ఆశ్రయించెను. ఇచట, శ్రీకృష్ణచంద్రుడు ఇట్లు ఆలోచించెను– 'విదియనుండి చతుర్దశి వఱకు చంద్రుడు పరిపూర్ణుడై ఉండును. కావున, రాహువు గూడా ఆ చంద్రునిపై ఆక్రమణము చేయలేదు. కావున, భగవంతుడైన శంకరుని కోపాగ్నిచేత దగ్ధప్రాయుడు అపరిపూర్ణుడును అయిన కందర్పునిమీద విజయము సాధించుట యందు ఏమి మహత్త్వము కలదు? కావున, కందర్పుని,పరిపూర్ణుని గావించియే వానిని జయించుట యుక్తము.'

ఇట్లు ఆలోచించి, శ్రీకృష్ణభగవానుడు మురళిని అమృతమయమైన తన ముఖచంద్రునియందు ధరించి, ఆ మురళిని అధరసుధతో పూరించెను.వేణురంధ్రముల ద్వారా జాలువారిన గీతామృతమును కర్ణపుటముల ద్వారా వ్రజాంగనల హృదయమందు చేర్చి, దగ్ధప్రాయుడైన కందర్పుని, పునరుజ్జీవితుని జేసెను. దగ్ధప్రాయుడైన కామదేవుడు శ్రీకృష్ణుని అధరసుధవలన ఉత్తేజితుడయ్యెను. వేణువాదనవ్యాజముతో ఫూత్కారముచేత కామాగ్నిని ఉత్తేజితము చేసినట్లును, దానియందు అధరసుధాసించనముచేత ఆజ్యాహుతిని వేసినట్లును చేసెను.

ఇంత అయినను, వ్రజేంద్రనందనుడు ఇట్లు ఆలోచించెను– 'ఈ కందర్పుడు మనస్సునుండి జనించును. కావుననే మనసిజుడు, లేక మనోజుడు,అని చెప్పబడును. వ్రజాంగనలమనస్సు,నాయందు భక్తి కలిగి ఉండును. కావున, భగవద్భక్తుడు, తండ్రియొక్క సన్నిధానమువలన కందర్పుని ప్రాగల్భ్యమునకు ప్రతిబంధము

కలుగవచ్చును.' ఇదియే ఆలోచించి, భగవంతుడు వేణుగీత పీయూషప్రవాహముచేతశ్రీ వ్రజాంగనల మనస్సును అపహరించెను.

"వ్రజస్త్రియః కృష్ణగృహీతమానసాః ।"

ఇతర ప్రవాహము స్వసంస్పృష్టమైన (తనచే స్పృష్టింపబడిన) పదార్థములను గంతవ్య స్థానమునకు గానిపోవును. కాని, -వేణుగీత పీయూషప్రవాహము స్వసంస్పృష్ట పదార్థములను తన ఉద్గమస్థానమైన శ్రీకృష్ణుని సన్నిధానమునకు చేర్చును. అథవా, శ్రీకృష్ణ చంద్రుని ముఖపంకజమునుండి వినిర్గతమైన వేణుపీయూషము అనావృతమైన వ్రజాంగనల కర్ణకుహరములందు ప్రవేశించి, వారి హృదయములందు గల ధైర్య, వైరాగ్య, వివేక,లజ్జాది రత్నములచే పరిపూర్ణమైన మంజూషను (పేటికను) హరించెను. కావున, మన్మథుడు అత్యంత నిర్మలుడయ్యెను. వేణుగీతపీయూషముచేత ఆప్యాయితుడై (సంతృప్తుడై) అధిక ప్రగల్భుడయ్యెను.

ఇట, వసంతుడు గూడా ఆలోచించెను- 'అనంతకోటిబ్రహ్మాండ నాయకుడు, నిఖిల జగత్పతియు నయిన భగవంతునితో తన మిత్రుని యుద్ధమున, నేను గూడా నా మిత్రునికి సాయపడ వలయును.నా మిత్రుడైన మనోజుడు పుష్పధన్వుడు. పుష్పములే ఆ మిత్రుని అస్త్ర, శస్త్రములు. విరహిజనుల హృదయవిదారణము చేయుట కొఱకై రక్తరంజితమైన ఎఱ్ఱని కింశుక మనెడి బరిశెను ఉపయోగించును. కమల, కుందకుట్మలములు, కేతకీపుష్పములు మున్నగునవియే బల్లెమువలె పని చేయును. ఇటువంటివే అయిన అన్యాన్య పుష్పములు గూడా అస్త్రశస్త్రములు చేయు పనిచేయును. ఇట్లు ఆలోచించియే వసంతుడు వివిధములైన కమల- కమలినులను, కుముద- కుముదినులను, కేతకీ, చంపక, మాలతి మున్నగు అనేక విధములైన పుష్పములను వికసింపజేసెను.

ఈవిధముగా మిత్రుని సహాయముచేత సుసంపన్నుడై

హృష్టపుష్టుడై, శస్త్రసుసజ్జితుడై వ్రజాంగనల సుషమాసంపన్నము లయిన అవయవముల దివ్య, కాంచనమయ, కామగామి అయిన దుర్గమందే అధిష్ఠించెను. శ్రీబృందారణ్యధామమున, శ్రీకృష్ణ చంద్రునితో సంగ్రామము చేయుటకై వెడలెను.

భగవంతుడు, ఆ దివ్యధామమందు అచట కేతెంచిన వ్రజాంగనలమధ్య,నిర్వికారభావముతోధర్మతత్త్వమును ఉపదేశించ సాగెను. అపుడు, కందర్పుడు ఇట్లనెను- ఈ వ్రజసుందరస్త్రీల సంసర్గమందు అవయవసంబంధము, వివిధములైన రాసవిలాసము లందు మీ మనస్సు క్షుబ్ధము,మోహితము కానపుడే మీరు విజయము సాధించినవారగుదురు.

శ్రీకృష్ణుడు 'తథాఽస్తు' అని పలికి, అట్లే చేసెను. వ్రజాంగ నల సుందర శరీర మన్న కామదుర్గమందు ఆక్రమణ మొనర్చి, బ్రహ్మాది జయసంరూఢదర్పము గల కందర్పుని దర్పదళనము చేసెను. ఇంతియే కాది, తన స్వరూపభూతమైన బ్రహ్మసంస్పర్శ చేత వ్రజాంగనలను ఆత్మసాత్కృతలను చేసి, వారిని సర్వథా నిర్వికారలనుగా చేసెను. పరిరంభణమొనర్చి, అలక, ఊరు, నీవీ, స్తనస్పర్శచేత, పరిహాస, నఖపాత, క్ష్వేళి (సింహనాదము వంటి నాదము) అవలోక, హాసములచే గూడా కందర్పుని నిగ్రహించియే వ్రజసుందరులను రమింపజేసెను. ఎట్లనిన-

"బాహుప్రసార పరిరంభ కరాళకోరూ నీవీ స్తనాలభన
నర్మ నఖాగ్రపాతైః ।
క్ష్వేళ్యావలోక హసితైః వ్రజసుందరీణా ముత్తంభయన్
రతిపతిం రమయాంచకార ॥"

వ్రజాంగనలతో శ్రీకృష్ణుని నానావిధ హావభావములు, కటాక్ష ములు, కందర్ప, వసంతాదుల అస్త్ర, శస్త్రప్రయోగములు

అన్నియును, వ్యర్థములయ్యెను. ఆత్మారాముడైన శ్రీకృష్ణుడు యథాతథముగానే నిర్వికారుడై ఉండెను.

అనంత బ్రహ్మాండాంతర్గతమైన కామబిందువుయొక్క ఉద్గమ స్థానము సాక్షాత్తుగా మన్మథుడు. అట్టి మన్మథుని మనస్సును గూడా శ్రీకృష్ణచంద్రుడు మథించివేసెను. కావున, ఆయన, సాక్షాత్తు మన్మథమన్మథుడని చెప్పబడును. వస్తుతః, ప్రేమనిర్భరచిత్తము గల వ్రజాంగనల స్మరణముచేత కాముని దర్పము దళిత మగుచుండెడిది. శ్రీకృష్ణుని నఖమణిచంద్రికారశ్మిచ్ఛటను చూచినంత మాత్రముచేతనే సాక్షాత్తుగా మన్మథుడు మోహితుడయ్యెనని భావుకులైన భక్తుల అభిప్రాయము. ఇంతియే కాదు, ఆ మన్మథుడు తీవ్రమైన ఉత్కంఠతో వేల జన్మలవరకు తీవ్రాతితీవ్రములైన తపస్సులచేత వ్రజాంగనాభావమును పొంది ప్రియతముడు, ప్రాణధనుడును అయిన శ్రీకృష్ణచంద్ర పరమానందకంద నఖమణి చంద్రికారశ్మిచ్ఛటను సేవించెదనని దృఢముగా సంకల్పించెను. కావుననే భగవంతుడు సాక్షాన్మథ మన్మథుడయ్యెను.

బ్రహ్మసాక్షాత్కారము, బ్రాహ్మసంస్పర్శవలన కామాది వికారములు ఆత్యంతిక క్షయము నొందుట స్వాభావికమే. అట్టి స్థితిలో ప్రేమమయులైన వ్రజాంగనలయందు వారి ప్రియతమ ప్రాణధనుడైన భగవంతునియందు కామప్రభావము ఏమికలుగును? కాముడు, పరాజితుడయియే ప్రద్యుమ్నరూపముతో శ్రీకృష్ణుని పుత్రుడయ్యెను. కావుననే శ్రీకృష్ణుని, వ్రజాంగనల రమణమందు కామోపయోగము లేదు. అచట, ప్రేమయొక్క ఉపయోగమే ఉండును. ఆ ప్రేమయే 'కామ' పదవ్యపదేశ్య మగును. కావుననే-

"ప్రేమైవ గోప రామాణాం కామ ఇత్యగమత్ ప్రథామ్।"

అని భావుకుల కథనము. గోపాంగనల ప్రేమయే కామ నామముచే ప్రసిద్ధమయ్యెను. వస్తుతః, కృష్ణవిషయకమైన కామము కామమే

కాజాలదు. 'నాయందు ఎవరి బుద్ధి ప్రవేశించునో, వారి కామము కామము కాదు. భర్జితమైన, లేక క్వథితమైన బీజము అంకురితము కానట్లే భగవద్విషయకమైన కామము సంసారమూలము కాదు' అని భగవద్వచనము-

"న మయ్యావేశిత ధియాం కామః కామాయ కల్పతే।
భర్జితాః క్వథితా ధానాః ప్రాయో బీజాయ నేష్యతే॥"

నాయికా నాయకుల పరస్పర సంయోగమునకు మూల భూతమైన స్నేహవిశేషమే కామము. శృంగారరసము సర్వరసములలో శ్రేష్ఠము. అది సర్వరసములకు అంగిరసము. దానిని ఉజ్జ్వల రసమని అందురు. ఏ పదార్థమందలి తృష్ణ అయినను ప్రాణి హృదయమును కంటకమువలె ఉద్వేజితము చేయును. తృష్ణారూప మైన కంటకముచేత వ్యథితము గావుననే, చంచలమైన మనస్సు నందు వ్యాపక, అఖండ, అనంత బ్రహ్మానందము అభివ్యక్తము కాదు. ఇచటనే అభిలషితమైన పదార్థము లభించుటవలన, క్షణిక మైన తృష్ణావృత్తియొక్క నివృత్తివలన, శాంతమైన అంతఃకరణ మందు బ్రహ్మాత్మకసుఖము అభివ్యక్తమగును.

నాయికానాయకుల పరస్పర సమ్మిలనతృష్ణసర్వాతిశాయియై ఉండును. కావుననే అపుడు తృష్ణచేత క్వథితమైన హృదయమందు అశాంతి, చాంచల్యము గూడా అధికమగును. ఇటువంటి సమయమున, పరస్పర సంయోగము వలన తృష్ణాకంటకము తొలగి పోవును.దానివలన క్షణకాలముపాటు శాంతమైన అంతఃకరణమందు బ్రహ్మానందాభివ్యక్తికి సంబంధించిన విశేషము ఉండును. కావుననే అన్యరసాపేక్షయా, శృంగారరసమునకు ప్రాధాన్యము కలదు.

తదనంతరము, శిశుసమర్పణవ్యాజముతోను, దృష్టులతోను ప్రియతముని అంగసంగము పొంది, దురంత భావముతో నిండిన

అంతరాత్మతో ఆ వ్రజాంగనలు తమ ప్రాణనాథపరిష్వంగము చేసిరి—

"పత్న్యః పతిం ప్రోష్య గృహానుపాగత ముత్తస్థు
రారాత్ సహసాఽ సనాశయాత్ ।
తమాత్మజై ర్దృష్టిభి రన్తరాత్మనా దురన్తభావాః
పరిరేభిరే పతిమ్ ॥"

జల, తరంగసంయోగమే యథార్థమునకు అత్యంత వ్యవధాన శూన్యమైన సంయోగము. భావుకులైనవారు కొందఱు ఇట్లు చెప్పుదురు— 'మధుపము సుకోమల కమల మకరంద మధుపానము చేయునది. కాని వాస్తవమునకు కమలమునకే ఒకవేళ రసనేంద్రియ, ఘ్రాణేంద్రియములు ఉన్నచో అపుడే వ్యవధానశూన్యమైన తత్సౌగంధ్య, సౌరస్యములను అనుభవింపజాలును.

జీవాత్మ, పరమాత్మల కలయికను అనేక భావములతో శాస్త్రములు వర్ణించినవి. శుద్ధ ప్రత్యక్చైతన్యాభిన్నుడైన పరమాత్మ నిత్య ప్రాప్తవస్తువు అయినను, తత్ప్రాప్తిని వర్ణించునపుడు శ్రుతి ఒకచోట,

"అత్ర బ్రహ్మ సమశ్నుతే ।"

బ్రహ్మవేత్త ఇచటనే బ్రహ్మను అనుభవించునని చెప్పను. మఱొకచోట,

"సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యన్త సుఖమశ్నుతే ।"

అనుచు, శ్రుతులు అత్యంత బాహ్యసంస్పర్శ విరక్తుడైన జ్ఞానికి, బ్రహ్మసంస్పర్శజన్యమైన లోకోత్తర సుఖానుభవము కలుగునని చెప్పుచున్నవి. నిర్విశేషమైన చిత్సుఖస్వరూప బ్రహ్మసంస్పర్శ కల్పనము అద్భుతము !

శ్రుతులు, ఒకచోట, ఈ విషయమును అన్యదృష్టాంతముతో స్పష్టము చేసినవి—

"తద్యథా ప్రియయా భార్యయా సంపరిష్వక్తో నాన్తరం
కించన వేద న బాహ్యమ్ ।"

ప్రియుడు, ప్రియురాలైన భార్యను పరిష్వంగము చేసికొని, ప్రేమానందాతిరేకములో బాహ్యాభ్యంతర ప్రపంచమును మరచి పోవును, భేదమందు వ్యవధానము యొక్క ఆత్యంతిక నివృత్తి కలుగదు. కావున, భేదయుక్తమైన సంయోగమువలన రసికులకు సంతోషము కలుగదు. పుత్ర, దేహాదులతోను, మనస్సు, అంత రాత్మలతోను ఎంత అంతరంగత్వము, వ్యవధానశూన్యత్వము లభించునో, అంత అధికమైన ప్రేమ వ్యక్తమగును.

సర్వాంతరము,సర్వాపేక్షయా సన్నిహితమయిన అంతరాత్మ చేతనే ప్రాణులకు నిరతిశయము, నిరుపాధికమును అయిన ఉత్కృష్ట ప్రేమ కలుగును. కావున, భగవంతుని అత్యంత అంత రంగత్వము వ్యక్తమైనపుడే భగవంతునిపట్ల ఘనిష్ఠమైన ప్రేమ కలుగును. కావున, అభేదజ్ఞానము ఆవశ్యక మగును. అయినను, అత్యంత అభేదమందు బ్రహ్మస్పర్శగాని, ప్రత్యగాత్మ పరి ష్వంగముగాని, కుదరదు. కావున,కాల్పనిక భేదము,పారమార్థికమైన అభేదము అంగీకరించబడును. ఘటాకాశమునకు మహాకాశముతోటి సంబంధము వలెనే జీవాత్మకు పరమాత్మతోటి సమ్మిలనము కలుగును. కాని, తరంగ, జలదృష్టాంతము ఇంతకంటె గూడా సరసమైనది.

తరంగములోపల, బయట, మధ్య, లేక సర్వాంశమందు జలము నిండి ఉన్నట్లే జీవాత్మయందు బ్రహ్మాత్మ, సమ్మిలితుడై ఉండును. నిర్జీవ వీచీజల దృష్టాంతమును సజీవరూపముగా గ్రహించుచు, దానికే నాయికానాయకులరూపక మీయబడెను. సజీవదృష్టాంతములందు నాయికానాయకులకంటె ఘనిష్ఠమైన, వ్యవధానరహితమైన సమ్మిలనము పొసగునట్టి దృష్టాంతము

మరొకటి లేదు.కావుననే అంతరంగికులైన పతి-పత్నుల సంబంధము జలతరంగసంబంధమువంటిదని భావించబడును.

పైన చెప్పినరీతిగా భగవంతుడు, పరమానందఘనుడే. సమస్తము, ఆ సర్వాంతరాత్మ, సర్వద్రష్ట, సర్వవిజ్ఞాతయే అయినపుడు విజ్ఞాతను ఏ సాధనముచేత తెలిసికొందుము ?

"విజ్ఞాతార మరే కేన విజానీయాత్ ।"

అయినను, నిరుపాధిక, నిర్దృశ్య రూపముతో సదానందఘనుడైన భగవత్సాక్షాత్కారము, భగవత్కృప లేక, కలుగదు. అపుడే శ్రుతిమాత, భగవంతుని, తెలిసికొనుటకై శ్రద్ధా, భక్తి, జ్ఞానయోగములు ప్రధాన కారణములని చెప్పుచున్నది-

"శ్రద్ధా భక్తి ధ్యానయోగా దవేహి ।"

బ్రహ్మ గూడా ఇదియే చెప్పెను. హే నాథ! సర్వావభాసకమైన నీ దివ్యస్వరూపము అత్యంతము స్పష్టమైనను, నీ చరణాంబుజ ప్రసాదముచేత అనుగ్రహింపబడినవాడే, దానిని తెలిసికొనగలుగును, అన్యథా, అనేకవిధములైన యుక్తులతో సర్వథా వివేచన చేసినను, ఇది దుర్లభమే.

"అథాపి తే దేవ పదాంబుజద్వయ ప్రసాద
లేశానుగృహీత ఏవ హి ।
జానాతి తత్త్వం భగవన్ మహిమ్నో నచాన్య ఏకోఽపి
చిరం విచిన్వన్ ॥"

పూర్ణవైరాగ్యసంపన్నుడు, శాంతుడు, సమాహితచిత్తుడును అయిన మహాపురుషుడు వేదాంతవాక్య శ్రవణ, మనన,నిదిధ్యాసనములచేత పరమ తత్త్వమును సాక్షాత్కరించుకొనగలుగును. అయినను, శ్రీఘ్రాతిశీఘ్రముగా తత్త్వసాక్షాత్కారమునకై ఒకానొక విశేష స్వరూపమును ఉపాసించుట అత్యంతావశ్యకము.

కారణమేమనిన, ప్రాణుల చిత్తమందు నానావిధములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల, అంధకార, ప్రకాశాది దృశ్యముల స్ఫురణమే ఏర్పడి ఉండును. నిద్రవలన, లేక విక్షేపమువలన శూన్యావస్థ దుర్లభము. దృశ్యముయొక్క స్ఫురణము నిరోధింపబడక దృశ్యాతీత, నిర్దృశ్య, విశుద్ధ తత్త్వస్ఫురణము అత్యంత అసంభవము. జగత్తు దుఃఖమయమైనను, మోహవశమున, ప్రపంచ చింతనమందును మాధుర్యము ప్రతీతమగును. ప్రపంచాతీతుడైన భగవంతుడు పరమానందమయుడు, సర్వానర్థనివర్తకుడును అయినను ఆయనకు జీవుని ఆకర్షణము ఉండదు. జ్వరగ్రస్తుడైన రోగికి, తీక్ష్ణమైన ఆతపమందు స్వాదము, అథవా సర్పదంశన (పాముకాటు) విషముచేత ప్రభావితుడైన ప్రాణికి చేదైన వేపాకునందే స్వాదము కలుగును. పిత్తదోషదూషితమైన జిహ్వగల ప్రాణికి పంచదారయందు కటుత్వము అనుభూయమానమగును. అట్లే, అనాది దుర్వాసనలచేత దూషితమైన అంతఃకరణము గల ప్రాణులకు భగవంతునియందు రూక్షత్వము భాసించును. కావుననే మంత్రద్రష్ట, ఈ విషయమును గూడా భగవంతుని, ప్రార్థించును- హే దేవ ! నీవు, నన్ను నిరాకరించకుము, నేను నిన్ను నిరాకరించకుండునట్లుగా నీవు నాయందు దయ చూపుము. ఏలన, నిన్ను మఱచిపోకుండుట నా వశమునందు గల విషయము కాదు.

"మాఽహం బ్రహ్మ నిరాకుర్యామ్, మా మా బ్రహ్మ
నిరాకరోత్ ॥"

దీనివలన, ప్రభు కృపచేతనే ప్రాణులు ప్రభువువైపునకు ప్రవర్తింతురు అని తెలియును. కావుననే మహానుభావులు ఇట్లు చెప్పిరి-

"సోఽహం తవాంఘ్ర్యుపగతోఽస్మ్యసతాం దురాపం
తచ్చాప్యహం భవదనుగ్రహ మీశ మన్యే ।

పుంసాం భవేద్యర్హి సంసరణాపవర్గ స్త్వయ్యబ్జనాభ
సదుపాసనయా రతిః స్యాత్ ॥"

హే కృపామయ! అసత్పురుషులకు దుష్ప్రాప్యమైన (పొంద జాలని) నీ శ్రీచరణపంకజముల శరణు జొచ్చితిని. ఇదియు, నీ అనుగ్రహమే. ఏలన, సంసారనివృత్తి కలుగబోవుచున్నప్పుడే హే అబ్జనాభ! ప్రాణులకు సదుపాసనముద్వారా నీయందు ప్రీతి కలుగును అని భావము.

ఇది యుక్తమే. భగవదనుకంప లేక, భగవంతునియందు ప్రీతి కలుగదు. కాని, ప్రభుప్రేమ లేక భాస్వతి, భగవతి అయిన అనుకంపాదేవి సాక్షాత్కారము ఎట్లు కలుగును? వాస్తవమునకు బీజాంకురములవలె అనుకంపకి, భగవతీభక్తికి ఇతరేతర(పరస్పర) నిమిత్త నైమిత్తిక భావమే యుక్తము. కావుననే శ్రీజగద్ధరభట్టు 'స్తుతికుసుమాంజలి' యందు ఇట్లు స్తుతించెను-

"నానుగ్రహ స్తవ వినా త్వయి భక్తియోగం
నానుగ్రహం తవ వినా త్వయి భక్తియోగః ।
బీజప్రరోహవదసౌ వనయోర్న కస్య భూత్యై
పరస్పరనిమిత్తనిమిత్తిభావః ॥"

పరమ కృపామయుడైన భగవంతుడు, మాయామోహితులైన జీవుల ప్రవృత్తి, శబ్దాదిప్రపంచము వైపునకే ఎక్కువగా ప్రవృత్తమగుననియు, సన్ను ఆశ్రయించక, అనర్థనివృత్తి ఏ విధముగాను సంభవము కాదనియు చూచి, పరమ కారుణికుడైన వైద్యుడు దూరదృష్టిలేని వాడు, అమాయకుడు నయిన శిశువుకు పథ్యమందు అభినివేశమును,మహౌషధమందు, పథ్యమందు విద్వేషమును జూచి, మహౌషధినే పరమ మనోహరరూపములోను, ఆ రోగి అభిలషించిన రూపములోను ప్రకట మొనర్చి ఇచ్చును. ఆరీతిగానే భగవంతుడు తన ఆ వేదాంతవేద్య, అఖండ, అనంత,

పరమానందఘన, నిరాకార, నిర్వికార, అగోచన స్వరూపమును తన అచింత్య, దివ్య లీలాశక్తి ప్రభావము చేత సర్వమనోహర, సుమధుర స్వరూపములో ప్రకటించును. తత్స్వరూప దర్శన, స్మరణ, శ్రవణములవలన మోహితుడు కాని సచేతనుడు ఎవడు ఉండును ?

అక్షరనిష్ఠులు, అమలాత్ములు, పరమహంసలు, మహా మునీంద్రులు, బ్రహ్మ, మహేంద్ర ప్రభృతి దేవాధిదేవులు మొదలు కొని ఖగ, మృగ, వన, గిరి, నదీ, సరోవర, వృక్ష, లతాదులందు గూడా ఆ మధుర, మనోరమ, మంగళమయ, స్వరూపదర్శన స్పర్శనముల వలన, ఆనందోద్రేకమందు పులకావళి కలుగును, ఆనందాశ్రువులు సంచరించును. కావుననే వ్రజాంగనలు ఇట్లనిరి–

> "కా స్త్ర్యంగ తే కలపదాయత మూర్ఛితేన సంమోహి
> తార్యచరితా న్న చలేత్ త్రిలోక్యామ్ ।
> త్రైలోక్యసౌభగ మిదం చ నిరీక్ష్య రూపం యద్గో ద్విజ
> ద్రుమ మృగాః పులకా న్యబిభ్రన్ ॥"

హే జీవనధన! బృందావనచంద్రుడు, మనోహరుడు, అమృతమయుడైన నీ ముఖచంద్రునినుండి వినిఃసృతమైన కలపదాయత గీతమూర్ఛన వలన, ఆర్యచరిత్రవలన ఏ స్త్రీ స్పందితురాలు కాదు ? త్రైలోక్య సుభగమైన ఏ మంగళమయ శరీరమును చూచి గో, ద్విజ, మృగ, వృక్షములందు గూడా పులకావళులు బయలుదేరునో, ఎచట ప్రాణుల మనస్సు ప్రాకృతములైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల వైపునకు ఆకర్షితమగునో అచట, తన దివ్యలీలాశక్తిచేత అశబ్ద, అస్పర్శ, అరూప, వేదాంతవేద్య, సదానందఘనరూపుడైన భగవంతుడే నిఖిలరసామృతమూర్తిని ధరించి, తన దివ్య బ్రహ్మ రసాత్మకమైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములతో సాక్షాత్తుగా ప్రాణుల మనస్సును ఆకర్షించును. భక్తుల సర్వస్వము జ్ఞానుల

ఏకమాత్ర పరమ తత్త్వమును అయిన భగవంతుడే అతి నాస్తికునికి గూడా సర్వస్వమై ఉన్నాడు. భేదమేమనిన, ఆ నాస్తికుడు తన సర్వస్వమందు నిరతిశయమైన ప్రేమ కలిగియుండియు, సర్వస్వరూపుడైన ఆ భగవంతుని, గుర్తించడు. ఈ విషయము అసంభవమైనదిగా అనిపించవచ్చును. కాని, వివేచన చేయుట వలన, సుస్పష్టమగును. ఎంత నాస్తికుడైనను, తన అభావము, లేక మృత్యువు వలన, భయపడును. సర్వదా జీవించి ఉండవలయు ననియే అతడు కోరుకొనుచుండును.

అతి సాధారణమైన ఆత్మరక్షణ కొఱకు, అస్తిత్వము కొఱకు వ్యగ్రత కలుగుచున్నప్పుడు, ఒక మనష్యుడు, అతడు ఎంత నాస్తికుడయినను అగుగాక, తన అస్తిత్వమును (ఉనికిని) కోరు కొనడా ? అతడు తన అస్తిత్వమును నాశనము చేసికొనుటకు ఇష్టపడునా ? అట్లు ఇష్టపడనిచో, అతడు బ్రహ్మాస్తిత్వమందు. పూర్ణమైన అనురాగము కలవాడా, కాదా ? తన అస్తిత్వమును కోరుకొనునట్టి తాను ఎవరు అన్నది మఱొక విషయము. అదృష్ట వశముచేత ఎన్నడైనను, ఇటువైపునకు దృష్టి మరలినపుడే నశ్వర దేహ, ఇంద్రియ, మనో, బుద్ధి, అహంకారాది దృశ్యపదార్థము లన్నియు మనవే అని తెలిసికొనును. మనము వీనికంటె భిన్నమైన ద్రష్టలము. మఱియు, ఆ నిర్వికార స్వరూపమైన స్వాత్మాస్తిత్వ మునే సదా కోరుకొందుము. స్వప్రకాశమైన దృక్స్వరూపము యొక్క అస్తిత్వము తత్స్వరూపమే. కావుననే ఆత్మ, స్వప్రకాశ మని చెప్పబడునని వివేచన చేయుటవలన విదితమగును. కావున, ప్రపంచమందలి అనేకానేక పదార్థములందు సందేహము గాని, విపర్యయము గాని, లేక అజ్ఞానము గాని, ఎంతయైనను ఉండ వచ్చును. కాని, స్వాత్మ ఉన్నదా, లేదా ? లేక, లేనేలేదా ? అని ఆత్మవిషయకములైన సందేహాదులు ఎవరికిని ఉండవు.

జీవనగతములైన పరమేశ్వర, ధర్మ, కర్మలు అన్నింటి యొక్క అభావమును ప్రతిపాదించునట్టి శూన్యవాది గూడా ఇచ్ఛ లేకపోయినను, స్వాత్మాస్తిత్వమును అంగీకరించవలసి వచ్చును. ఏలన, సర్వాభావమును స్థాపించువాడు ఉన్నప్పుడే గదా, స్వాతిరిక్తమైన సర్వాభావము సిద్ధమగునది. తన అభావము ఉండజాలదు. సర్వనిరాకర్త, సర్వనిషేధమునకు అవధిభూతుడు, సాక్షిభూతుడు నయినవానిని అంగీకరించనపుడు, శూన్యము గూడా అప్రామాణిక మగును. కావున, అదియే అత్యంత అభాధితము, సర్వబాధాధిష్ఠానము, సాక్షిభూతము, అస్తిత్వము, లేక సత్తఅయిన భగవంతుని రూపము. ఇంతియేకాక, జ్ఞానమునకై, ప్రకాశమునకై ప్రతి ప్రాణియందు ఉత్సుకత కన్పడుచున్నది. పశుపక్ష్యాదులు గూడా స్పర్శ చేత, ఆఘ్రాణించుటచేత ఏదియో ఒక విధముగా జ్ఞానమును ప్రేమించునట్టివే. ఈ జ్ఞానవాంఛ, ప్రాణియందు 'నాకు ఇటువంటి తత్త్వజ్ఞానము కలుగవలయును' 'అముక పదార్థజ్ఞానము కలుగవలయును' అనువాంఛ, క్రమ క్రముగా ఉపచితమగుచు కన్పించును.

ఇతిహాసమును, భూగోళమును, ఖగోళమును, భూతతత్త్వమును, అధిభూత, అధ్యాత్మ, అధిదైవ సర్వతత్త్వములను తెలిసికొనవలయునని మనస్సు వాంఛించును. కిం బహునా, సర్వజ్ఞత్వ జ్ఞానములేక, సంతోషము కలుగదు. సంపూర్ణత్వము ఎక్కడలభించును? అని వివేచన చేయుటవలన స్పష్టమగును. సర్వపదార్థములు ఏ స్వప్రకాశ, అఖండ, విశుద్ధ భావమందు-బోధయందు కల్పితమో, అదియే సర్వావభాసకము, సర్వజ్ఞము కాగలుగును. ఏలయనగా, ప్రకాశము, లేక భానము అత్యంత అసంగము, నిరవయవము, అనంతము. దృశ్యపదార్థముతో ఆధ్యాత్మిక సంబంధము దక్క, అన్యసంయోగ, సమవాయాది సంబంధములు ఉండజాలవు. కావున, సర్వజ్ఞుడు కావలయునను వాంఛ ఉన్నచో, సర్వావభాసక,

సర్వాధిష్ఠాన, విశుద్ధ, అఖండ, బోధ కలుగవలయునను వాంఛ ఏమిటి ? ఈ అఖండ బోధయే సచ్చిదానందస్వరూపుడైన భగవంతుని చిద్రూపము. పూర్వోక్త అఖండ, అనంత, స్వప్రకాశ సత్తయే, లేక అస్తిత్వమే, అందఱి స్వీయ రూపమైనట్లే, ఈ అబాధ్యమైన, అఖండమైన బోధ గూడా అందఱి అంతరాత్మ అని తెలియవలయును.

ఈవిధముగానే ఆస్తికులు, నాస్తికులే కాదు, పశు, కీటకాది పర్యంతము గూడా సర్వప్రాణులు ఆనందము కొఱకై వ్యగ్రత కలిగి ఉందురు. ప్రతి ప్రాణిదేహ, ఇంద్రియ, మనోబుద్ధి, అహంకారాదుల చేష్టలు, సంచలనములు ఎన్ని ఉండునో అవి అన్నియు, ఆనందముకొఱకై ఉన్నవి. ఏ ప్రయోజనము లేక ఎవరును దేనియందును ప్రవర్తించరు.

"ప్రయోజన మనుద్దిశ్య న మన్దోఽపి ప్రవర్తతే ।"

అధికముగా చెప్పనేల ?ఉన్మత్తుడు గూడా భ్రాంతి, లేక అజ్ఞానము చేత నయినను ఆనందము కొఱకే సర్వచేష్టలు చేయును. సమస్త వస్తువులందు సందిహానుడు (సందేహించువాడు), భ్రాంతుడు అగుచు గూడా ప్రాణి దేనికొఱకై అనేకప్రయత్నములు చేయునో, దానివిషయమున వానికి సందేహము, భ్రాంతి, అథవా, అజ్ఞానము కలదని ఎట్లు చెప్పగలుగుదుము ?

ఈరీతిగా దేనికొఱకై సమస్త ప్రయత్నములు జరుగుచుండునో, ఆ ఆనందము అత్యంత ప్రసిద్ధము. ప్రపంచమంతట గల సర్వవస్తువులందు దేనికొఱకై ప్రేమ ఉండునో, ఏది స్వయముగా నిరతిశయ, నిరుపాధిక ప్రేమకు ఆస్పదమో, అనగా ఏది అన్యముకొఱకై ప్రియము కాదో, అదియే 'ఆనంద' శబ్ద వాచ్యము. ఆనందసాధనములన్నింటిలో ప్రేమ, అస్థిరముగా ఉండుట చూచుచునే ఉన్నాము. స్త్రీ, పుత్రాదులు అనుకూలురుగా

ఉన్నంతవఱకే ప్రేమ ఉండును. ప్రతికూలురైనంతనే వారు ద్వేష్యులే అగుదురు. కాని, సుఖము, ఆనందము ఎల్లప్పుడు ప్రియములై ఉండును. ఎన్నడైనను, ఎవరికైనను ఆనందమునిన, ద్వేషము కలుగునని చెప్పజాలము. ఈవిధముగా అతి నాస్తికుడు గూడా ఆనందమును అభిలషించును. ఆనంద ప్రాప్తికై ప్రయత్న శీలుడగును. ఆ ఆనందముకొఱకై వెంపరలాడును. కాని, అతడు గుర్తించలేకపోవుటయే వానియందు గల లోపము. నాస్తికుడు సుఖసాధనములైన స్త్రీ పుత్రాదుల, శబ్దస్పర్శాదుల అనుభవము నందే సుఖమనెడి భ్రాంతితో చిక్కుకొని దానియందే సంతుష్టుడగు చుండును. ఎవరియందు ఒకప్పుడు ప్రేమ, మఱొకప్పుడు ద్వేషము కలుగునో, అది సుఖము కాదు. సర్వదా దేనియందు నిరతిశయ, నిరుపాధిక ప్రేమ ఉండునో, అదియే సుఖమని వివేచన చేయుట వలన విదితమగును.

జాగతిక (ప్రపంచసంబంధమైన) అనుభవసాధనపదార్థములు ఇటువంటివి కావు. కావున, అవి సుఖరూపములు కావు. కాని, అభిలషించిన పదార్థము లభించుటలో తృష్ణ, ప్రశమితమైన పిమ్మట శాంతము, అంతర్ముఖమునయిన మనస్సునందు సుఖాభాసకలుగును. ఆ ఆభాసయొక్క, లేక ప్రతిబింబముయొక్క నిధానము (మూలము), బింబభూతము, శుద్ధము నయిన అంతరాత్మయే అనందము. ఏలన, ఆనందలక్షణమే అంతరాత్మ లక్షణము. సమస్తము ఆనందముకొఱకే ప్రియమగుచున్నది. ఆనందము మఱొక అన్యపదార్థముకొఱకు ప్రియమైనది కాదు. సరిగా ఆరీతిగానే సమస్త వస్తువులు ఆత్మకొఱకే ప్రియములగుచున్నవి. ఆత్మ, మఱొకరికొఱకై ప్రియము కాదు. కావున అంతరాత్మయే ఆనందము. ఆ అంతరాత్మ, నిరతిశయ, నిరుపాధిక పరప్రేమకు ఆస్పదము. దాని ఆభాసయే అంతర్ముఖమైన అంతఃకరణమందు పడుటవలన,

'అహం సుఖీ'-'నేను సుఖముగా ఉన్నాను' మొదలగు వ్యవహారము కలుగును. ఇదియే సుఖము, లేక అంతరాత్మ. దీనికొఱకే సమస్త కార్యకరణ సంఘాతము ప్రవర్తించుచున్నది. ఇదియే సుఖ, దుఃఖ, మోహాత్మక సంఘాతముకంటె విలక్షణము, సుఖదుఃఖ మోహాతీతము, అసంఘాతము, అసంగము, అద్వితీయమును అయిన తత్త్వమే సచ్చిదానందస్వరూపుడైన పరమాత్మ యొక్క ఆనందరూపము. ప్రతి ప్రాణియు, స్వాతంత్ర్యమును (బంధ విముక్తిని) అభిలషించును. ఒక పిపీలికమును పట్టుకొనినపుడు, అది వ్యాకులతతో కాళ్ళు, చేతులు కొట్టుకొనును. శుక, శారికాది పక్షులు బంగారుపంజరమందు ఉండియు, సుందర, మధుర భక్ష్య, పేయ పదార్థములను ఇష్టపడవు. కాని, బంధవిముక్తములై స్వాతంత్ర్యముతో అడవియందు పుల్లని పండ్లను గూడా తిని జీవిత ముమ గడుపుట మంచిది అని తలచును. ఈరీతిగా ప్రతి ప్రాణి, బంధవిముక్తుడగుటకు, స్వాతంత్ర్యము కొఱకు లాలాయితుడై ఉండును.

ఇటువంటి స్థితిలో ఏ నాస్తికుడు,బంధవిముక్తిని,స్వాతంత్ర్య మును కోరడు? కాని, వాస్తవమైన స్వాతంత్ర్యరూపమును వివేచన చేయుట వలన, ఇతడు గూడా భగవత్స్వరూపుడే అని స్పష్టమగును. ఏలయనగా అసంగ, సచ్చిదానందస్వరూపుడైన భగవంతుని, చేరక, బంధవిముక్తిని, స్వాతంత్ర్యమును ఊహించుట నిరాధారమైన విషయము. స్థూల, సూక్ష్మ, కారణదేహముల సంబంధము ఉన్నంతవఱకు స్వాతంత్ర్య మున్నది. ఎట్లు సంభ వించును? ఎవరైనను, మాతాపితరుల, గురుజనుల, వేదశాస్త్రముల ఆదేశములను అంగీకరించక, తాను స్వతంత్రుడనని భావించవచ్చును గాక. కాని, ప్రతి ప్రాణియు, జన్మ, జరా, వ్యాధి, దారిద్ర్య, విపత్తి, మరణాదులకు పరతంత్రుడు కావలసియే ఉండును.ఏలన,

కొంత స్వాతంత్ర్యమును వదలుకొని, శాస్త్రములకు, గురుజనులకు పరతంత్రుడై కర్మ, ఉపాసనా,జ్ఞానములచేత మలవిక్షేపావరణము సుండి శరీర త్రయబంధమునుండి,లేక జీవభావమునుండి ముక్తుడై, స్వీయ నిర్వికార స్వరూపమును పొందనంతవఱకు పరిపూర్ణ స్వాతంత్ర్యము లభింపజాలదు.

స్వాతంత్ర్యము సర్వోపాధివినుర్ముక్తుడు, అసంగుడు, అనంతుడు, స్వప్రకాశుడు, ప్రత్యగభిన్నుడు, సచ్చిదానంద స్వరూపుడు నయిన భగవంతుని స్వరూపమే అని వివేచన చేయుట వలన స్పష్టమగును.ఇటువంటివాడే అయిన ప్రతి ప్రాణికి సమస్తము తన అధీనములో ఉండవలయుననియు, తాను స్వాధీనుడనై ఉండ వలయుననియు ఆసక్తి కలుగును. చిట్టచిఱకు తల్లిదండ్రులు గురుజనులు గూడా అందఱును తన ప్రార్థనను అంగీకరించవలయు ననియు సర్వథా అనుకూలురుగా ఉండవలయునన్న ఆసక్తియే కలుగును. ఈ స్థితియే దేవతలపట్ల గూడా ఉండును. ఈ సర్వ భావములు జీవభావము ఉండగా కలుగజాలవు. సమస్త కల్పిత పదార్థములు కల్పనకు అధిష్ఠానభూతుడైన భగవంతునికే పర తంత్రములై ఉండును.ఈవిధముగా పరమార్థతః, పూర్ణఅస్తిత్వము, పూర్ణ బోధ, పూర్ణ ఆనందము, పూర్ణ స్వాతంత్ర్యము, పూర్ణ నియామ కత్వము భగవంతునియందే ఉండును. ఆస్తికులు, నాస్తికులు, అందఱును పూర్ణ స్వాతంత్ర్యము, పూర్ణ నియామకత్వము, పూర్ణ బోధ, పూర్ణ ఆనందము, పూర్ణమైన అబాధ్యస్వరూపముతో వ్యగ్రత చెందుదురు. తత్ప్రాప్తికై ప్రాణములొడ్డి ప్రయత్నము చేయు దురు. అపుడు అజ్ఞానులు, లేక నాస్తికులు ఏ తత్త్వమును పొందు టకై వ్యగ్రులగుదురో, ఆ తత్త్వము భక్తుల, జ్ఞానుల ధ్యేయము, జ్ఞేయము, పరమారాధ్య, పరబ్రహ్మ అయిన భగవంతుడు కాడని ఎవరు అనగలరు ? ఏలయనగా, ప్రతి ప్రాణికి, లేక ప్రతి

తత్త్వమునకు అంతరాత్మ భగవంతుడే. అటువంటి స్థితిలో భగవద్విముఖుడై సత్త్వరహితుడు, స్ఫూర్తిరహితుడు కావలయునని ఎవరు కోరుకొందురు ? ఈ ఆశయముతోనే వాల్మీకిమహర్షి ఇట్లు చెప్పెను–

"లోకే నహి సవిద్యేత యో న రామ మనువ్రతః ।"

లోకమున, శ్రీరామచంద్రుని అనుసరించనివాడు ఎవడును ఉండడు అని భావము.

తన సర్వస్వమును వీడి, ఎవరికైనను, విశ్రాంతి ఎట్లు కలుగును ? కావుననే తరంగమునకు సముద్రానుగామిత్వము ఉన్న రీతిగానే, ప్రతి ప్రాణికి భగవదనుగామిత్వము కలదు. భేదమేమనిన, జ్ఞాని, తన ప్రియతముడైన భగవంతుని, తెలిసికొని ప్రేమించును. ఇతరులు ఆ భగవంతునికొఱకై వ్యగ్రత కలవారయ్యు ఆ భగవంతుని, ఎఱుంగరు.

భాగవత ద్వితీయస్కంధమందు గూడా భగవంతుని విరాడాది స్థూలరూపధ్యానము చెప్పిన తరువాత, అనంతకోటి బ్రహ్మాండనాయకుడైన ప్రభువుయొక్క, మధుర, మంగళమయ మూర్తిధ్యానము చెప్పబడినది. ధ్యానము వలన, చిత్తమునకు పరిపూర్ణమైన ఏకాగ్రత కలిగినపుడు, భగవంతుని అనంత, అఖండ, స్వప్రకాశ బోధస్వరూపము సాక్షాత్కరించునని చెప్పబడినది. పూర్వోక్త స్వరూపమందు దృఢనిష్ఠకై భగవంతుని మధుర స్వరూపము యొక్క, శ్రీచరణముల యొక్క ధ్యానసహితము, అనురాగసహితము నయిన పరిరంభణము (ఆలింగనము) మరల చెప్పబడినది.

"హృదోపగుహ్యార్హ పదం పదే పదే ।"

భగవంతుని అచింత్య, అనంత, మధుర, మంగళమయ స్వరూప

మందు ప్రేమ, భజనము సర్వసాధనము, సర్వఫలస్వరూపము. కావుననే దీనియందు సాధకులు, సిద్ధులు-ఇరువురికిని ప్రవృత్తి కలుగును.

ప్రభువుయొక్క శ్రీచరణారవిందముల సౌగంధ్యామృత సింధువునందలి ఒక బిందువును సమాస్వాదనము చేయుటవలన గూడా సనకాదుల, శుకాదులవంటి బ్రహ్మనిష్ఠులైన మహామునీంద్రులు గూడా ముగ్ధులగుదురు.

"తస్యారవిందనయనస్య పదారవింద కింజల్కమిశ్రతులసీ మకరందరేణుః ।
అన్తర్గతః స్వవివరేణ చకార తేషాం సంక్షోభ మక్షరజుషామపి చిత్తతన్వోః ॥"

కావుననే జనకునివంటి విదేహులైన తత్త్వనిష్ఠుల అనుభూతులు ఏతాదృశములే అని మహాత్ముల వచనములవలన అవగతమగుచున్నది.

ఇది యుక్తమే. కావుననే అమలాత్ములు, పరమహంసలు నయిన మహామునీంద్రులకే భక్తియోగమును విధించుటకై అదృశ్యుడు, అగ్రాహ్యుడు, అచింత్యుడు, అవ్యపదేశ్యుడు నయిన భగవంతుడు అద్భుత సౌందర్య, మాధుర్య సుధా జలనిధి దివ్యమూర్తిని ధరించును. అట్లు కానిచో, అల్పకార్యములకై ప్రభువు అవతరించుట, మశక నివారణమునకై భుశుండిని (తుపాకిని) ఉపయోగించుట అనుచితమైనట్లే అగును. కాని, నామ, రూప, క్రియాత్మక ప్రపంచమునుండి వ్యావృత్తమనస్కులైన (మఱలిన మనస్సు గల) అమలాత్ములైన పరమహంసలకు భజనానందము నొసగుటకై ప్రభువు దివ్యస్వరూపధారణము చేయుట పరమ ఆవశ్యకము.

అద్వైత బ్రహ్మనిష్ఠులైన పరమహంసలకు భక్తియోగము

నొసగి, వారిని శ్రీ పరమహంసలను చేయుటయే ప్రభువుయొక్క ఆవిర్భావముయొక్క ముఖ్యప్రయోజనము. మిశ్రితములైన క్షీర నీరములను హంస వేఱువేఱుగా చేయును. అట్లే సాంఖ్యసిద్ధాంతానుసారము ప్రకృతినుండి, ప్రాకృత ప్రపంచమునుండి భిన్నము, అసంగము, అనంతము నయిన చేతన తత్త్వమును వివేచనము చేయువారినే హంసలని చెప్పవచ్చును. కాని, వేదాంతసిద్ధాంతానుసారమైనచో, దృగ్దృశ్యములకు,ఆత్మ అనాత్మలకు, పరాత్పరుడు, పూర్ణతముడు,సర్వావభాసకుడైన భగవంతునికి, ప్రకృతికి ప్రాకృత ప్రపంచమునకు మధ్య, దివ్య మణిమాలకు దానియందు కల్పితమైన సర్పమునకు, అనగా సత్య, అనృతములకు గల ఆధ్యాసిక సంబంధమువంటి సంబంధము కలదు. అట్లే, దృశ్యమైన ప్రకృతికి, తద్భాసకుడు, అధిష్ఠానభూతుడు నయిన భగవంతునికి ఆధ్యాసిక సంబంధము కలదు. కావున,సత్యానృతముల వివేచనవలన సత్యమే అవశిష్టమై ఉండును. సర్వథా అనృతాభావము ఉండును. ఆ రీతిగానే దృక్ దృశ్యములను గూడా వివేచన చేసినపుడు అనృత స్వరూపమైన దృశ్య ప్రకృతి, అదృశ్యమైపోవును. సర్వదృక్ అయిన భగవంతుడు మాత్రమే శేషించి ఉండును.

ఈ విధముగా వేదాంతసిద్ధాంతానుసారము సత్యానృత రూపమైన నీరక్షీరవివేకము కలదు. నీరస్థానీయమైన దృశ్యమును తొలగించి,పరమ సత్యస్వరూపుడైన భగవంతునియందే అవస్థితులై ఉండువారు పరమహంసలని చెప్పబడుదురు.

> "నైష్కర్మ్య మప్యచ్యుతభావవర్జితం న శోభతే జ్ఞానమలం నిరంజనమ్ ।"

ఇత్యాది అభియుక్త వచనములను అనుసరించి,భగవంతుని మధుర మంగళమయ స్వరూపమందు పూర్ణానురాగము కలుగక,భగవత్సంబంధమైన జ్ఞానము గూడా సుశోభితము కాదని విదితమగును.

కావున, భక్తియోగమువలన జ్ఞానమును సుశోభితమొనర్చి పరమహంసలను శ్రీపరమహంసలనుగా చేయుటయే ప్రభువు, మధుర మంగళమయ స్వరూపమును ధరించుటకు ముఖ్య ప్రయోజనము. ఎందుచేతననగా భజనీయుడు లేక, భక్తియోగము కుదరనే కుదరదు. భగవత్తత్త్వముకంటె భిన్నమైన ప్రపంచము ఎవరి దృష్టిలో లేనేలేదో, వారికి భజనీయుడైన భగవంతుడు దక్క, మఱి ఏమి ఉండును? భగవంతుని అచింత్య, అనంత, అవ్యపదేశ్య, నిరాకార స్వరూపమందైనచో వారు పరినిష్ఠితులే అయిఉన్నారు. మహావాక్యజన్యమైన పరబ్రహ్మాకారవృత్తితో బ్రహ్మసంబంధమును ఎఱింగి, మనోబుద్ధులు, సర్వేంద్రియములు, రోమరోమము గూడా ప్రభువుతోటి సంబంధము కొఱకై వ్యగ్రములై ఉండును. ఇంద్రియములు,స్వయంభువు అయిన పరమాత్మనుండి పరాఙ్ముఖములుగా సృష్టింపబడి హింసింపబడుట కొఱకే అవి తమ ప్రియతమునినుంటి బహిర్ముఖము చేయబడినవని తలంచును.

"పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః ।"

మహర్షి ఆదికవి గూడా 'ఎవరు స్నేహపూర్ణమైన దృష్టితో శ్రీరామచంద్రుని చూడలేరో, శ్రీరామచంద్రుడు దయాపూర్ణమైన దృష్టితో ఎవరిని చూడడో, అతడు సమస్త లోకమందు నిందితుడు అని, వాని స్వాత్మ గూడా వానిని గర్హించును' అని చెప్పెను.

"యశ్చ రామం న పశ్యేత్తు రామో యం నాభిపశ్యతి ।
నిందితః సర్వలోకేషు స్వాత్మాఽప్యేనం విగర్హతి ॥"

కమలమువంటి నేత్రములు గల వ్యక్తియొక్క అతి శోభనమైన నేత్రములు భగవంతుని స్వరూపదర్శనమందు ఉపయోగపడనిచో, వ్యర్థములే అగును. అట్లే జ్ఞానికి గూడా ప్రారబ్ధభోగ పర్యంతము తప్పనిసరిగా ఉండునట్టి దేహ, ఇంద్రియ, మనోబుద్ధి, అహంకారాదులు భగవంతుని సౌందర్య, మాధుర్య, సౌరస్య

సుధాదుల సమాస్వాదనమందు ఉపయోగింపబడనిచో వ్యర్థములు, నీరసములే అగును. కావున వ్రజేంద్రనందనుడైన శ్రీకృష్ణచంద్రుని అనురాగపూర్ణమైన క్రీగంటిచూపులతో గూడిన వేణుచుంబిత అమృతమయ ముఖచంద్రుని సౌందర్య, మాధుర్యామృతమును నిర్నిమేషములైన నేత్రములతో పానము చేయుట, ఘ్రాణేంద్రియముతో సౌగంధ్యామృతమును ఆఘ్రాణించుట, త్వగింద్రియముతో సుస్పర్శామృతమును ఆస్వాదించుటయే నేత్రములుగలవారి నేత్రాది ఇంద్రియ సంఘాతమునకు సార్థకత అనియు, వానికి చరమఫలము ఇదియే అనియు, అట్లు కానిచో, నేత్రాది ఇంద్రియ సంఘాతము ఉండుట వ్యర్థమే అనియు వ్రజాంగనలు అందురు.

"అక్షణ్వతాం ఫల మిదం న పరం విదామః ।"

ఈవిధముగా అంతరాత్మను, అంతఃకరణమును, ప్రాణములను, ఇంద్రియములను, దేహమును రోమరోమమును స్వీయ దివ్య రసము చేత సరసము, మంగళమయము చేయుటకొఱకై భగవంతుడు ఆవిర్భవించును.

సర్వోపాధివినిర్ముక్తమైన బ్రహ్మ, నిరతిశయము, పరమ ప్రేమాస్పదము, పరమానందరూపము. ఆ బ్రహ్మకంటె అధిక ప్రేమాస్పదత్వమును, పరమానందరూపత్వమును ఊహించుట సంభవము కాదు. అయినను, ప్రారబ్ధావశేషము ఉన్నంతవఱకు జ్ఞానికి గూడా అంతఃకరణరూపమైన ఉపాధియందే బ్రహ్మదర్శనము కలుగును. అంతఃకరణముచేత బ్రహ్మదర్శనము, నేత్రముచేత సూర్యదర్శనమువంటిదనియే తెలియవలయును. కాని, దూరవీక్షణయంత్ర సహాయముచేత నేత్రములద్వారా సూర్యుని అతి దివ్య, స్పష్టరూపము కన్పడునట్లే దివ్యలీలాశక్తిచేత పరమ మనోహరమైన సగుణరూపముతోఅభివ్యక్తమైన తత్త్వమందు అంతఃకరణముకంటె విలక్షణమైన చమత్కారము అనుభూయమాన మగును. కాని,

ప్రారబ్ధక్షయము అయినపుడు, సర్వోపాధులు నశించినపుడు, సాక్షాత్తుగా సూర్యరూపమే అయినపుడు ఏ సూర్యరూపమైన ఆత్మ రూపము ఉపలబ్ధమగునో, అది సర్వథా అనుపమేయము. వృష భానునందిని (రాధ) దర్పణమందు తన ముఖచంద్ర మధురిమను అనుభవించును. అథవా, శ్రీకృష్ణునివక్షఃస్థలమందు ఆమెకు తన ముఖచంద్ర మధురిమ ఎక్కువగా భాసించును. కాని, వృషభాను నందినీ ముఖచంద్ర మాధుర్యమైనచో, ఆమెకు అంతరాత్మ భూతుడు, ప్రియతముడు నయిన శ్రీకృష్ణునికే విదితమగును. కొద్ది వ్యవధానము ఉన్నపుడు రసాస్వాదమందు లోపమే ఉండును. కావుననే మధురరూపమందునేత్రము ఉన్నప్పుడే రూపమాధుర్యము పుష్పమందు ఘ్రాణేంద్రియము ఉన్నపుడే సరియైన గంధ మాధుర్యము అనుభూయమానము కాగలదని భావుకులైన భక్తులు చెప్పుదురు.

వస్తువు, అదియే అయినను, అచింత్య, దివ్యలీలాశక్తి యొక్క అద్భుత ప్రభావముచేత జ్ఞానుల మనస్సు గూడా భగ వంతుని ఈ మధుర స్వరూపమందు బలాత్కారముగా ఆకర్షిత మగును. ఫల, వృక్ష, అంకుర, బీజములు భూమిస్వరూపవిశేషములే అయినను, ఫలమునందు భూమి, బీజము, అంకురము, వృక్షము- వీని అన్నిటికంటె విలక్షణములైన సౌందర్య, మాధుర్య, సౌగంధ్య, సౌరస్యములు ఉండును. గులాబీ విత్తనమందు, లేక కాడయందు శాఖలు, ఉపశాఖలు కంటకములు, పత్రములు మున్నగువానిని ఉత్పాదనము చేయు శక్తి ఉన్నట్లే, పుష్పమును ఉత్పాదనము చేయు శక్తి ఉండును. కాని, కంటకాదులను ఉత్పాదనము చేయు శక్తికంటె సౌందర్య, మాధుర్య,సౌగంధ్యసంపన్నమైన.పుష్పమును ఉత్పాదనము చేయు శక్తి విలక్షణమై ఉండును. ఆ రీతిగానే భగవంతుని మహాశక్తియందు ప్రపంచోత్పాదిని అయిన శక్తి

ఉన్నట్లే, ఆ శక్తికంటె పరమ విలక్షణ పరాత్పర, పూర్ణతమ భగవంతుని స్వరూపభూతమైన మధుర, మనోహర, మంగళమయ మూర్తిని ఆవిర్భవింపజేయునట్టి శక్తి గూడా కలదు.

ఆ అచింత్య, దివ్య లీలాశక్తిసంబంధముచేత నిరాకారుడైన భగవంతుడు, శైత్యసంబంధముచేత నిర్మలమైన జలము హిమరూపముగాను, అథవా, సంఘర్షవిశేషముచేత అవ్యక్తముగా ఉన్న అగ్ని, లేక విద్యుత్తు దాహక, ప్రకాశరూపముతో వ్యక్తమైనట్లుగానే సాకారరూపము వ్యక్తమగును. నిరాకారమైన బ్రహ్మకంటె గూడా భగవంతుని మధురమూర్తియందు, ఇక్షుదండము (చెఱకుగడ), చందనవృక్షము మధురము, సుగంధితము నయిన రీతిగానే చమత్కారము భాసించును. ఒకవేళ, ఎపుడైనను, ఇక్షుదండమందు సుమధుర ఫలము, చందనవృక్షమందు అతి సుందర, సురభిళ పుష్పము ప్రకటమైనచో వాని మాధుర్యమును, సౌగంధ్యమును ఎంత ప్రశంసించినను, అల్పమే అగును. ఆ విధముగానే అనంత బ్రహ్మాండాంతర్గతమైన ఆనందబిందువుయొక్క ఉద్గమస్థానము అచింత్య, అనంత, పరమానందఘనమైన బ్రహ్మయే అద్భుత రసమయము. ఇట్టి స్థితిలో తత్ఫలరూపమైన మధుర,మంగళమయ స్వరూపమందు ఎంత చమత్కారము ఉండునో, సహృదయులే తెలిసికొనజాలుదురు. ఇక్షురససారము శర్కరాది సారకందమైన రీతిగానే, ఔపనిషదమైన పరబ్రహ్మరససారమైన భగవంతుని మధుర, మనోహర, సగుణ స్వరూపము ఉండును.

కావుననే ఒక మహాత్ముడు శ్రీకృష్ణుని జూచి, ఇట్లు కల్పన జేసెను- ఇతడు వ్రజాంగనల ప్రేమరససార సమూహమా, అథవా, సాత్వతేయుల రూపుదాల్చిన సౌభాగ్యమా, లేక శ్రుతుల గుప్త విత్తమైన బ్రహ్మయే శ్యామలమహోమయ (తేజోమయ) మూర్తిని ధరించి, అభివ్యక్తమయ్యెనా !"-

"పుంజీభూతం ప్రేమ గోపాంగనానాం మూర్తీభూతం
భాగధేయం యదూనామ్ ।
ఏకీభూతం గుప్తవిత్తం శ్రుతీనాం శ్యామీభూతం
బ్రహ్మ మే సన్నిధత్తామ్ ॥"

ఈవిధముగానే—

"శృణు సఖి కౌతుకమేకం నందనికేతాంగణే మయా దృష్టమ్।
గోధూళిధూసరితాంగో నృత్యతి వేదాన్తసిద్ధాంతః ॥"

"పరమ మిమ ముపదేశ మాద్రియధ్వం నిగమవనేషు
నితాన్త ఖేదఖిన్నాః ।
విచినుత భవనేషు వల్లవీనా ముపనిషదర్థ ములూఖలే
నిబద్ధమ్ ॥"

కొందఱు మహాత్ములు నిగమాటవియందలి(వేదారణ్యమందలి) బ్రహ్మతత్త్వమును అన్వేషించువారి శ్రమను చూచి, దయార్ద్ర హృదయులై, వారు అన్వేషించునట్టి బ్రహ్మను యశోదాదేవి, రోటియందు బంధించి ఉన్నట్లు చెప్పుదురు. మఱికొందఱు నందుని ప్రాంగణమందు ధూళిధూసరితమైన వేదాంతసిద్ధాంత నృత్యమందు గల ఆశ్చర్యమును చెప్పుదురు. పరమ కౌతుకము గల పరమేశ్వరునియందు ఈ కౌతుకము ఉన్నదే కదా ! ఇంత అయినను, నిరాకారుడైన భగవంతుడు సాకారుడు ఎట్లు కాగలడు? అని ప్రజలు ప్రశ్నింతురు. కౌతుకి, కృపాళువు నయిన భగవంతుని లీలచేత నిరాకార జీవుడు సాకారుడగుచున్న విషయమును వారు దృష్టియందు ఉంచుకొనరు. (ఏలన, అందఱి మతమున, జీవుడు, నిరాకారుడు, నిరవయవుడు). స్పర్శరహితమైన ఆకాశము స్పర్శసహితమైన వాయురూపములో అవతరించును. రూపరహితమైన వాయువు, రూపవంతమైన తేజోరూపముగా అభివ్యక్తమగును. రసగంధవిహీనమైన తేజస్సు జలముగాను, క్రమముగా రసయుక్తమైన జలము

గంధవతియైన పృథ్వీరూపములోను ప్రాదుర్భవించుట సంభవమైనపుడు, ఆ భగవంతుడు నిరాకారుడైగూడా సాకారరూపములో ఏల ప్రకటము కాజాలడు ?

నిర్వృత్తికమైన జ్ఞాని మనస్సునందు అవిషయముగా ప్రకటమైన వేదాంతవేద్యుడు, సచ్చిదానందఘనుడు నయిన ఆ భగవంతుడే అనంతకోటి కందర్పుల దర్పమును చూర్ణము చేయువాడు, దివ్యసౌందర్య సుధాజలనిధి, మధురాతిమధుర స్వరూపముతో అభివ్యక్తమైన తన స్నేహముచేత (ప్రేమచేత) ద్రవీభూతమైన భక్తుని అంతఃకరణమును, స్వీయ వర్ణాంచితుని చేయును. (తన రంగులో నింపివేయును) చక్కగా, సౌందర్యాస్వాదనము కలుగును.

భక్తుని ద్రుత (కరగిపోయిన) చిత్తమందు నిఖిలరసామృతమూర్తియైన భగవంతుని ఆవిర్భావమే 'భక్తి' శబ్దమునకు అర్థము. అంతఃకరణము, లక్కవలె కఠినమైన ద్రవ్యము. తాపకమైన అగ్నితోటి సంబంధము ఉండుటవలన, లక్క కరగిపోయినట్లే, స్నేహ, రాగాది తాపక భావములతోటి సంబంధమువలన, అంతఃకరణము ద్రవీభూతమగును. రాగాస్పదయైన కామినిని, ద్వేషాస్పదములైన సర్పాది పదార్థములను గ్రహించునట్టి చిత్తము, ద్రవీభవనము పొంది, తనయందు తత్పదార్థస్వరూపములను అంకితము చేసికొనుటకు కారణమిదియే. దీనికొఱకే అవి విస్మృతములు కాక, పునః పునః స్మృతికి వచ్చుచుండును. ఉపేక్ష్యములైన తృణాదుల స్మృతి, తక్కువగా ఉండుటకు కారణము, వానియందు రాగద్వేషములు, భయాదులు కలుగవు. కావున, చిత్తద్రుతి అచట కలుగలేదు.

లక్క, ద్రవీభవించనంతవఱకు, దానియందు ఏ వర్ణమైనను (రంగు అయినను), వ్యాపకము, స్థిరము కాదని భావుకుల కథనము. కావున, తాపకమైన అగ్నిసంబంధముచేత లక్క, ఎంత ద్రవీభూతము

కావలెననిన, నూరు మడతలు కల సన్నని వస్త్రములో ఒడపోయు టకు తగినదిగా ద్రవీభూతము కావలయును. అపుడు గంగాజలము వలె నిర్మలము, ద్రుతమును అయిన ఆ లక్కయందు వేయబడిన రంగు, లక్కయందలి ప్రత్యణువునందును, సర్వాంశమునందును వ్యాపకము, స్థిరము నగును. అపుడు, లక్క, తననుండి రంగును వేఱుచేయదలచినను, రంగే, తాను వేఱు కావలయునని తలచినను, రెండును, వేఱు కాలేవు. సరిగా ఈవిధముగానే భగవద్విషయక రాగాదులు, గంగాజలమువలె నిర్మలము, ద్రవీభూతము నయిన చిత్తమున, పరమానందఘనుడైన భగవంతుడు అభివ్యక్తి చెందినపుడు, ద్రవీభూతమైన లక్కయందలి రంగువలె, సర్వాంశమందు వ్యాపకముగా, స్థిరముగా భగవత్సత్త ఉండును. భావనా ప్రభావము వలన, ఈ భగవంతుని అపరిచ్ఛిన్న, అనంత, అంతర విస్తారము అంతఃకరణమందు, ప్రాణములందు, రోమరోమమున వ్యాపించును. అపుడు, అంతరముగాను, బాహ్యముగాను, సర్వథా భగవదనుభవము కలుగసాగును.

తమ ప్రియతముడైన భగవంతుని స్వరూపమందు కలుగు తీవ్ర రాగము వలన, తద్విరహవ్యథామయమైన తీవ్ర తాపము వలన, భావుకుడైన భక్తుని గుణరూపములైన సర్వకోశములు భస్మసాత్కృతములగును. అపుడు, భావనామయమైన భగవత్సంమిలన రూప సౌఖ్యరసము వలన, మనస్సు, ప్రాణము, ఇంద్రియములు, దేహము, రోమరోమము ఆప్యాయనము (తృప్తి) పొందును. అట్లు కాగా, బాహ్యాంభ్యంతరముల సమస్తరూపములతో భగవత్తత్త్వావగాహనము కలుగును. ఈరీతిగా అహైతుక భగవద్భక్తి గుణమయములైన కోశములను దగ్ధము చేయును. అప్పుడే నిరుపాధికుడైన, నిరావరణుడైన, భావుకుడైన భక్తుడు తనభగవంతునితో కలియగలడు. భగవదీయ విరహవ్యథ వలన, తాపమయమైన భక్తి వలన, ఎవరి

అన్నమయాది పంచకోశములకు సంబంధించిన శరీర త్రయము తప్తము కాదో, వారు పరమ తత్త్వామృత సమాస్వాదనమునకు అధికారులు కాజాలరు.

"అతప్తతనుః న తు దానోఽశ్నుతే దివమ్ ।"

అను శ్రుతి ఆశయ మిదియే.

"తపసా కృచ్ఛ్రాదినా భగవద్విరహజన్య తీవ్ర తాపేన భక్తిపరిణామభూతేన జ్ఞానాగ్నినా వా న తప్తతను ర్యస్య స దివం పరమాత్మతత్త్వామృతం నాశ్నుతే ।"

కృచ్ఛ్రాది తపస్సువలన, భగవద్విరహజన్యమైన తీవ్ర తాపమువలన, భక్తికి ఫలభూతమైన జ్ఞానాగ్నిచేత ఎవరి స్థూల, సూక్ష్మ, కారణరూప శరీర త్రయము సంతప్తము కాదో, వారు పర తత్త్వమును ఎట్లు ఆస్వాదించగలరు ? కావున, అనిమిత్తమైన భగవతీభక్తి, సిద్ధికంటె గూడా శ్రేష్ఠమని చెప్పబడును. భుజించిన ఆహారమును జఠరాగ్ని జీర్ణింపజేసినట్లుగానే అహైతుకీభక్తి, పంచ కోశములను జీర్ణమగునట్లు చేయును.

"అనిమిత్తా భాగవతీ భక్తిః సిద్ధే ర్గరీయసీ ।
జరయత్యాశు యా కోశం నిగీర్ణ మనలో యథా ॥"

భక్తియే, జ్ఞానరూపముగా పరిణతమై మూలావిద్యను గూడా నాశమొందించును. భట్టోజీదీక్షితులు_

"క్లృపి సంపద్యమానే చ ।"

అను వార్తికమునకు

"భక్తిః జ్ఞానాయ కల్పతే, జ్ఞానాకారేణ పరిణమతే ।"

అని ఉదాహరణముగా చెప్పిరి. శ్రీమద్భాగవత మాహాత్మ్యమందు జ్ఞాన, వైరాగ్యములు భక్తియొక్క పుత్రులే అనియు,తల్లి,యోగ్య

పుత్రజననము వలననే సౌభాగ్యవతి అని తలంచబడుననియు, పుత్రుడు మాతృభక్తివలననే సౌభాగ్యవంతు డగుననియు, కావున, ఎచట జ్ఞానము, భక్తిఫలమో, అచట భక్తి, జ్ఞానమునకు,జ్ఞానులకు పరమ పూజనీయము, భజనీయము నయిన దేవత అనియు చెప్ప బడినది. జ్ఞానము, భగవత్ప్రాప్తి, ముక్తి మున్నగునవి భక్తిఫలము లయినను, ఫలాపేక్షయా, సాధనమందే అధిక ప్రీతియుక్తమై ఉండును. ధనముయొక్కఫలభోగము ధర్మ,మోక్షములే అయినను, లోభియైనవాడు, ధనసంపాదనమునకై, ధనరక్షణమునకై, భోగ, ధర్మ, మోక్షములను సమస్త పురుషార్థములను త్యజించివేయుట చూచుచునే ఉన్నాము. ఏలయనగా, సాధనము ఉన్నపుడు, స్పష్టముగా సాధ్యము లన్నియు, సహజముగానే సిద్ధించునని, వారికి దృఢమైన విశ్వాసము. ద్రవీభూతమైన లక్కయందు కలిసి పోయిన వర్ణము (రంగు) వలె, భక్తుని ప్రేమార్ద్ర హృదయమందు ఏకమైపోయిన భగవంతుడు, వేఱు కావలంచినను, వేఱు కాజాలడు.

> "విసృజతి హృదయం న యస్య సాక్షాత్ హరి
> రవశాభిహితోఽప్యఘౌఘనాశః।
> ప్రణయరశనయా ధృతాంఘ్రిపద్మః స భవతి
> భాగవతప్రధాన ఉక్తః॥"

బలాత్కారముగా నయినను, ఏ భగవంతుని మంగళమయ నామము వలన, మహా పాపపుంజము నశించునో, అట్టి పరమ స్వతంత్రుడు, సర్వశక్తిసంపన్నుడు నయిన భగవంతుడు, ఎవని అంతఃకరణము నందు స్నేహార్ద్రతారూపమైన ప్రణయపాశమందు బద్ధుడై బయల్పడజాలడో, అతడే, ప్రధాన భాగవతోత్తము డగునని భావము. కావుననే ఒకానొక ప్రేమికుడు (భక్తుడు) రాగము వలన ద్రవీభవించిన తన అంతఃకరణమందు, ద్రవావస్థారూపమైన ఆ ప్రణయపాశముచేత ప్రభువును బంధించి, ఆయనయందలి

సర్వజ్ఞత్వమును, సర్వశక్తిమత్త్వమును, మహాశక్తిని గూడా కుంఠితమొనర్చి, శంకారహితుడై 'నీవు నా హృదయమునుండి బయల్పడగలిగినచో, నేను నీ పౌరుషమును చూచెదనని పలికెను.

"హస్త ముత్క్షిప్య యాతోఽసి బలాత్ కృష్ణ కిమద్భుతమ్ ।
హృదయాద్యది నిర్యాసి పౌరుషం గణయామి తే ॥"

ఈవిధముగానే భక్తుడు, భగవంతుని, తన హృదయము నుండి పృథక్కరింపదలచినను, వేఱు చేయజాలడు.

కావుననే వ్రజాంగన, శ్రీకృష్ణునినుండి తన హృదయమును మఱలించుటకై శ్రీకృష్ణుని దోషానుసంధానము చేయును. హే సఖి! నల్లనివారితో సఖ్యము నెరపరాదు. కాని,ఏమి చేయుదము ? శ్యామ సుందరుడైన వ్రజేంద్రనందనుని కథ, కథాతత్త్వము మనకు దుస్త్యజమయియే ఉన్నది. ఒక సఖి, శ్రీకృష్ణప్రేమలో మూర్ఛిత యైన తన ప్రియతమ సఖికి ఉపచారము చేయుటలో నిమగ్నయై ఉండెను. ఇంతలోనే మఱొక సఖి వచ్చి,శ్రీకృష్ణచర్చ చేయసాగెను. ఉపచారము చేయుటయందు నిమగ్నయై ఉన్న సఖి, నివారించుచు ఇట్లనును-

"సంత్యజ సఖి తదుదస్తం యది సుఖలవమపి
సమీహసే సఖ్యాః ।
స్మారయ కిమపి తదితర ద్విస్మారయ హస్త
మోహనం మనసః ॥"

హే ప్రియ సఖి! మన ప్రియసఖిని విశ్రాంతి తీసికొననీయ దలంతువేని, ఆ శ్రీ వ్రజరాజకుమారుని చర్చ తీసికొనరాకుము. కాని, మఱొక విషయమును జ్ఞప్తికి దెచ్చి, ఏదియో తీరుగా మన మోహనుని విస్మరింపజేయుము. మహామునీంద్రగణము శ్రీకృష్ణ చంద్ర పరమానంద కందమునందు, మనసును లగ్నము చేయుటకై, బాహ్య విషయములందు దోషానుసంధానము ద్వారా

మనస్సును మరలింతురు. ఈ వ్రజాంగనలు తన మనోహరుడైన శ్రీకృష్ణునినుండి మనస్సును మరలించి, అన్య విషయములయందు లగ్నము చేయదలంతురు. యోగీంద్రబృందము తమ హృదయమందు ఎవరి స్ఫూర్తిలేశము కొఱకై వెంపరలాడునో, సర్వప్రాణిప్రేమాస్పదుడు, జీవనధనుడును అయినఆ ప్రభువును, వారు (వ్రజాంగనలు) హృదయమునుండి బహిష్కరింపదలంతురు. ఇది యుక్తమే. పూర్తిగా ద్రవీభూతమైన లాక్ష (లక్క), దానియందు స్థాయీభావమును పొందిన రంగు–ఈరెండింటియందు పరస్పరము వేఱగుటయే అసంభవమన్నంతగా అద్భుత ఘనిష్ఠ సంబంధము ఉండును. ఆ రీతిగానే భగవద్భావనచేత ద్రవీభూతమైన అంతఃకరణమందు భగవంతుని స్థాయీభావాపత్తి వలన, మఱల పరస్పర పార్థక్యము (ఒండొరులు వేఱగుట) అసంభవ మగును. జీవునికి భగవంతునితోటి స్వాభావిక సంబంధము ఇంతకంటె గూడా అత్యంత అధిక ఘనిష్ఠము. సముద్రము లేక, తరంగములకు ఉనికియే లేనట్లుగా భగవంతుడు లేక, జీవసత్తయే లేదు.

ఇచటనే, ముఖ్య ప్రేమ ఉన్నది. అయినను, స్వరూప సాక్షాత్కారమునకు పూర్వము, స్వాభావికమైన, నిరుపాధికమైన ఈ ప్రీతి అసంభవము. కావున, స్వాభావిక ప్రీతి అంతయు ద్రవావస్థారూపమైన ప్రణయనమునందే అంతర్గతమై ఉండును.

సాక్షాన్మన్మథమన్మథో విజయతే

